# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 10 సంచిక : 6 హైదరాబాద్ 131 జూన్ 2012 పేజీలు : 68 రు. 15

- పెట్టుబడా, పెట్టుబడిదారీ సంబంధాలా?
- రాజ్యం - ప్రజా ఉద్యమం - బందీలు
- ఎన్నికల చుట్టూ తెలంగాణ ఉద్యమం
- పాలనా విధానాల వికృత శిశువు అవినీతి
- విద్యుచ్ఛక్తి భారం పెరగడానికి కారణం
- తి.తి.దే. కార్మికుల హక్కుల ఉల్లంఘన
- భవన నిర్మాణ కార్మికుల స్థితిగతులు


FIFTY YEARS
OF
ANDHRA PRADESH
1956-2006
Editors
R.S. Rao
V. Hanumantha Rao
N. Venugopal
Centre for Documentation, Research and Communication

131

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూన్ 2012
సంపుటి : 10
సంచిక : 6



## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ కృతజ్ఞతలు**

**వీక్షణం ఆర్థిక స్థితి గురించి విజ్ఞప్తికి ప్రతిస్పందనగా మే నెలలో అందిన విరాళాలు, సహాయాలు**

బి. అనిల్‌కుమార్, కర్నూలు రు. 500; టి. కృష్ణాబాయి, విశాఖపట్నం రు. 1000; ముంబై ఎలక్ట్రికల్ ఎంప్లాయీస్ యూనియన్ రు. 500

ఎస్. హజరత్ అలీ, వేమూరు, గుంటూరు; ఎ. నర్సింహారెడ్డి, వరంగల్; జి. సూరి, హైదరాబాద్; డి.ఎస్.ఎన్. రాజు, పుణె పదుల సంఖ్యలో చందాలు చేర్పించారు

నేను వీక్షణం మాస పత్రికను చదివాను. మన సమాజంలో జరిగే అనేకమైన అంశాలను తెలుసుకోగలిగాను. అందులోని కథనాలు వ్యాసాలు ఎంతో బాగున్నాయి. మీ పత్రిక చదివేకొద్దీ నాకు ఇంకా అనేక అంశాలు చదవాలన్న ఆసక్తి కలిగింది. ఇంతటి మహత్తరమైన మాసపత్రిక నేటి సమాజానికి ఎంతో అవసరం. ప్రతి ఒక్కరు చదవ వలసిన పత్రిక. నేను ప్రస్తుతం జీవిత ఖైదు అనుభవిస్తున్నాను. నాకు జైలులో లభించిన ఖాళీ సమయాన్ని వీక్షణం పత్రిక చదవడానికి ఉపయోగించు కుంటాను. మీరు పంపించే పత్రికను నేను చదువుతూ, నాతోటి మిత్రులతో చదివిస్తూ, పత్రికను చదివి సమాజహితం కోసం నా వంతు కృషి చేస్తాను.

– *ఇ. లక్ష్మణ్, కేంద్ర కారాగారం, వరంగల్*

వీక్షణం చందాదారున్ని అయినందుకు చాలా సంతృప్తిగా ఉంది. పత్రిక టపా (పోస్ట్)లో ఇంటికి రాగానే ఒక ఆత్మీయురాలు/ఆత్మీయుడు కలిసినపుడు కలిగే ఆనందం కలుగుతున్నది. సామ్రాజ్యవాద ప్రమాదాన్ని, దాన్ని అడ్డుకోవడానికి విశాల ప్రజల ఐక్యత ఎంత తప్పనిసరి అవసరమో తన వ్యాసాలద్వారా, పుస్తకాల ద్వారా పాఠకులను చైతన్య పరచడంలో వీక్షణం పాత్ర చాలా ప్రశంసనీయమైనది. ప్రస్తుత గ్రామాల అధ్యయన అంశం కూడా చాలా ఆసక్తిని కలిగిస్తున్నది. ఒక అంశాన్ని ఒకటే కోణంలో చూసి మాట్లాడే (అశాస్త్రీయ) పద్ధతిని చాలామందిలో మనం చూస్తూ ఉంటాం. కారణం ఇప్పుడున్న చెడ్డ వ్యవస్థ దాని సంస్కృతి. మనం విభిన్న కోణాల్లో అందునా అకడెమిక్‌గా మాత్రమే అధ్యయనం చేయడంకాక ప్రత్యక్షంగా ప్రజలతో మమేకమై నిష్పక్షపాతంగా అధ్యయనం చేసినప్పుడే లోపాల్ని తెలుసుకొని మంచి మార్పు వైపు ప్రయాణించడానికి వీలు కలుగుతుంది. కమ్యూనిస్టులు, కమ్యూనిస్టు పార్టీలు (అందరూ కాదు) కేవలం ఆర్థిక పరమైన కోణాన్ని పట్టించు కున్నారు. అది ఒక ప్రధానమైన లోపం. కావాలని చేయకపోవచ్చు. నాయకత్వం లోనికి వచ్చినవారి సామాజిక స్థితిగతులు ఆ పరిమితులను కలిపించి ఉండవచ్చు గాక. అందుకే గ్రామాన్ని అధ్యయనం చేయడం అంటే పులే, అంబేద్కర్లను చదవాలి. ఏప్రిల్ వీక్షణంలోని దుప్పల రవికుమార్ గారి ఉత్తరం చదివాను. బ్రిటిష్ వాళ్ళు రాక ముందు ఉన్న గ్రామాలను కోరుకుంటున్న అర్థం స్ఫురిస్తా ఉంది. నూతన, ఆరోగ్యవంతమైన (ప్రత్యామ్నాయ) సమాజాన్ని నిర్మించుకోడానికి కావలసిన సామాజిక కార్యకర్తలను సమాజానికి అందించడంలో వీక్షణం తన వంతు పాత్ర తప్పక పోషించగలదని, అట్లాగే పట్టణాల అధ్యయనం కూడా త్వరలో ప్రారంభించా లని కోరుకుంటున్నాను.

*డి.ఎస్.ఎన్. రాజు*
*దిశా స్టడీ సర్కిల్, పూణె, మహారాష్ట్ర*

వి. హనుమంతరావుగారి గౌరవ సంపాదకత్వంలో, ఇతర నిపుణుల, సంపాదకుల సమ్మేళనంలో సూటిగా, నేరుగా ఎప్పటి నుండో పాఠకుల ముందుకొస్తున్న వీక్షణం పత్రికను ఈ మధ్యనే చదివాను. చాలా సంతోషం, తృప్తి, ఆనందం కలిగాయి. ఈ మధ్యకాలంలో నిజాలు, వాస్తవాలు వెలుగులోకి తెచ్చే పత్రికలు లేవు. పొగడ్తలు, అవాస్తవాలు కొన్ని పేపర్ల లక్ష్యాలు. ఈ తరుణంలో సమాజంలోని వాస్తవాలను, నిజాలను చెప్పడానికి కావాల్సిన ధైర్యం, తెగువ మీలో పుష్కలంగా ఉన్నాయని వీక్షణం చెబుతోంది. సంపాదకీయం కుంభకోణాల గురించి సవివరంగా మా ముందుంచింది. నేటి ప్రభుత్వం పదవులు కాపాడుకోవడానికి, పదవీకాలం పూర్తి చెయ్యడానికి కుటిల ప్రయత్నాలు చేస్తోంది. అవినీతి ధారాళంగా పబ్లిక్‌గా విస్తరిస్తోంది. ఒక నిజాయితీ పరుడైన పోలీసు అధికారి బదిలీని విపక్షాలు, మీడియా, న్యాయవ్యవస్థ ఆపలేకపోయాయి. ఇవన్ని విషయాలు వీక్షణంలో అచ్చు వేయడం అభినందనీయం. అలాగే 'బొగ్గు నుండి సైనిక శకటాల దాకా', 'ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ నిధులు ఎవరికో?' 'రైల్వేలను కబళించనున్న ప్రైవేటీకరణ', 'గుజరాత్ గాయానికి పదేళ్ళు', 'కిడ్నాపుల వెనుక ఉన్న కారణాలు', 'మన విదేశీ రుణం' లాంటి వివరణాత్మక వ్యాసాలు, త్యాగశీలి విప్లవకవి శివసాగర్ జ్ఞాపకాలు చాలా గొప్పగా, స్పెసిఫిక్‌గా, ఎమోషనల్‌గా ఉన్నాయి. చక్కని ఆర్టికల్స్, పుష్కలమైన వివరాలతో 'వీక్షణం' సీరియస్‌గా ఉంది. వీక్షణం లాంటి ప్రయోగాత్మకమైన పత్రికలకు పాఠకుల, ప్రజల నైతిక మద్దతు, ప్రోత్సాహం అవసరం అని నా భావన.

– *కోలాహలం మోహన్‌రాజు, మిర్యాలగూడ, నల్లగొండ*

వీక్షణం రెగ్యులర్‌గా వస్తున్నది. చదువుతున్నాం. మీరు కోరిన విధంగా తప్పక వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచిక రూపకల్పనలో తప్పక పాలు పంచుకుంటాం. పత్రిక చదువుతుంటే నాకు పూర్వం మాదరన్ రివ్యూ, మాన్‌కైండ్ చదివిన జ్ఞాపకాలు వస్తుంటవి. వీక్షణం పత్రిక కూడా అదే కోవలో నడుస్తున్నందుకు చాలా సంతోషం.

*వి. చలపతిరావు, కూకట్‌పల్లి, హైదరాబాద్*

వీక్షణం మే 2012 సంచికలో 'గ్రామీణ అధ్యయనం' అనే వ్యాసంలో 1920లో భారతదేశంలో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ విషయంలో కొంత వివాదం ఉన్నట్టు రాశారు. కాని 1920లో ఎం.ఎన్. రాయ్ (ఫాదర్ ఆఫ్ కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా) గురించి రాయకపోవడం బాధాకరం. ఎందుకంటే 1924లో లెనిన్‌తో కలిసి వలస సిద్ధాంతాన్ని తయారుచేసిన ఎం. ఎన్. రాయ్ తరువాత, చైనా వెళ్లి అక్కడ పరిస్థితిని కొమింటర్న్ తరఫున వివరించిన సంగతి మరువరాదు. ఇతడు రష్యా వెలపల 1920లో ప్రప్రథమ కమ్యూనిస్టు పార్టీని స్థాపించాడు. 1952 ప్రపంచ ప్రప్రథమ మానవతా ఉపాధ్యక్షుడిగా ఎన్నికైన సంగతి అందరికీ తెలుసు. ముఖ్యంగా ఇండియాలో కమ్యూనిస్టు పార్టీ మిత్రులు ఎం.ఎన్. రాయ్‌ని మరువడం, అతడిని గురించి తెలపకపోవడం ఒక చారిత్రక తప్పిదం. 1946లో ఎం.ఎన్. రాయ్ 'భారతదేశంలో రాజకీయ పార్టీలు' అనే గ్రంథంలో విషయాలు తెలిపినట్టే తెలుస్తోంది. ఒక వ్యక్తిని ఏ రకంగానైనా ఉన్నది ఉన్నట్టు చెప్పకపోవడం సహేతుకం కాదని నా భావన, అంతేగాని ఒక వ్యక్తిని నొప్పించాలని నా భావన కాదు.

– *ముత్తెనగారి రాజేందర్ రెడ్డి, భూంపల్లె, మెదక్*

మావోయిస్టు పార్టీ కలెక్టర్‌ను గాని మరి ఎవరినైనా కిడ్నాప్ చేయగానే మానవతా దృక్పథంతో విడిచి పెట్టాలని, కిడ్నాపులు తప్పు అని కమ్యూనిస్టు నేతలు, కుహనా మేధావులు, పోలీసుల అండతో ఆ ప్రాంతాల నాయకులూ ప్రకటనలు ఇస్తున్నారు. ప్రదర్శనలు నిర్వహిస్తున్నారు. కిడ్నాప్ చేసినపుడు, ఆ పార్టీలో గిరిజనులు, ఇతరులు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కరించాలని, జైళ్లలో ఉన్న ఆదివాసులను, తమ పార్టీ నాయకులను విడుదల చేయాలని డిమాండ్ చేస్తున్నారు. ఇవి న్యాయసమ్మతమైనవే. ఒకటి ప్రజల కోసం, రెండోది వారి పార్టీది అని కొందరనుకుంటున్నారు. అది సరికాదు. ప్రజల కోసం పార్టీ పనిచేస్తున్నందున

*(మిగతా 62వ పేజీలో...)*

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, శ్రీకాకుళం – ఏకుల మల్లేశ్ (ఇంటర్నెట్ ద్వారా)

# ధరల పెంపు పర్యవసానాలేమిటి?

పెట్రోల్ ధరను ఒక్కసారి పదిశాతానికి పైగా పెంచుతూ కేంద్రప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ఆ మర్నాడు డీజిల్, కిరోసిన్ ధరలు కూడ పెంచే నిర్ణయం తీసుకోవడానికి మంత్రివర్గ సమావేశం జరిగింది గాని, నిర్ణయాన్ని వచ్చేనెలకు వాయిదా వేశారు. అంతకుముందే పెరుగుతూ వస్తున్న నిత్యావసర వస్తువుల ధరలు, ఈ రవాణా ఇంధనాల ధరల పెరుగుదల వల్ల మరింత పెరిగిపోతాయి. ఇప్పటికే రెండంకెల అంచుల్లో ఉన్న ద్రవ్యోల్బణం ఇంకా పైకి ఎగబాకుతుంది. అసలు ద్రవ్యోల్బణ అంకెలే ఒక మాయ. ద్రవ్యోల్బణం అనేది గత సంవత్సరం ఇదే సమయానికి ఉండిన వినియోగదారుల ధరల సూచికీ, ప్రస్తుత ధరల సూచికీ మధ్య తేడా రేటు మాత్రమే. అది ఒక సాంకేతిక సూచి. అది లెక్కగట్టడంలో చాల సంక్లిష్ట అంశాలు ఇమిడి ఉంటాయి. అది పైకీ కిందికీ మారుతూ ఉండవచ్చు కూడ. అందుకే అప్పుడప్పుడు ద్రవ్యోల్బణం తగ్గింది అని ప్రభుత్వం ప్రకటిస్తుంటుంది గాని ప్రజలు నిత్యజీవితంలో ఎల్లప్పుడూ ధరల పెరుగుదలనే తప్ప, తరుగుదలను, స్థిరత్వాన్ని చూడలేదు. ద్రవ్యోల్బణం గురించి ఆ శాస్త్ర, సాంకేతిక విషయాన్ని అలా ఉంచి ధరల పెరుగుదల అనే నిత్యజీవిత మహమ్మారి ప్రజల జీవితాల మీద ఇలా ఎందుకు స్వారీ చేస్తున్నదో, దాన్ని నియంత్రించవలసిన, నియంత్రించగలిగిన ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయో చూడవలసి ఉంది. ప్రస్తుత పెట్రోల్ ధరల పెరుగుదలే చూసుకుంటే, అంతర్జాతీయ చమురు ధరల పెరుగుదల వల్ల, డాలర్‌తో రూపాయి మారకం విలువ తగ్గిపోవడం వల్ల పెట్రోల్ ధరలు పెంచక తప్పలేదని ప్రభుత్వం చెపుతున్నది. ఇవి రెండూ పచ్చి అబద్ధాలు. వాస్తవాలను మసిపూసి మారేడుకాయ చేసే ప్రయత్నాలు. పెట్రోల్ ఉత్పత్తికి అవసరమైన ముడి చమురు (క్రూడ్ ఆయిల్) ఎక్కువభాగాన్ని భారత్ దిగుమతి చేసుకుంటున్న మాట నిజమే గాని, దాని ధరలకూ భారత్‌లో పెట్రోల్ ధరలకూ ఏమీ సంబంధం లేదు. అసలు దేశంలో పెట్రోలియం ఉత్పత్తుల రాజకీయార్థిక అంశాలు పరిగణనలోకి తీసుకుంటే పాలకవర్గాల దుర్మార్గం, అబద్ధ ప్రచారం స్పష్టంగా బయటపడతాయి. పెట్రోల్, డీజిల్‌లకు వినియోగదారుల నుంచి వసూలు చేస్తున్న ధరలో సగానికి పైగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పన్నులే ఉన్నాయి. అలాగే చమురుశుద్ధి కర్మాగారాల నుంచి విడుదల అవుతున్న పెట్రోలు ధర నిర్ణయించేటప్పుడు ప్రైవేట్ వ్యాపార ప్రయోజనాల కోసం దారుణమైన మోసాలు, అంకెల గారడీలు జరుగుతున్నాయి. ఆధునిక జీవితంలో ఈ రవాణా ఇంధనాలు ప్రతి మనిషికీ అత్యవసరమయి పోయాయి గనుక వీటిమీద ఇబ్బడి ముబ్బడిగా పన్నులు రాబట్టి తమ విలాసాలకు, అనవసర వ్యయాలకు, ముడుపులకు వాడుకోవచ్చునని ప్రభుత్వాలు భావిస్తున్నాయి. ఇలా ధరలు పెంచితేనే చమురు రంగంలోని ప్రైవేట్ కంపెనీలకు ఎన్నోరెట్లు ఎక్కువ లాభాలు అందుతాయి గనుక కూడ ఈ రంగంలో అసలు ప్రభుత్వ నియంత్రణే ఉండగూడదని, మార్కెట్ శక్తుల ఇష్టారాజ్యానికి వదిలేయాలని ఆ కంపెనీలు, బహుళజాతిసంస్థలు కోరుతున్నాయి. దేశంలో ప్రపంచీకరణ ఇంకా వేగంగా జరగాలని కోరుకునే శక్తులన్నీ ఈ దిశగా సలహాలు ఇస్తున్నాయి. ఈ ఇరవై ఏళ్లలో ఈ రంగాన్ని సరళీకరించడానికి, అంటే ప్రైవేట్ సంస్థల లాభాలు పెంచడానికి, ప్రభుత్వ నియంత్రణ తగ్గించడానికి ప్రభుత్వ నియంత్రిత ధరల విధానాన్ని తొలగించడం (2002), రంగరాజన్ కమిటీ సిఫారసులు (2005), కిరిత్ పారిఖ్ కమిటీ సిఫారసులు (2011) వంటి ప్రయత్నాలెన్నో జరిగాయి. ఆ దిశలో మరొక అడుగే తాజా ధరల పెంపు. ఈ పరిణామానికి ప్రతిస్పందనలు చూస్తే భారత సమాజానికి ఏం జరగబోతున్నదా అని విచారం కలుగుతున్నది. పాలకవర్గాలలో అధికారపక్షాలు, ప్రపంచీకరణ శక్తులు ఈ ధరల పెంపుదలను స్వాగతించాయి. పెట్రోలియం శాఖ మంత్రి సమర్థనలు మాత్రమే కాదు, యుపిఎ భాగస్వామ్య పక్షాలలో వెనుకబడిన, పేద వర్గాల ప్రతినిధులుగా చెప్పుకునేవారు కూడ ఈ చర్యను అనివార్యమైనదిగా అభివర్ణిస్తూ సమర్థించారు. ఎకనమిక్ టైమ్స్ వంటి పత్రికలు ఈ చర్యను సంపూర్ణంగా సమర్థిస్తూ ఇది చాలదని, ఇంకా ముందుకు పోవాలని సలహా ఇచ్చాయి. ఇక ప్రతిపక్షాలుగా పిలుచుకునే పాలకవర్గ ముఠాలు నామమాత్రపు ఖండనలు, నిరసనలు ప్రకటించి భారత్ బంద్‌కు పిలుపునిచ్చాయి. కాని ఆ ముఠాలన్నీ కూడ అధికారంలో ఉన్నప్పుడు ఇటువంటి చర్యలు తీసుకున్నవే. తాము అధికారంలో ఉన్న సమయంలో పెట్రోలియం ఉత్పత్తుల ధరల పెరుగుదలను అరికట్టడంలో కనీస ప్రజానుకూల చర్యలైనా తీసుకున్నవి కావు. కనుక ఇవాళ వాళ్ల పిలుపులకు అతి తక్కువ స్పందన వస్తున్నది. పేర్లు, జెండాలు మారినా ఇవన్నీ పాలకవర్గ ముఠాలే గనుక వీళ్ల ప్రతిస్పందనలు ఇలా ఉండడంలో ఆశ్చర్యం లేదు. కాని ప్రజల వైపు నుంచి పెద్దఎత్తున నిరసన, వ్యతిరేకత వ్యక్తం కాకపోవడం ఆశ్చర్యకరంగా, భవిష్యత్ విస్ఫోటనానికి సూచికగా ఉంది. ఈ ధరల పెంపు తక్షణమే ప్రభావం చూపగల మధ్యతరగతి మౌనంగా ధరల పెంపును ఆమోదించింది. ధరల పెరుగుదల పరోక్ష ప్రభావం అన్ని వర్గాల ప్రజల మీద ఉంటుంది గాని ఆయావర్గాల వ్యతిరేకత కూడ ఇంతవరకు వ్యక్తం కాలేదు. దుర్భరమైన ఈ చర్య పట్ల మౌనానికి మూడు అర్థాలున్నాయి. ఒకటి, ఇటువంటి చర్యలు అనివార్యమనీ, ఈ ఊబిలోంచి తమను రక్షించగలదేమీ లేదనీ, తామేమీ చేయలేమనీ ప్రజలు కర్మ సిద్ధాంతంలో పడి, నిస్సహాయతకు, నిర్లిప్తతకు గురి కావడం. ధరలు పెరిగినకొద్దీ ఇంకా ఇంకా ముడుచుకుపోయి తమ అవసరాలు తగ్గించుకోవడం. కత్తిరించిన జీవితాలు గడపడం. ఇది జరిగితే సమాజ మనుగడే, సమాజంలోని చలనశీలతే రద్దయిపోతుంది. సమాజం మృత సమాజమవుతుంది. రెండు, ఈ పరిస్థితిని మార్చాలనీ, కాని ఆ మార్పుకు నాయకత్వం వహించే వారెవరూ లేరనీ, నాయకత్వం వహిస్తామని ప్రగల్భాలు పలుకుతున్న పార్లమెంటరీ రాజకీయ పక్షాల మీద తమకు నమ్మకం లేదనీ ప్రజలు భావిస్తుండవచ్చు. ఇది జరుగుతూ ఉంటే సమాజం గొప్పగా చెప్పుకుంటున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికీ, ప్రాతినిధ్య రాజకీయాలకూ అర్థం లేదని, ఆ సంస్థలు విశ్వసనీయతను కోల్పోయాయని తేలుతుంది. మూడు, ఇది తీవ్రంగా వ్యతిరేకించవలసిన, ప్రతిఘటించ వలసిన చర్యేనని, కాని ఇప్పుడు తమకు ఆ శక్తి లేదని, తమలో ఆ శక్తిని ఉద్దీపింపజేయగలిగిన రాజకీయ సామాజిక నాయకత్వం లేదని, తమ ఆగ్రహాన్ని తమలోనే దాచుకోవడం. ఇది జరుగుతుంటే ప్రజలలో ఆగ్రహం పెరిగిపోతూ ఉంటుంది. ఏదో ఒకరోజున ఆ ప్రజా ఆగ్రహం పెల్లుబికి, విస్ఫోటనం జరుగుతుంది. అది అరాచకంగానూ జరగవచ్చు, సరైన నాయకత్వం ఏర్పడితే నిర్మాణాత్మక విప్లవంగానూ జరగవచ్చు. భారత సమాజం ఆ కీలక పరిణామపు అంచులలో ఉన్నదా?

# అక్రమార్జన - నేర విచారణ - పత్రికాస్వేచ్ఛ

రాష్ట్రంలో పత్రికలు, టెలివిజన్ ఛానళ్లు అన్నీ తాము ప్రజల సమాచార వాహికలమనే సంగతి మరచిపోయి వేరువేరు పాలకవర్గ రాజకీయ ముఠాల బాకాలుగా మారిపోయి చాల రోజులయింది. తెలుగు మీడియాలో అతి ఎక్కువ భాగం తన మీడియా (మాధ్యమం) బాధ్యతను మరచిపోయి మాఫియాలా పనిచేస్తున్నాయని విశ్లేషకులు చాలకాలంగానే అంటున్నారు. పారిశ్రామిక, వ్యాపార, అక్రమ, నేర రాజకీయ సామ్రాజ్యాల మేలిముసుగుగా, ఆ అక్రమాలనుంచి, నేరాలనుంచి కాపాడుకునే రక్షణ కవచంగా మీడియా ఉపయోగ పడుతున్నది. ప్రధాన స్రవంతి మీడియా సంస్థలలో అక్రమ ధనం లేని సంస్థ, ఏదో ఒక పాలకవర్గ ముఠాతో అంటకాగని సంస్థ ఒక్కటి కూడ లేదంటే అతిశయోక్తి కాదు. పత్రికల, ఛానళ్ల అధిపతులలో నేరస్తులు కాని వారు ఒకరిద్దరు కూడ ఉంటారో ఉండరో. సక్రమమైన విచారణలు జరిగితే అందరూ శిక్షార్హులే. ఏయే మీడియా సంస్థ అధిపతి ఏయే అక్రమాలకు పాల్పడ్డారో ప్రజలందరికీ తెలుసు. తెలుగుసీమ రాజకీయాలలో ఇవాళ సాగుతున్న పాలకవర్గ ముఠా తగాదాల స్థాయి వల్ల ఈ మీడియా సంస్థలు వార్తల కన్న ఎక్కువ వ్యాఖ్యలు, ప్రత్యర్థుల మీద నిజాలూ అబద్ధాలూ విరివిగా ప్రచారం చేస్తున్నాయి. తాము పరమ పవిత్రులమని, అవతలివాళ్లు అవగుణాల కుప్పలని ప్రచారం చేస్తున్నాయి. ఈ క్రమంలో ప్రచార సాధనాల మౌలిక లక్షణాలు అడుగంటిపోయి, ఒక్క పత్రిక చదివితే, ఒక్క ఛానల్ చూస్తే వాస్తవాలు తెలియని స్థితి, కొన్ని వార్తలు కొన్ని పత్రికలలోనే, ఛానళ్లలోనే వచ్చే స్థితి ఏర్పడింది. ఈ నేపథ్యంలో సాక్షి పత్రిక, టివి ఛానళ్ల యాజమాన్యపు అక్రమాల మీద విచారణ మొదలై, బ్యాంక్ ఖాతాల స్తంభన జరిగింది. సహజంగానే ఈ చర్యల మీద రెండు పరస్పర విరుద్ధ అభిప్రాయాలు వినబడుతున్నాయి. అక్రమార్జన నేరమే కాదన్నట్టు, దానిమీద విచారణే జరగగూడదన్నట్టు, మీడియా యజమానులు చేసిన నేరం మీదనైనా సరే విచారణ జరిగితే పత్రికాస్వేచ్ఛ మీద దాడి అన్నట్టు ఒక వర్గం వాదిస్తున్నది. తాము చేసిన అక్రమార్జనలను కప్పిపుచ్చుతూ, అవతలివాళ్ల నేరానికి వాళ్లను ఉరితీయాలని, ఆ నేరస్తుల దగ్గర ఉద్యోగం చేసేవాళ్లయినా నేరస్తులేనని మరొక వర్గం వాదిస్తున్నది. ఆవులు కొట్లాడుకుంటే లేగల కాళ్లు విరిగినట్టు ఈ ముఠా తగాదాలలో అసలు సమస్యలు మరుగున పడుతున్నాయి. మూడో అభిప్రాయానికి తావు లేకుండా పోతున్నది. ప్రజాధనాన్ని ఎవరు కైంకర్యం చేసినా కచ్చితంగా నేరమే. ఆ నేరం ఇవాళ పాలక ప్రతిపక్షాలలో ఉన్న అందరూ, పత్రికాధిపతులుగా వారితో సాహచర్యం నెరపుతున్న వారందరూ చేసినదే. ఆ నేరాలన్నిటి మీద నిష్పాక్షికమైన విచారణ జరగవలసిందే. అయితే ఇవాళ ఉన్న స్థితిలో పాక్షికమైన విచారణే జరిగే అవకాశం ఉంది. దాని పాక్షికతను తప్పు పట్టవచ్చుగాని విచారణనే తప్పు పట్టలేం. మీడియా సంస్థల యజమానుల నేరాలకు మీడియా రక్షణ కవచం కాదు, కాగూడదు. కనుక వారి నేరాల విచారణ పత్రికాస్వేచ్ఛ మీద దాడి కాదు. కాని అవి మీడియా సంస్థలు గనుక, ఎంత చెడినా ప్రజాసంబంధ వ్యవస్థలు గనుక, వేలాది మంది ఉద్యోగుల జీవితాలు వాటితో ముడిపడి ఉన్నాయి గనుక ఆ సంస్థల మూసివేత, బ్యాంకు ఖాతాల స్తంభన, ఉద్యోగుల మీద కక్ష సాధింపు తీవ్రంగా వ్యతిరేకించవలసిన, ప్రతిఘటించవలసిన అంశాలు. యజమానుల ప్రయోజనాలు, ఉద్యోగుల ప్రయోజనాలు వేరు వేరని గుర్తించాలి. ప్రజా ప్రయోజనాలు అంతకన్న మించినవని గుర్తించాలి. వీ

# యూరప్‌లో ఏం జరుగుతోంది?

అమెరికా అగ్రరాజ్యంగా ఎదిగేవరకూ, ఇరవయో శతాబ్ది మధ్యభాగం వరకూ కనీసం నాలుగు వందల సంవత్సరాలు ప్రపంచ దేశాలన్నిటి మీద యూరప్ దేశాలే రాజ్యం చేశాయి. ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలను మాత్రమే కాదు, సంస్కృతినీ, ఆలోచనలనూ కూడ ప్రభావితం చేశాయి. అందుకే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల ఆలోచనాపరులందరి మీదా, సంస్కృతి మీదా యూరపియన్ ఆలోచనా ధోరణుల ప్రభావం ఎక్కువ. అన్ని ఆధునిక భావస్రవంతులూ యూరప్‌లోనే పుట్టాయి. కాని క్రమంగా రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ఆ ప్రభావం తగ్గిపోతూ వచ్చింది. 1968 ఫ్రెంచి విద్యార్థి ఉద్యమం మినహా యూరప్ పెద్ద సంచలనాలు లేకుండా ఉండిపోయింది. అటువంటి యూరప్ మళ్లీ ఒకసారి కదలబారుతోంది. నాలుగైదు సంవత్సరాలుగా ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుని ప్రపంచీకరణ విధానాలను మరింత ఎక్కువగా అమలు చేయాలని ప్రయత్నిస్తున్న ప్రభుత్వాలు, ఆ విధానాల దుష్ఫలితాలను ప్రతిఘటిస్తున్న ప్రజలు ఎదురెదురుగా నిలబడి సాగిస్తున్న పోరాటాలు అక్కడి నుంచి నిత్యవార్తలుగా వెలువడుతున్నాయి. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదాలను ఇచ్చిన 1789 ఫ్రెంచి విప్లవం నాటినుంచి 1968 ఫ్రెంచి విద్యార్థుల రెక్కవిప్పిన రెవల్యూషన్ దాకా యూరప్ ప్రపంచంలో ఎటువంటి ఆసక్తిని రేకెత్తించిందో అటువంటి ఆసక్తిని ఇవాళ మళ్లీ రేకెత్తిస్తున్నది. ప్రపంచ శ్రామికులంతా ఒకే కొమ్మ పువ్వులు అని భావించే వారందరికీ ఇవాళ్టి యూరప్ పరిణామాలు ఆసక్తికరంగా మాత్రమే కాదు, ఆశాసూచికలుగా ఉన్నాయి. బ్రిటన్, ఇటలీ, స్పెయిన్, ఫ్రాన్స్, గ్రీస్, జర్మనీ, సెర్బియా, స్లొవేనియా, చెక్ రిపబ్లిక్... ఇలా యూరప్ లోని అన్ని దేశాలలోను ప్రభుత్వ వ్యతిరేక ప్రజా ప్రదర్శనలు, సమ్మెలు, వీధిపోరాటాలు, ఎన్నికలలో అధికారపక్షాలను మట్టి గరిపించడాలు, పాలకవర్గాల పట్ల అసంతృప్తి, ప్రత్యామ్నాయాల కోసం ఎడతెగని అన్వేషణ కనబడుతున్నాయి. ప్రభుత్వాలు ప్రజావ్యతిరేక సామాజిక ఆర్థిక విధానాలను మరింతగా అమలు చేయాలనే ఒత్తిడికీ, అలా అమలు చేస్తే తమ మనుగడనే కోల్పోవలసి వస్తుందనే వాస్తవానికీ మధ్య ఊగిసలాడుతున్నాయి. ఆ ఒత్తిడి అమెరికాది, బహుళ జాతి సంస్థలది, పాలకవర్గాలది. ఈ వాస్తవం ప్రజలది. అంటే ఒకరకంగా ఆక్యుపై వాల్ స్ట్రీట్ ఉద్యమం నినదించినట్టుగా తొంబై తొమ్మిది శాతం ఏకం కావడానికీ, ఒక్క శాతం పాలనను కూలదోయడానికీ రంగం సిద్ధమవుతున్నది. ప్రజావ్యతిరేక విధానాలను ప్రకటిస్తున్న, అమలు చేస్తున్న ప్రభుత్వాలు కూలి పోతున్నాయి. గత్యంతరం లేక మరొక పాలకపక్ష ముఠానే ఎన్నుకున్నా, అది అధికారానికి వచ్చి అవే విధానాలను కొనసాగిస్తోంది. ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడడానికి సంక్షేమ వ్యయం తగ్గించడమా, పొదుపు చర్యలు చేపట్టడమా, యూరో జోన్ నుంచి బైటికి రావడమా, అమెరికా మీద మరింత ఎక్కువగా ఆధారపడడమా, కనీస సోషల్ డెమొక్రటిక్, సోషలిస్టు, ప్రజానుకూల విధానాలను చేపట్టడమా అని అన్ని ప్రభుత్వాలూ మల్లగుల్లాలు పడుతున్నాయి. పాలకులు పాతపద్ధతిలో పాలన కొనసాగించలేకపోవడమూ, పాలితులు గతంలోలాగ పాలనను అంగీకరించక పోవడమూ విప్లవ పరిస్థితికి నిదర్శనాలని లెనిన్ చెప్పిన మాట ప్రపంచమంతా నిజమవుతున్నది, యూరప్‌లో కూడ కనబడుతున్నది. వీ








- **శ్రీశ్రీ** – సాహిత్య సమాలోచన – తెలుగు విజ్ఞాన సమితి, బెంగుళూరు – 176 పేజీలు, 1/4 క్రౌన్, రు: 200, ప్రతులకు: తెలుగు విజ్ఞాన సమితి, 29, జి.డి. పార్క్ ఎక్స్‌టెన్షన్, వయ్యాలికావల్, బెంగుళూరు – 560 003; విశాలాంధ్ర బుక్‌హౌస్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ – 500 001
- **పరామర్శ** – సాహిత్య వ్యాసాలు – నల్లూరి రుక్మిణి – విప్లవ రచయితల సంఘం – 176 పేజీలు, 1/8 డెమీ, రు: 80, ప్రతులకు: నల్లూరి రుక్మిణి, సి-132, ఎస్.వి.ఎన్. కాలనీ, గుంటూరు – 522 006; సెల్ : 9989133401
- **రమాబాయి అంబేద్కర్** – జీవిత చరిత్ర – శాంతిస్వరూప్ బౌద్ధ్, అనువాదం: డా. జి.వి. రత్నాకర్ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ – 52 పేజీలు, 1/8 డెమీ, రు: 40, ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067. ఫోన్ : 23521849, www.hyderabadbooktrust.blogspot.com
- **వ్యాసహారిక** – వ్యాస సంపుటి – కొండపల్లి నీహారిణి – 165 పేజీలు, 1/8 డెమీ, రు : 125, ప్రతులకు : కొండపల్లి నీహారిణి, ఇ.నెం. 3-4-526/33, ఎన్.ఎల్.జి. రెసిడెన్సీ, ఫ్లాట్ నెం. 102, బర్కత్‌పుర, హైదరాబాద్ – 500 027; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, నవోదయ బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్
- **కథలు – కథకులు** – – ముక్తవరం పార్థసారథి – వికాసం బుక్స్, 136 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : ఎం. పార్థసారథి, 411, ప్రభాత్కర్ అపార్ట్‌మెంట్స్, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ – 500 057. ఫోన్ : 040-23345091
- **కొత్త బాటలు వేస్తూ...** – మహిళా మార్గం కథలు – మహిళా మార్గం ప్రచురణలు – 252 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : బి. జ్యోతి, ఎడిటర్, మహిళా మార్గం, 1-3-75/5/ఎ, భీంనగర్, గద్వాల్, మహబూబ్‌నగర్ – 509 125; సెల్: 9848855624; సహచర బుక్‌మార్క్; దిశ పుస్తక కేంద్రం
- **మా వూరి కథలు** – డా. పి. విజయలక్ష్మి – మహిళా మార్గం ప్రచురణలు – 142 పేజీలు, 1/8 డెమీ, రు : 60, ప్రతులకు : బి. జ్యోతి, ఎడిటర్, మహిళా మార్గం, 3-6-779/6, వీధి నెం. 14, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500029; సహచర బుక్‌మార్క్; దిశ పుస్తక కేంద్రం
- **సమ్మోహము** – కవిత్వం – దుర్గాప్రసాద్ అవధానం – స్వర్ణ పబ్లికేషన్స్ – 97 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : స్వర్ణ పబ్లికేషన్స్, దుర్గాప్రసాద్ అవధానం, 5-12-103/4, శ్రీనివాస కాలనీ, బిటిఎస్, నల్లగొండ, తెలంగాణ; ఫోన్ : 08682-231314, సెల్: 9492608314
- **బహుత్‌ఖూబ్ యాకూబ్** – సౌభాగ్య – పాలపిట్ట బుక్స్ – 99 పేజీలు, 1/8 డెమీ, రు : 60,
- **చీకటి పున్నమి** – కథలు – వడలి రాధాకృష్ణ – తన్మయి పబ్లికేషన్స్ – 160 పేజీలు, 1/8 డెమీ, రు : 125

పై రెండు ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036. ఫోన్ : 040 – 27678430, 9848787284, palapittabooks@gmail.com









## పోలీసులకు చిక్కిన భానుకిరణ్

మద్దెలచెరువు సూరి హంతకుడు భానుకిరణ్ ఏప్రిల్ 21న జహీరాబాద్‌లో ఒక దాబా వద్ద పోలీసులకు చిక్కాడు. సూరీ తనను చంపవచ్చనే భయంతో తానే హత్య చేసినట్లు ఒప్పుకున్నాడు. భానుకిరణ్‌పై రాష్ట్రవ్యాప్తంగా పదిహేను కేసులు నమోదైనట్లు సిఐడి అదనపు డిజి రమణమూర్తి మీడియాతో అన్నారు. పదిహేను నెలలుగా భానుకిరణ్ పోలీసులకు చిక్కకుండా షోలాపూర్, ముంబై, ఢిల్లీ, గుజరాత్, గుర్‌గావ్‌లలో తలదాచుకున్నాడు. భానుకిరణ్‌కు సినీ ప్రముఖులతో, పారిశ్రామికవేత్తలతో, పలువురు రాజకీయ నాయకులతో, పోలీసులతో సంబంధాలు ఉన్నట్లు విచారణలో తెలిసింది.

## రెవల్యూషనరీ డెమోక్రటిక్ ఫ్రంట్ ప్రథమ మహాసభలు

రెవల్యూషనరీ డెమోక్రటిక్ ఫ్రంట్ (ఆర్‌డిఎఫ్ – విప్లవ ప్రజాస్వామిక సంఘటన) మొదటి జాతీయ మహాసభలు తెలంగాణలోని హైదరాబాద్ లో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఏప్రిల్ 22, 23 తేదీల్లో రెండు రోజులపాటు జరిగాయి. ఈ సభలో ఆంధ్రప్రదేశ్, జార్ఖండ్, ఉత్తరాఖండ్, ఢిల్లీ, ఒడిశా, తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, కేరళ, హర్యానా, పంజాబ్, కాశ్మీర్‌ల నుంచి ప్రతినిధులు, కళాకారులు హాజరయ్యారు. శ్రీకాకుళ సాయుధ పోరాటంలో క్రియాశీల పాత్ర పోషించిన ఎపిఆర్‌ఎఫ్ వ్యవస్థాక అధ్యక్షుడు గోరు మాధవరావు ఆర్‌డిఎఫ్ జెండాను ఆవిష్కరించారు. ఇటీవల పాముకాటుతో మృతి చెందిన మావోయిస్టు పార్టీ ఉత్తర తెలంగాణ రీజనల్ కమిటీ నేత శంకర్ తల్లి అమరవీరుల స్థూపాన్ని ఆవిష్కరించారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని, ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వెంటనే ఆపివేయాలనే తీర్మానాలతోపాటు పలు తీర్మానాలు ఈ సభలలో చేశారు.

## అసంఘటిత కార్మికులకు బీమా

కార్మికులకు ఉద్దేశించిన కొత్త బీమా పథకాన్ని ముఖ్యమంత్రి ఎన్. కిరణ్‌కుమార్ రెడ్డి ఏప్రిల్ 22న తిరుపతిలో ప్రకటించారు. రాష్ట్రంలోని ఆటో డ్రైవర్ల నుంచి ఇళ్లల్లో పనివాళ్ల వరకు అన్ని రంగాల్లో ఉన్న అసంఘటిత కార్మికులకు లబ్ధి చేకూర్చే 'రాష్ట్రీయ స్వాస్థ్య బీమా యోజన' ను ఏప్రిల్ నెల నుంచే రాష్ట్రవ్యాప్తంగా అమలు చేయనున్నట్లు తెలిపారు. ఈ పథకం కింద కార్మికులకు రెండు లక్షల రూపాయల బీమా సౌకర్యం ఉంటుందని, వైద్య ఖర్చుల కోసం ఏటా ముప్పై వేల రూపాయల వరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చెల్లిస్తాయని తెలిపారు. అరవై ఏళ్లు పైబడిన వారికి నెలకు మూడు వేల రూపాయల పెన్షన్ లభిస్తుందని తెలిపారు. ఇందు కోసం ప్రతి కార్మికుడు ఏడాదికి రెండు వందల రూపాయల ప్రిమియం చెల్లించాల్సి ఉంటుంది. దీనివల్ల రాష్ట్రంలోని కోట్లాది మంది అసంఘటిత కార్మికులకు మేలు జరుగుతుందన్నారు.

## ఉప ఎన్నికల షెడ్యూల్ విడుదల

రాష్ట్రంలోని ఒక లోక్‌సభ, 18 అసెంబ్లీ స్థానాలకు ఉప ఎన్నికల షెడ్యూల్‌ను ఏప్రిల్ 24న రాష్ట్ర ఎన్నికల ప్రధానాధికారి బన్వర్‌లాల్ ప్రకటించారు. నోటిఫికేషన్ జారీ మే 18, నామినేషన్ల దాఖలు చివరి రోజు మే 25, నామినేషన్ల పరిశీలన మే 26, నామినేషన్ల ఉపసంహరణకు తుది గడువు మే 28, పోలింగ్ జూన్ 12, ఓట్ల లెక్కింపు జూన్ 15న జరుగనున్నట్లు షెడ్యూల్ ప్రకటించారు. ఈ ఉప ఎన్నికల నియోజకవర్గాలు పన్నెండు జిల్లాల పరిధిలో ఉన్నాయి. మొత్తం ఓటర్లు 44 లక్షల మంది కాగా, పోలింగ్ బూత్‌లు 5,406 ఉన్నాయి.

## ఇంటర్ సెకండ్ ఇయర్ ఫలితాలు

రాష్ట్రంలో జరిగిన ఇంటర్మీడియట్ రెండవ సంవత్సరం ఫలితాలను ఏప్రిల్ 24న మాధ్యమిక విద్యాశాఖ మంత్రి పార్థసారథి వెల్లడించారు. ఈ పరీక్షలకు జనరల్ (రెగ్యులర్) విద్యార్థులు 7,56,459 మంది హాజరు కాగా, వారిలో 4,41,966 (58.43 శాతం) మంది ఉత్తీర్ణులయ్యారు. వొకేషనల్ రెగ్యులర్ కాటగిరిలో 64,581 మంది పరీక్షలకు హాజరు కాగా, 34,644 (53.64 శాతం) మంది ఉత్తీర్ణులయ్యారు.

## ఇసుక తవ్వకాలపై స్టే

'ఇసుక తవ్వకాలు అత్యవసరం అనడంలో ఎటువంటి సందేహం లేదు. కానీ, పర్యావరణ పరిరక్షణకు అంతే ప్రాముఖ్యం ఇవ్వాలి. నియంత్రణ లేకుండా ఇసుక తవ్వకాలకు అనుమతిస్తే, భవిష్యత్ తరాలు మూల్యం చెల్లించుకోవాల్సి వస్తుంది. అందుకే, ప్రభుత్వం సత్వరమే సమగ్ర మైనింగ్ పాలసీని రూపొందించాలి. ఇంతకంటే మేం ఎక్కువ చెప్పాల్సిన అవసరం లేద'ని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ మదన్ బి. లోకూర్, జస్టిస్ పి.వి. సంజయ్ కుమార్‌లతో కూడిన ధర్మాసనం తేల్చి చెప్పింది. రాష్ట్ర వ్యాప్తంగా ఇసుక తవ్వకాలు, లీజులను ఏప్రిల్ 1 నుంచి నిలిపి వేయాలంటూ మార్చ్ 21న ఇచ్చిన మధ్యంతర ఆదేశాలను ఏప్రిల్ 26న ఖరారు చేసింది.

## టిఆర్ఎస్ 11వ వార్షికోత్సవ సభ

తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) 11వ వార్షికోత్సవం ఏప్రిల్ 29న రంగారెడ్డి జిల్లా వికారాబాద్ సమీపంలోని అనంతగిరి హిల్స్‌వద్ద జరిగింది. ఈ సందర్భంగా టిఆర్ఎస్ అధ్యక్షుడు కె. చంద్రశేఖరరావు మాట్లాడుతూ తెలంగాణ సాధించేవరకు తమ ప్రస్థానం ఆగేది లేదని, అవసరమైతే ఇంకో పదకొండేళ్లు కొట్లాడతామని అన్నారు. ఏ పార్టీలోనూ విలీనమయ్యే ప్రసక్తి లేదన్నారు. వార్షికోత్సవ సభలకు పలువురు నేతలూ, కార్యకర్తలూ, ప్రజలూ హాజరయ్యారు.

## రెండవసారి గవర్నర్‌గా...

ఇ.ఎస్.ఎల్. నరసింహన్ రాష్ట్ర గవర్నర్‌గా రెండవ సారి మే 3న ప్రమాణ స్వీకారం చేశారు. రాజ్‌భవన్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ మదన్ బి. లోకూర్ ఆయనతో ప్రమాణ స్వీకారం చేయించారు. ముఖ్యమంత్రితో పాటు పలువురు ప్రముఖులు హాజరయ్యారు.

## బూదరాజు రాధాకృష్ణ సంస్మరణ సభ

బూదరాజు రాధాకృష్ణ జయంతి సందర్భంగా ఆయన శిష్యులు, అభిమానులు, పాత్రికేయుల ఆధ్వర్యంలో హైదరాబాద్ సోమాజిగూడ లోని ప్రెస్‌క్లబ్‌లో మే 3న సంస్మరణ సభ జరిగింది. ఆయన ఎందరో పాత్రికేయులను తీర్చిదిద్దారని, వాడుక భాషకు, పత్రికా భాషకు వన్నె తెచ్చారని పలువురు వక్తలు అభిప్రాయపడ్డారు. భాషకు సంబంధించి ఆయన రాసిన ఎన్నో పుస్తకాలు నేటికీ అందరికీ ఒక దిక్సూచిగా పనిచేస్తున్నాయన్నారు. ఆయన రూపొందించిన శైలీ పత్రమే నేటికీ ప్రామాణికంగా ఉన్నదని, వాడుక భాషను ఆధునికీకరించడంలో బలమైన ముద్రవేశారని వక్తలు అన్నారు. సీనియర్ పాత్రికేయులు జి.ఎస్. వరదాచారి, గోవిందరాజు చక్రధర్, కాకాని చక్రపాణి, చంద్రశేఖరరెడ్డి, విజయ్‌కుమార్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## మంత్రి మోపిదేవి వెంకటరమణ అరెస్టు

వై.ఎస్. జగన్మోహన్‌రెడ్డి అక్రమాస్తుల కేసులో భాగంగా సిబిఐ మంత్రి మోపిదేవి వెంకటరమణపై ఐపిసి 120బి, రెడ్‌విత్ 409, 420 సెక్షన్ల ప్రకారం కేసు నమోదు చేసింది. వై.ఎస్ రాజశేఖరరెడ్డి హయాంలో పెట్టుబడులు, మౌలిక శాఖ మంత్రిగా పనిచేసిన మోపిదేవి ప్రైవేట్ వ్యక్తులతో కలిసి వాన్‌పిక్ ప్రాజెక్టు కోసం నేరపూరిత కుట్రకు పాల్పడ్డారని, మంత్రిగా ఆయన అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారని పేర్కొంటూ మే 24న రెండవ రోజు విచారణలో భాగంగా సిబిఐ ఆయనను అరెస్టు చేసింది. ఆయనను జూన్ 7 వరకు జ్యుడీషియల్ రిమాండ్‌కు తరలించాలని ప్రత్యేక న్యాయమూర్తి ఆదేశించారు. సిబిఐకు ఐదు రోజుల కస్టడీకి అనుమతించారు. వీ

## పత్రికా స్వేచ్ఛనా? పెట్టుబడి స్వేచ్ఛనా?

'పెట్టుబడికి కట్టుకథకు పుట్టిన విషపుత్రికలు పత్రికలు' అని అన్నాడు శ్రీశ్రీ. సాక్షి దినపత్రిక బ్యాంకు ఖాతాలను సిబిఐ స్తంభింపచేయంతో భావ ప్రకటనా స్వేచ్ఛకు, పత్రికా స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లిందా లేదా పెట్టుబడి స్వేచ్ఛకు భంగం వాటిల్లిందా అనే ప్రశ్నలు మన ముందుకు వచ్చాయి. పత్రికా స్వేచ్ఛకూ, భావ ప్రకటనా స్వేచ్ఛకూ ఎప్పుడు, ఎక్కడ ఆటంకం కలిగినా ముక్తకంఠంతో ఖండించాల్సిందే. దానికి వ్యతిరేకంగా పోరాడాల్సిందే. అందులో అనుమానం అక్కర్లేదు. అధికారంలో ఉన్నవారి గురించి ప్రతిపక్షం, ప్రతిపక్షంలో ఉన్నవారు అధికారం చేపట్టాక దిగిపోయిన అధికార పక్షం పరస్పరం చేసుకునే ఆరోపణలతో కొంతమేరకు పెట్టుబడి చిట్టాలు ప్రజలకు తెలిసినవే. వీరూ వారూ పరస్పరం ఆరోపించుకునే క్రమంలో మనకు కావాల్సినంత సమాచారాన్ని అందించారు. అయితే, ఆ పెట్టుబడులు, వాటి స్వభావం గురించి మనం ప్రజల వైపు నుంచి, కార్మికుల వైపు నుంచి, ఉద్యోగుల వైపు నుంచి, పాత్రికేయుల వైపు నుంచి మాత్రమే వ్యాఖ్యానించగలం. ఫలానా అంశంపై ఫలానా అభిప్రాయం కలిగి ఉండడం వలన లేక ఒక వ్యాసం రాయడం వలన పత్రికపై నిర్బంధం వస్తే తప్పక వ్యతిరేకించాలి. ఇక్కడ గొడవ కంటెంట్‌కు సంబంధించి కాదు. కాపిటల్‌కు సంబంధించినది. పెట్టుబడి స్వచ్ఛత, పారదర్శకతల మూలాల్లోకి వెళితే ఉన్న పత్రికలు చాలా వరకు మూసేయాల్సి ఉంటుంది. మనకున్న పత్రికల పెట్టుబడుల స్వచ్ఛత, నైతికతా ప్రమాణాలు ప్రశ్నార్థకమే. సాక్షి పెట్టుబడులపై దర్యాప్తులు – చర్యలు, పత్రికా స్వేచ్ఛ ఒకటి కావు. ఈ రకమైన దర్యాప్తు అన్ని పత్రికల పెట్టుబడులపైనా నిష్పక్షపాతంగా జరిపి సత్యాలు తెలిపితే ప్రజలకు కొంత మేలు జరిగి, కాస్త జ్ఞానం పెరుగుతుంది. ఇలాంటి సందర్భాల్లో ప్రభుత్వాలే పాత్రికేయుల, ఉద్యోగుల, కార్మికుల భద్రతకు బాధ్యత వహించాలి. ఎవరి పత్రిక వారిది, ఎవరి గొడవ వారిది, ఎవరి పెట్టుబడి వారిది అన్న చందంగా సాక్షి గొడవ కుంచించుకుపోయింది. పెట్టుబడిదారుల మధ్య సఖ్యత సాధ్యం కాకపోవచ్చు (లాభం ఉందంటే వెనుకాడరు) కానీ, విలువల కోసం, బతుకుతెరువు కోసం జీవించే పాత్రికేయుల మధ్య ఐక్యత సాధ్యం కావాలి కదా! ఇదెందుకు సాధ్యం కావడం లేదో ఆలోచించాలి. బహుశా పాలక పక్షాలలో ఎవరో ఒకరివైపు చేరిపోయి, ప్రజలకు దూరమైపోయిన క్రమంలోనే ఈ పరిణామాల్ని చూడాలి. నిజంగానే పాలన, శాసన, న్యాయ వ్యవస్థలను ప్రజల వైపు నుంచి ప్రశ్నించే స్థానంలోనే మీడియా ఉందా, లేక పాలకవర్గాల్లో ఎవరో ఒక పక్షానికి చేరిపోయాయా ప్రశ్నించుకోవాలి.

## మావోయిస్టు సానుభూతిపరుడైతే...

ఒక వ్యక్తి మావోయిస్టు సానుభూతిపరుడంటే అర్థం నేరస్తుడనో, అసాంఘిక శక్తి అనో కాదనీ, అది అతని ఆలోచన లేదా వ్యక్తిగత అభిప్రాయానికి సంబంధించిన అంశమని హైకోర్టు వ్యాఖ్యానించింది. అటువంటి వారిని వేధిస్తే నిజంగానే మావోయిస్టులు అయిపోవచ్చని ఆందోళన వ్యక్తం చేసింది. తన తండ్రికి మావోయిస్టులతో సంబంధాలున్నాయంటూ బ్యాంక్ ఉద్యోగం నుంచి తనను తొలగించారని గుంటూరు జిల్లా నులకపేటకు చెందిన బి. మల్లికార్జునరెడ్డి వేసిన పిటిషన్‌పై హైకోర్టు పై విధంగా స్పందించింది. మావోయిస్టు సిద్ధాంతాలకు ఆకర్షితుడయ్యాడనో, విప్లవ సాహిత్యం పట్ల మక్కువతో ఉన్నాడనో సాకులు చూపి సంఘ వ్యతిరేక శక్తిగా ముద్రవేసి శిక్షించడం రాజ్యాంగంలోని ఆర్టికల్ 19ని ఉల్లంఘించడమే అవుతుందని ఏప్రిల్ 28న జస్టిస్ బి. చంద్రకుమార్ పేర్కొన్నారు. పిటిషనర్‌ను తిరిగి ఉద్యోగంలోకి తీసుకోవాలని, అతనికి లభించాల్సిన అన్ని సౌకర్యాలు కల్పించాలని న్యాయమూర్తి బ్యాంకును ఆదేశించారు. 1971లో విప్లవ రచయితలను పిడి యాక్ట్ కింద ప్రభుత్వం నిర్బంధించిన సందర్భంలోనూ న్యాయమూర్తులు జస్టిస్ చిన్నపరెడ్డి, జస్టిస్ ఓబుల్ రెడ్డిలు 'విశ్వాసాలు అదుపులో పెట్టబడేవి కావు. రాజకీయ విశ్వాసాల కోసం ఎవర్ని నిర్బంధించకూడదు' అని తీర్పు చెప్పి వారిని విడుదల చేశారు. సమీప గతంలో యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ అస్సాం (ఉల్ఫా) అనే నిషిద్ధ సంస్థ సభ్యుడుగా అరూప్ భుయాన్ మీద తీవ్రవాద, విచ్ఛిన్నకర కార్యకలాపాల (నిరోధ) చట్టం (టాడా) కింద అస్సాంలోని డిజిగ్నేటెడ్ కోర్టు విధించిన శిక్షను సవాల్ చేస్తూ ఆయన సుప్రీంకోర్టుకు పిటిషన్ దాఖలు చేసుకున్నప్పుడు 28 మార్చి 2007న విధించబడిన ఆ శిక్షను రద్దు చేస్తూ 3 ఫిబ్రవరి 2011న సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ మార్కండేయ కట్జు, జస్టిస్ జ్ఞాన్ సుధామిశ్రా ఒక చరిత్రాత్మకమైన తీర్పు ఇచ్చారు. నిషిద్ధ సంస్థలో సభ్యులని రుజువు చేసినంత మాత్రాన ఎవరూ శిక్షార్హులు కారని ఆ తీర్పులో వారు నిర్ధారించారు. ఒక నిషిద్ధ సంస్థలో కేవలం సభ్యత్వం ఉండడం అనేది ఒక వ్యక్తిని నేరస్తుడుగా మార్చదని అన్నారు. ఇటువంటి తీర్పులు దేశంలోని న్యాయస్థానాలకూ, ప్రజాస్వామికవాదులకూ గీటురాయి కావాలి. భావ ప్రకటనా స్వేచ్ఛతో సహా జీవించే అన్ని హక్కులు కలిగి ఉన్నప్పుడే ప్రజాస్వామ్యానికి, ప్రజాస్వామ్య భావనకు అర్థం ఉంటుంది.

## మద్యం మాకు వద్దు... మరి ఆదాయమో?

ఐదు నెలలుగా ఎసిబి దాడులు, అరెస్టులు, విచారణల నేపథ్యంలో ఎక్సైజ్ శాఖకు చెందిన ఎస్సైల నుంచి డిప్యూటీ కమిషనర్‌ల దాకా 350 మంది మే 8న ఎక్సైజ్ కమిషనర్ సమీర్ శర్మను కలిసారు. బెల్టు షాపులను, బినామీలను అడ్డుకుంటే, నిబంధనల ప్రకారం నడుచుకుంటే మద్యంపై వచ్చే ఆదాయం పడిపోతుందని, రెవెన్యూ తగ్గితే మీదే బాధ్యత అని కమిషనర్‌ను హెచ్చరించారు. తాము నిబంధనల ప్రకారం నడుచుకుంటే రాష్ట్రంలో ఉన్న 6594 మద్యం దుకాణాల్లో నాలుగు వేల వరకు రద్దవుతాయని తేల్చారు. రాష్ట్రంలో రు. 20 వేల కోట్ల మేర మద్యం అమ్మకాలుంటే అందులో లైసెన్స్‌డ్ షాపుల ద్వారా వచ్చే ఆదాయం 30–40 శాతం మాత్రమే ఉందనీ, మిగతా 60 శాతం ఆదాయం బెల్టు షాపుల ద్వారా వస్తోందనీ చెప్పారు. ఎసిబి అధికారులు తమను వేధిస్తున్నా పట్టించుకోవడం లేదని వాపోయారు. మరోపక్క ఇదే కాలంలో కడప జిల్లా జమ్మలమడుగు నియోజకవర్గంలోని పెద్దపసుపుల గ్రామ మహిళలు 'మా ఊర్లో మద్యం వద్దు' అని నినదిస్తున్నారు. పెద్దపసుపుల గ్రామంలో ఒక మధ్యతరగతి రైతు నెలకు దాదాపు 15,000 రూపాయలు, కూలీ మీదే బతికే మనిషి నెలకు ఐదారు వేల రూపాయలు మద్యం కోసం ఖర్చు పెడుతున్నారు. ఈ ఒక్క ఊరి నుంచే మద్యం షాపు యజమానికి నెలకు రు. 80 లక్షల ఆదాయం వస్తోంది. (దీని చుట్టూ అనధికార బెల్టు షాపులు పదమూడు వరకు ఉన్నాయి.) ఇట్లా మా చెమట, నెత్తురు మద్యం వ్యాపారుల బొక్కసాల్లోకి పారితే, మా వాళ్లకు మాత్రం అవయవాలు కుళ్లి, ఆరోగ్యాలు చెడి, అప్పులు పెరిగి, వినాశనం మిగుల్తోందని అంటున్నారు. ఇక ప్రభుత్వం ఇచ్చే బియ్యం, పెన్షన్ వీటిలో ఎన్నో వంతు అని ప్రశ్నిస్తున్నారు. ప్రభుత్వం ప్రజల కోసమా, మద్యం వ్యాపారుల కోసమా అని నిలదీస్తున్నారు. లక్ష్యాలు నిర్దేశించి మరీ ప్రభుత్వం మద్యం అమ్మకాలను ప్రోత్సహిస్తోందనీ, మా కొంపలు గుల్లచేసి మా కుటుంబాలను విచ్ఛిన్నం చేస్తున్న ఈ విధానం ఎవరి అభివృద్ధి కోసమనీ ప్రజలు నిలదీస్తున్నారు. ఈ నిరసనలు, మద్యం పట్ల వ్యతిరేకత ఇప్పుడు మళ్లీ రాజుకుంటున్నాయి. వీ

వార్త – వ్యాఖ్య : డి.వి. రామకృష్ణారావు

ఒక గిరిజన యువతిని మావోయిస్టు అన్న అనుమానంతో అత్యంత దారుణంగా చిత్రహింసలకు గురిచేస్తే, అలా గురిచేసిన అధికారికి రాష్ట్రపతి ప్రశంసా పతకం లభిస్తే అది పార్లమెంట్ స్తంభించేందుకు దారితీయదు. కాని అంబేద్కర్‌పై 60 ఏళ్ల క్రితం వేసిన కార్టూన్‌ను పాఠపుస్తకాల్లో ప్రచురించినందుకు పార్లమెంట్ స్తంభించిపోతుంది. కారణం అంబేద్కర్‌పై ఓటు బ్యాంకు రాజకీయాలు చేసే అవకాశం ఉండడమే. అంతేకాదు, కేంద్రంలో చిదంబరం వంటి మంత్రుల వ్యవహారాలను ప్రశ్నించకుండా సభ్యుల దృష్టి మళ్లించేందుకే అవసరం లేని విషయాలను లేవనెత్తుతున్నారనే వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి.

***ఎ. కృష్ణారావు 'దాచేస్తే దాగని సత్యాలు' , ఆంధ్రజ్యోతి దినపత్రిక, మే 16***

అనేక రంగాలలో పనికి తగ్గ వేతనం దొరకని పరిస్థితుల్లో, స్త్రీ తాను చేసే పనికి సమాజం అసలు గుర్తింపు ఇవ్వని పనుల్లో ఉంటున్న వాళ్లు ఇంకా మహిళా దినోత్సవాలకు దూరంగానే ఉంటున్నారు. దీనికి కారణం వారు అనునిత్యం కుటుంబ సమస్యలు, ఆర్థిక ఇబ్బందులు, ఉద్యోగ భద్రత లేకపోవడం, ఒక్కింత కూడా స్థిరత్వం లేని ఉద్యోగాలను చేయడం వల్ల వారు వాళ్ల సమస్యలు తప్ప, గంపగుత్తగా స్త్రీజాతి ఎదుర్కొంటున్న సమస్యలవైపు దృష్టిని సారించే దిశలో లేకుండాపోతున్నారు. అందుకే, సమాజపరంగా కుటుంబపరంగా కొంత వెసులుబాటు, ఉద్యోగ భద్రత ఉన్నవాళ్లుగా మనం శ్రామిక మహిళ సమస్యల సాధన కోసం పోరాటాలను ఎంచుకొని మిగతా సెక్షన్ల మహిళలను కూడా పురోభివృద్ధిలోకి తీసుకొని రావాల్సిన బాధ్యత ఉంది.

***ఆర్. రంజన, ఉద్యోగుల గొంతుక మాసపత్రిక, ఏప్రిల్ సంచిక***

మన స్కూళ్లలో ఒకటీ రెండు తరగతులకైనా రోజూ ఒక పీరియడ్ కథలు చెప్పుకోడానికుంటే ఎంత బావుంటుంది! ప్చ్! మన పిల్లలు ఆ మాత్రం భాగ్యానికైనా నోచుకోలేక పోతున్నారు. ఈ అవకాశమే ఉంటే బడిలో చేరిన పిల్లలు బడి నుండి జారిపోకుండా సగం సమస్య పరిష్కారమయ్యేది. 'కథలు చెప్పుకొంటే డ్రాపౌట్ తగ్గుతారా' అని నన్ను చాలా మంది ఎగతాళిగా చూడొచ్చు. ఇంత పెద్ద సమస్యను ఇంత తక్కువగా పరిగణిస్తున్నానని ఎద్దేవా చేయ్యొచ్చు. ఇలాంటి సలహా నేనిచ్చినపుడు నా పట్ల వెటకారంగా (సానుభూతితోనూ) చూసిన సీనియర్ అధికార్లనెందరినో నేనెరుగుదును.

నాకో తీరని కల ఉంది. అదేమంటే మన టీచర్లకు కనీసార్హతగా ముప్పై కథలయినా తడుముకోకుండా చెప్పే రోజు ఎప్పుడొస్తుందా అని. మన ప్రాచీన కథల మీద ఈ మాత్రం పట్టు ఉండే టీచర్లుంటే ఎంత అద్భుతంగా ఉంటుందో గదా అని! 'పట్టు' అంటే గందరగోళ పరచకుండా, గజిబిజి చెయ్యకుండా సాఫీగా చెప్పగలగడం అన్నమాట.

***ప్రొ. కృష్ణకుమార్, తెలుగు అనువాదం: వి. సుబ్రహ్మణ్యం,***
***ఐక్య ఉపాధ్యాయ మాస పత్రిక, మే సంచిక***

రుఖియా షెఖావత్ జీవితాంతం వార్తా పత్రికలకు, మ్యాగజైన్‌కు అనేక వ్యాసాలు రాశారు. ఆమె 'మతిచూర్','పద్‌మార్గ్', 'ముక్తిపాల్', 'సృష్టితత్వ', 'జ్ఞానపాల్' అనే మొదలైన విశిష్టమైన బెంగాలీ నవలలను రచించారు. తన రచనలలో మతం, మన దేశం, సామాజిక సమస్యలు, విద్య మొదలైన వాటిని చర్చించారు. ఆనాటి పరిస్థితులతో పోలిస్తే ఒక మహిళ అందులోనూ ఒక ముస్లిం మహిళ ఇంతటి ఆధునిక భావాలను కలిగి ఉండడం చాలా అరుదు.

సామాజిక నిర్బంధాల అడ్డుగోడల్ని కూలగొడుతూ స్త్రీ, పురుషుల ప్రయోజనాలు వ్యతిరేకమైనవి కావు, వారిద్దరి జీవితధ్యేయం ఒక్కటే అనే వాస్తవాన్ని ఆమె నొక్కి చెప్పారు. 1926లో బెంగాల్ మహిళల విద్యా సదస్సులో ముస్లిం మహిళల విద్య కొరకు, పరదా పద్ధతికి వ్యతిరేకంగా ప్రసంగించారు. 1931లో 'ఆధునిక భారత బాలికలు' అనే విషయం మీద ఆమె ఇచ్చిన ఉపన్యాసంలో 'విద్య అంటే ఏదో ఒక మతాన్ని లేక ఒక కమ్యూనిటీని గుడ్డిగా అనుకరించడం కాదు. ఏదో ఒక డిగ్రీని పొందడానికి చదివేది కూడా నిజమైన విద్య కాదు. విద్యను దాని నిజమైన అర్థంలో పొందినట్లైతే అది మనిషిలో సామాజిక బాధ్యతను కలిగిస్తుంది' అని అభిప్రాయపడ్డారు.

***ఎ. సుగుణ, తెలంగాణ విద్యార్థిని తొవ్వ, త్రైమాసిక పత్రిక, జనవరి-మార్చ్ సంచిక***

ప్రైవేట్ విద్యాసంస్థల ఉపాధ్యాయుల విషయానికి వస్తే పరిస్థితి మరీ దారుణంగా ఉంది. పేరుకు పాఠశాల పనివేళలు ఉదయం 9 నుండి సాయంత్రం 4 వరకైనా, స్టడీ అవర్ల పేర ఉదయం 9 నుండి రాత్రి 7-8 గంటల వరకు విద్యార్థులనంటి పెట్టుకొని ఉండాల్సిందే. ప్రశ్నాపత్రాలు తయారు చేయడం, పేపర్లు దిద్దడం, ప్రోగ్రెస్ కార్డుల పోస్టింగ్, వ్యక్తిగత రికార్డుల నిర్వహణ, బోధనోప కరణాల తయారీలాంటి పనులు చేయాల్సిందే. ఇంతా చేస్తే ఒకటో తేదీ తీసుకునే జీతం ఐదారువేలకు మించదు. పాతికేళ్ల సీనియర్‌కు కూడా పది వేలు మించదు. ఫీజులు, డొనేషన్ల పేర ప్రైవేట్ యజమాన్యాలు తల్లిదండ్రుల నుంచి వసూలు చేస్తున్నదెంత? దానిలో రోజుకు పది గంటలకు పైగా పనిచేస్తున్న ఉపాధ్యాయులకు ఈ ప్రైవేట్ యాజమాన్యాలు చెల్లిస్తున్న వాటా ఎంతో బహిరంగ రహస్యమే.

***సంపాదకీయం, ఉపాధ్యాయ మాసపత్రిక, మే సంచిక***

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఏర్పడిన తరువాత ఇప్పటివరకు సుమారు 179 మందిని న్యాయమూర్తులుగా నియమించడం జరిగింది. వాస్తవానికి సామాజిక న్యాయసూత్రం ప్రకారం సుమారు వంద మంది వరకు ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీ, మహిళల నియామకం జరగాలి. కాని దానికి విరుద్ధంగా ఆంధ్రప్రదేశ్ హైకోర్టు చరిత్రలో ఇప్పటివరకు కేవలం పది మంది బిసిలు, ముగ్గురు ఎస్‌సిలు, ఒక ఎస్‌టి, ముగ్గురు మహిళలు మాత్రమే నియమించ బడ్డారంటే, ఆంధ్రప్రదేశ్ ఉన్నత న్యాయస్థానంలో మెజారిటీ ప్రజలకు దక్కవలసిన న్యాయమైన వాటా దక్కకపోవడాన్ని గమనించినట్లైతే ప్రభుత్వం, ఉన్నత న్యాయస్థానాలలో మెజారిటీ ప్రజలైన ఎస్‌సి, ఎస్‌టి, బీసి, మైనారిటీ, మహిళలు ఎంతటి వివక్షకు, అన్యాయాలకు గురైనారో అర్థమవుతుంది.

***ఆం.ప్ర. బిసి సంక్షేమ సంఘం, ఆర్‌పిఐల సంయుక్త పత్రికా ప్రకటన,***
***నీలిజెండా పక్షపత్రిక, మే 1-15, సంచిక***

ఈనాడు ప్రైవేట్ విద్యాసంస్థలు ఫీజులు చెల్లించి సీటు కొనుక్కోగలిగే వారికే అందుబాటులో ఉన్నాయి తప్ప డబ్బులేని పేదవారికి ఉపయోగపడవు. నారాయణ, చైతన్య విద్యాసంస్థలు బినామీ పేర్లతో చట్టవిరుద్ధంగా విద్యాసంస్థలను ఏర్పరచి, రాష్ట్రమంతా విస్తరించి 10+2 స్థాయి విద్యను శాసిస్తూ కోట్లాది రూపాయలు దండుకుంటుంటే అరికట్టలేని పాలకులు, సామాజిక బాధ్యత పేరుతో మరిన్ని కోట్ల ప్రజాధనం కార్పొరేట్ విద్యాసంస్థలకు దోచి పెట్టేందుకు పథకాలు వేస్తున్నారు. ఈ మొత్తం నిధులను ప్రభుత్వరంగంలోనే వినియోగిస్తే నాణ్యమైన విద్యను పేదలకు అందించవచ్చని నిపుణులైన విద్యావేత్తలు సూచిస్తున్నారు.

చివరగా, ప్రైవేట్ విద్యాసంస్థలు విద్యార్థులను ముడిసరుకులుగా యాంత్రికంగా మానవత్వం లేని స్వార్థపరులుగా తయారుచేసి, పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులను, తీర్చిదిద్దిన సమాజాన్ని నిర్లక్ష్యం చేసే స్థితికి తెస్తున్నాయి. అంతర్జాతీయ అనుభవాల రీత్యా చూసినా ప్రజలందరికీ ఉచిత నిర్బంధ విద్య ప్రభుత్వరంగంలోనే సాధ్యం. పౌర సమాజం మేల్కొనకపోతే విద్యావ్యవస్థ ప్రైవేటీకరణ వైపు పోకుండా నిరోధించడం సాధ్యం కాదు.

***సంపాదకీయం, ఉద్యోగ క్రాంతి మాసపత్రిక, ఏప్రిల్ సంచిక***

మన భారతదేశంలోని ఏజెన్సీ ప్రాంతాలు అశేష ఖనిజ సంపదలకు నిలయమైన తమ భూమిని, అడవిని, ఆ అడవి నిండా ఉన్న సహజ వనరులను కాపాడుకోవడానికి ఆంధ్రప్రదేశ్, చత్తీస్‌గడ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒడిశా, జార్ఖండ్, పశ్చిమ బెంగాల్‌లోని ఆదివాసులు పోరాడుతున్నారు. సహజమైన సకల సంపదలను టాటా, బిర్లా, జిందాల్, పోస్కో, వేదాంత, సలీం, ఎస్సార్ వంటి బహుళజాతి సంస్థలకు కట్టబెట్టడానికి, వాళ్ల కోసం అడవి నుండి ఆదివాసులను తరిమివేయడానికి గ్రీన్‌హంట్ పేరుతో పారామిలిటరీ బలగాలు, సైన్యంతో భారత ప్రభుత్వం ఆదివాసులపై యుద్ధాన్ని కొనసాగిస్తున్నది. ఈ దాడిని ఆదివాసీ జాతిపై, సంస్కృతిపై, వారి విశ్వాసాలపై, ఆర్థిక వనరులపై దాడిగా పరిగణించాలి. సకల వనరులను కాపాడుకుంటూ ఈ దేశ సార్వభౌమత్వాన్ని సమున్నతంగా నిలబెట్టడం కోసం, తమ మనుగడ కోసం ఆదివాసీలు జీవన్మరణ పోరాటం చేస్తున్నారు.

***సంపాదకీయం, ఆదివాసీ గొంతుక త్రైమాసిక పత్రిక, ఏప్రిల్-జూన్ సంచిక***

# పెట్టుబడి ఉంది, పెట్టుబడిదారీ వ్యవస్థ లేదు

*మార్క్సిస్టు విశ్లేషకుడు, రాజకీయార్థిక శాస్త్రవేత్త, వీక్షణం పెద్దదిక్కు* **ఆర్.ఎస్. రావు** *లేకుండా ఏడాది గడిచింది. గత సంవత్సరం జూన్ 17న మరణించిన ఆయన స్మృతిలో ఇప్పటికీ తెలుగులోకి రాకుండా ఇంగ్లిష్‌లోనే ఉండిపోయిన కాపిటల్ వితౌట్ కాపిటలిజం, సమ్ నోట్స్ ఆన్ సెల్ఫ్ క్లారిఫికేషన్ అనే వ్యాసాన్ని అనువదించి ప్రచురిస్తున్నాం. ఈ పత్రాన్ని ఆయన 1982లో ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం, హైదరాబాద్‌లో నిర్వహించిన ఒక సదస్సులో సమర్పించారు.*

**1960**లలో జరిగిన, నక్సలైటు ఉద్యమాలుగా ప్రఖ్యాతి పొందిన రైతాంగ ఉద్యమాలు దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో వడ్డీ వ్యాపారి – వ్యాపారి – భూస్వామి సంబంధంలో కొనసాగుతున్న భూస్వామ్య దోపిడీ రూపాలను వెలుగులోకి తెచ్చాయి. శ్రీకాకుళం ఉద్యమ సమయంలో వెలువడిన ఒక కరపత్రాన్ని పైపైన చూసినా భారత విశ్వవిద్యాలయాల్లో భారతీయ ఆర్థిక వ్యవస్థ గురించి పాఠ్య పుస్తకాలలో బోధించే విషయాలు కనబడతాయి. ఉదాహరణకు, జి.డి. అగర్వాల్, పి.సి. బన్సీల్ రాసిన 'ఎకనమిక్ ప్రాబ్లమ్స్ ఆఫ్ ఇండియన్ అగ్రికల్చర్' (1969) లో 1951-61 మధ్య గ్రామీణ రుణ భారం గురించి ఇలా రాశారు : 'ఈ దశాబ్దంలో రుణభారం ఉన్న గృహాల సంఖ్య 69.2 శాతం నుంచి 65.8 శాతానికి తగ్గింది. అయితే, ఒక్కొక్క ఇంటి మీద ఉన్న రుణ భారం రు. 526 నుంచి రు. 719కి పెరిగింది. 1951-52లో వ్యవసాయదారుల మొత్తం ఆస్తిలో 5.8 శాతం అప్పులు ఉండగా, 1961-62 నాటికి అది 7 శాతానికి పెరిగింది.'

ఈ రుణభారానికి కారణాలేమిటో కూడా ఆ రచయితలు రాశారు: 'పశువుల దాణా ఇచ్చే పంటలతో సహా అన్ని పంటల వైఫల్యం, పెద్ద ఎత్తున అంటు వ్యాధులు, కరువులు కలిసి పశు సంపద నష్టపోవడానికి దారితీశాయి. రైతు ఆస్తులలో పశుగణమే ప్రధానమైన ఆస్తి గనుక పోయిన పశువుల స్థానంలో కొత్త పశువులు కొనుక్కోవడానికి రైతులు అప్పులు చేయవలసి వచ్చింది. అలాగే, పెళ్లిళ్ల వంటి సామాజిక సందర్భాలలో రైతులమీద పెద్ద ఎత్తున ఖర్చులు పడ్డాయి. అవి ఏ రైతు కూడా తన సొంత నిలువల నుంచి సమకూర్చుకోలేడు. అలాగే ఆస్తి విషయాలలో వ్యాజ్యాల గురించి పట్టింపుల వల్ల రైతులు అనుత్పాదకమైన అప్పులు చేసి తత్ఫలితంగా దారిద్ర్యంలోకి కూరుకుపోవలసి వచ్చింది'.

భారతదేశంలో గ్రామీణ రుణభార సమస్యకు ఈ రచయితలు చెప్పిన వేరు వేరు కారణాలకు బాధ్యత ఉన్నదనడంలో సందేహం లేదు. కానీ, వ్యవసాయదారుకు అందుతున్న స్వల్ప ఆదాయంలోనే నిజమైన కారణాల్ని చూడవలసి ఉంటుంది. ఆ స్వల్ప ఆదాయానికి ప్రత్యక్ష కారణం రైతుల చేతుల్లో ఉన్న లాభసాటి కాని చిన్న కమతాలు. ఆ చిన్న కమతాలలో ఆధునిక, సాంకేతిక అభివృద్ధి ఫలాలను ఉపయోగించడం సాధ్యం కాదు. అలాగే, గతంలో రైతుల ఆదాయానికి వేడి నీళ్లకు చన్నీళ్లలా దోహదం చేసే చేతి వృత్తుల పరిశ్రమల ఆదాయం ఉండేది. ప్రస్తుతం అది తగ్గిపోవడంతో, రద్దయిపోవడంతో పరిస్థితి మరింత దారుణంగా మారింది. గ్రామీణ రుణ పరపతి వ్యవస్థలలో వ్యవస్థేతర వ్యక్తిగత రుణదాతల ప్రాబల్యం ఉంది. వడ్డీ వ్యాపారిని తొలగించి, ఆ స్థానాన్ని ఆక్రమించవలసిన సహకార సంస్థలు విఫలమయ్యాయని గ్రామీణ పరపతి సర్వే నివేదికే వెల్లడిస్తోంది. ఈ మొత్తం వైఫల్యానికి మౌలికమైన కారణాలన్నీ ఆర్థిక, సామాజికార్థిక వ్యవస్థలకు సంబంధించినవి. మన గ్రామీణ వ్యవస్థా నిర్మాణంలోని మౌలిక బలహీనతలకు సంబంధించినవి. వీటన్నిటిలోకీ మౌలికమైనదీ సహకార ఉద్యమం విఫలం కావడానికి కారణమైనదీ సహకార పరపతికి, అటువంటి ఇతర సహకార సంఘాల కృషికి పోటీగా, వ్యతిరేకంగా ముందుకు వచ్చిన శక్తిమంతమైన ప్రైవేట్ ఏజెన్సీల పాత్ర. అలాగే, వ్యవసాయోత్పత్తుల అమ్మకానికి సంబంధించిన సమస్యల గురించి ఒక నివేదిక ప్రకారం 'వ్యవసాయ మార్కెటింగ్ పరపతి సరిగ్గా సంఘటితం కాలేదు. రైతు తన ఉత్పత్తి అవసరాల కోసమూ, మనుగడ కోసమూ కూడా అప్పు చేస్తాడు. అప్పు చేయకుండా వేచి ఉండలేడు. సాధారణంగా అతనొక చిన్న స్థాయి వ్యవసాయ ఉత్పత్తిదారుడు. అందువల్ల వ్యవసాయోత్పత్తుల మార్కెటింగ్‌పై పంట కోత సమయంలో ఎద్దడి ఉండక తప్పదు. పంట కోసిన కొద్ది నెలల్లోనే ఉత్పత్తిలో అత్యధిక భాగం మార్కెట్ అయిపోతుంది. అందువల్ల మార్కెట్‌లోకి సరఫరా పెరిగి ధరలు పడిపోతాయి. మధ్యకాలంలో సరఫరా లేనప్పుడు ధరలు పెరిగినప్పటికీ ఆ లాభమంతా వ్యాపార వర్గానికి అందుతుంది.'

**భూసంస్కరణలు**

ఇక భూసంస్కరణల విషయానికి వస్తే పైన ఉదహరించిన రచయితలు ఆయా రాష్ట్రాలలో భూసంస్కరణల కృషి గురించి ఇలా అన్నారు: 'మైసూరు రాష్ట్రంలో ప్రభుత్వం స్వాధీనం చేసుకోగలిగిన మిగులు భూమి ఎంతో నిర్ధారించడానికి మరికొంత సమయం పడుతుంది. మణిపూర్‌లో ప్రభుత్వం మిగులు భూమిని స్వాధీనం చేసుకొని, పంపిణీ చేయాలంటే మొదట హక్కు పత్రాల నిర్ధారణ పూర్తి కావలసి ఉంది. ఆంధ్రప్రదేశ్, బీహార్, రాజస్థాన్‌లలో మిగులు భూములను నిర్ధారించే చర్యలు తీసుకున్నారు. ఒరిస్సాలో భూ గరిష్ఠ పరిమితి గురించిన నిబంధనలు తయారు చేయడం చట్టపరమైన ఇబ్బందుల వల్ల ఆగిపోయింది. ఇతర రాష్ట్రాలలోనూ, కేంద్ర పాలిత ప్రాంతాలలోనూ ఈ కృషి ఇంకా అమలు కావలసే ఉంది. లేదా, అమలు చేయడానికి ప్రాథమిక చర్యలు మొదలయ్యాయి.'

భారతీయ వాస్తవికతను రేఖామాత్రంగా చూపిన ఈ వ్యాఖ్యకు, పశ్చిమ గోదావరి జిల్లాలో ఈ రచయిత స్వయంగా పాల్గొన్న వ్యవసాయ క్షేత్రాల నిర్వహణ సర్వే ఫలితాలకు చాలా తేడా ఉంది. అక్కడి ఫలితాలు సూచిస్తున్నదేమంటే, అక్కడ రైతులలో వ్యాపారుల మీదా, వడ్డీ వ్యాపారుల మీద పూర్తిగా ఆధారపడకుండా స్వతంత్ర జీవనం సాగిస్తున్నవారు కొందరైనా ఉన్నారు. అయితే, అక్కడ కూడా భూసంస్కరణల అమలు జరగలేదని స్పష్టంగానే కనబడింది. అంతేకాదు, ద్రవ్య వేతనాలకు పనిచేసే రోజువారీ వేతన కార్మికులు హెచ్చు సంఖ్యలో ఉన్నారనీ, చాలా మంది చిన్న రైతులు తమంతట తామే రోజుకూలీలుగా వెళుతున్నారనీ కనబడింది. ఈ నిర్ధారణలు అటు నీటిపారుదల సౌకర్యాలు బాగా ఉన్న వరి పంట ప్రాంతంలోనూ, ఇటు పొగాకు పండించే వర్షాధార భూములలోనూ సమానంగానే ఉన్నాయి. చిన్న రైతుల కన్న పెద్ద రైతులకు స్పష్టమైన ఆర్థిక సానుకూలతలు ఉన్నాయని, అందువల్ల చిన్న రైతులు అంతకంతకూ ఎక్కువగా తమ భూముల నుంచి తోసివేయబడుతున్నారనీ సర్వేలో తేలింది. సుదీర్ఘ కాలంగా నీటిపారుదల సౌకర్యాలు ఉండడం, వాణిజ్య పంటల ప్రవేశం ఈ ప్రాంతంలో వడ్డీ వ్యాపారుల, వ్యాపారుల, ప్రయోజనాల కన్న బలంగా రైతాంగ ప్రయోజనాలు ఉండడానికి ఒక కారణం కావచ్చు. అయితే, దేశంలోని ఇతర అభివృద్ధి చెందిన ప్రాంతాలను పరిగణనలోకి తీసుకున్నప్పుడు ఈ వివరణ సంపూర్ణమూ కాదు, సంతృప్తికరమూ కాదు.

ఈ రచయిత 1966లో స్వయం ఉపాధి పథకాల ఉపాధి అవకాశాల గురించి రాసిన ఒక పత్రంలో సాపేక్షికంగా అభివృద్ధి చెందిన ప్రాంతాల మధ్యనే ఎటువంటి భేదాలు ఉన్నాయో చూపడానికి ప్రయత్నించాడు. ఉదాహరణకు, పశ్చిమ గోదావరి జిల్లాలో రోజుకూలీల మీద ఆధారపడడం 80 శాతంగా ఉంటే, మీరట్, ముజఫర్ నగర్ జిల్లాలో అది అతి తక్కువగా 25 శాతంగా ఉంది. నిజానికి మీరట్, ముజఫర్ నగర్‌లు అభివృద్ధి చెందిన జిల్లాలే. ఆ ప్రాంతాలలో చాల చక్కెర కర్మాగారాలు ఉండడం వల్ల చెరుకు పంట అతి ఎక్కువగా ఉంది. అక్కడ రోజు కూలీల మీద ఆధారపడడం అతి తక్కువగా ఉంది. అంత మాత్రమే కాదు, చిన్న రైతులు ఇతర క్షేత్రాలలో కూలీకి పోవడం కూడా అతి తక్కువగా ఉంది. అక్కడ అది మూడు రోజులు మాత్రమే ఉండగా, పశ్చిమ గోదావరి జిల్లాలో సగటు వ్యవసాయదారుకు 45 రోజులుగా ఉంది. మరొక ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఉత్తరప్రదేశ్‌లోని రైతులు దాదాపు 35 రోజుల పాటు తన శ్రమను ఇతరులకు బదిలీ శ్రమగా ఉపయోగిస్తారు. పశ్చిమ గోదావరి రైతుల విషయంలో బదిలీ శ్రమ మూడు రోజులకన్న ఎక్కువ లేదు.

ఒకరి పొలంలో మరొకరు శ్రమ చేసే ఈ బదిలీ శ్రమ అనే ప్రాచీన అలవాటు కొనసాగుతుండడం, రోజు కూలీలను పెట్టుకొనే స్థితి పెరగకపోవడం అనేవి కొన్ని పరిణామాలను సూచిస్తాయి. మొట్టమొదట దాని అర్థం ఏమంటే, శ్రమ శక్తి ఇంకా ఒక సరకుగా మారలేదని సూచన. మరొక పక్క పెద్ద క్షేత్రాలకు సాపేక్షికంగా ఆధిక్యత ఉందనేది కూడా ఇక్కడ నిర్ధారణ కావడం లేదు. వ్యవసాయ రంగంలో ఈ రెండు అంశాల గురించి విద్యావేత్తల మధ్య పెద్ద ఎత్తున చర్చ జరుగుతోంది. రెండో అంశానికి సంబంధించిన చర్చకు 'ప్రతికూల సంబంధం చర్చ' అని పేరు. అక్కడ ప్రధాన చర్చనీయాంశం పెద్ద క్షేత్రాలు ఎక్కువ సమర్థంగా పనిచేస్తాయా, చిన్న క్షేత్రాలు ఎక్కువ సమర్థంగా పనిచేస్తాయా అని. ఈ చర్చలో ప్రధానమైన సమాచారమంతా దేశంలోని అభివృద్ధి చెందిన ప్రాంతాలలో జరిగిన క్షేత్ర నిర్వహణా అధ్యయనాల నుంచి వచ్చింది. మొత్తం మీద ఆ సమాచారం సూచించినది ఏమంటే, క్షేత్రాలు పెద్దవైన కొద్దీ, పంటల తీవ్రత తగ్గిపోతూ వచ్చింది. అంటే, భారత వ్యవసాయంలో పెద్ద క్షేత్రాల ఆధిక్యత లేదని నిస్సందేహంగా రుజువు అయింది.

## పెట్టుబడిదారీ రైతు గుర్తింపు

ఈ నేపథ్యంలోనే భారతదేశపు అభివృద్ధి చెందిన ప్రాంతాలలో, ముఖ్యంగా, పంజాబ్‌లో జరిగిన విస్తృతమైన అధ్యయనాలను అశోక్ రుద్రా, అతని సహచరులు ప్రచురించినప్పుడు కొత్త కోణం వెలికి వచ్చింది. ఈ అధ్యయనాలు పంజాబ్‌లో పెట్టుబడిదారీ రైతు ఏర్పడ్డాడా లేదా అనే కోణం మీద కేంద్రీకరించారు. అప్పుడే ఈ చర్చలో నేను రాసిన ఒక వ్యాఖ్యలో ఇలా అన్నాను – 'కాలక్రమంలో పెట్టుబడిదారీ అభివృద్ధి ప్రక్రియలో, చిన్న ఉత్పత్తిని తొలగించి భారీ స్థాయి ఉత్పత్తి ఆ స్థానంలోకి అశోక్ రుద్రా సూచిస్తున్న సూచికలు ఈ రెంటి మధ్యా బలమైన సంబంధం ఉన్నదని ఆయన చెబుతున్న మాటకు సరిపోతాయి. కాని, అదే సమయంలో ఒక్కొక్క రంగాన్ని తీసుకొని సూక్ష్మ పరిశీలన చేస్తే ఈ ప్రక్రియ కాలంలో ఆ సూచికలకు ప్రాధాన్యత లేదని బయట పడుతుంది. ఆ అధ్యయనంలో నుంచే కొందరు రైతుల ప్రవర్తనను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. సగటున వారు తమ కమతాలను పన్నెండు సంవత్సరాలలో పది శాతం పెంచుకున్నారు. అందులో ఎక్కువ భాగం కొనుగోలు ద్వారా సంపాదించిన భూమే. ఆధునిక పెట్టుబడి పరికరాలపై రు. 8000 ఖర్చు పెట్టారు. వారి నివాస గృహాల మరమ్మత్తుకూ, భూమి మెరుగుదలకూ రు. 2000 ఖర్చు పెట్టారు. ఇది వారి నికర ఆదాయంలో 22 శాతం. వారి పంటలలో 60 శాతాన్ని మార్కెట్‌లో అమ్ముకుంటున్నారు. శాశ్వతంగా గానీ, అప్పటికప్పుడు గానీ, రోజు కూలీలతో పనిచేయించుకుంటున్నారు. ఈ మొత్తం క్రమంలో ఎక్కడా వారు పెట్టుబడిదారీ రైతు స్వభావాన్ని ప్రదర్శించలేదు. (బహుశా పెట్టుబడిదారీయేతరంగా ఉంటే వచ్చే లాభాలను పొందడానికి కావచ్చు).'

నా ఈ వ్యాఖ్యలోని ప్రధానాంశం ఏమంటే, ఒక ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడిదారీ విధానం కోసం వెతికేటప్పుడు మన దృష్టి 'ఉనికి ఉన్నదాని మీద కంటే ప్రధానమైనది దాని మీద మారుతున్న దాని మీద ఉండాలి'. ఈ సందర్భంలో భారత ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడి ఉనికిలో ఉన్నదా లేదా అనే దానికన్న పెట్టుబడి స్వభావం ఏమిటో గుర్తించడమే కీలకమైన ప్రశ్న.

భారత ఆర్థిక వ్యవస్థలో పారిశ్రామిక రంగంలోనూ, వ్యవసాయ రంగంలోనూ 19వ శతాబ్దపు రెండవ అర్ధభాగంలో పెట్టుబడి ప్రవేశించిది.

పెట్టుబడిదారీ విధానం ప్రగతిశీలమైనది అని అంటే అర్థం అంతకు ముందరి ఉత్పత్తి విధానాలన్నిటికన్నా ఉత్పత్తి శక్తులను విడుదల చేయడంలో దానికి ఎక్కువ సామర్థ్యం ఉందని. అది ఎక్కువ

ప్రభావశీలంగా ఉంటుందని. పెట్టుబడిదారీ విధానపు నిర్దిష్టత అది ఆర్థిక అంశం ద్వారా తన చలనం సాగిస్తుందనేది. పెట్టుబడిదారీ విధానపు చలన సూత్రాలలో ఒకటి, ఉత్పత్తి సాధనాల కేంద్రీకరణ నియమం. ఈ కేంద్రీకరణకు దారితీసే క్రమమే చిన్న తరహా ఉత్పత్తి దారులను తొలగించి, వారిని స్వేచ్ఛాయుతమైన రోజు కూలీలుగా మార్చివేస్తుంది. భారత ఆర్థిక వ్యవస్థ గురించి స్థూల స్థాయిలో మనకు దొరుకుతున్న వైరుధ్యపూరిత ఆధారాలను బట్టి, భారత ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడిదారీ విధానానికి సంబంధించి ఏకైక సూత్రీకరణ సాధ్యం కాదు. అందువల్ల సూక్ష్మ స్థాయిలో, ప్రాంతీయ స్థాయిలో అధ్యయనం చేసి అవగాహన చేసుకోవలసిన అవసరం పెరుగుతోంది. అదే సమయంలో సామ్రాజ్యవాద యుగంలో పెట్టుబడిదారీ చలన సూత్రాల సంబద్ధత గురించి కూడా విమర్శనాత్మకంగా పరీక్షించవలసి ఉంటుంది.

పెట్టుబడిదారీ విధానం తన మౌలిక లక్షణమైన ఆర్థిక సామర్థ్యాన్ని పోగొట్టుకోలేదు అని అంగీకరిస్తే, మరి మన దేశంలో అది చలించ వలసినంత తీవ్రంగా ఎందుకు చలించడం లేదు అనే దానికి వివరణ వెతుక్కోవాలి. బహుశా అందుకు కారణం అది బైటి నుంచి వచ్చింది కావడమే అయి ఉంటుంది. ఒడిశాలో వ్యవసాయాభివృద్ధి గురించి విశ్లేషిస్తూ గతంలో ఇలా వ్యాఖ్యానించడం జరిగింది– 'దొరుకుతున్న ఆధారాలను బట్టి స్వాతంత్ర్యా నంతరం మూడు దశాబ్దాలలో వ్యవసాయోత్పత్తి పెరుగుదలను చూపినప్పటికీ దాన్ని కాలక్రమంగా విభజిస్తే, 1960 దశకంలోనే ఈ పెరుగుదల అంతా కేంద్రీకరించినట్టు కనబడుతుంది. సరిగ్గా అప్పుడే భారీ నీటిపారుదల సౌకర్యాల కల్పన మీద ఎక్కువ శ్రద్ధ కనబడింది. వ్యవసాయోత్పత్తి పెరుగుదల ఫలితం వ్యాపారీకరణ పెరుగుదల మాత్రమే కాదు, మనుగడ కోసం వ్యవసాయం సాగించాలనే దృక్పథం కూడా పెరిగింది. అలాగే ఈ పెరుగుదల క్రమానికి మరొక అంశం ఈ పెరుగుదల సుస్థిరమైనది కాకపోవడం. అందువల్ల తొలి రోజుల్లో కొంత పెరుగుదల కనబడి ఆ తరువాత అది దిగజారుడుకు దారితీస్తుంది.'

ఆంధ్రప్రదేశ్‌లో కూడా అభివృద్ధి చెందిన ప్రాంతాలలో 19వ శతాబ్దపు మధ్యభాగంలో బ్రిటిష్ వారు ప్రవేశపెట్టిన నీటిపారుదల సౌకర్యాల లబ్ధితో పెరుగుదల కనబడిందనడంలో ఆశ్చర్యం లేదు. ఇక్కడ తయారైన పెట్టుబడి ఈ ప్రాంతంలో ఎక్కడా భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు చేపట్టలేదు. నిజం చెప్పాలంటే, ఈ ప్రాంతాలలో ఏవైనా భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు సాగినప్పటికీ వాటిని ప్రారంభించినదీ, నాయకత్వం వహించినదీ కమ్యూనిస్టు పార్టీలే తప్ప పెట్టుబడికానీ, పెట్టుబడి ప్రతినిధులు కానీ ఆ పోరాటాలు సాగించలేదు.

భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు నాయకత్వం వహించకపోవడం మాత్రమే కాదు, పెట్టుబడి భూస్వామ్య ఉపరితలాన్ని తన ఆశ్రయంగా, తన రక్షణగా మార్చుకుంది. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధానం తన స్వభావాన్ని పోగొట్టుకుంటుందనడానికి కీలకమైన నిదర్శనం ఇదే. వలసలను పాలించడానికి భూస్వామ్య పాలకులతో మిలాఖత్తు అయి, రాజీ చేసుకొన్న సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానానికి అభివృద్ధి నిరోధక స్వభావాన్ని సంతరించిపెట్టింది. సామ్రాజ్యవాద యుగంలో ద్రవ్య పెట్టుబడి, గుత్త సంస్థలు, అన్ని చోట్లా ఆధిపత్య తపననే ప్రదర్శిస్తాయి తప్ప స్వేచ్ఛాకాంక్షను ప్రదర్శించవని లెనిన్ అన్నాడు. పెట్టుబడిదారీ విధానం తన ప్రగతిశీల స్వభావాన్ని వదులుకోవడం మరీ ముఖ్యంగా, ఉపరితలం విషయంలో ప్రగతిశీలంగా ఉండకపోవడం భారత సమాజంలో రూపంలోనూ, సారంలోనూ స్పష్టంగా కనబడుతుంది.

'పెట్టుబడిదారీ విధానపు నిజమైన మేధో, సాంస్కృతిక విజయాలు భూస్వామ్య విధానం విధ్వంసం మీద ఆధారపడినవి. అందువల్లనే అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో అక్కడక్కడా భూస్వామ్య అవశేషాలు మిగిలి ఉన్నప్పటికీ అవి నిజమైన అర్థంలో, స్వాభావికంగా భూస్వామికంగా ఎంతమాత్రం లేవు. బ్రిటిష్ రాచరికం, అమెరికన్ కవిత్వం, జర్మన్ మర్యాదలు అన్నిటికన్నీ బూర్జువా స్వభావానికి భిన్నమైనవి ఎంత మాత్రం కావు. ఈ దేశాలలో సాగిన బూర్జువా విప్లవాల సంపూర్ణ స్వభావానికి ఇది ఒక సూచిక. కాని, పెట్టుబడిదారీ అభివృద్ధి కుంటుతూ, ప్రాంతీయంగా, అనుకరణమయంగా సాగుతున్న భారతదేశం వంటి దేశాలలో, బూర్జువా విప్లవం అనేది ఎన్నడూ కేంద్ర స్థానంలో లేని దేశంలో సామాజిక సాంస్కృతిక జీవితంలో బూర్జువా అంశాలుగా ఉండేవి కూడా తమ స్వభావాన్ని పోగొట్టుకొని భూస్వామ్య అస్తిత్వంలో ఉంటాయి. ఇది కేవలం అంకెల ఆధారం మీద నిర్మించగలిగే వాదన కాదు. పెట్టుబడిదారీ పరిశ్రమ జాతీయోత్పత్తిలో ఇంత భాగం ఉత్పత్తి చేస్తోంది, దేశంలోని సాగుకు లాయకైన మొత్తం భూమిలో ఇంత భూమిలో పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ప్రవేశించాయి అనే అంకెల ద్వారా చెప్పగలిగింది కాదు. అర్ధ భూస్వామ్యం అనేది తప్పనిసరిగా రెండు ఉత్పత్తి విధానాల మధ్య ఒక గుణాత్మకమైన రాజీని సూచిస్తుంది. కాని, మన చర్చకు ముఖ్యమైన అంశమేమంటే, భారతీయ సమాజంలో ప్రతి అంశాన్నీ బలంగా నిర్ధారించే స్వభావం భూస్వామ్యానికి ఉంది అనేది. భారతదేశంలో మనం చూస్తున్నటువంటి పెట్టుబడిదారీ విధానపు అంతర్గత బలహీనత వల్ల ప్రపంచ పెట్టుబడిదారీ కేంద్రాలు తయారు చేసిన ఎంతో అభివృద్ధి చెందిన భౌతిక, భావాత్మక వస్తువులు కూడా వాటి వాడకంలో స్వభావం మార్చుకుంటాయి. ఈ ప్రక్రియకు ఒక ప్రధాన కారణం ఏమంటే, భారత జీవితంలో బూర్జువా వస్తువు అని చెప్పగలిగిన వాటిలో ప్రతి ఒక్కటీ విదేశాల నుంచి దిగుమతి అయినదే' అని మిహిర్ భట్టాచార్య రాశాడు.

భారతదేశంలోని ప్రతి అభివృద్ధి చెందిన ప్రాంతానికి దానిదయిన ఒక ప్రత్యేక 'జాతీయ' దేవుడో దేవతో ఉండడం, వారికి బహిరంగ పూజలూ ప్రదర్శనలూ జరగడం కూడా యాదృచ్ఛికం ఏమీ కాదు. కలకత్తాకు ఒక దుర్గ ఉంది. బొంబాయికి ఒక గణపతి ఉన్నాడు. ఢిల్లీకి ఒక రాముడు ఉన్నాడు. వగైరా వగైరా. చివరికి కార్మికులకు ఇచ్చే బోనస్ కూడా మత చిహ్నాల పరంగానే పూజా బోనస్, దీపావళి బోనస్ అని ఉండడం ఆసక్తికరం. అట్లాగే, ఒక సుప్రసిద్ధ పారిశ్రామికవేత్త దేశమంతా గుళ్లు నిర్మించి ఆ గుళ్లను కూడా ఆ దేవుడి పేరు మీద కాకుండా తన కుటుంబం పేరు మీద పిలుచుకోవడం కూడా యాదృచ్ఛికం కాదు. అదే పారిశ్రామిక కుటుంబం విశ్వ హిందూ పరిషత్ సాగిస్తున్న మత పునరుద్ధరణ కార్యక్రమానికి ఆధునిక యంత్ర పరికరాలతో కూడిన అత్యాధునిక వాహన రథాన్ని అందించిందని

పత్రికలు రాస్తున్నాయి. అలాగే, తెలుగు పెట్టుబడి ఎక్కడికి వెళితే అక్కడికి తన వెంట వెంకటేశ్వర స్వామిని తీసుకువెళ్లడం కూడా కేవలం యాదృచ్ఛికం కాదు. యాభై ఏళ్ల కింద బ్రిటిష్ పెట్టుబడి తనతోపాటు చర్చ్‌ను తీసుకుపోతుండేది. ఇప్పుడు భారత పెట్టుబడి తనతోపాటు దేవాలయాన్ని తీసుకుపోతోంది. ఈ నేపథ్యంలో దేశంలో కొన్ని భాగాలలో సతీ సహగమనం జరుగుతూ ఉండడం, దానిపట్ల రాజ్యానికి గానీ, పెట్టుబడికి గానీ వీసమెత్తు వ్యతిరేకత లేకపోవడం కూడా ఆశ్చర్యకరం కాదు. రాజస్థాన్‌లో శిఖర్ జిల్లాలో ఝూగ్లీ గ్రామంలో ఇటీవల జరిగిన ఒక సతీ సహగమనం గురించి రాస్తూ, కుంకుం సంగరి, సుదేశ్ వైద్ ఇలా అన్నారు – 'సమాజంలో క్రమక్రమంగా మార్పు జరుగుతూ సమాజ సుస్థిరతకు సవాలు విసురుతున్న సందర్భంలో స్త్రీల యథాతథ స్థితిని పునర్ నిర్ధారించడానికి, భార్యలుగా, గృహిణులుగా స్త్రీల పాత్రను పవిత్రీకరించడానికి జరుగుతున్న ప్రయత్నంలో భాగమే సతీ సహగమన భావజాలానికి పెరుగుతున్న ఆదరణ. కింది కులాల ప్రజలు ఎంతో కొంత విద్యావకాశాలు పొందుతూ, పక్కా గృహాలలో నివసిస్తూ, ఉద్యోగాలలో అటూ ఇటూ మారుతూ, రాజ్‌పుత్ ప్రాబల్య ప్రాంతాలలో ఇంతవరకు అంగీకరించని పనులు చేస్తూ ఉన్నప్పుడు వారిని తిరిగి అణచివేసి అగ్రకుల విలువలను బలోపేతం చేసే లక్ష్యం ఈ సతీ సహగమనం భావజాలంలో ఉంది.'

మత పునరుద్ధరణ ప్రయత్నాలు, ఆర్థికేతర విభజనల పునాది పై సమాజంలో చీలికలు, సర్వ సాధారణంగా అందరికీ తెలిసినవే. గుర్తించినవే. వాటిని ఒక పరిశోధనా పత్రంలో మళ్లీ చెప్పనక్కర్లేదు. కానీ, పునరుక్తి అయినప్పటికీ చెప్పవలసిన మాట – 'భూస్వామ్య వర్గం మీద రాజకీయ స్వాతంత్ర్యానికి సంబంధించిన ఏ ఒక్క విజయమూ అతి తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కోకుండా రాలేదు. పెట్టుబడిదారీ సమాజంలోని విభిన్న వర్గాల మధ్య జీవన్మరణ పోరాటం ద్వారా తప్ప మరొక రకంగా, ప్రజాస్వామిక పునాది మీద ఏ ఒక్క పెట్టుబడిదారీ దేశం అభివృద్ధి చెందలేదు' అని లెనిన్ అన్నాడు.

## పెట్టుబడిదారీ విధానం లేని పెట్టుబడి

భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని నడపడంలో పెట్టుబడిగానీ, పెట్టుబడిదారుడు గానీ విఫలం అయినప్పుడు సమాజంలో పెట్టుబడి ఉండి, పెట్టుబడిదారీ విధానం లేని స్థితి ఏర్పడుతుంది. పెట్టుబడిదారీ విధానం అనేది ఒక ఉత్పత్తి విధానం. అక్కడ పెట్టుబడికీ శ్రమకూ మధ్య పునాదిలో వైరుధ్యం ఉంటుంది. అది దానికి సరిపోయిన ఉపరితలాన్ని తయారు చేస్తుంది. 'ఈ వస్తువులు సరుకులుగా ఒకదానితో ఒకటి సంబంధంలోకి ప్రవేశించడానికి, వాటి రక్షకులు ఒకరితో ఒకరు సంబంధం పెట్టుకోవాలి. ఆ వ్యక్తులు ఆ వస్తువులలో నివసిస్తున్నట్టుగా, ఒకరి సరుకును మరొకరు సొంతం చేసుకోకుండా ఉన్నట్టుగా, ఒకరు తన సరుకును మరెవ్వరికీ ఇవ్వకుండా ఉన్నట్టుగా, ఆ ఆదాన ప్రదానాలు కేవలం పరస్పర అంగీకారంతో మాత్రమే జరిగేటట్టుగా ఉండాలి. అంటే వాళ్లు ఒకరిని ఒకరు సొంత ఆస్తిపై హక్కుదారులుగా మాత్రమే చూసుకోవాలి. ఇది ఒక చట్టపరమైన సంబంధం. అది ఒక ఒప్పందం ద్వారా వ్యక్తమవుతుంది. ఆ ఒప్పందం అభివృద్ధి చెందిన చట్టబద్ధ విధానం కావచ్చు, కాకనూపోవచ్చు. అది ఆ ఇద్దరి మధ్య సంబంధంగా ఉంటుంది. అది ఒక ఆర్థిక సంబంధంగా ఉంటుంది. ఆ ఇద్దరి మధ్య జరిగే ప్రతి చట్టబద్ధమైన వ్యవహారంలో పునాది అంశంగా ఈ చట్టబద్ధ సంబంధమే ఉంటుంది. ఒక మనిషికి మరొక మనిషి ఉనికిలో ఉండేది కేవలం సరుకుల ప్రతినిధిగా, సరుకుల సొంతదారుగా మాత్రమే' అని మార్క్స్ అన్నాడు. ఈ మారకపు సంబంధాలను బలపరిచే నిర్మాణాలు కాలక్రమంలో రూపొందాయి. ఆ నిర్మాణాలన్నీ కూడా పునాదిలోని వైరుధ్యానికి ప్రతిఫలనాలే.

పనిదినం గురించి సుదీర్ఘమైన, అద్భుతమైన విశ్లేషణ చేస్తూ మార్క్స్ ఈ ప్రక్రియను వివరించాడు: 'భౌతిక ఉత్పత్తి విధానంలోని మార్పులు, తదనుగుణంగా ఉత్పత్తిదారుల మధ్య సామాజిక సంబంధాలలో వచ్చిన మార్పులు మొట్టమొదట మితిమీరిన విలాసానికి అవకాశం కల్పించాయి. ఆ తరువాత అందుకు వ్యతిరేకంగా మారిపోయి, సమాజం నిగ్రహం పాటించాలని పిలుపునివ్వడం మొదలుపెట్టాయి. ఈ పిలుపులే పని దినానికి చట్టబద్ధ పరిమితినిచ్చాయి. నియంత్రించాయి. అన్ని చోట్లా ఒకేరకంగా ఉండేలా చేశాయి. అప్పుడు ఒక విరామం ఏర్పడింది. అందువల్ల 19వ శతాబ్దపు మొదటి భాగంలో ఈ నిగ్రహ ప్రక్రియ ఒక అసాధారణమైన చట్టపరమైన నిబంధనగా మాత్రమే కనబడింది. కొత్త ఉత్పత్తి విధానపు ప్రాథమిక క్షేత్రాన్ని ఈ విధంగా జయించడం పూర్తయింది. ఈ మధ్యలో గుర్తించినదేమంటే, ఉత్పత్తికి సంబంధించిన ఇతర శాఖలన్నీ ఈ కార్ఖానా పద్ధతిని అనుసరించడం మాత్రమే కాదు, దాదాపుగా ఉత్పత్తిదారులందరూ కాలం చెల్లిన పద్ధతులనే అనుసరిస్తున్నారని. అంటే, కుండలు చేయడం, గాజు తయారీ, పాతకాలపు చేతివృత్తులు, పాతకాలపు ద్రవ్య చలామణీ, చివరికి గృహ పరిశ్రమలు అనబడే మేకుల తయారీ వంటివి కూడా ఎంతోకాలంగా పెట్టుబడిదారీ దోపిడీ రూపాలలో కార్ఖానాలలాగా పనిచేయడం మొదలయ్యాయని'. 'పెట్టుబడికి ఉండే ఈ సార్వత్రీకరణ స్వభావమే ఇంతకాలమూ తన పరిధిలో లేని రంగాల మీద కూడా దానికి అధికారాన్ని సమకూరుస్తుంది. ప్రజల సామాజిక జీవనాన్ని శాసించే అన్ని సామాజిక సంబంధాలలోనూ, వ్యవస్థలలోనూ పెట్టుబడి ప్రజాస్వామికీకరణను ప్రవేశపెట్టడం వల్ల ఈ సార్వత్రిక అదుపు సాధ్యం అవుతుంది'. జర్మనీలో పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రజాస్వామికీకరణ క్రమం ఎలా అసమగ్రంగా ఉండిపోయిందో వ్యాఖ్యానిస్తూ మార్క్స్ 'మన దేశంలో అమలవుతున్న పరిస్థితులు చూసి మనం దిగ్భ్రాంతి చెందవలసి ఉంది. ఇంగ్లండ్‌లో జరిగినట్టుగా మన ప్రభుత్వాలు, పార్లమెంట్‌లు ఎప్పటికప్పుడు క్రమబద్ధంగా ఆర్థిక పరిస్థితుల పరిశీలన కోసం విచారణ కమిషన్‌లు నియమించి ఉంటే, సత్యాన్వేషణలో ఈ కమిషన్‌లకు ఇంగ్లండ్‌లోని కమిషన్‌లకు ఉన్నటువంటి అధికారాలు ఉండి ఉంటే, ఈ పనిచేయడం కోసం ఇంగ్లిష్ ఫ్యాక్టరీ ఇనస్పెక్టర్‌ల వంటి సమర్థులైన మనుషులు, పక్షపాతం లేని గౌరవనీయమైన మనుషులు దొరికి ఉంటే, మన దగ్గర కూడా ఇంగ్లండ్‌లో లాగా ప్రజారోగ్యం మీద మంచి వైద్య నివేదికలు ఉండి ఉండేవి. స్త్రీలనూ, పిల్లలనూ ఎలా దోపిడీ చేస్తున్నారో విచారణ కమిషన్‌ల నివేదికలు ఉండేవి. గృహ వసతి మీద, ఆహారం మీద మంచి కమిషన్‌ల నివేదికలు ఉండేవి' అని మార్క్స్ రాశాడు.

# రాజ్యం - ప్రజా ఉద్యమం - బందీలు

***సుక్మా కలెక్టర్ అపహరణతో మావోయిస్టు పార్టీ ఆపరేషన్ గ్రీన్‌హంట్, బస్తర్ ఆదివాసుల స్థితి గురించి చర్చని లేవనెత్తి గలిగిందని అంటూ, గుర్తేడు నుంచి సుక్మా దాకా అనుభవాలను పంచుకుంటున్నారు జి. హరగోపాల్***

చత్తీస్‌గడ్‌లోని సుక్మా జిల్లా కలెక్టర్ అలెక్స్ పాల్ మీనన్‌ను మావోయిస్టులు ఏప్రిల్ 21న సుక్మా జిల్లా కెర్లపాల్ గ్రామం దగ్గరినుంచి అపహరించి తీసుకుపోయి అదుపులో పెట్టుకున్నారు. ఆ తర్వాతి రోజు పార్టీ ప్రతినిధి బిబిసి కి పంపిన హిందీ సందేశంలో కలెక్టర్ ను విడుదల చేయాలంటే మూడు డిమాండ్లు నెరవేర్చాలని కోరారు. ఒకటి, ఆపరేషన్ గ్రీన్‌హంట్ ను, గ్రామాల మీద దాడులను ఆపి వేయాలి, గ్రామాల నుంచి పారా మిలిటరీ బలగాల క్యాంపులను ఎత్తివేయాలి. రెండు, అరెస్టు చేసి, తప్పుడు కేసులు విధించి చత్తీస్‌గడ్‌లోని వేరు వేరు జైళ్లలో నిర్బంధించిన అమాయక ఆదివాసులను విడుదల చేయాలి. మూడు, ఎనిమిది మంది మావోయిస్టు నాయకులను, కార్యకర్తలను విడుదల చేయాలి.

ఈ డిమాండ్ల సాధన – బందీ విడుదల విషయంలో చర్చలు జరపడం కోసం మావోయిస్టు పార్టీ తమ తరఫున మధ్యవర్తులుగా ఉండాలని బిడి శర్మను, నన్ను కోరింది. బిడి శర్మ గతంలో విశాల బస్తర్ కలెక్టర్‌గా మధ్యప్రదేశ్ ప్రభుత్వంలోనూ, షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ జాతుల కమిషనర్ గా కేంద్ర ప్రభుత్వంలోనూ, విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్‌గాఈశాన్య రాష్ట్రాలలోనూ పనిచేసిన గౌరవనీయమైన వ్యక్తి. ఆదివాసుల అభ్యున్నతి కోసం గత నాలుగు దశాబ్దాలకు పైగా నిరంతర కృషి చేస్తున్న వ్యక్తి. ప్రభుత్వం తన తరఫున మధ్యవర్తులుగా మాజీ ఐఎఎస్ అధికారులు నిర్మలా బుచ, ఎస్‌కె మిశ్రాలను నియమించింది. మా మధ్య ఏప్రిల్ 25–26 నుంచి మే 3 వరకు మూడు నాలుగు దఫాలు చర్చలు జరిగాయి. ఈ మధ్య కాలంలో బిడి శర్మ, నేను సుక్మాలో మావోయిస్టు పార్టీ నాయకులతో రెండు దఫాలు ప్రత్యక్షంగా, వీలున్నప్పుడల్లా పరోక్షంగా చర్చలు జరిపాం. మా ఈ చర్చల ఫలితంగా మే 3న కలెక్టర్ విడుదలయ్యాడు. మొదటి డిమాండ్ కేంద్ర ప్రభుత్వ పరిధిలోనిదని కనుక దాన్ని నెరవేర్చలేమని ప్రభుత్వ ప్రతినిధులు అన్నారు. ఖైదీల, మావోయిస్టు నాయకుల విడుదల సాధ్యాసాధ్యాలను పరిశీలించడానికి నిర్మలా బుచ్ నాయకత్వంలో ఒక ఉన్నతస్థాయి విచారణ కమిటీని నియమించారు.

చర్చల ఫలితాలు ఎలా ఉన్నా, ఈ చర్చల క్రమం గొప్ప అనుభవాన్ని ఇచ్చింది. గణనీయమైన పాఠాలను నేర్పింది. చర్చించవలసిన ఎన్నో అంశాలను వెలుగులోకి తెచ్చింది.

అపహరణల సమయంలో మధ్యవర్తిగా ఉండడం నాకిది మూడోసారి. మొదటిసారి కొయ్యూరు అపహరణల సమయంలో 1993లో కన్నబిరాన్‌తో కలిసి పాల్గొన్నాను. రెండవసారి ఆర్ఎస్ రావు, దండపాణి మొహంతీలతో కలిసి గత సంవత్సరం ఒరిస్సా ప్రభుత్వంతో జరిగిన చర్చలలో పాల్గొన్నాను. ఒరిస్సాతో పోలిస్తే చత్తీస్‌గడ్ లో చర్చలు కాస్త కష్టంగా గడిచాయనే చెప్పాలి. 'ఆపరేషన్ గ్రీన్‌హంట్ ను, పోలీసుల చర్యలను ఆపేయాలని వారు కోరుతున్నారు గదా, దానికి బదులుగా వారు ఏం చేస్తారు' అని ప్రభుత్వ ప్రతినిధులు, అధికారులు ప్రశ్నించారు. రెండువైపుల నుంచీ సాయుధ చర్యలు ఒక నిర్ణీతకాలం వరకు ఉండగూడదని మేమన్నాం. ఎనిమిది మంది మావోయిస్టుల విడుదల

---

భారతదేశపు పరిస్థితి చూస్తే ఇక్కడ కేవలం ప్రజాస్వామిక ప్రక్రియ లేకపోవడం మాత్రమే కాదు, అందుకు తగిన వ్యవస్థా నిర్మాణాలు లేకపోవడం మాత్రమే కాదు, ఇక్కడి పెట్టుబడి మతం, కులం, ప్రాంతం, అంతస్తులు వంటి పెట్టుబడిదారీ పూర్వ క్రమాలను, వ్యవస్థలను ఎన్నిటినో వాడుకుంటుందనేది తప్పనిసరిగా గుర్తించవలసిన అంశం. ఇక్కడి పెట్టుబడి విచారణ కమిషన్‌లను గౌరవిస్తుందా లేదా అని కాదు. ఇక్కడ మంచి ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్‌లను నియమిస్తామా లేదా అని కాదు. ఆ కమిషన్‌లు, ఆ ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్‌లు కుల పరిగణనలకు అతీతంగా ఉంటారా అనేదే ప్రశ్న. ఇక్కడ వైద్య నివేదికలకు కొరత లేదు. కానీ, అవి మతపరిగణన లను అధిగమిస్తాయా అనేది ప్రశ్న. పెట్టుబడి శ్రమను విముక్తి చేసినప్పుడు ఆ శ్రమకు అనామకత్వాన్ని ఆపాదిస్తుంది. కాని, భారత సందర్భంలో పెట్టుబడి శ్రమకు ఉండే అనామకత్వాన్ని తొలగించి దాని మీద మత, కుల, బృంద ముద్రను తగిలిస్తుంది. తత్ఫలితంగా కార్మిక వర్గం మధ్య, పేద రైతుల మధ్య, వ్యవసాయ కూలీల మధ్య విభజన ప్రక్రియ మొదలవుతుంది. ఆ విభజనలన్నీ ఆర్థికేతర పునాది మీద జరుగుతాయి. బ్రిటిష్ వలసవాదులు ప్రారంభించిన ప్రక్రియకు కొనసాగింపుగా జరుగుతున్న ఈ వ్యవహారం ఆర్థికంగా, చారిత్రకంగా జరగవలసిన పద్ధతిలోనే జరుగుతోంది. అంతేకాదు, సామ్రాజ్యవాద దశలో పెట్టుబడి స్వభావం గురించిన అవగాహన ప్రకారం కూడా ఇది తార్కికమైనదే. ఈ దశలో పెట్టుబడి దానికి అనుగుణమైన ఉపరితలం లేకుండానే మనుగడలో ఉంటుంది.

అందువల్ల మనకు పెట్టుబడి ఉంది. పెట్టుబడిదారీ వ్యవస్థ లేదు. మార్క్స్ మాటలను తిరగేసి చెప్పాలంటే, మార్క్స్ అన్నట్టుగా మనం సజీవుల చేతుల్లోనూ, మృతజీవుల చేతుల్లోనూ పీడన అనుభవిస్తున్నాం. భారతదేశంలో అదనంగా జాతీయ పెట్టుబడిదారు అనే ఒక అభూత కాల్పనిక గాథ చేతుల్లోనూ పీడన అనుభవిస్తున్నాం.

విషయంలో కూడ ఇద్దరు యావజ్జీవ శిక్ష పడ్డవాళ్లు. మిగిలిన ఆరుగురిని సులభంగా విడుదల చేయవచ్చు. ఒకరు హెపటైటిస్ బి వ్యాధిపీడితులు, మరొకరు చిన్నారి శిశువు ఉన్న తల్లి, మరొకరు అన్ని కేసులలోనూ నిర్దోషిగా కోర్టులు తీర్పులు చెప్పాయి. అక్రమ నిర్బంధంలో ఉన్న అమాయక ఆదివాసుల విడుదల అయితే పెద్ద చర్చ లేకుండా అంగీకరించగలిగిందే.

కనుక డిమాండ్ల అంగీకారం విషయంలో ఒరిస్సా అనుభవమే ఇక్కడ సులభంగా పునరావృతమై ఉండేది. కాని ఇక్కడ సంఘపరివార భావజాలంలో ఉన్న ప్రభుత్వం ఉండడం, ఆ ప్రభుత్వం తనంతట తాను ఏ నిర్ణయమూ తీసుకోలేని, ప్రతిదానికీ ఆ పార్టీ కేంద్ర నాయకత్వ అనుమతి తోనే తీసుకోవలసిన స్థితి ఉండడం, కేంద్ర ప్రభుత్వం కూడ కఠినంగా ఉండమని సూచించడం, జాతీయ మీడియా మావోయిస్టుల పట్ల శత్రుపూరిత వైఖరి అవలంబించడం వంటి కారణాల వల్ల ఈసారి చర్చలు కష్టంగా నడిచాయి. ఏ అర్థవంతమైన, తక్షణ పరిష్కారం లేకుండానే ముగిశాయి. పైగా ప్రభుత్వం వైపు నుంచి ఉన్న మధ్యవర్తులు ఇద్దరికిద్దరూ ప్రజల పట్ల, ప్రజా ఉద్యమాల పట్ల ఎటువంటి అవగాహన లేనివారు. మరొకవైపు మావోయిస్టుల ప్రతినిధిగా నాతో పాటు ఉన్న బిడి శర్మ మనుషుల మంచితనం మీద విశ్వాసం ఉన్నవాడు. అవతలివాళ్లు కూడ మంచివాళ్లే అనుకునే స్వభావం ఆయనది. ఒక దశలో ప్రభుత్వ ప్రతినిధులు చెప్పేదాన్ని రాసి ఇమ్మని నేనడిగితే, 'వాళ్లను మనం నమ్మాలి. నోటితో ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేని వాడు రాసి ఇచ్చినా నిలబెట్టుకోడు' అన్నారాయన.

చర్చలలో ప్రభుత్వ వైఖరి, ప్రభుత్వ ప్రతినిధుల వైఖరి ఇలా ఉన్నప్పుడు చర్చలనుంచి వైదొలగడమైనా మంచిదే అనే విషయంలో మా దృక్పథాలలో తేడాఉంది. పైగా అప్పటికే 'ఇది సుదీర్ఘ పోరాటం. ఇక్కడ మన డిమాండ్లను వాళ్లు ఆమోదించలేదే అనే ఆందోళన మీకు వద్దు. అక్కడి పరిస్థితులను బట్టి ఏది సాధ్యమైతే అదే చేయండి' అని మావోయిస్టు పార్టీ నాయకులు మాతో ముందే అని ఉన్నారు.

ప్రభుత్వం ఏమీ అంగీకరించకుండానే, 'కలెక్టర్ ను విడుదల చేయండి' అని పార్టీకి సాధ్యమైనంతవరకు విజ్ఞప్తి చేయకండి అని కోరారు. అందుకే మా మొదటి ప్రకటనలో, 'ప్రభుత్వం ఉన్నతస్థాయి కమిటీ వేయడానికి అంగీకరించింది గనుక కలెక్టర్ విషయంలో సానుకూలంగా స్పందించండి' అని విజ్ఞప్తి చేశాం. కాని 'మీరు వదిలెయ్యమనే విజ్ఞప్తి చేయకపోతే మీడియా, బయటి సమాజం మధ్యవర్తుల మీద దుమ్ము పోసేందుకు సంసిద్ధంగా ఉంది. ఆ మాట స్పష్టంగా ఉండవలసిందే' అని ప్రభుత్వ పక్షం పట్టుబట్టింది. మేం కూడ అప్పుడున్న పరిస్థితిలో అదే సబబు అని భావించాం. అందుకే మేం 'కలెక్టర్ విడుదల అయిన గంటలోపు, మావోయిస్టులు కోరినవారిలో కనీసం ఇద్దరిని విడుదల చేయాలి' అని డిమాండ్ పెట్టాం. దానికి ప్రభుత్వ పక్షం 'న్యాయస్థానాల పనిలో మేం జోక్యం చేసుకోలేం గదా, మీరు అడుగుతున్న ఇద్దరికీ బెయిల్ దరఖాస్తులు పెడతాం. ఆ బెయిళ్లను వ్యతిరేకించవద్దని ప్రాసిక్యూటర్ కు చెపుతాం' అన్నారు. కాని ఆ బెయిల్ కేసు డా. బినాయక్ సేన్ కు బెయిల్ నిరాకరించిన జడ్జి ముందుకు వెళ్లింది. ఆయన సహజంగానే బెయిల్ తిరస్కరించాడు. 'గంట లోపల విడుదల చేస్తామ'ని స్పష్టమైన హామీ ఇమ్మని మేం కోరినప్పుడు, కుదరదు అని చెప్పకుండా, కలెక్టర్ విడుదల తర్వాత ఇలా దొంగ ఎత్తు వేసిన ప్రభుత్వ పక్షం మీద బిడి శర్మ గారికి చాల కోపం వచ్చింది. 'జీవితంలో ఇంతగా నమ్మిన వారి చేతుల్లో ఇంత మోసానికి నేనెప్పుడూ గురికాలేదు' అని చాల బాధపడ్డారు. నిజానికి చత్తీస్‌గడ్ చీఫ్ సెక్రటరీ సునీల్ కుమార్ పదే పదే తాను శర్మ గారి శిష్యుడినని చెపుతూ వచ్చాడు. నిర్మలా బుచ్, శర్మగారు కలిసి పని చేశారు. అందుకే వాళ్ల మీద ఆయన చాల ఆశలు పెట్టుకున్నారు. రాజ్య స్వభావం ఏమిటో దీనిద్వారా స్పష్టమవుతోందిగదా అని నేనన్నాను.

ఒరిస్సా బందీ ఉదంతం సందర్భంగా పార్టీ కార్యకర్తల విడుదల కన్నా ఆదివాసుల విడుదల ముఖ్యం అని నాయకత్వం భావించింది. నా మధ్యతరగతి, ఉదారవాద విలువల వల్ల అది వాళ్ల నిస్వార్థవైఖరికి చిహ్నమని, తమ విడుదల కన్న ఆదివాసుల విడుదలే ముఖ్యమని అనుకోవడం చాల గొప్ప విషయమని నాకు అనిపించింది. కాని ఈ సారి నాయకత్వం మరొక రకమైన వాదన పెట్టింది. ఆదివాసులను ఇటువంటి పద్ధతులద్వారా విడుదల చేయిస్తే అది వాళ్లకు తప్పుడు సంకేతాలు పంపుతుందని, మనం జైలులో పడితే మనకోసం పార్టీ ఏదో ఒకటి చేసి మనను విడిపిస్తుంది అని వారనుకుంటే, పోరాటతత్వం సన్నగిల్లవచ్చునని వాళ్లు భావించారు. జైలులో కూడ, లీగల్ రూపాల్లో పోరాడాలనే చైతన్యం ఇవ్వకుండా అపహరణల ద్వారా విడుదల చేయించవచ్చుననుకుంటారని అంటూ ఆదివాసులు తాము పోరాడాలనే చైతన్యాన్ని పెంచాలే తప్ప మరొకరకంగా విడుదల సాధ్యమని చెప్పలేం అని వాళ్లు అన్నారు. అయినా అక్రమంగా జైళ్లలో పెట్టారనే అంశం తప్పకుండా ప్రజల దృష్టికి తీసుకురావాలని వాళ్లు భావించారు.

బిడి శర్మ ఆదివాసులమీద అపారమైన ప్రేమ ఉన్నప్పటికీ ప్రభుత్వాధికారిగా పనిచేశారు. నేను అనేక పరిమితుల్లో నాకు తోచిన రంగంలో, అనేకచోట్ల రాజీపడుతూ పనిచేస్తున్నాను. అసలు మమ్మల్ని మీ ప్రతినిధులుగా ఎందుకు ఎంచుకున్నారు అని మావోయిస్టు నాయకులను అడిగాను. 'లోకమంతా స్వార్థంలో, ప్రజలపట్ల నిర్లక్ష్యంలో మునిగిపోతున్నప్పుడు మీరు కొన్ని విలువల కోసం నిలబడ్డారు. మిమ్మల్ని ఎంచుకోవడానికి అదే కారణం' అని అన్న మాటలు నన్ను చాల కదిలించాయి. అనేక రాజీలతో, నా బతుకు నేను బతుకుతున్నప్పటికీ వీళ్లు ఎంత చిన్న ప్రజానుకూలమైన పనినైనా ఎంత సముచితంగా గౌరవిస్తారు, ఎంత మానవీయ వైఖరి వీళ్లది అనుకున్నాను. అయితే మాకు పరిమితులున్నాయి. నిజానికి నాకు శర్మ గారికి చాల తేడా ఉంది. చాల విషయాల్లో వాదించుకున్నాం. కాని మధ్యవర్తులమధ్యే తేడాలున్నాయన్నది మధ్యవర్తిత్వ ప్రక్రియకే మంచిది కాదు. తేడాలెన్ని ఉన్నా ఒకరికొకరు సహకరించడమే మధ్యవర్తుల పరిణతికి గీటురాయి. మధ్యవర్తులకు ఉండే పరిమితులే పార్టీ కూడ భరించవలసి వస్తుంది. ఉదాహరణకు మధ్యవర్తులుగా వెళ్లిన మాదగ్గర చత్తీస్‌గడ్ జైళ్లలో ఉన్న ఖైదీల గురించి పూర్తి సమాచారం లేదు. ఎవరిని ఎందుకు విడుదల చేయవలసిన అవసరం ఉందో మేం నిర్దిష్టంగా వాదించలేకపోయాం. అది మా పరిమితుల్లో ఒకటి. చత్తీస్‌గడ్ లో ప్రజాసంఘాలు, ప్రజాస్వామ్యవాదులు లేకపోవడం ఒక పెద్దలోటుగా అగుపించింది.

చర్చలు విఫలమవుతున్నాయని, బహుశా ఇటువైపు ఏమీ సాధించకుండానే కలెక్టర్ ను విడుదల చేయవలసి రావచ్చునని అర్థమయ్యాక, పార్టీ నాయకులతో 'ఎటువంటి తీవ్రమైన చర్య వద్దు' అన్నాను. ఆయన నా భుజం మీద చెయ్యి వేసి ఆర్ద్రంగా నొక్కాడు. 'అటువంటిదేమీ ఉండదు' అనే ఆశ్వాసం నాకా స్పర్శలో ధ్వనించింది.

మరి నిజంగానే ఏమీ సాధించలేదా? సాధించడం అంటే ఏమిటి అని నిర్వచించుకోవడంలోనే ఉంటుంది. ఇంత పెద్ద చర్య చేసి ఏమీ సాధించకుండానే కలెక్టర్ ను విడుదల చేయవలసి వచ్చిందిగదా అని ప్రజలు, శ్రేణులు అడిగితే ఏం విశ్వాసం కలిగించగలం – ఇది నాయకత్వానికి పెద్ద సమస్యే. బయట ఈ ప్రశ్న అడిగేవాళ్లు చాల సంఖ్యలోనే ఉన్నారు.

ఇప్పుడు దండకారణ్యంలో, చత్తీస్‌గడ్‌లో ఉన్న పరిస్థితుల్లో బిడి శర్మ, హరగోపాల్ ఇక్కడికి రెండుసార్లు వచ్చిపోగలగడమే మహత్వపూర్ణ సంఘటన అని పార్టీ నాయకత్వం అన్నది. నిజంగానే బైటి ప్రపంచమంతా హింసాత్మక ఉద్యమం అని అనుకునే ఉద్యమం గురించి, దాని డిమాండ్ల గురించి, ఆపరేషన్ గ్రీన్‌హంట్ గురించి పది రోజుల పాటు చర్చను రేకెత్తించగలగడమే ఈ ఘటన విజయం. పదిరోజుల పాటు మావోయిస్టు రాజకీయాలు, బస్తర్ ఆదివాసుల స్థితి దేశ ప్రజల దృష్టిలో నిలిచిపోయాయి. అంతమాత్రమే కాదు, మేం అటూ ఇటూ తిరుగుతున్నప్పుడు దాదాపు వంద గ్రామాల్లో ఆదివాసులను చూశాం. వారితో మాట్లాడాం. బిడి శర్మ అయితే వారితో ఇన్ ఖిలాబ్ జిందాబాద్ అనీ, కాగజ్ తుమారా, జమీన్ హమారా అనీ, రాజ్ హమారా సర్కార్ తుమారా అనీ నినాదాలు ఇప్పించాడు. వాళ్ల మధ్య తాను ఒక 'యువకుడిగా' మారిపోయాడు. మద్యం తాగమని ప్రమాణాలు చేయించాడు.

ఆ క్రమంలో మేం వందలాది మంది ఆదివాసులను కలిశాం. వారి గాథలు విన్నాం. ప్రతి ఒక్కరికీ ఒక విషాద గాథ ఉంది. వారి మీద జరిగిన దోపిడీ, దౌర్జన్యం, అత్యాచారం, ఇళ్లు తగులబెట్టడం, కుటుంబ సభ్యులను చంపెయ్యడం... అవన్నీ ఎన్ని రోజులు విన్నా తరగని సుదీర్ఘ విషాదగాథలు. మాకు దొరికిన సమయంలో మేం నలభై మంది కథలు విని ఉంటాం. వాళ్లు వాళ్ల భాషలో చెపుతుంటే మాకోసం అనువాదం ఏర్పాటు చేశారు. అయితే నాకు కొట్టవచ్చినట్టుగా కనిపించినదేమంటే, వాళ్లలో ఏ ఒక్కరూ ఎంత సొంత కుటుంబానికి సంబంధించిన విషాదగాథ చెపుతున్నప్పుడైనా ఏడుస్తూ చెప్పలేదు, కంటనీరు పెట్టలేదు. మాకు మొక్కలేదు. బతిమిలాడలేదు. ఆగ్రహంతో చెప్పారు. అసహనం వ్యక్తం చేస్తూ చెప్పారు. ఇంత అన్యాయమా అని ప్రశ్నిస్తున్నట్టు చెప్పారు. బహుశా ఇది ఆదివాసి సంస్కృతికి ప్రత్యేకమైన లక్షణమేమో. అదే వాళ్ల పోరాటాలకు ఆక్సిజన్ గా పనిచేస్తున్నదేమో అనిపిస్తుంది.

ఈ ఘటన తర్వాత నాకు అసలు మొత్తంగా కిడ్నాప్ ఘటనలపైనే ఆలోచించాలని అనిపిస్తున్నది. ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, చత్తీస్‌గడ్ లలో ప్రఖ్యాతమైన సంఘటనల ద్వారానే నా ఆలోచనలు పంచుకుంటాను.

మొట్టమొదట 1987లో తూర్పు గోదావరి జిల్లా గుర్తేడు లో ఐఎఎస్ అధికారులను కిడ్నాప్ చేసినప్పుడు ఆ కిడ్నాప్ అయిన బృందంలో ఎస్ ఆర్ శంకరన్ ఉన్నారు. అప్పుడు మొదటిసారిగా మధ్యవర్తుల ప్రక్రియ మొదలయింది. మధ్యవర్తుల ఏర్పాటు కిడ్నాప్‌కు గురైన వారి కోరిక వల్ల, ముఖ్యంగా శంకరన్ కోరికతో జరిగింది. ఇటువంటి ఘటనలో మధ్యవర్తులు ఉండవలసిన అవసరం ఉంటుందని శంకరన్ కు ఉండిన అవగాహన వల్లనే ఆ ప్రక్రియ మొదలయింది. అప్పుడు కిడ్నాప్ అయినవారిలోంచి ఒకరిని బయటికి పంపితే వారు యుగంధర్ ద్వారా కన్నబిరాన్ మధ్యవర్తిత్వానికి ఒప్పిస్తారని, యుగంధర్ ముఖ్యమంత్రి ఎన్‌టిఆర్ ను కూడ ఒప్పించగలరని శంకరన్ ఊహించారు. ఈ ఆలోచనను పార్టీ కూడ ఆమోదించింది. తద్వారా ఖైదీల విడుదల, బదిలీ జరిగాయి.

ఆ తర్వాత సుధీర్ కుమార్ కిడ్నాప్ సంఘటనలో మధ్యవర్తుల అవసరం లేకుండానే ప్రభుత్వం పార్టీ డిమాండ్ ను అంగీకరించడంతో విడుదల జరిగిపోయింది.

ఆతర్వాత 1993లో కొయ్యూరు కిడ్నాప్ కేసులో ప్రభుత్వమే మధ్యవర్తుల సహాయం కోరింది. ప్రభుత్వం తరఫున ఐఎఎస్ అధికారి దయాచారి కన్నబిరాన్ నూ, నన్నూ మధ్యవర్తిత్వం వహించమని కోరారు. మేం అందుకు ఒప్పుకున్నాం. అప్పుడు అదనంగా చేరినదేమంటే అటూ ఇటూ ఏమంటున్నారో సమాజంతో బహిరంగంగా పంచుకోవాలని మేం అనుకుని పత్రికాసమావేశాలలో చెప్పడం మొదలుపెట్టాం. తప్పో ఒప్పో నేను చెప్పలేను గాని అప్పటి నుంచి కిడ్నాప్, డిమాండ్లు, చర్చలు రహస్య వ్యవహారం కాకుండా బహిరంగ వ్యవహారం అయిపోయాయి. అప్పుడు మొదట పార్టీ తాను బందీగా పెట్టుకున్న ఎంఎల్ఎ బాలరాజును, ఐఎఎస్ అధికారి శ్రీనివాసులును, ఇతర ఐదుగురు ప్రభుత్వాధికారులను విడుదల చేసింది. ప్రభుత్వం ఒప్పందానికి కట్టుబడి క్రాంతి రణదేవ్ ను వారం పది రోజుల తర్వాత విడుదల చేసింది.

ఆ తర్వాత కిడ్నాప్‌లపై పార్టీలో కూడ చర్చ జరిగిందని, పార్టీ ఒక పత్రం తయారు చేసిందని విన్నాను. ఏది ఏమైనా కిడ్నాప్ లు ఆగిపోయాయి. ఆతర్వాత రెండు మూడు సంవత్సరాలలోనే ప్రభుత్వానికీ పార్టీకీ మధ్య చర్చలు జరగాలనే ఆలోచన, పౌరస్పందనవేదిక ఏర్పాటు జరగడంతో కిడ్నాప్‌లు పూర్తిగా ఆగిపోయాయి. అప్పటిదాకా కిడ్నాప్ లలో మధ్యవర్తులు పోషించిన పాత్రను పౌరస్పందనవేదిక పోషించింది. ఈ మధ్యవర్తిత్వాన్ని ఇరుపక్షాలూ అంగీకరించాయి. ఆ తర్వాత 2002 చర్చల ప్రయత్నాలు, 2004 చర్చల వివరాల్లోకి ఇక్కడ పోనక్కరలేదు.

చర్చల తర్వాత మళ్లీ కిడ్నాప్ రూపం తెరమీదికి వచ్చినది 2011లో ఒరిస్సాలో. ఈ సందర్భంలో కలెక్టర్ వినీల్ కృష్ణను బందీగా పెట్టుకుని, డిమాండ్లు కూడ ప్రకటించిన తర్వాత మధ్యవర్తులు కావాలని ఈ సారి పార్టీయే మొదటగా అడిగింది. బహుశా ఇది చర్చల అనుభవం ఫలితం కావచ్చు.

ఆ తర్వాత 2012లో ఒరిస్సాలో ఇటాలియన్ల కిడ్నాప్, ఎంఎల్ఎ కిడ్నాప్ జరిగాయి. వీటిలో మొదటి ఘటనలో మధ్యవర్తులతో చర్చలు జరిగాయి గాని, రెండో ఘటనలో చర్చలు లేవు, మధ్యవర్తులు లేరు.

ఈ నేపథ్యంలో చత్తీస్‌గడ్ లో సుక్మా కలెక్టర్ కిడ్నాప్ జరిగింది. ఇక్కడ కూడ పార్టీ ముందే డిమాండ్లు ప్రకటించి, చర్చల కోసం మధ్యవర్తులను సూచించింది. చర్చలు జరపాలని, మధ్యవర్తులను అంగీకరించాలని ప్రభుత్వానికి ఉన్నట్టనిపించలేదు.

గత సంవత్సరం ఒరిస్సా ప్రభుత్వం వ్యవహరించిన పద్ధతికీ, ఇప్పుడు చత్తీస్‌గడ్ ప్రభుత్వం వ్యవహరించిన పద్ధతికీ నాకు తేడా కనబడింది. ఒరిస్సా ప్రభుత్వం కలెక్టర్ క్షేమం గురించి ఆందోళన పడుతున్నదని స్పష్టంగా కనబడింది. అప్పుడు పార్టీ ఇచ్చిన పద్నాలుగు డిమాండ్లపై ఆయా సంబంధిత శాఖలు వివరణలు తయారుచేసి మధ్యవర్తులం వెళ్లేటప్పటికే సిద్ధంగా ఉంచాయి. ప్రభుత్వ ప్రతినిధులు ఈ విషయాల మీద ఆలోచించి ఉన్నారు. కొందరి విడుదల జరిగింది. రాధామోహన్ కమిటీ వేయడం జరిగింది. ఆ తర్వాత మిగిలిన వాళ్ళ విడుదల మీద, మిగతా డిమాండ్ల మీద సాచివేత చూపిందనేది, కమిటీ ఒక్కసారి కూడ సమావేశం కాలేదనేది వేరే విషయం. కాని కనీసం కలెక్టర్ బందీగా ఉన్న సమయంలో ఒరిస్సా ప్రభుత్వం తీవ్రంగానే ప్రయత్నాలు చేసినట్టు కనబడింది.

ఈసారి చత్తీస్‌గడ్ ప్రభుత్వం మాత్రం మొదటినుంచీ ఎటువంటి పట్టువిడుపులు లేకుండా మొండిగా ఉండిపోయింది. ఒక పోలీసు అధికారి అయితే, 'కలెక్టర్ చచ్చిపోతే ఏం, పోలీస్ అధికారులం ఎంతమందిమి చావడం లేదు' అని కూడ అన్నాడు. ఈ పోలీసు వైఖరితో పాటు అది భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం గనుక కూడ అది చాల కఠినంగా, మొరటుగా ఉండింది. 'ఈ బందీ విడుదలకు డిమాండ్లు ఒప్పుకుంటే బందీలుగా తీసుకుపోవడం ఒక పద్ధతిగా మారవచ్చు. కనుక ఎట్టి పరిస్థితిలోనూ డిమాండ్లకు తలొగ్గగూడదు' అని పార్టీ నాయకులు, అధికారులు భావించారు. భారతీయ జనతా పార్టీ భావజాలమే పీడన భావజాలం గనుక, దానికి ప్రజాస్వామిక చర్చా పద్ధతులే తెలియవు గనుక అసలీ చర్చలు, మావోయిస్టుల డిమాండ్లకు అంగీకరించడం అంతా అనవసరం అనే అభిప్రాయం కూడ వ్యక్తమయింది. పైగా భాజపా కేంద్రీకృత నిర్మాణం వల్ల ఈ డిమాండ్లను ఒప్పుకోవడం కేవలం ముఖ్యమంత్రి రమణ్ సింగ్ చేతుల్లో మాత్రమే లేదు. అద్వానీ ఒప్పుకోవాలి, మొత్తం పార్టీ ఒప్పుకోవాలి, ఆర్ ఎస్ ఎస్ ఒప్పుకోవాలి. దీనికి తోడు కిడ్నాప్ జరిగిన మరుక్షణం నుంచి జాతీయ స్థాయి ఇంగ్లిష్ ఛానెళ్లు, హిందూ లాంటి వార్తా పత్రికలతో సహా, ప్రభుత్వ కఠిన వైఖరి తీసుకోవాలనే ఒక మధ్యతరగతి ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి చాల 'అనవసరమైన' శ్రమ పడ్డాయి. ఈ అన్ని కారణాలవల్ల డిమాండ్లకు అంగీకరించడం అసాధ్యం, కష్టసాధ్యం.

వ్యక్తులను అపహరించడం, వారిని విడుదల చేయడానికి కొన్ని డిమాండ్లు పెట్టడం అనుసరించవలసిన పద్ధతేనా అని విప్లవపార్టీలు పునరాలోచించుకోవాలనేది నా స్థిరాభిప్రాయం. అది మాకు కలిసిన నాయకులతో కూడ చెప్పాను. పార్టీ ఏవైనా పొరపాట్లు చేస్తున్నదనుకుంటే మీ వంటివారు చెపితేనే గదా మేం ఆలోచించి, అవసరమైతే దిద్దుకునేది అని వాళ్లన్నారు. అపహరించడం సరైన పద్ధతేనా అని అనుమానం ఉన్నప్పుడు మధ్యవర్తిగా ఎందుకు వెళ్లాలి అనే ప్రశ్న కూడ వస్తుంది. అయితే అపహరణ చేసినప్పుడు మావోయిస్టు పార్టీ ఆదివాసుల హక్కుల సమస్యను ముందు పెట్టినప్పుడు, ఒక ప్రజాస్వామ్య చర్చ ఈ అంశాలమీద అవసరమని భావించి దీనికి నేను అంగీకరించాను.

మొత్తం వ్యవహారం ముగిసిపోయిన తర్వాత మాట్లాడుతూ బిడి శర్మ రెండు విషయాలు చెప్పారు. ఒకటి, తాను ఎన్నో సంవత్సరాలు కలెక్టర్‌గా పనిచేసిన, తాను ఎంతో ప్రేమించిన బస్తర్‌కు ఏమయిపోయింది, ఏమయిపోతున్నది అనే ఆవేదన. బస్తర్ ఆదివాసులు ఎప్పుడూ స్వేచ్ఛగా, సురక్షితంగా ఉన్నారని, ఇవాళ పోలీసు, పారామిలిటరీ బలగాలవల్ల ప్రతిక్షణం అభద్రతతో బతకవలసి వస్తున్నదని ఆయన అన్నారు. తాను కలెక్టర్ గా ఉన్నప్పుడు ఒక పంజాబీ పరిశోధక విద్యార్థిని బస్తర్ ఆదివాసులమీద పరిశోధన చేయడానికి వచ్చిన ఉదంతం చెప్పారు. ఆమె మారుమూల ఆదివాసి గూడాల్లో తనకు రక్షణ ఉంటుందా అని అడిగిందట. ఆదివాసుల మధ్య ఎక్కడికి వెళ్లినా, ఎప్పుడు వెళ్లినా ఆమె భయపడవలసిందేమీ లేదని, ఆదివాసులే ఆమెను కాపాడతారని, సహకరిస్తారని శర్మ చెప్పారట. కాని ఏ పంజాబీ యువకుడో, ఆదివాసేతరుడో కనబడితే మాత్రం ఆమెకు రక్షణ ఉండకపోవచ్చునని, అప్పుడు వెంటనే పరుగెత్తుకుని వెళ్లి ఆదివాసుల దగ్గర రక్షణ తీసుకొమ్మని చెప్పారట. అటువంటి నిష్కల్మషులైన, ప్రేమమయులైన ఆదివాసుల జీవితాలను ఇవాళ మన ప్రభుత్వ బలగాలు ఎంతగా ధ్వంసం చేస్తున్నాయి అని ఆయన ఆవేదనతో ప్రశ్నించారు. ఈ విషయం మేం ముఖ్యమంత్రిని కలిసినప్పుడు బిడి శర్మ నిస్సంకోచంగా చెప్పారు.

రెండో విషయం, భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన రోజు బస్తర్ ఆదివాసుల జీవితాలలో, దేశమంతా ఆదివాసుల జీవితాలలో ఘోర అంధకారం మొదలయిందని ఆయన అన్నారు. ఆ రోజు నుంచి భారత ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదివాసుల జీవితాలలోకి చొచ్చుకువెళ్లే అవకాశం, అధికారం వచ్చాయని ఆయన అన్నారు. బస్తర్ లోని వనరులు పూర్తిగా ఆదివాసుల సమూహానికి చెందినవే తప్ప మరెవరికీ వాటిమీద అధికారం లేదని ఆయన అన్నారు. ఈ అంశం మేమిద్దరం విడుదల చేసిన పత్రికాప్రకటనలో పేర్కొన్నాం.

చిట్టచివరిగా, ఈ ఘటనా క్రమంలో పత్రికలు, ప్రచారసాధనాలు ప్రవర్తించిన అన్యాయమైన తీరు గురించి చెప్పాలి. కలెక్టర్ విడుదల అయినతర్వాత మేం అసలు ఈ ఘటన మొత్తంలో మమ్మల్ని ఆందోళన పరచిన అంశాలు ఏమిటో వివరిస్తూ రెండు పేజీల వివరణ రాశాం. ఆదివాసుల జీవితాల పట్ల మా ఆందోళనను వ్యక్తం చేశాం. ఆ వివరణ వంద కాపీలు తీసి విలేఖరులందరికీ ఇచ్చాం. ఒక్క పత్రిక గాని, ఛానల్ గాని ఆ విషయాలు పట్టించుకోనే లేదు. ఇంత జరిగి, పది రోజుల చర్చ జరిగినప్పటికీ సల్వాజుడుం అన్యాయాల గురించి పట్టించుకోవాలని ప్రచారసాధనాలు అనుకోనేలేదు. కలెక్టర్ విడుదల తర్వాత పత్రికాసమావేశంలో టైమ్స్ నౌ విలేఖరి నన్ను ఒక ప్రశ్న అడిగినప్పుడు నేనదే అన్నాను. కార్పొరేట్ ప్రయోజనాల కోసం మాత్రమే పనిచేస్తున్న ప్రచారసాధనాలకు ఈ ప్రజాసంబంధమైన వ్యవహారంలో ప్రశ్నించే హక్కులేదని, నిజమైన ప్రజాసమస్యలను ఏ ఒక్కరోజూ పట్టించుకోని కార్పొరేట్ మీడియాకు జవాబు చెప్పవలసిన అవసరం మాకు లేదు అన్నాను.

అలా ఈ ఘటన ఆదివాసుల జీవితాలలోని విషాదం గురించి, ప్రభుత్వాల దుర్మార్గం గురించి, ప్రచారసాధనాల వ్యవస్థానుకూల, ప్రజావ్యతిరేక స్వభావం గురించి మరింత వెలుగులోకి వచ్చాయి. తెలిసిన విషయాలనే మరోసారి ధృవీకరించాయి.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం నాయకులు)* వీ

# ఎన్నికల చుట్టూ పరిభ్రమిస్తున్న తెలంగాణ ఉద్యమం

***ప్రజా ఉద్యమాలు ప్రజల మధ్య ఐక్యతను పెంచితే, ఎన్నికల రాజకీయాలు వైషమ్యాలు పెంచాయనీ, ఈ బలి పీఠం నుంచి తెలంగాణను రక్షించుకునే కార్యాచరణను రూపొందించుకోవాలనీ అంటున్నారు* శ్రీధర్ దేశ్‌పాండే**

సకల జనుల సమ్మె ముగిసిన తర్వాత తెలంగాణలో ఎన్నికలు తప్ప మరో ప్రజాపోరాటం ఏదీ జరుగలేదనే చెప్పాలి. 2011 అక్టోబర్ 24న సమ్మె ముగిసినప్పటి నుండి తెలంగాణ వ్యాప్తంగా అనేక సభలు, సమావేశాలు జరిగాయి. సమ్మె విజయాలు, వైఫల్యాలపై మదింపు జరిగింది. పత్రికల్లో వ్యాసాలు వెలువడినాయి. కొన్ని పుస్తకాలు కూడా అచ్చయినాయి. ఇవన్నీ జరిగేటప్పటికి జనవరి-ఫిబ్రవరి నెలలు రానే వచ్చాయి. పిల్లల పరీక్షలు ముందున్నాయి. పిల్లల పరీక్షలకు ముందు ఏ ఉద్యమ కార్యక్రమాన్ని జెఎసి ప్రజలకు ఇవ్వలేకపోయింది. గతంలో పిల్లల పరీక్షల కోసమే సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నిలిపివేసినట్లుగా ఉద్యోగ సంఘాల జెఎసి ప్రకటించింది. అక్టోబర్ 2011 నుండి ఇప్పటిదాకా అంటే ఏడు నెలల కాలంలో చెప్పుకోదగ్గ ఉద్యమ కార్యక్రమాన్ని జెఎసి ప్రజలకు ఇవ్వలేకపోయింది. అయితే తెలంగాణ రాజకీయ వ్యవస్థ... అంటే ఎన్నికల చుట్టూ ఉద్యమాన్ని తిప్పుతున్న ఉద్యమకారులు మాత్రం ఊరికే చేతులు ముడుచుకొని కూర్చొనిలేరు. సహాయ నిరాకరణ అనంతరం జూన్ 2011లో పన్నెండు నియోజక వర్గాలలో ఉప ఎన్నికలు జరిగాయి. తిరిగి మార్చ్ 2012లో ఆరు నియోజకవర్గాలలో ఉప ఎన్నికలు రానే వచ్చినాయి. ఇప్పుడు జూన్‌లో పరకాల ఉప ఎన్నిక జరగబోతున్నది. 2014 లోపు మరెన్ని ఉప ఎన్నికలు రాబోతాయో ఇప్పటికైనా ఊహించలేం. సారాంశం ఏమిటంటే, ఇవ్వాళ తెలంగాణ ఉద్యమం మొత్తం ఎన్నికల పోరాటంగా రూపుదాల్చింది. ఎన్నికల్లో టిఆర్ఎస్‌నో లేదా తెలంగాణ వాదాన్ని నెత్తుకెత్తుకున్న మరో పార్టీనో లేదా అభ్యర్థినో గెలిపించి తెలంగాణ వాదాన్ని నిలబెట్టుకోవాల్సిన ఒక అనివార్య పరిస్థితిని ప్రజలకు ఈ రాజకీయ వ్యవస్థ తయారు చేస్తున్నది. అది స్వయంగా ఉద్యమ కార్యక్రమాన్ని ప్రజలకు ఇవ్వదు. ప్రజలే తమ చొరవతో సహాయ నిరాకరణ, మిలియన్ మార్చ్, సకల జనుల సమ్మె లాంటి మహత్తర ఉద్యమాలను నిర్మిస్తే, ఈ రాజకీయ వ్యవస్థ వాటిని కుప్పకూల్చడం మినహా చేసిందేమీ లేదు. ఇవ్వాళ వర్తమాన ఉద్యమ పరిస్థితిని చర్చించడం అంటే ఎన్నికల గెలుపు, ఓటములను చర్చించడమే. గెలుపు ఓటముల వ్యూహాలను, ఎత్తుగడలను విశ్లేషించడమే. తెలంగాణ మేధావి వర్గమంతా ఇప్పుడు ఈ విశ్లేషణల్లో మునిగిపోయింది. పోనీ ఎన్నికలు ముందుకు తెస్తున్న సవాళ్లను స్వయంగా ఎదుర్కొనేందుకు వ్యూహాలు తయారు చేస్తున్నారా అంటే, అదీ లేదు. ఎన్నికలు వస్తున్నాయి ప్రజలు తెలంగాణ పార్టీలకు, అభ్యర్థులకు ఓట్లు వేస్తూనే ఉన్నారు. విచిత్రంగా ఎన్నిక నుండి మరో ఎన్నిక దాకా తెలంగాణ శక్తుల ఐక్యత మాత్రం విచ్ఛిన్నమవుతూనే ఉన్నది. ఎన్నికలు తెలంగాణ ప్రజల, శక్తుల ఐక్యతను దెబ్బతీస్తూనే ఉన్నాయి. ఇది ఎన్నికల రాజకీయంలో ఉండే సహజమైన స్వభావమే. ఉద్యమాలు ప్రజలను ఐక్యం చేస్తాయి. ఎన్నికలు ప్రజలను నిట్టనిలువునా చీలుస్తున్నాయి. మహబూబ్‌నగర్‌లో అది రుజువైంది. పరకాల మరో నిదర్శనంగా ముందుకు రాబోతున్నది. ఇవ్వాళ తెలంగాణ ఉద్యమం ఎన్నికల చుట్టూ తిరుగుతూ ఉన్నది. అదే ఇవ్వాల్టి ఉద్యమ వర్తమానం. కాబట్టి ఈ వ్యాసంలో ఎన్నికల విశ్లేషణ అనివార్యం అవుతున్నది.

మార్చ్‌లో తెలంగాణలో జరిగిన ఆరు ఉప ఎన్నికలలో మహబూబ్ నగర్ నియోజకవర్గం ఎన్నికపై అందరి దృష్టి పడింది. మిగతా ఐదింటిలో అభ్యర్థులు రాజీనామాలు చేసి తిరిగి ఎన్నికల్లో పోటీ పడుతున్నవారే. మహబూబ్‌నగర్ ఎన్నిక అభ్యర్థి మృతి కారణంగా వచ్చిన ఎన్నిక. అందుకే అక్కడ అందరికీ ఆశలు పెరిగినయి. ముఖ్యంగా బిజెపి మహబూబ్‌నగర్ సీటుపై ఆశలు పెంచుకున్నది. మిగతా ఐదింటిలో తాము టిఆర్ఎస్ అభ్యర్థులను బలపరుస్తున్నందు వలన మహబూబ్‌నగర్ తమకు వదిలేయమని కోరినారు. తెలంగాణ ఉద్యమాన్ని తమ గుత్తసొత్తుగా భావిస్తున్న టిఆర్ఎస్ మహబూబ్‌నగర్‌లోనూ పాగా వేయాలనుకున్నది. టిఆర్ఎస్, బిజెపి రెండూ జెఎసిలో భాగస్వామ్య పక్షాలే. గత రెండేండ్లుగా జెఎసి ఇచ్చిన కార్యక్రమాలలో ఉమ్మడిగా పాల్గొంటున్నాయి. వారి బహిరంగ సభలో వీరు, వీరి బహిరంగ సభలో వారు పాల్గొంటూనే ఉన్నారు. జెఎసి నాయకులు ఇరు పార్టీల సభలకు, సమావేశాలకు హాజరవుతూ ఉన్నారు. అందువల్ల మహబూబ్‌నగర్‌లో ఇద్దరిలో ఎవరో ఒక్కరే పోటీ చేస్తే బాగుంటుందని అందరూ ఆశించారు. లేని పక్షంలో తెలంగాణ వాదుల ఓట్లు చీలి తెలంగాణ పార్టీలు ఓడిపోయి తెలంగాణ వ్యతిరేక పార్టీలు గెలుస్తాయన్న ఆందోళన అందరిలో ఉండింది. పోటీవల్ల తెలంగాణ శక్తుల ఐక్యతకు విఘాతం కలుగుతుందని అనుకున్నారు. పోటీ నివారణకు జెఎసి నాయకులతో పాటు ఇతరులు తమ తమ స్థాయిల్లో కృషి చేశారు. కానీ రెండు పార్టీలు ఇచ్చిపుచ్చుకునే ధోరణిని వదిలేసి పంతాలకు పోయినాయి. టిఆర్ఎస్ ఎన్నికల షెడ్యూల్ ప్రకటించిన మరుసటి రోజే ఐదు నియోజకవర్గాల్లో తమ అభ్యర్థులను ఏకపక్షంగా ప్రకటించింది. జెఎసిలో చర్చించి అందరినీ విశ్వాసంలోకి తీసుకొని ఉండాల్సింది. ఐక్య సంఘటన కనీస ధర్మం అది. టిఆర్ఎస్ వారు పాత లెక్కలు తవ్వితీసారు. 2004, 2009 సాధారణ ఎన్నికల్లో మహబూబ్‌నగర్‌లో బిజెపికి పడిన ఓట్లు 0.3 శాతంగా తేల్చిపడేసారు. ఎంఎల్‌సి ఎన్నికల్లో పెద్దగా పట్టభద్రుల ఓట్లు పొందలేక పోయిందని తేల్చారు. 0.3 శాతం ఓటుతో వారు సాధించేదేముంటుంది? వారు పోటీలో ఉంటేనే మంచిది. వారి బలమెంతో వారికి తెలిసివస్తుంది. బిజెపి ఓడిపోతే ఇక తామే తెలంగాణలో ఏకైక పార్టీగా నిలదొక్కుకోవచ్చు అనుకున్నారు. జెఎసిలో సంప్రదింపులకు అవకాశం ఇవ్వకుండా ఏకపక్షంగా అభ్యర్థులను ప్రకటించింది టిఆర్ఎస్.

ఇక బిజెపి... తమది జాతీయ పార్టీ. జెఎసిలో రెండేండ్లుగా భాగస్వామ్య పక్షంగా క్రియాశీలంగా పనిచేస్తున్నాం. జెఎసి ఇచ్చిన అన్ని కార్యక్రమాలను విజయవంతం చేశాం. యుపిఎ తెలంగాణ బిల్లు పెడితే తాము బేషరతుగా మద్దతు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాం. యుపిఎ బిల్లు పెట్టకపోతే 2014లో తాము అధికారంలోకి వస్తే తామే తెలంగాణ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెడ్తాం. తమ పార్టీకి చెందిన జాతీయ నాయకులు పార్లమెంట్‌లోనూ, పార్లమెంట్ బయటా ప్రభుత్వాన్ని తెలంగాణపై నిలదీస్తున్నారు. తెలంగాణ పది జిల్లాలలో పోరు యాత్రను తెలంగాణ ప్రజలు, ప్రజాసంఘాలు అపూర్వంగా స్వాగతించారు. తమతో సంప్రదించకుండానే టిఆర్ఎస్ ఏకపక్షంగా అభ్యర్థిని ప్రకటించడంతో జాతీయ పార్టీగా మేము పోటీకి దిగవలసి వచ్చింది. ఇది బిజెపి వారి వాదన. ఏది ఏమైనా రెండు పార్టీల మధ్య ఒక అవగాహన కల్పించడంలో జెఎసి కృషి ఫలించలేదు.

తెలంగాణ వాదులు ముందు ఊహించినట్లుగానే తెలంగాణ మేధావి వర్గం రెండుగా చీలిపోయింది. ఆ చీలిక ఫలితంగా తెలంగాణ ఓట్లు రెండు పార్టీలకు సమానంగా చీలిపోయాయి. 1800 ఓట్లు బిజెపి కి ఎక్కువ పడడంతో బిజెపి గెలిచింది. మహబూబ్‌నగర్‌లో టిఆర్ఎస్ అభ్యర్థి ముస్లిం. బిజెపి అభ్యర్థి 2009 ఎన్నికల వరకు మహబూబ్‌నగర్ జిల్లా టిఆర్ఎస్ అధ్యక్షుడుగా ఉన్న వ్యక్తి. మహబూబ్‌నగర్‌లో జెఎసి ఎవరికీ మద్దతు ఇవ్వకుండా తటస్థంగా ఉండాలని నిర్ణయించింది. అయితే స్థానిక జెఎసి బిజెపినే సమర్థించినట్లు వార్తలు వచ్చినాయి. తెలంగాణ ఉద్యమం కలిసి కట్టుగా గెలిపించుకోవాల్సిన ముస్లిం అభ్యర్థి సయ్యద్ ఇబ్రహీం ఓడిపోయాడు. ఎన్నికల ఫలితాల అనంతరం ముస్లింలు తాము తిరస్కరించబడినామన్న భావనకు లోనయినట్లుగా వార్తలు వచ్చాయి. ఇబ్రహీం ఓటమికి జెఎసి ని నిందించి, జెఎసి చైర్మన్ ప్రొ. కోదండరాంని బాధ్యుడిని చేస్తూ టిఆర్ఎస్ వర్గాల నుండి విమర్శలు వెల్లువెత్తినాయి. నిజంగా ఇబ్రహీం ఓటమి బాధ్యతను నెత్తుకెత్తుకోవాల్సిన వాళ్లు నిశ్చింతగా ఉండగా, నిత్యం జనంలో విస్తృతంగా తిరుగుతూ ఉన్న ప్రొ. కోదండరాం విమర్శలకు జవాబులు చెబుతూ ఉన్నారు. బిజెపి మతతత్వాన్ని ప్రచారం చేసి గెలిచిందని టిఆర్ఎస్ విమర్శలు గుప్పించింది. మతతత్వాన్ని మొదట ప్రయోగించింది టిఆర్ఎస్ నేనని బిజెపి వాదించింది. జమాతే-ఇస్లామీ-హింద్ అనే మత సంస్థ ఆఫీసుకు కెసిఆర్ స్వయంగా వెళ్లి ముస్లిల కోసం తాము బిజెపితో దోస్తీని వదులు కున్నామని ప్రకటించడాన్ని వారు ఉదహరించారు. ఆ తర్వాతే తమ శ్రేణులు అటువంటి మత ప్రచారానికి పాల్పడినట్లు బిజెపి సమర్థించుకున్నది.

మహబూబ్‌నగర్‌లో బిజెపి ఎందుకు గెలుపొందింది? అనేక కారణాలు విశ్లేషకులు తెలియజెప్పినారు. కెసిఆర్ వ్యవహార ధోరణికి వ్యతిరేకంగా, టిఆర్ఎస్ ఏకపక్ష ఒంటెత్తు పోకడలకు వ్యతిరేకంగా, తెలంగాణ ఉద్యమాన్ని ఎన్నికల చుట్టూ తిప్పుతూ ప్రజా పోరాటాలను నిర్లక్ష్యం చేస్తున్నందుకు ఆగ్రహంగా, బిజెపి అభ్యర్థి యెన్నం శ్రీనివాస్ రెడ్డి పట్ల సానుభూతికి, ఎంఐఎం కాంగ్రెస్‌కు అనుకూలంగా ప్రచారం చేసి ఐదు వేల ముస్లిం ఓట్లను చీల్చినందుకు, బిజెపి ప్రయోగించిన మతతత్వ ప్రచారం, స్థానిక జెఎసి బిజెపి కి మద్దతు ఇవ్వడం, కెసిఆర్, టిఆర్ఎస్ వ్యతిరేక శక్తులను బిజెపి తనవైపు పోలరైజ్ చేసుకోవడం, ఇట్లా అనేక అంశాలు టిఆర్ఎస్ ఓటమికి దారితీసినట్లుగా విశ్లేషకులు భావించారు. ముఖ్యంగా బిజెపితో అవగాహనకు వచ్చి పరకాల సీటు మీకు వదిలేస్తాం, మహబూబ్‌నగర్‌లో పోటీ నుండి విరమించుకోండి అని కోరి ఉంటే మహబూబ్‌నగర్‌లో ముస్లిం అభ్యర్థి సునాయాసంగా గెలిచి ఉండేవాడని, జూన్‌లో జరిగే పరకాల ఎన్నికలో బిజెపి అభ్యర్థి సునాయాసంగా గెలిచే వాతావరణం ఏర్పడేది. మహబూబ్‌నగర్‌లో టిఆర్ఎస్ ఓటమికి బాధ్యత ఆ పార్టీదే అని చాలామంది ఆలోచనాపరులు అభిప్రాయాలు పంచుకున్నారు.

మహబూబ్‌నగర్‌లో తెలంగాణ వాదం ఓడిపోనందుకు తెలంగాణ వాదులు ఊపిరి పీల్చుకున్నారు. తెలంగాణ ఓట్లు చీలినప్పటికీ తెలంగాణ వ్యతిరేక పార్టీలు గెలుపొందలేకపోయినాయి. ఇక ఇప్పుడైనా తెలంగాణ శక్తుల మధ్య ఐక్యతకు కృషి జరగాలని అందరూ కోరుకున్నారు. పరకాలలో కూడా ఉమ్మడి అభ్యర్థి మాత్రమే ఉండాలన్న తెలంగాణ వాదుల ఆశ పటాపంచలయ్యింది. రెండు పార్టీలు అభ్యర్థులను దించుతున్నాయి. మహబూబ్‌నగర్‌లో జరిగినట్టే రెండు పార్టీల మధ్య అవగాహన కుదరకపోవడమే కాదు, శత్రు వైఖరితో ఒకరిపై మరొకరు దుమ్మెత్తి పోసుకుంటున్నారు. ఎవరికి వారు గెలుపుపై ధీమాను ప్రకటిస్తున్నారు. అయితే మహబూబ్‌నగర్‌లో కన్ను మాత్రమే లొట్టపోయింది. వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పింది. ఇదే రకమైన ఫలితం పరకాలలో పునరావృతమవుతుందా?

పరకాలలో అందరికీ ఆశలున్నాయి. మహబూబ్‌నగర్‌లో గెలుపుతో బిజెపి దూకుడు మీద ఉన్నది. ఇక తెలంగాణ అంతా తన వెనుకకు మళ్లిందని పరకాలలోనూ తమదే విజయమని బిజెపి కలగంటున్నది. ఈ గెలుపుతో తెలంగాణలో ఒక ప్రత్యామ్నాయ పార్టీగా ఎదగాలని భ్రమిస్తున్నది. సిపిఐ కూడా పరకాల సీటుపై ఆశలు పెంచుకున్నది. అయితే రెండు దిగ్గజాల మధ్య తాము సరితూగలేమని తొందరగానే స్పృహలోకి వచ్చి పోటీ నుంచి విరమించుకున్నది. తమ మద్దతు టిఆర్ఎస్‌కేనని ప్రకటించింది. (చిత్రంగా వీరు సీమాంధ్రలో తమ మద్దతు టిడిపికే అంటున్నారు.) సందట్లో సడేమియా లాగా తమ త్యాగాలను ఎరగా వేసి పదవులు పొందాలనుకునే నళిని లాంటి వారు, విద్యార్థులు కూడా పరకాలపై ఆశలు పెంచుకున్నారు. మహబూబ్‌నగర్‌లో ఓటమిని జీర్ణించుకోలేని టిఆర్ఎస్ ఎట్లాగైనా పరకాలలో బిజెపిని ఓడించి మహబూబ్‌నగర్‌లో బిజెపిది వాపే తప్ప బలుపు కాదని, తామే తెలంగాణలో ఏకైక పార్టీగా నిలబడాలన్న కాంక్షతో బరిలోకి దిగుతున్నది. అందరూ తమ శ్రేణులను ఇప్పటికే పరకాలలో దించి ప్రచారంలో మునిగిపోయారు. తెలంగాణలో పరకాల ఒక్కటే ఉప ఎన్నిక కనుక అన్ని పార్టీలు తమ శక్తియుక్తుల్ని అక్కడే కేంద్రీకరించి పనిచేస్తున్నాయి.

ఈ నేపథ్యంలో పరకాల ఉపఎన్నిక తెలంగాణ వాదుల ముందు ఒక సవాలుగా నిలిచి ఉన్నది. ఎవర్ని గెలిపించడం? ఎవరికి మద్దతు ఇవ్వడం? తటస్థంగా ఉండడమా? లేక ఏదన్నా ఒక పార్టీని సమర్థించడమా? మహబూబ్‌నగర్‌లో తటస్థం అన్నందుకు ప్రొ. కోదండరాం బిజెపి అనుకూల వైఖరితో ఉన్నట్లు విశ్లేషించారు. మరి పరకాలలో తటస్థంగా ఉండగలమా? ఇవి తెలంగాణవాదుల ముందు, జెఎసి ముందున్న ప్రశ్నలు. పరకాల ఉపఎన్నిక ఒక సవాలుగా రానున్నదని అందరికీ తెలుసు. ఇది అంచనాకు రాని విషయం ఏమీ కాదు. ఇపుడు తెలంగాణ వాదుల్లో పరకాల ఒక చర్చనీయాంశంగా మారింది. చర్చ పరిపరివిధాలుగా సాగుతున్నది.

చర్చల్లో ప్రధానంగా ముందుకు వచ్చిన అంశాలు 1) బిజెపి, టిఆర్ఎస్‌లు అహాలు వీడి, పట్టింపులు మాని ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో, స్నేహపూరిత వాతావరణంలో, వీలయితే జెఎసి మధ్యవర్తిత్వంలో

చర్చించుకొని ఒక అవగాహనకు రావాలి. ఎవరు పరకాలలో పోటీలో ఉండాలో వారే ఉమ్మడిగా ఉండాలి. ఇది సాధ్యమైతే రెండు ప్రయోజనాలూ నెరవేరతాయి. ఉమ్మడి అభ్యర్థిని ఏకపక్షంగా సునాయాసంగా గెలిపించుకో గలుగుతాం. మహబూబ్‌నగర్ ఎన్నికల్లో వచ్చిన చీలికను నివారించి తెలంగాణ శక్తుల మధ్య ఐక్యతను సాధించుకోగలుగుతాం. ఇది అసాధ్యమేమీ కాదు. విశాల తెలంగాణ ఉద్యమ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచించగలిగితే ఏదైనా సాధ్యమే. 2) రెండు పార్టీల మధ్య అవగాహన సాధ్యం కానపుడు జెఎసి మౌనంగా ఉండజాలదు. ఉద్యమ ఐక్యతను కాపాడుకోవడం కోసం జెఎసినే అందరికీ ఆమోదయోగ్యమైన, ఏ పార్టీకి చెందని ఉమ్మడి అభ్యర్థిని ఎంపిక చేసి పోటీలో నిలబెట్టాలి. టిఆర్ఎస్, బిజెపి ఈ ఉమ్మడి అభ్యర్థిని బేషరతుగా సమర్థించాలి. జెఎసి అభ్యర్థి స్వతంత్ర అభ్యర్థిగానే రంగంలో ఉంటాడు. ఈ ప్రతిపాదనకు రెండు పార్టీలు ఒప్పుకోనప్పటికీ జెఎసి అభ్యర్థి తెలంగాణ ఉద్యమ అభ్యర్థిగా రంగంలో ఉండాలి.

ఈ రకమైన రెండు ప్రతిపాదనలు తేలిపోయినయి. ఈ వ్యాసం రాసేటప్పటికే రెండు పార్టీలు తమ అభ్యర్థులను ప్రకటించి ఉన్నాయి. జెఎసి చైర్మన్ ప్రొ. కోదండరాం కూడా జెఎసి రాజకీయ పార్టీ కాదు గనుక ఎన్నికల బరిలోకి దిగే ప్రసక్తి లేదు అని ప్రకటించారు. అయితే పరకాలలో జెఎసి ఎవర్ని సమర్థిస్తుంది? టిఆర్ఎస్ తమకే మద్దతివ్వాలని అంటున్నది. బిజెపి తటస్థంగా ఉండాలంటున్నది. జెఎసి మాత్రం హైదరాబాద్‌లో సిటీ కాలేజ్‌లో జరిగిన సుదీర్ఘమైన విస్తృతస్థాయి సమావేశంలో ప్రజాభిప్రాయం ఎవరివైపు ఉంటే వారికే మద్దతు ప్రకటిద్దాం అని నిర్ణయించి సర్వే కోసం ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ సర్వే పనిలో నిమగ్నమైంది. సర్వే ఫలితం ఎట్లా ఉంటుందో దాన్ని బట్టి జెఎసి నిర్ణయం ఉంటుంది. అయితే ఈసారి జెఎసి తటస్థ వాదాన్ని ఆశ్రయించే అవకాశం లేదని మాత్రం రూఢి అయ్యింది.

మొత్తం మీద పరకాల ఉపఎన్నిక అందరికీ గుణపాఠాలను నేర్పడానికి సిద్ధమవుతున్నది. టిఆర్ఎస్ గెలిస్తే బిజెపికి గుణపాఠం. దూకుడుతనం పనికిరాదు. మహబూబ్‌నగర్‌లో గెలుపుకు ఉపకరించిన అంశాలు తెలంగాణ అంతటా పునరావృతం కావు. మహబూబ్‌నగర్‌లో బిజెపి ఆశ్రయించిన మతతత్వ ప్రచారం తెలంగాణ ఉద్యమ రాజకీయాల్లో అవాంఛనీయం. శతాబ్దంగా తెలంగాణ ప్రజలు నిర్మించుకున్న సమ్మిళిత సంస్కృతికి విఘాతం కలిగించే ఎటువంటి ప్రచారాలనైనా తెలంగాణ ప్రజలు తిప్పికొడతారు. కాబట్టి దూకుడు కట్టిపెట్టి ఉద్యమ శక్తులతో భుజం కలిపి నడవాలి. ఇది బిజెపి నేర్చుకోవాల్సిన గుణపాఠం.

బిజెపి గెలిస్తే టిఆర్ఎస్‌కి గుణపాఠం. తెలంగాణ ఉద్యమానికి తానే ఏకైక ప్రతినిధిని, తెలంగాణ తన గుత్తసొత్తు అన్న భ్రమల నుండి బయటపడి తెలంగాణ కోసం పనిచేస్తున్న అన్ని శక్తులను, పార్టీలను కలుపుకొని ఉద్యమ బాటలో నడవడం, అన్నీ నాకే అన్న స్వార్థం వీడి కొంత మీకు కూడా అన్న ధోరణిని అలవర్చుకుంటే 2014లో 80-90 అసెంబ్లీ, 10-12 పార్లమెంట్ సీట్లు గెలుచుకొని కింగ్‌మేకర్‌గా ఎదగాలన్న వారి కల సాకారమవుతుంది. తెలంగాణ సాధన చివరి అంకంలో టిఆర్ఎస్ స్టేట్స్‌మన్‌షిప్‌ని ప్రదర్శించాల్సిన ఆవశ్యకతను గుర్తించాలి. ఇది టిఆర్ఎస్ నేర్చుకోవాల్సిన గుణపాఠం.

తెలంగాణ వ్యతిరేక పార్టీ గెలిస్తే? అప్పుడు మొత్తం తెలంగాణ ఉద్యమమే గుణపాఠం నేర్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అనైక్యత వల్ల మన గతి ఏమవుతుంది? ఉద్యమం అపజయాన్ని మూటగట్టుకోవాల్సిన పరిస్థితి ఎదురవుతుంది. శత్రువు కోరుకునేది ఇదే. ఉద్యమంపై తెలంగాణ వ్యతిరేక శక్తుల దాడి తీవ్రతరమవుతుంది. తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ మరింత దూరం వెళ్లిపోతుంది. మన యువత, విద్యార్థులు నిరాశా నిస్పృలకు లోనై ఆత్మహత్యలకు పాల్పడతారు. ఉద్యమం చెల్లాచెదురవుతుంది. జెఎసి విచ్ఛిన్నమవుతుంది. ఈ పరిస్థితి రానివ్వకుండా ఏం చేయగలం? అనైక్యతతో అపజయాన్ని మూటగట్టుకుందామా? ఐక్యతతో విజయతీరాలకు చేరుకుందామా? ఇవి ఉద్యమం ముందు వచ్చే ప్రశ్నలు. ఇవన్నీ ఊహాజనితమని కొట్టిపారేసే వాళ్లకు ఏమీ చెప్పలేం. వర్తమాన వాస్తవికతను ఆధారం చేసుకొని భవిష్యత్ పరిణామాలను ఊహించడం అసహజం ఏమీ కాదు. బిజెపి, టిఆర్ఎస్‌లు ఇవ్వాళ తమ ప్రయోజనాల కోసం ఉద్యమ ప్రయోజనాలను బలి పెడుతున్నట్లుగా స్పష్టమవుతోంది. ఈ బలిపీఠం నుండి తెలంగాణ ఉద్యమాన్ని రక్షించుకునే కార్యాచరణ ఉద్యమం తయారు చేసుకోవలసి ఉంటుంది. జెఎసి రాజకీయ పార్టీలను వదిలించుకొని ఇప్పుడు జెఎసికి బయట ఉన్న తెలంగాణ శక్తులను కలుపుకొని జెఎసిని విస్తృతపరచి విశాల ప్రజాస్వామిక లౌకిక వేదికను నిర్మించుకోవాల్సి ఉన్నది. తెలంగాణ ఆకాంక్షతో దోబూచులాడుతున్న కేంద్ర, రాష్ట్ర పాలకవర్గాల మెడలు వంచి తెలంగాణను సాధించుకోవడానికి ఉద్యమ కార్యాచరణను రూపొందించవలసి ఉన్నది. సిటీ కాలేజ్ సమావేశంలో ఈ దిశగా అడుగులు వేయడానికి సూత్రప్రాయమైన అంగీకారం కుదిరినట్లు సమాచారం. ఇది శుభపరిణామం. రాజకీయ పార్టీలు ఉద్యమాన్ని ఎన్నికల చుట్టూనే తిప్పుతాయి. వాటి ఆధిపత్యాల నుండి జెఎసి బయట పడి తెలంగాణ ప్రజల నిజమైన ప్రతినిధిగా ఉద్యమ నిర్మాణానికి పూనుకోవాలి. కెన్నెడీ మాటలను తెలంగాణ ఉద్యమానికి అన్వయించుకుంటే 'ఉద్యమం మాకేమిస్తుందని కాదు, ఉద్యమానికి మనమేమి ఇవ్వగలం' అన్నదే మనల్ని ముందుకు నడిపించేందుకు ప్రేరణ కావాలి.

*(రచయిత తెలంగాణ విద్యావంతుల వేదిక ఉపాధ్యక్షుడు)* వీ

# పాలనా విధానాల వికృత శిశువు అవినీతి

*నేల నుంచి నింగి దాకా, నీళ్ల నుంచి బొగ్గు దాకా కాదేదీ అవినీతికి అనర్హం అంటూ పాలకులూ, పారిశ్రామికవేత్తలూ, దళారీలూ ప్రజల సొత్తును ఏ విధంగా దోచుకుంటున్నారో వివరిస్తున్నారు* **పి.వి. రమణ**

మన దేశంలో రోజుకో కుంభకోణం బద్దలవుతోంది. మొన్న కామన్‌వెల్త్ గేమ్స్ కుంభకోణంలో 70 వేల కోట్ల రూపాయలు, 2జీ స్పెక్ట్రం స్కాంలో ఒక లక్షా 76 వేల కోట్ల రూపాయలు, కాగ్ తాజాగా పేల్చిన బాంబు, బొగ్గు గనుల కుంభకోణంలో 10 లక్షల 67 వేల కోట్ల రూపాయలు, ఇస్రో యాంట్రిక్స్ దేవాస్ కుంభకోణంలో రెండు లక్షల కోట్ల రూపాయల వలన దేశ ఖజానాకు భారీగా గండిపడింది. ఇవి ఒక విధంగా నమూనా మాత్రమే. ఇవి దొరికితే దొంగల అవినీతి కథలు. ప్రజల పక్షాన నిలిచే మేధావులచే సోషల్ ఆడిట్ చేయిస్తే అన్ని రంగాలలో లక్షల కొద్దీ ఇలాంటి కుంభకోణాలు బయటపడతాయి. తద్వారా ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మేడిపండు రూపం మరింత బట్టబయలు అవుతుంది. అవినీతిపరులైన రాజకీయ నాయకులు, మంత్రులు, అధికార యంత్రాంగం దేశ, విదేశీ దళారీల అపవిత్ర కలయికతో సామ్రాజ్యవాద దేశాల సేవకులుగా దేశ సార్వభౌమత్వాన్ని అమ్మకానికి పెట్టడంలో పోటీపడుతున్న కొన్ని కుంభకోణాల గురించి తెలుసుకుందాం.

**బొగ్గు గనుల కుంభకోణం**

కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) సంస్థ 'పెర్‌ఫార్మెన్స్ ఆడిట్ ఆఫ్ కోల్ బ్లాక్ అలకేషన్స్' అనే 110 పేజీల నివేదిక ప్రభుత్వానికి సమర్పించగా దాంట్లో కొన్ని వివరాలు లీక్ అయి పత్రికల్లో 'భారీ కుంభకోణం'గా ప్రచురించబడ్డాయి. 2004-09 మధ్యకాలంలో దేశవ్యాప్తంగా వివిధ ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థలకు కేటాయించిన 155 బొగ్గు బావుల్లో విధానాలకు వ్యతిరేకంగా జరిగిన అవకతవకల కారణంగా భారతదేశ ఖజానాకు పది లక్షల 67 వేల కోట్ల రూపాయల మేరకు నష్టం వాటిల్లిందని కాగ్ నివేదికలో పేర్కొంది. బొగ్గు గనుల్ని వేలం పద్ధతిలో కాకుండా స్క్రీనింగ్ పద్ధతిలో కేటాయించడం వలన దాదాపు వంద ప్రైవేట్ కంపెనీలు ఐదు లక్షల కోట్ల రూపాయల లాభాలు గాలివాటంగా పొందాయని తెలుస్తుంది. కోల్ ఇండియా తక్కువ స్థాయి బొగ్గు టన్నుకు రు. 1000 విదేశాల నుండి దిగుమతి చేసుకునేస్థాయి దానికి రు. 4000 ధర కడుతుంది. ఈ నివేదికలో అతి తక్కువ స్థాయి బొగ్గు ధరలనే తీసుకోవడం వలన నష్టం మరింత ఎక్కువగా ఉండే అవకాశం ఉంది.

కాగ్ నివేదిక ప్రభుత్వం అనుసరిస్తున్న బొగ్గు కేటాయింపుల పాలసీనే ప్రశ్నించింది. బొగ్గు గనుల జాతీయకరణ చట్టం 1973 ప్రకారం బొగ్గు గనుల తవ్వకాల్ని కేవలం ప్రభుత్వ రంగ పరిశ్రమలకి కేటాయించాలి. ఈ చట్టానికి 1976, 1993, 1996లలో సవరణలు చేసి ప్రైవేట్ స్టీలు, సిమెంట్, విద్యుత్ కంపెనీల అవసరాలకు కాప్టివ్‌మైన్స్ పేరిట కేటాయించడాన్ని అనుమతించారు. ఈ సందర్భంగా 2జీ స్పెక్ట్రం కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులో 'సహజ వనరుల మీద రాజ్యం ఆధిపత్యంతోపాటు, వాటి సంరక్షకునిగా, ధర్మకర్తగా వ్యవహరించాలి. రాజ్యానికి వనరుల మీద ప్రజల తరపున చట్టపరంగా హక్కు కలిగి ఉండవచ్చు గానీ, వాటి వలన ప్రజలకు ఎటువంటి లాభం ఉండేటట్టు చూడకుండా ప్రైవేట్ వ్యక్తులకు సంస్థలకు కట్టబెట్టే హక్కు దానికి లేదు' అన్న వ్యాఖ్యల్ని కాగ్ తన నివేదికలో పేర్కొనడం విశేషం.

ఈ బొగ్గు గనుల కేటాయింపులలో భారీగా లాభాలు పొందిన ప్రైవేట్ కంపెనీలలో టాటాలకు 40,321 కోట్ల రూపాయలు, జిందాల్ స్టీల్‌కు 34,024 కోట్ల రూపాయలు, ఎలక్ట్రోస్టీల్‌కు 26,320 కోట్ల రూపాయలు, భూషణ్ స్టీల్స్‌కు 15,967 కోట్ల రూపాయలు లభించాయి. వీటితోపాటు అనిల్ అగర్వాల్ గ్రూప్ కంపెనీస్, జహస్వాల్ నెక్, అభిజిత్ గ్రూప్, ఆదిత్య బిర్లా కంపెనీస్, ఎస్సార్ గ్రూప్ ఆఫ్ కంపెనీస్, అదానీ గ్రూప్, ఆర్సిలర్ మిట్టల్ ఇండియా లిమిటెడ్, లాంకో గ్రూప్ ఇలా దేశ వనరుల మీద ఆధిపత్యం చలాయించే కంపెనీలు చాలా ఉన్నాయి. లాభాలు పొందిన ప్రభుతవరంగ సంస్థల్లో ఎంఎంటిసి, ఎన్‌టిపిసి, పశ్చిమ బెంగాల్, చత్తీస్‌గఢ్, జార్ఖండ్, మధ్యప్రదేశ్‌లకు చెందిన కార్పొరేషన్లు ఉన్నాయి. కాని వీటిలో తవ్వకాలకు సంబంధించిన కాంట్రాక్టుల్లో ప్రధాన భాగం ప్రైవేట్ కంపెనీలే చేపడుతాయి. కాబట్టి ఆ లాభాలలో కూడా అధిక శాతం ఈ ప్రైవేట్ కంపెనీల జెబుల్లోకి దారితీస్తాయి.

'బొగ్గు గనులు కేటాయించిన ప్రభుత్వ కంపెనీలు పనులు వేగంగా ప్రారంభించలేకపోతున్నాయి. అసలు కోల్ ఇండియాకు తవ్వకానికి సరైన ప్లాన్‌లు లేవు. అవి ఎవరినీ ఆకర్షించడం లేదు. మా లాంటి కంపెనీలు పనులు వేగంగా చేస్తూ దేశానికి ఎంతో సంపదను అందిస్తున్నాయి. మాకు సంబంధించిన రెండు బొగ్గు గనుల ద్వారా ఎంతో సేవ చేస్తున్నందుకు గర్వంగా ఉందని చెప్పుకోగలరు' అంటూ జిందాల్ స్టీల్ అండ్ పవర్ లిమిటెడ్ అధినేత నవీన్ జిందాల్ చేసిన ప్రకటనలో దోపిడీదారుని అహంకారమే తెలుస్తుంది.

**బొగ్గు గనుల కేటాయింపు**

మొదట ప్రభుత్వం కేటాయించడానికి అనువుగా ఉన్న బొగ్గు గనుల్ని గుర్తిస్తుంది. వాటి గురించి పత్రికల్లో ప్రకటన ద్వారా కావాల్సిన వారిని అభ్యర్థించాల్సిందిగా కోరతుంది. ఆ బొగ్గు గనులను ఎటువంటి ప్రాజెక్టుల కోసం వినియోగిస్తారో, వాటి ప్రయోజనా లేమిటో వివరంగా తెలియజేసి అనుమతి కోరిన తర్వాత, బొగ్గు మంత్రిత్వ శాఖ కార్యదర్శి అధ్యక్షతన స్క్రీనింగ్ కమిటీ, గనులు కోరిన కంపెనీల అభ్యర్థనల్ని పరిశీలించి నిర్ణయం తీసుకుంటుంది. బొగ్గు గనుల జాతీయకరణ చట్టం – 1973 సెక్షన్ 3.3 (ఎ)(ఐ) ప్రకారం ప్రభుత్వరంగ సంస్థలకు పోటీ పద్ధతిలో బొగ్గును పొందే భారం పడకుండా, తద్వారా సామాన్య ప్రజలకు భారం కాకుండా ఉండే రక్షణ ఉంది'. ప్రస్తుత విధానాల ప్రకారం కాప్టివ్‌మైన్స్‌కు విద్యుత్, స్టీల్, సిమెంట్ పరిశ్రమలకు చెందిన వారే అర్హులు. ప్రాజెక్టు ప్లానుల్ని సమర్పించిన కంపెనీలకు స్క్రీనింగ్ కమిటీ ద్వారా లబ్ధిదారుల్ని ఎంపిక చేస్తారు.

**కాగ్ నివేదికపై మంత్రుల స్పందన**

ప్రభుత్వ నిర్వాకంపై పత్రికల్లో సంచలన వార్తలకు అడ్డుకట్ట వేయాలని

నష్ట నివారణ కోసం వెంటనే ఒక ప్రణాళిక సిద్ధం చేశారు. దాని ఫలితమే కాగ్ ముఖ్య అధికారి వినోద్‌రాయ్ పత్రికల్లోని వార్తల్ని ఖండిస్తూ ఒక ఉత్తరం ప్రధానమంత్రికి రాయడం, రాయడం అనే కంటే రాయించారు అంటేనే సరిపోతుంది. వెంటనే యుపిఎ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీ, ప్రధాని మన్మోహన్ సింగ్‌లు రంగంలోకి దిగి, కాగ్ అధికారి ఉత్తరాన్ని ఉటంకిస్తూ 'అవన్నీ అంచనాలేనని, పూర్తిగా నిజాలు కావని, తుది నివేదిక వచ్చే వరకు ఎలాంటి అపోహలు పెట్టుకోవద్దని' చెపుతూ సమస్యని కప్పిపుచ్చే ప్రయత్నం చేశారు.

బొగ్గు శాఖా మంత్రి శ్రీప్రకాశ్ జైస్వాల్‌ను మొదట కాగ్ నివేదిక గురించి అడిగితే తను ఎటువంటి నివేదిక చూడలేదని, అందులో ఏముందో తెలీదని బుకాయించారు. 'మా ప్రభుత్వ లక్ష్యం బొగ్గు అమ్మి డబ్బు చేసుకోవడం కాదు. ఏ రాబడి వచ్చినా అది రాష్ట్రాలకే చెందుతుంది' అని కూడా సెలవిచ్చారు. తర్వాత 'కాగ్ నివేదికలో ఉదహరించిన గాలివాటంగా లభించిన పది లక్షల అరవై ఏడు వేల కోట్ల రూపాయలు ఒక ఊహాగానం మాత్రమే' అన్నారు. ఆ తర్వాత తుది నివేదిక వస్తే ఎన్‌డిఎ వాజ్‌పాయ్ హయాంలో కేటాయించబడిన 35 బొగ్గు గనుల్ని గురించి జవాబు చెప్పాల్సి ఉంటుంది. ఇప్పటికే మా మంత్రిత్వశాఖ ఒక స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన రెగ్యులేటరీ అధికార సంస్థను ఏర్పాటు చేసి, దాని ద్వారా బొగ్గు గనుల తవ్వకానికి లైసెన్సులు జారీచేయడం, బొగ్గు ధర నిర్ణయం, నాణ్యత కలిగిన బొగ్గు సరఫరా జరిగేటట్లు చూడడం, కార్బన్ ఫ్రీ టెక్నాలజీనే వాడేటట్లుగా కంపెనీలను నియంత్రించడం, ప్రభుత్వానికి విధానాల నిర్ణయంపై సలహాలివ్వడం వంటి విధానాలు కేబినేట్‌కు సిఫారసు చేసామని' చెప్పారు. దీని అర్థం భవిష్యత్‌లో రెగ్యులేటరీ సంస్థ పేరుతో బహుళజాతి కంపెనీలకు డైరెక్టుగా సేవ చేయడమే అని సులువుగా అర్థం అవుతుంది. ప్రైవేట్ కంపెనీలు మార్కెట్ విలువ ప్రకారం తమ ఉత్పత్తుల్ని అమ్ముకుంటుంటే వారికి ఎందుకు బొగ్గు గనుల్ని తక్కువ ధరకే కేటాయించారు అని అడిగితే 'సంబంధిత మంత్రిత్వశాఖల నుండి వారి సిఫారసుల మేరకే నిర్ణయం తీసుకుంటామని' అన్నారు. అంటే ఈ పాపంలో మాకే కాదు మిగతా మంత్రిత్వ శాఖలకు కూడా భాగం ఉందని చెప్పడమే.

ప్రధాని ప్రకటన తర్వాత రెండు రోజులకు ఆర్థికమంత్రి ప్రణబ్‌ముఖర్జీ 'అది ప్రాథమిక నివేదిక మాత్రమే. తుది నివేదిక అంత తీవ్రంగా ఉంటదని, మా శాఖ నుంచి ఉత్తర ప్రత్యుత్తరాల్ని అందుకున్న తర్వాత దాదాపు 90 శాతం నిర్ధారణలన్ని రద్దయిపోతాయి. సాధారణంగా ఇదే ఆచరణ గల 150 సంవత్సరాల నుండి అమలు జరుగుతుంది' అని అన్నారు. అంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కాలం నాటి విధానాలనే కొనసాగిస్తున్నామనీ, ఎలాంటి ప్రశ్నలైనా రద్దు చేసుకోవలసిందే గాని వాకికి జవాబులుండవనీ వివరంగా సెలవిచ్చారు.

**కాగ్ నివేదికలో అసలు దోషులెవరు?**

కాగ్ ప్రాథమిక నివేదికకు, తుది నివేదికకు పెద్ద మార్పేమీ ఉండ బోదని, నిజానికి ప్రాథమిక నివేదికలో వేసిన అంచనాలు చాలా తక్కువగా వేసినవేనని పరిశీలకులు భావిస్తున్నారు. కాగ్ నివేదికలో అంచనాలు తప్పని, సరిగ్గా అంచనాలు వేయలేదని వస్తున్న విమర్శలకు కాగ్ అధికారి వినోద్ రాయ్ ఖండిస్తూ 'అంతర్జాతీయ ప్రమాణాలు కలిగిన ఆడిట్ సంస్థ మాది. ఏదో ఆషామాషీగా లెక్కలు వేయడం జరగదు. ఉన్నత శిక్షణ పొందిన, నిపుణులైన అధికార్లతో ఆడిట్ జరుగుతుంది. ప్రతిదీ మూడు నాలుగుసార్లు వడపోత జరిగి, నిగ్గు తేల్చిన తర్వాతే నివేదిక తయారవుతుంది. ఇటువంటి తప్పులు జరగకుండా ఉండేటట్లు శ్రద్ధ తీసుకుంటారు. అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాల నుండి వారి ఆడిటర్లను మా అకాడమీలో తర్ఫీదుకు పంపుతారంటే మా సంస్థకు ఎంత గౌరవముందో ఆలోచించండి' అన్నారు.

కాగ్ నివేదిక ఆరు నెలల క్రితం నుండి తయారీలో ఉంది. బొగ్గు మంత్రిత్వ శాఖ నుండి అన్ని రకాల సంజాయిషీలు పొందిన తర్వాతే పూర్తి చేసారు. సెప్టెంబర్ నుండి నవంబర్ వరకు బొగ్గు మంత్రిత్వ శాఖ, బొగ్గు నియంత్రణ శాఖ, కోల్ ఇండియా రికార్డులన్నీ పరిశీలించిన తర్వాతే నివేదిక పూర్తయింది. కాగ్‌కు ఈ మూడు సంస్థల నుండి పూర్తి సహాయ సహకారాలు అందినట్లుగా రికార్డు కూడా ఉంది.

పైగా కాగ్ తన నివేదికలో, 2004 జూన్‌లో బొగ్గు మంత్రిత్వ శాఖ పేర్కొన్న విషయాన్నే నొక్కిచెప్పింది. అదేమిటంటే 'కోల్ ఇండియా సరఫరా చేసే బొగ్గుకు, ప్రైవేట్ కంపెనీలకు కేటాయించిన గనుల నుండి వచ్చిన బొగ్గుకు ధరలో చాలా వ్యత్యాసముంటుంది. తద్వారా ఆ కంపెనీలకు గాలివాటంగా వచ్చే లాభాలు అధికంగా ఉంటాయి. అందుకే ప్రభుత్వం వాటిని పోటీ పద్ధతిలో వేలం వేయాలని ఆలోచిస్తుంది.'

అక్టోబర్ 14, 2004లో ప్రధాని మన్మోహన్ సింగ్ అధ్యక్షత వహించిన సమావేశంలో (అప్పటి బొగ్గు మంత్రి కూడా ఆయనే) భవిష్యత్‌లో బొగ్గు కేటాయింపులన్నీ పోటీ పద్ధతుల్లో వేలం వేయాలని నిర్ణయం తీసుకున్నారు. పై రెండు సమావేశాల్లో స్పష్టంగా తీసుకొన్న నిర్ణయాలకు విరుద్ధంగా, ప్రధానమంత్రి ఆఫీసు అనుమతితో పాత పద్ధతినే కొనసాగించినట్లుగా కాగ్ తన నివేదికలో పేర్కొంది. అందుకే 2004 నుండి 2009 వరకు హడావుడిగా 155 బొగ్గు గనుల్ని ప్రైవేట్, ప్రభుత్వ సంస్థలకు కేటాయించేసారు.

జూలై 28, 2006న ప్రభుత్వ న్యాయశాఖ, బొగ్గు మంత్రిత్వ శాఖకు, వేలంపాట పద్ధతిని ప్రవేశపెట్టాలని, దాని కోసం శాఖపరమైన నిబంధనల్ని అవసరమైన మేరకు సవరణలు చేసుకోవాలని సలహా ఇస్తూ, దాని ప్రకారం భవిష్యత్‌లో 'ఇండియన్ కాంట్రాక్ట్ చట్టం 1872' ప్రకారం కేటాయించవచ్చని తెలిపింది. అయినా ఆ సలహాను కూడా పాటించలేదు సరికదా, సెప్టెంబర్ 2006లోనే స్క్రీనింగ్ కమిటీ పద్ధతిలో 38 బొగ్గు గనుల్ని కేటాయించేసారు అని కాగ్ తెలిపింది.

**ఆకాశాన్ని అమ్మేయాలని చూసిన ఇస్రో భాగోతం**

అంతరిక్ష ఎస్. బాండ్ స్పెక్ట్రంను అద్దెకివ్వడానికి, ప్రధానమంత్రి ఆఫీసు, ఇంటెలిజెన్స్ సంస్థలు, రక్షణ మంత్రిత్వ శాఖల నుండి క్లియరెన్స్ వచ్చిన తర్వాత 2005లో ఒక ఒప్పందం జరిగింది. దానిని గత సంవత్సరం ఫిబ్రవరిలో ప్రభుత్వమే అకస్మాత్తుగా ఆపేసింది. పార్లమెంట్‌కు కాగ్ సమర్పించిన నివేదిక ప్రకారం ఈ ఒప్పందం వలన రెండు లక్షల కోట్ల రూపాయల నష్టం వాటిల్లిందని తెలపడమే ప్రధాన కారణం.

2000లో 'భారత అంతరిక్ష పరిశోధనా కేంద్రం' (ఇస్రో) అంతరిక్షంలో స్పెక్ట్రం ఎస్ బాండ్ ఉపయోగాన్ని ప్రైవేటు సంస్థలకు అమ్మడానికి, ఉపగ్రహాల ద్వారా సంభాషణా శాస్త్ర పరిజ్ఞానాన్ని వ్యాపార పద్ధతిలో నడపడానికి నిర్ణయం తీసుకొంది. ఇస్రోకు చెందిన వ్యాపార వ్యవహారాల సంస్థ 'యాంత్రిక్స్' 2003లో అమెరికాకు చెందిన 'ఫోర్జ్ అడ్వైజర్స్ కంపెనీ'తో వ్యావార లావాదేవీలకు సంబంధించిన ఒప్పందం చేసుకొంది. తర్వాత ఫోర్జ్ కంపెనీ 'దేవాస్ మల్టీ మీడియా'ను స్థాపించి ప్రముఖులైన మాజీ ఇస్రో శాస్త్రవేత్తలకు తమ కంపెనీలో ఉద్యోగాలు కల్పించింది. పై ఒప్పందం ప్రకారం యాంత్రిక్స్ సంస్థ 70 మెగాహెట్జ్ ఎస్ బాండ్ స్పెక్ట్రం పన్నెండు సంవత్సరాల వరకు వాడుకొంటుంది. దీని కోసం జిఎస్‌ఎటి-6, జిఎస్‌ఎటి-6ఎ ఉపగ్రహాల ద్వారా ట్రాన్స్‌పాండర్‌లను ఉపయోగిస్తారు. ఈ ఒప్పందంలో దేవాస్ సంస్థ యాంత్రిక్స్‌కు అరవై కోట్ల రూపాయలు అడ్వాన్స్‌గా ఇచ్చింది.

ఈ ఒప్పందంలో అవకతవకలు జరిగాయని గ్రహించిన ప్రభుత్వం మూడు కమిటీలను ఏర్పాటు చేసింది. మొదటిదైన వి.ఆర్. సురేష్ పానెల్

మన శాస్త్రవేత్తలదేమీ తప్పులేదని తేల్చింది. తర్వాత వేసిన చతుర్వేది, నరసింహ పానెల్ ఈ ఒప్పందాల్లో జరిగిన ఆర్థిక విషయాల మీద ఏమీ చెప్పకుండా ప్రభుత్వ నిబంధనల్ని అతిక్రమించినట్లు తెలిపింది. ఇక మూడవ ఉన్నత స్థాయి కమిటీకి మాజీ కేంద్ర విజిలెన్స్ కమిషనర్ ప్రత్యూష్ సిన్హా నాయకత్వం వహించారు. ఈయన సమర్పించిన నివేదిక ఇంతవరకు ప్రభుత్వం వెల్లడించలేదు. కాని దాని ఆధారంగానే ప్రభుత్వం నలుగురు సీనియర్ శాస్త్రవేత్తల మీద చర్యలు తీసుకున్నట్లు తెలుస్తోంది. వీరిలో మాజీ ఇస్రో చైర్మన్ మాధవన్ నాయర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ స్పేస్‌లో సైంటిఫిక్ సెక్రటరీగా పనిచేసిన భాస్కర్ నారాయణ్, కమ్యూనికేషన్ సెక్టర్‌లో నిపుణుడైన శాస్త్రవేత్త కె.ఎన్. శంకర్, మాజీ యాంత్రిక్స్ మేనేజింగ్ డైరెక్టర్ మూర్తి ఉన్నారు.

ఈ విషయాలన్నీ ప్రధానమంత్రికి తెలియదని బుకాయిస్తున్నారు. కాని, దేవాస్ సంస్థ సిఇఒ రామచంద్రన్ విశ్వనాథన్, జర్మనీ విదేశాంగ మంత్రి గైడో వెస్టర్ వెల్లెతో జరిపిన సంభాషణలో అతను అక్టోబర్ 2010లో ప్రధానమంత్రిని కలిసినట్లు చెప్పాడు. అమెరికా స్టేట్ డిపార్ట్‌మెంట్ వారు కూడా ఈ విషయాన్ని ప్రధాని ఆఫీసులో మాట్లాడినట్టు చెప్పారు.

తమపై ప్రభుత్వ దాడిని నిరసిస్తూ ఇస్రో మాజీ చైర్మన్ మాధవన్ నాయర్ 'సిన్హా రిపోర్టులో పూర్తిగా ఏముందో మాకు తెలియదు. గాని మా నలుగురు శాస్త్రవేత్తలతో పాటు మరో ముగ్గురు ప్రభుత్వ అధికారులు కూడా బాధ్యులేనని అంటున్నారు. మరి వారి మీదెందుకు చర్యలు తీసుకోలేదని' ప్రశ్నిస్తున్నారు. ఆ ప్రభుత్వ అధికారుల్లో సీనియర్ ఐఎఎస్ అధికార్లయిన, స్పేస్ కమిషనర్ అండ్ అటామిక్ ఎనర్జీ కమిషన్‌ల మాజీ ఆర్థిక సలహా సంఘం సభ్యుడు ఎస్.ఎస్. మీనాక్షి సుందరం, అడిషనల్ సెక్రటరీ, స్పేస్ డిపార్ట్‌మెంట్‌లో ఆర్థిక సలహా సంఘం సభ్యుడు జి. బాలచంద్రన్‌లు ఉన్నారు.

మల్టీనేషనల్ కంపెనీలలో మన దేశ శాస్త్రవేత్తలు ఉద్యోగులుగా చేరితే దేశ ప్రయోజనాలకు ప్రమాదం వాటిల్లదా అని ప్రశ్నిస్తే మాధవన్ నాయర్ 'మన ప్రభుత్వమే 2000లో ఇస్రో ఉద్యోగులతో వ్యాపార కంపెనీలను ప్రారంభించడానికి నిర్ణయం తీసుకుంది. ఆ కంపెనీలకు కావాల్సిన సాంకేతిక సహకారం ఇస్రో అందిస్తుంది. ఉద్యోగులు కంపెనీలు ప్రారంభించి శాటిలైట్ల ద్వారా మల్టీ మీడియా కమ్యూనికేషన్ సేవలను అందించడంలో తప్పేముంది' అని అన్నారు.

అంతవరకు అంతరిక్ష సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రభుత్వ సంస్థలైన దూరదర్శన్, టెలికాం డిపార్ట్‌మెంట్‌లు ఉపయోగించుకునేవారు. నిజానికి 2010లోనే టెలికాం డిపార్ట్‌మెంట్‌లో వారు ఇస్రో ఈ విధంగా ఎస్ బాండ్ స్పెక్ట్రంను విదేశీ కంపెనీలకు అద్దెకివ్వడాన్ని వ్యతిరేకించింది. అప్పటి టెలికాం సంస్థ కార్యదర్శి పి.జె. థామస్ మన దేశ అవసరాలకు ఈ సాంకేతిక పరిజ్ఞానం చాలా అవసరమని, దీన్ని వ్యాపార అవసరాలకు వాడడం ప్రమాదమని వాదించారు.

ఎట్టకేలకు 2012 మే 15న యాంత్రిక్స్ దేవాస్ కుంభకోణం గురించి కాగ్ పార్లమెంట్‌లో సమర్పించిన నివేదికలో బయటపెట్టిన దీన్ని 'ప్రైవేట్ కంపెనీల లాభాల కోసం ప్రభుత్వ ధనాన్ని దోచిపెట్టిన అరుదైన వ్యవహారం'గా అభివర్ణించింది. అతి విలువైన అంతరిక్ష స్పెక్ట్రంను ఇస్రోకు చెందిన యాంత్రిక్స్ విభాగం, ఆ సంస్థ మాజీ ఉద్యోగులు ప్రధాన వాటాదారులుగా గల దేవాస్ సంస్థకు కారుచౌకగా కట్టబెట్టిందని తేల్చి చెప్పింది. మాధవన్ నాయర్‌తో పాటు మిగిలిన వారందరూ ప్రైవేట్ సంస్థల కోసం, ప్రభుత్వ, ప్రజల ప్రయోజనాలు తాకట్టు పెట్టారని వ్యాఖ్యానించింది. దేవాస్‌కు వీలైనంత అధిక లాభాన్ని చేకూర్చడానికి అడ్డమైన దారులన్నీ తొక్కారని స్పష్టం చేసింది. 'ఒకవైపు కేబినెట్ అనుమతి కోరుతూ, అది రాకముందే దేవాస్ సంస్థతో ఒప్పందం కుదుర్చుకొన్నారు. ప్రభుత్వానికి తెలపకుండానే జిఎస్ఎటి-6, జిఎస్ఎటి-6ఎ శాటిలైటులను ప్రభుత్వ ఖర్చుతో ప్రైవేట్ కంపెనీ ప్రయోజనాల కోసం ఉపయోగించాలని చూసారు' అని వివరించింది.

**దేశాన్ని రక్షిస్తామంటున్న రక్షణ శాఖకే రక్షణ లేదు**

చెకోస్లోవేకియాకి చెందిన టెట్రా కంపెనీ నుండి 788 హెవీ డ్యూటీ ట్రక్కుల కొనుగోలు ఒప్పందాన్ని క్లియర్ చేస్తే పద్నాలుగు కోట్ల రూపాయల లంచం ఇవ్వడానికి మాజీ ఆర్మీ అధికారి తేజేందర్ సింగ్ ప్రయత్నించాడని సాక్షాత్తు మన దేశ సైనిక దళాల ప్రధానాధికారి జనరల్ వి.కె. సింగ్ బయటపెట్టారు. మార్చ్ 12న ప్రధానికి రాసిన ఉత్తరంలో 'మనకు మన దేశాన్ని రక్షించుకునే సామర్థ్యం లేదనీ, దేశ రక్షణ ప్రమాద పరిస్థితిలో ఉందని' అంటూ పెద్ద సంచలనాన్ని సృష్టించారు. 'దేశంలో సాయుధ బలగాల పరిస్థితి మరీ దయనీయంగా ఉంది. ట్యాంకుల విభాగం నిరాయుధంగా మారింది. శత్రు ట్యాంకుల్ని ఎదుర్కొనే సామర్థ్యం వీటికి ఏమాత్రం లేదు. ఇక గగనతల ఆక్రమణకు కీలకమైన వాయుసేనలో 97 శాతానికి కాలం చెల్లిపోయింది. పదాతిదళం పరిస్థితి మరీ ఘోరం. వీరికి ముఖ్యమైన ఆయుధాలు లేవు. రాత్రివేళ పోరాడే సామర్థ్యం లేదు. మన దేశ రక్షణ వ్యవస్థ పైకి కనబడే మేడిపండు లాగుందని' ఆ ఉత్తరంలో పరిస్థితిని వివరించారు.

జనరల్ వి.కె. సింగ్‌కు లంచం ఇవ్వచూపిన తేజేందర్ సింగ్ చిన్న వాడేమీ కాదు. రక్షణరంగ ఇంటెలిజెన్స్ చీఫ్‌గా పనిచేసాడు. ఇంకా సైన్యంలో పలు రకాల కీలక పదవులు నిర్వహించాడు. కేంద్ర హోం మంత్రి చిదంబరానికి ఈయనకి చాలా సన్నిహిత సంబంధాలున్నాయి. 2010లో జాతీయ సాంకేతిక పరిశోధనా సంస్థ (ఎన్‌టిఆర్ఒ)కు డైరెక్టర్‌గా ఇతన్ని నియమించేందుకు చిదంబరం ప్రయత్నించాడు. కాని అప్పటికి ముంబాయి ఆదర్శ్ గృహ సంస్థ కుంభకోణంలో అతని పాత్ర బయట పడడంతో ఆ అవకాశం పోయింది. సైన్యంలో ప్రమోషన్లు, ఆయుధ కొనుగోలు వ్యవహారాలలో మాజీ సైనికాధికారుల హవా నడుస్తోంది.

1986 నుంచే మన దేశం టెట్రా కంపెనీ నుండి సైన్యం కోసం ట్రక్కులు కొనుగోలు చేస్తోంది. అప్పుడు రాజీవ్‌గాంధీ ప్రధానమంత్రే కాకుండా రక్షణ మంత్రి కూడా. తనకు సన్నిహితుడైన ఒక వ్యాపారి ద్వారా ఈ ట్రక్కుల కొనుగోలు ఒప్పందం కుదుర్చుకున్నాడు. మన దేశంలోనే కాకుండా కంపెనీ మాతృదేశమైన చెకోస్లోవేకియాలోనే 135 మిలియన్ డాలర్ల ఒప్పందంలో జరిగిన వ్యవహారం మీద పోలీసు పరిశోధన జరుగుతోంది.

ప్రపంచంలోని ఇతర దేశాల ధరలతో పోలిస్తే నలభై లక్షల రూపాయలకు అమ్మాల్సిన టెట్రా ట్రక్కులను ఎనభై లక్షల రూపాయలకు అమ్ముతున్నారు. ఈ ట్రక్కులకు మన దేశంలో సర్వీసింగ్ చేసే సదుపాయాలు లేవు. విడి పరికరాలు సులువుగా లభించవు. దీంతో వందలాది ట్రక్కులు నిరుపయోగంగా పడి ఉన్నాయి.

దేశ రక్షణ రంగంలో జరుగుతున్న కుంభకోణాలు కోకొల్లలు. జర్మనీ నుండి ఎచ్‌డబ్ల్యూవి సబ్ మెరైన్‌ల కొనుగోళ్లలో ముడుపులు చెల్లించారని తెలిసిపోవడంతో వాటిని నిషేధించారు. వాళ్లు సరఫరా చేసిన రెండు సబ్‌మెరైన్‌లకు విడి పరికరాలు దొరకక పోవడంతో మధ్య దళారులకు కోట్ల రూపాయలు చెల్లించాల్సి వస్తోంది. ఇలాంటివే అనేకం ఉన్నాయి.

తాజాగా ఫ్రాన్స్ నుండి కొనుగోలు చేస్తున్న 'రాఫిల్' యుద్ధ విమానాల సరఫరాకు దళారీగా పనిచేసినవారు మరెవరో కాదు! ముఖేష్ అంబానీ. అంటే మన దేశ బడా పెట్టుబడిదార్లకు, దళారీలకు మధ్య అడ్డు గీతేమీ లేదని స్పష్టమవుతోంది.

# విద్యుచ్ఛక్తి భారం పెరగడానికి కారణం?

*విధానపరమైన లోపాలకు తోడు విద్యుత్ వినియోగం పెరగడం, నిపుణుల సూచనలను అమలు చేయకపోవడం వంటి అనేక కారణాలతో విద్యుత్‌రంగం సతమతమవుతోందని అంటున్నారు* **వి. హనుమంతరావు**

దీపం కింద చీకటి – రాష్ట్రంలో స్థానిక విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పదహారు వేల మెగావాట్లు. కాని విద్యుత్ బల్బులు ఎపుడు వెలుగుతాయో, ఎపుడు ఆరిపోతాయో, మళ్లా ఎపుడు వెలుగుతాయో ఎవరికీ తెలియదు. ఆ చీకటిలోనే వినియోగదారుల మీద ధరల బాదుడు. ఒక ముఖ్యమంత్రి రైతులకు ఉచిత విద్యుత్ ఇస్తే, అదే పార్టీకి చెందిన మరో ముఖ్యమంత్రి నాలుగున్నర వేల కోట్ల రూపాయల అదనపు భారం మోపారు. ఇది ప్రభుత్వమేనా? ఎందుకిలా జరుగుతోంది? ఇదేదో ధరల పెరుగుదల వల్ల, విద్యుత్ ఛార్జీలు పెరిగాయని, వంకాయలు, బెండకాయల ధరలు పెరిగినా ఎలా కొనుకోన్నామో, అలాగే, విద్యుత్ ఛార్జీలు ఎంత పెంచినా చెల్లించుకోవాల్సిందేనా? ప్రభుత్వం ఏమీ చేయలేదా? కొంచెం రాష్ట్ర చరిత్ర పుటలు తిరగేసి చూస్తే –

రాష్ట్ర విద్యుచ్ఛక్తి రంగంలో ప్రారంభ దినాలను తలచుకుంటే అది నిజమేనా అనిపిస్తుంది. దేశంలో మొట్టమొదటి రెండు విద్యుత్కేంద్రాల్లో రెండవది మన రాష్ట్రంలోనే, అందులోనూ హైదరాబాద్‌లోనే (అప్పటి నైజాం నవాబు నివాసం కింగ్ కోఠికే పరిమితం) అని ఎంత మందికి తెలుసు? ఆంధ్ర రాష్ట్రం 1953లో ఏర్పడిన నాటికి తలసరి విద్యుత్ వాడకం కేవలం అయిదు యూనిట్లు. అప్పటి మద్రాసు రాష్ట్రంలో భాగంగా ఆంధ్ర జిల్లాలు కలిసి ఉన్నప్పుడు అప్పటి ప్రభుత్వం ఆంధ్ర జిల్లాలను నిర్లక్ష్యం చేసిన దాని ఫలితమే ఇది. తెలంగాణ ప్రాంతంలో హైదరాబాద్ నగరంలో ఒక యూనిట్ ఆరు అణాలు (అప్పటి రూపాయకు 16 అణాలు) మాత్రమే. ఆంధ్రప్రదేశ్ 1956 నవంబర్‌లో ఏర్పడిన నాటికి రాష్ట్రం మొత్తం విద్యుదుత్పత్తి 99 మెగావాట్లు. 1983లో తెలుగుదేశం ప్రభుత్వం ఏర్పడిన తర్వాత విద్యుత్ రంగానికి ప్రణాళికలో కోత విధించిడంతో (ఆ మేరకు సామాజిక సంక్షేమ పథకాలకు కేటాయింపు పెంచడం హర్షణీయమే అయినా) ఈ రంగానికి కష్టాలు ప్రారంభమయ్యాయి. అప్పటి నుంచి ఇప్పటి వరకూ ఆ షాక్ నుంచి రాష్ట్రం బయటపడలేక పోతోంది. ఈ షాక్‌కు చంద్రబాబు హయాంలో సంస్కరణలు ప్రవేశపెట్టడంతో అగ్నికి ఆజ్యం తోడైనట్లయింది. 1996లో ప్రపంచ బ్యాంక్‌కు అప్పటి చంద్రబాబు ప్రభుత్వం తలవొగ్గి ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టడమే కారణం. ఈ సంస్కరణల లక్ష్యం 1) విద్యుత్ మండలిని మూడు ముక్కలు చేయడం; 2) విద్యుదుత్పత్తి ప్రైవేటీకరించడం; 3) విద్యుత్ ఛార్జీలు పెంచడం. ఫలితం, మన ఇళ్లల్లో, రాష్ట్రంలో పరిశ్రమల్లో రోజుకు ఎపుడు, ఎన్నిసార్లు కరెంటు పోతుందో తెలియదు. కరెంట్ ఛార్జీల పెంపుదలతో గూబలదరిపోతున్నాయి. ఉత్పత్తి చాలక ఇతర రాష్ట్రాల నుంచి ప్రైవేట్ విద్యుత్కేంద్రాల నుంచి కోట్ల రూపాయలు చెల్లించి కరెంట్ కొనుక్కోవాల్సి రావడం, సంస్కరణలు ప్రవేశపెట్టే నాటికి మన రాష్ట్రంలో విద్యుదుత్పాదన మిగులు చూపించిందంటే ఆ స్థాయికి చేర్చిన ఘనత నార్ల తాతారావుదే. మన రాష్ట్రాభివృద్ధికి ఎంతగానో తోడ్పడిన నిపుణులు ఇద్దరు ఉన్నారు. ఒకరు తాతారావు, రెండవ వారు నీటిపారుదల నిపుణులు డా. కె.ఎల్. రావు. విద్యుత్‌ను వ్యాపార వస్తువు చేయవద్దు. ఆ విద్యుత్తుతో తయారయ్యే

---

భారతదేశంలో ముడుపులుచెల్లించి ఒప్పందాలు చేసుకోవచ్చని, నాణ్యత లేని సరఫరాలు చేసినా, సరఫరాలు ఆలస్యం చేసినా పట్టించుకునే వారుండరని విదేశీ కంపెనీలకు అర్థమైపోయింది. అందుకే వారు బరి తెగించి పనికిరాని రక్షణ సామాగ్రిని మనకు అంటగట్టడంలో విజయం సాధించారు. 'రక్షణ రంగానికి లక్షల కోట్లు కేటాయిస్తున్న ట్యాంకుల సంగతి అటుంచితే, కనీసం తుపాకుల్ని తయారుచేసుకొనే శక్తి కూడా లేదని రుజువైంది. అందుకే విదేశీ దళారులకు కోట్లాది రూపాయలు అందించి, ఆయుధాలను కొనుగోలు చేయాల్సి వస్తోందని 'జాతీయ మారిటైమ్'కు చెందిన సీనియర్ అధికారి రక్షణ రంగ నిపుణుడు, కమాండర్ ఉదయ్ భాస్కర్ అన్నారు.

గత మూడేళ్ల నుండి భారతదేశం తన రక్షణ రంగ బడ్జెట్‌ను విపరీతంగా పెంచడానికి కారణం అమెరికా సహకారంతో ప్రాంతీయ శక్తిగా ఎదగాలనే ప్రయత్నంలో భాగమే. అందుకే చైనాతో పోటీగా భారీ ఎత్తున ఆయుధాలు, ట్యాంకులు, యుద్ధ విమానాలు, సబ్ మెరైన్‌లు ఎడాపెడాగా కొనుగోలు చేస్తోంది. పార్లమెంట్ రక్షణ మంత్రి ఆంథోని 'మన మిలిటరీ అవసరాలకు చేసే కొనుగోళ్లలో దాదాపు డెబ్భై శాతం విదేశాల నుండి దిగుమతి చేస్తున్నవే' అని ప్రకటించారు.

మన దేశ రక్షణ బడ్జెట్ రు. 1,93,407.29 కోట్లు. ఇది గత సంవత్సరం కన్నా 18 శాతం ఎక్కువ. ఇందులో ఆర్మీకి రు. 97,303 కోట్లు, వైమానిక దళానికి రు. 48,192 కోట్లు, నావికా దళానికి రు. 37,315 కోట్లు కేటాయించారు. రక్షణ రంగమంటే బంగారు గుడ్డు బాతు లాంటిది. లక్షల కోట్ల రూపాయల బడ్జెట్ సొమ్ములో రక్షణ శాఖలో దళారులకు, రాజకీయ నాయకులకు, మంత్రులకు, అధికారులకు అత్యధిక శాతం లంచాలుగా ముడుతున్నాయన్న సత్యం సులువుగా అర్థం అవుతుంది.

పెట్టుబడిదారీ సమాజంలో అవినీతి అనే చీడ అంతర్భాగంగానే ఉంటుంది. ప్రపంచీకరణ పేరుతో సంస్కరణ యుగం ప్రారంభమైన నాటి నుంచే అవినీతి పూర్తిగా వ్యవస్థాగతమైపోయింది. రాజకీయాలన్నీ నేరపూరితమైపోయాయి. నేరగాళ్లు, రాజకీయ నాయకులు, మంత్రులు, ప్రభుత్వ అధికారులు తోడు దొంగలై ప్రజల సంపదను కొల్లగొడుతున్నారు. ఈ అవినీతిని అంతమొందించాలంటే అంతరాల సమాజం గురించి మాట్లాడాలి. అసమానతల గురించి మాట్లాడాలి. ఈ దిశగా పయనిస్తున్న వారితో కలిసి నడవాలి. అప్పుడే అవినీతి చీడకు మూలమైన పెట్టుబడిదారీ సంస్కృతికి గోరీకట్టగలం.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)*

వస్తువులతో వ్యాపారం చేసుకోండి అని తాతారావు అంటూండేవారు. ఆయనను 2005లో కలిసి ఇంటర్వ్యూ చేసినపుడు మూడు నాలుగు విషయాలు చెప్పారు. అవి ఈనాటికీ వర్తిస్తాయి.

'మీకు విద్యుత్ కావాలా, విద్యుత్కేంద్రాలు కావాలా అనేది పాలకులకు వేసిన ప్రశ్న. మా రాష్ట్రంలో అంటే మా రాష్ట్రంలో అని పాలకులు వాదులాడుకొంటున్నారు. ఇంత తెలివి తక్కువ పని మరొకటి ఉండబోదు. రాష్ట్రానికి కావాల్సింది విద్యుచ్ఛక్తి. సరే, కేంద్రాన్ని కావాలని అడగడం, విద్యుచ్ఛక్తి ఎవరిస్తారు? మాకు కావాల్సినంత విద్యుచ్ఛక్తి ఎవరిస్తారు? సహజంగా రాష్ట్రాలు ఈ ప్రశ్నలు వేస్తాయి. దానికి తాతారావు జవాబు–

'విద్యుత్‌ను రాష్ట్రాల పరిధిలో నుంచి కేంద్ర ప్రభుత్వ పరిధిలో చేర్చాలి. ఇలా చేయాలని నేను మూడు దశాబ్దాలుగా చెప్పా'నంటూ తాతారావు విద్యుత్ కేంద్రాలు ఉద్యోగావకాశాలేమీ కల్పించవు. కాని అలాంటి అవకాశాలు కల్పించే ఆర్థిక కార్యకలాపాలకు తోడ్పడుతుంది. 'నేను విద్యుత్ మండలికి అధ్యక్షునిగా ఉన్నప్పుడు ఈ విద్యుదుత్పాదనను ఆరు రెట్లు పెంచాను. ఆదాయాన్ని పది రెట్లు పెంచాను. కాని ఒక్క ఉద్యోగిని కూడా అదనంగా రిక్రూట్ చేసుకోలేదు. ఈ రంగాన్ని కేంద్రానికిచ్చేస్తే రాష్ట్రాలకు సమంగా, న్యాయంగా అవసరాలు తీర్చేస్తుందా ఏమిటి అని రాష్ట్రాలు సహజంగానే ప్రశ్నిస్తాయి. అలాంటి అవకాశం లేకుండా బిఎచ్ఇఎల్, ఎన్‌పిసి, ఎచ్‌టిపిసి (జల విద్యుత్తు), ఆర్థిక సహాయ సంస్థలతో ఒక కన్సార్షియం ఏర్పాటు చేయమంటున్నా. ఈ పరిష్కారం బాగానే ఉన్నట్టు కనిపిస్తుంది. అయితే ఇవి రాష్ట్రాల మధ్య పంపకం విషయంలో మాత్రమే. దేశంలోని ఆరు లక్షల గ్రామాల మాటేమిటి? ఇది కూడా కన్సార్షియం చేస్తుందా? తాతారావు అంటారు కదా, రాష్ట్రాల్లో గ్రామీణ విద్యుత్ సరఫరా కార్పొరేషన్లు ఏర్పాటు చేసుకొని – విద్యుత్ పంపిణీ చేయవచ్చు నంటారు. ఈ సందర్భంలో ఆయనో విషయం చెప్పారు. గ్రామీణ సరఫరాకు వేరే ఫీడర్ లైన్లు ఏర్పాటు చేస్తే సబ్ స్టేషన్లు మానిటర్ చేస్తాయి. ఈ విధానంలో ఉద్యోగులు ప్రతి ఇంటికి వెళ్లి మీటర్ చూడనక్కర్లేదు. సబ్ స్టేషన్‌లోనే ఆ సమాచారం లభిస్తుంది.

విద్యుదుత్పాదన ఖర్చు పెరిగిపోతోంది. ప్రజల మీద భారం పెరుగుతోంది. ఈ సమస్యనెలా పరిష్కరించాలి? డిక్షనరీలో అన్ని మాటలకు అర్థాలు దొరికినట్లే తాతారావు వద్ద విద్యుత్ గురించి ఎటువంటి ప్రశ్న వేసినా జవాబు లభిస్తుంది. ఎక్కడైతే బొగ్గు లభిస్తుందో, అక్కడే విద్యుత్కేంద్రాలు నెలకొల్పాలి. అలా చేస్తే బొగ్గు రవాణా ఖర్చులుండవు. ప్రస్తుతం రైల్వేల ద్వారా రవాణా చేస్తున్నాం. రైల్వే లైన్లు వాటి మెయిన్‌టెనెన్స్ ఖర్చు తడిసి మోపెడవుతుంది. దీనితో పోలిస్తే తీగల ద్వారా సరఫరా చేస్తే అయ్యే ఖర్చు చాలా తక్కువ. ఎక్కడో ఉన్న తాల్చేరు నుంచి మన పక్కన ఉన్న కర్ణాటకకు తీగల ద్వారానే విద్యుత్ సరఫరా అవుతుంది. ఎన్‌టిపిసి తన విద్యుత్ కేంద్రాలన్నింటిని (ఒకటి, అరా తప్ప) బొగ్గు గనుల వద్దనే స్థాపించింది. అలాగే సముద్ర తీరాన నెలకొల్పడం వల్ల బొగ్గును సముద్ర మార్గం ద్వారా రవాణా చేయవచ్చు. ఈ సముద్ర తీరం అనే సౌకర్యం పేరుతోనే సంజీవరెడ్డి ఉక్కు కర్మాగారాన్ని విశాఖలో నుంచి కొంటే ఇంకా తక్కువ ఖర్చుకు కొనుక్కోవచ్చు. ఇపుడు ప్రైవేట్ విద్యుదుత్పాదన యంత్రాలను తక్కువ ధరకు లభిస్తున్నాయని ప్రైవేట్ విద్యుదుత్పత్తిదారులు చైనా నుంచి దిగుమతి చేసుకొంటున్నారు. ఇలాంటి అనేక చర్చల ద్వారా, ఒక యూనిట్ విద్యుచ్ఛక్తి ఉత్పాదన ఖర్చు తగ్గుతుంది. వినియోదారులు లాభపడతారు. ఇంత చవగ్గా ప్రైవేట్ రంగం ఇస్తుందా అని తాతారావు ప్రశ్నించారు. మనం గాలి లేకపోతే ఎలా బతకలేమో, అలాగే విద్యుత్ లేకుండా మనం బతకలేని పరిస్థితి ఏర్పడుతోంది. పొలాల్లో, ఫ్యాక్టరీల్లో ఉత్పత్తి విద్యుచ్ఛక్తి మీద ఆధారపడి ఉంది. ఆ ఉత్పత్తికయ్యే ఖర్చు తగ్గుతుంది. ఫలితంగా సబ్సిడీలు తగ్గుతాయి. అలాంటి విద్యుచ్ఛక్తితో వ్యాపారం చేయడమేమిటి? లాభాలు చేసుకోవడమేమిటి? లాభాలు చేసుకోవడానికి లిప్‌స్టిక్‌లు, ఫేస్ పౌడర్లు, విమాన ప్రయాణాలు లాంటివి చాలా ఉన్నాయి. వాటిమీద పన్నులు పెంచి ఆదాయం పెంచుకోండి. ఉత్పత్తికి తోడ్పడే విద్యుత్‌తో లాభాలాటలాడొద్దు.

'ప్రైవేటీకరణ, ప్రపంచ బ్యాంక్ సాయం లాంటి విషయాల మీద తాతారావుకు కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఉన్నాయి. ప్రైవేటీకరిస్తే యూనిట్‌కు నాలుగైదు రూపాయలు వసూలు చేస్తారు. (ఇది ఇంటర్వ్యూ చేసిన నాటి లెక్క. ఉత్పత్తి చేసే విద్యుత్‌ను అవసరమున్నా, లేకపోయినా వర్షాకాలంలో విద్యుత్ అవసరం తగ్గుతోంది.) వాళ్లు ఉత్పత్తి చేసే విద్యుత్తునంతా ప్రభుత్వం కొనాల్సిందే. ఆ రంగానికి లాభాలు ముఖ్యం. అందుచేతనే విద్యుత్‌ను వ్యాపార వస్తువు చేయవద్దంటున్నా ప్రైవేట్ రంగం విద్యుచ్ఛక్తిని ఒక విలాస వస్తువుగా మార్చేశారు. విద్యుచ్ఛక్తి మండలి కావాల్సిన విద్యుచ్ఛక్తిని ఇస్తుందని నమ్మి పరిశ్రమను ఏర్పాటు చేసుకొంటే, నట్టేట్లో మునిగి పోవడమంటారు పారిశ్రామికవేత్తలు. కాన్సార్షియం ఏర్పాటు చేస్తే ఇప్పుడు పెట్టే పెట్టుబడితో సుమారు రెట్టింపు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చు. కాబట్టి సరఫరా చేయలేకపడమనే ప్రశ్నే లేదు. పట్టణాల్లో, నగరాల్లో సరఫరాను ప్రైవేట్‌పరం చేయవచ్చు. అయితే, రెగ్యులేటరీ కమిషన్ నిర్ణయించిన ధరకు సరఫరా చేయాలి. ప్రైవేట్ రంగం ఈ విషయంలో తోక ఝాడిస్తే ఏం చెయ్యాలో పట్టణ వాసులకు బాగా తెలుసు. గ్రామీణ ప్రాంతాలకు ప్రభుత్వమే బాధ్యత వహించాలి. ట్రాన్స్‌మిషన్, డిస్ట్రిబ్యూషన్ నష్టాలనుంచి అధిగమించడానికి సులువైన పద్ధతి హైటెన్షన్ లైన్లను ఏర్పాటు చేయడం. ప్రైవేటీకరణకు చేసుకొన్న ఒప్పందాలు దారుణమైన పత్రాలని చెప్పాలి. యూనిట్ ఛార్జీలను అదే పనిగా పెంచుకుంటూ పోవడం ప్రభుత్వ విధానం కాదు కదా. ఒక పక్క ఇలా ఖరీదైన ఒప్పందాలు చేసుకోవడం ఎందుకని, రెండో పక్క సబ్సిడీభారం పెరిగిపోతోందని వాపోవడమెందుకు? పశ్చిమ దేశాలను అనుకరించవద్దు. మన పరిస్థితులు వేరు. ప్రపంచబ్యాంక్ తాను సూచించిన పరిష్కారమే సర్వ రోగనివారిణి అనుకుంటోంది.

ప్రభుత్వం వత్తాసు పలకడం దురదృష్టం. పైన చేసిన సూచనలను పాటిస్తే ఏ విదేశీ సహాయం లేకుండా విద్యుత్ రంగాన్ని మళ్లీ రైలు పట్టాలపైకి ఎక్కించగలం.

ఇది జూలై 2005లో ఆయన ఇచ్చిన ఇంటర్వ్యూ సారాంశం.

మంచి లాభాలను సంపాదించవచ్చునేది ప్రైవేట్ రంగాల ఏకైక లక్ష్యం. మార్కెట్‌లో ఏ వస్తువుకైనా కొరత ఏర్పడితే, వ్యాపారస్తులు ధరలు పెంచేస్తారు. విద్యుచ్ఛక్తి కూడా అంతే. అదో వ్యాపార సరుకై పోయింది. అనేక కార్పొరేట్ సంస్థలు ఈ రంగంలో ప్రవేశించడానికి తయారయ్యాయి. కాని బొగ్గు కొరత కొరకరాని సమస్య అయింది. అడవుల్లో బొగ్గు గనులున్నాయి. వాటిని తవ్వాలంటే అక్కడే శతాబ్దాలుగా నివసిస్తున్న కోయలను బయటకు తరిమివెయ్యాలి. ఆ పని చేయడానికి చిదంబరం శతవిధాలా ప్రయత్నిస్తున్నాడు. మావోయిస్టులు ఆ పని చెయ్యనివ్వడం లేదు. పరిష్కారంగా కార్పొరేట్లు విదేశాల్లో బొగ్గు ఖనిజాలు లభ్యమయ్యే భూములను కొనేస్తున్నారు. అలా లభ్యమైన బొగ్గును దిగుమతి చేసుకొని, వాటిని దొంగచాటుగా అమ్ముకొని లాభాలు చేసుకొంటూ, మరోపక్క మన్మోహన్‌ను కలిసి ఒత్తిడి తీసుకొని వచ్చారు. వాళ్ల కోర్కె మేరకు కోల్ ఇండియాకు ఆదేశాలు జారీ చేస్తే, వాటిని సున్నితంగా తిరస్కరించగా తాజాగా కొత్త ఆదేశాలు జారీ చేశారు. కొత్తగా కోల్ ఇండియా బాధ్యతలు చేపట్టిన సింగరేణి మాజీ జనరల్ మేనేజర్ ఏం చేస్తారో వేచి చూడాలి?

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)*

# భవన నిర్మాణ కార్మికుల స్థితిగతులు

***భవన నిర్మాణ కూలీల నుంచి మేస్త్రీల వరకూ ఏ విధంగా దోపిడీకి గురవుతున్నారో, మహిళా కూలీలు ఎదుర్కొనే లైంగిక హింస, వివక్షలు ఎంత దుర్మార్గంగా ఉన్నాయో వివరిస్తున్నారు* కె. సుభాషిణి**

మేడేలు (ప్రపంచ కార్మిక దినోత్సవాలు) వస్తున్నాయి... పోతున్నాయి. మరి కార్మికుల జీవన ప్రమాణాల్లో గణనీయమైన మార్పులు చోటు చేసుకుంటున్నాయా అన్న ప్రశ్నకు సమాధానం అందరికీ తెలిసిందే.

ఏ రంగంలోనైనా కార్మికుల శ్రమను దోపిడీ చేయడం జరుగుతూనే ఉంది. ఉత్పత్తి రంగంలో అయితే వస్తువులను ఉత్పత్తి చేసి (కార్మికుల శ్రమతో) అధిక ధరలకు అమ్మి లాభాలు గడిస్తారు. పెట్టుబడి, కార్మికుల కూలీ లేదా జీత భత్యాలు, పరిశ్రమ నిర్వహణ ఖర్చులు పోనూ మిగిలినదంతా లాభాలే.

అసంఘటిత రంగమైన భవన నిర్మాణాల్లో పెట్టుబడి అనేది ఉండదు. కేవలం కర్ర పెత్తనం మాత్రమే ఉంటుంది. ఇందులో పనిచేసే వాళ్లను మూడు రకాలుగా విభజించవచ్చు. 1) భవన నిర్మాణ కార్మికులు, 2) మేస్త్రీలు, 3) ఇంజనీర్లు. సాధారణంగా ఇల్లు నిర్మించుకునే యజమానికి ఇంజనీర్‌తో మాత్రమే నేరుగా సంబంధం ఉంటుంది. ఇంజనీర్ల ఆధ్వర్యంలో మేస్త్రీలు ఉంటారు. ఒక్కొక్క ఇంజనీర్ కింద దాదాపు పదిహేను నుండి ఇరవై మంది దాకా మేస్త్రీలు పని చేస్తుంటారు. అలాగే ఒక మేస్త్రీ కింద పదిహేను నుండి ఇరవై ఐదు మంది దాకా కూలీలు ఉంటారు.

కూలీలల్లో పిల్లలు, స్త్రీలు, పురుషులు ఉంటారు. స్త్రీ, పురుషుల కూలీరేట్లలో కూడా తేడా ఇక్కడ కొట్టొచ్చినట్టుగా కనిపిస్తుంది. నైపుణ్యానికి సంబంధించిన పనులల్లో పురుషులు ఉంటారు. కొన్ని ప్రాంతాల్లో వీళ్లను గౌండా అని మరికొన్ని ప్రాంతాలలో బెల్దారి అని పిలుస్తారు. ఒక గౌండాకు రోజు కూలీ రు. 250 నుండి 300 దాకా ఉంటే మహిళా కూలీకి రు. 160 నుండి 180 దాకా ఉంటుంది. పిల్లలకు వీరి కంటే తక్కువ కూలీ ఇస్తారు. సిమెంట్ బస్తాలు, రాళ్లు, ఇసుక, సిమెంట్, కంకర మోయడం లాంటివి పిల్లలు, స్త్రీలు చేస్తుంటారు. అదే విధంగా మాల్ కలపడం, దాన్ని గంపలకు ఎత్తుకొని గౌండాలకు అందివ్వడం స్త్రీల పని. ఆ మాల్‌తో గోడలు కట్టడం, ప్లాస్టింగ్ చేయడం లాంటివి గౌండాలు చేస్తుంటారు. ఈ గౌండాలు అకస్మాత్తుగా ఎక్కడి నుండో ఊడిపడిన వాళ్లు కాదు. వీళ్లందరు చిన్నతనంలో భవన నిర్మాణ రంగంలో సిమెంట్, రాళ్లు, ఇసుక, ఇటుక మోసిన వాళ్లే. మొదట చిన్న గోడలు కట్టడం, రఫ్‌గా ప్లాస్టింగ్ చేయడం లాంటివి మొదలుపెట్టి మెల్లిగా అనుభవం సంపాదించి నైపుణ్యాన్ని పెంచుకునే ప్రయత్నం చేస్తారు.

నేటి బాలలే రేపటి పౌరులు అన్నట్టుగా నేటి బాల భవన నిర్మాణ కార్మికులే రేపటి గౌండాలు. నేటి గౌండాలే రేపటి మేస్త్రీలు. అయితే నేటి మేస్త్రీలు మాత్రం ఎన్నటికీ ఇంజనీర్లు కాలేరు. కాని కొంతమంది నేటి ఇంజనీర్లు మాత్రం రేపటి కాంట్రాక్టర్లు కాగలరు. ఇక్కడ ఇంకొక మాట చెప్పుకోవాలి. గౌండాలు అందరు మేస్త్రీలు కాలేరు. అంతో ఇంతో ఆర్థిక వెసులుబాటు, చాకచక్యం, మాటకారితనం, ఇంజనీర్, కాంట్రాక్టర్ల అండదండలుంటే తప్ప ఒక మామూలు గౌండా మేస్త్రీ కాలేడు. మేస్త్రీలు తమ కింద పనిచేసే కూలీలను పక్కకు పోనివ్వకుండా చేయడానికి అడ్వాన్సు రూపంలో కొంత సొమ్మును కూలీలకు ముఖ్యంగా గౌండాలకు ఇస్తుంటారు. వారిని కాదని పక్కకు పోలేని పరిస్థితి గౌండాలది. గౌండాలు కూడా తిరిగి చెల్లించలేరనే ధీమా మేస్త్రీలది. ఒకవేళ తెగించి పోతే వారిని నాలుగు తన్ని లాక్కొస్తారు. కేవలం ఈ పని చేయడానికే మేస్త్రీ కింద ఇద్దరు లేదా ముగ్గురు మనుషులు ఉంటారు. ముఠా మేస్త్రీల వ్యవహారం ఈ రంగంలో బాగా కనిపిస్తుంది. మేస్త్రీల పిల్లలు ఎన్నటికీ కూలీలుగా తయారు కారు. చదువుకొని ఏదో ఒక ఉపాధి సంపాదించుకుంటారు. లేకపోతే తండ్రిలాగా మేస్త్రీ అవతారం ఎత్తుతారు. ఈ భవన నిర్మాణ రంగంలో కూలీలుగా ఉన్న వాళ్లు అందరూ దాదాపు దళిత, దళిత క్రిస్టియన్లు, ముస్లిం మైనారిటీ వర్గాలకు సంబంధించిన వాళ్లే. వెనుకబడిన తరగతుల వారి శాతం ఈ రంగంలో తక్కువగానే కనిపిస్తుంది. మేస్త్రీల కింద పని చేసే కూలీలకు సాధ్యమైనంత వరకు రెగ్యులర్‌గా పని ఉంటుంది. వీళ్లు వారానికి ఐదు రోజులు మాత్రమే పని చేస్తారు. మిగిలిన రెండు రోజులు వినోదం, విశ్రాంతిల పేరిట కాలం గడిపేస్తారు. మేస్త్రీ కింద కాకుండా స్వేచ్ఛగా పని చేసుకునే కూలీలకు రోజు పని దొరుకుతుందనే గ్యారంటీ లేదు. ఏదైనా అడ్డా దగ్గరో, చౌరస్తా దగ్గరో కూచొని పని కల్పించే వారి కోసం ఎదురు చూస్తూంటారు. పని దొరికని రోజు ఖాళీగా ఇంటికి వెళ్లిపోతారు.

ఈ రంగంలో రెండు షిఫ్టులు ఉంటాయి. ఉదయం ఆరింటి నుండి తొమ్మిది వరకు (మూడు గంటలు) చేసే పనిని టైమ్ పని అంటారు. తర్వాత ఉదయం పది గంటల నుండి సాయంకాలం ఆరు దాకా చేసే పని సాధారణ పని. సాధారణ పనికి ఇచ్చే కూలీలో సగం టైమ్ పనికి చెల్లిస్తారు. అంటే ఉదయం ఆరు నుండి సాయంకాలం ఆరు దాకా (ఎంత చీకటి అయినా సరే కలిపిన మాల్ అయిపోగొట్టిన తర్వాతే ఇంటికి వెళ్లాల్సి ఉంటుంది.) చేస్తే ఒకటిన్నర రోజు కూలీ గిడుతుంది. ఈ టైమ్ పనికి సాధారణంగా స్త్రీలు హాజరు కారు.

భవన నిర్మాణానికి అయ్యే ఖర్చులో ఐదు శాతం ఇంజనీరుకు ఫీజు రూపంలో ఇంటి యజమాని నుండి ముడుతుంది. ఇంటి నమూనాను తయారు చేయడం దాన్ని మేస్త్రీకి వివరించడం ఇంజనీర్ చేసే పని.

దీనితో పాటు ఏదో ఒక టైమ్‌లో వచ్చి అరగంట పాటు భవన నిర్మాణాన్ని పరిశీలించి మేస్త్రీకి ఆదేశాలు ఇస్తుంటారు. ఇక మేస్త్రీల పని ఏంటంటే అందరూ కూలీల్నీ కూడగట్టి ఎవరు ఏం పని చెయ్యాలో ఎంత చెయ్యాలో ముందు రోజే చెప్పి ఎవరి పని వాళ్లకు అప్పగిస్తాడు. రోజుకు రెండు మూడుసార్లు పని జరిగే ప్రాంతానికి వచ్చి చూసుకొని పోతాడు. అప్పగించిన పనిని ఆ రోజుకి పూర్తిచేసి కూలీలు ఇంటికి పోవాలి. ప్రతి కూలీ తనకు వచ్చే కూలీలో పది నుండి పదిహేను శాతం వరకు మేస్త్రీకి కమిషన్ రూపంలో ముట్టచెప్పాల్సి ఉంటుంది. అందులో రెండు భాగాలు మేస్త్రీ ఒక భాగం ఇంజనీర్ పంచుకుంటారు. కూలీలకు పని చూపించినదానికి మేస్త్రీ కమిషన్ తీసుకుంటే, మేస్త్రీకి పని కల్పించినదానికి ఇంజనీర్ కమిషన్ తీసుకుంటాడు. నిచ్చెన మెట్ల కమిషన్‌ల దళారీ వ్యవస్థ రూపం ఇక్కడ ప్రత్యక్షంగా కనబడుతుంది. శ్రమ కూలీలది, వ్యయం ఇంటి యజమానిది. యజమాని ఇచ్చే కూలీ డబ్బులు పూర్తిగా కూలీలకు చేరడం లేదు. ఇద్దరూ నష్టపోతున్నారు. మధ్యలో ఉన్న మేస్త్రీలు, ఇంజనీర్లు కమిషన్ల రూపంలో గుంజుకొని లాభపడుతున్నారు. ఇంజనీర్లకు కమిషన్ కేవలం భవన నిర్మాణ మేస్త్రీ నుండే కాదు, కార్పెంటర్, ప్లంబర్, సెంట్రింగ్, ఫ్లోరింగ్, పెయింటర్ మొదలగు మేస్త్రీల నుండి కూడా ఇదే విధంగా కమిషన్స్ ముడుతూనే ఉంటాయి. ఈ కమిషన్లతో పాటు ఇంటి యజమాని కొనుగోలు చేసే సిమెంట్, ఇనుము, కలప, టైల్స్, పెయింట్స్ షాపుల యజమానుల నుండి కూడా ఇంజనీర్లకు కమిషన్ ముడుతుంది. ఈ కమిషన్ల వల్ల ఇల్లు కట్టుకునే ప్రతివారికి దాదాపు 25 నుండి 30 శాతం వరకు ఇంటి వ్యయం అధికమవుతుంది. ఇక ఇనుము, సిమెంట్ వగైరా కంపెనీల లాభాలు సరేసరి. ఇంటి నిర్మాణం కోసం బ్యాంకులో వడ్డీలకు రుణాలు తీసుకునే చిన్న, మధ్యతరగతి వర్గాల వారికి పదవి విరమణ వరకు నెలవారి కంతులు కట్టడంతోనే వారి జీవితాలు ముగుస్తాయి.

ఆరోగ్యాన్ని పణంగా పెట్టి దాదాపు పన్నెండు గంటలు పనిచేస్తున్న కూలీలకు చివరకు ముడుతున్న కూలీ నామమాత్రమే. నిరంతర సిమెంట్, ఇసుకలతో పని కాబట్టి ఈ భవన నిర్మాణ కార్మికుల చేతులు పొక్కి, తెల్లగా గడ్డలు కట్టి ఉంటాయి. నామమాత్రపు కూలీతో ఇంటిల్లిపాదికి పోషకాహారం అనేది అందని ద్రాక్ష పండు లాంటిదే. పాలు, పెరుగు, పండ్లు కళ్లతో చూడడమే కాని, వాటిని రుచి చూసి ఎరగని దయనీయమైన జీవితాలు వీరివి. దానికి తోడు వెనుకబాటుతనంతో కూడుకున్న అమాయకత్వం, అజ్ఞానం వీరిని మరింత అనారోగ్యాలకు గురి చేస్తున్నాయి.

భవన నిర్మాణ ప్రాంతాలల్లో కనీస సౌకర్యాలయిన మరుగుదొడ్లు లాంటివి మచ్చుకు కూడా కనిపించవు. దీంతో మహిళా కూలీలు పడే అగచాట్లు అన్నీ ఇన్నీ కావు. చుట్టూ ఇళ్లు లేదా ఇంటి నిర్మాణాలు ఉండడంతో మూత్ర విసర్జనకు కూడా చాలా దూరం పోవలసిన పరిస్థితి. అలా ఎక్కువసార్లు పోయినా, ఆలస్యం అయినా గౌండాలు అసభ్య పదజాలంతో మహిళా కూలీల పట్ల దురుసుగా ప్రవర్తిస్తారు. మహిళా కూలీలు తమ సహజ అవసరాలను తీర్చుకోవడానికి కూడా గౌండాల అనుమతి తీసుకొని పోవాల్సి రావడం నిజంగా చాలా శోచనీయం. వీరిని లైగికంగా కూడా ఈ గౌండాలు వేధిస్తుంటారు. తమకు లొంగనివాళ్లని మేస్త్రీకి చెప్పి పని మాన్పిస్తుంటారు. అర్థం చేసుకునే మేస్త్రీ అయితే ఆ మహిళా కూలీని వేరే గౌండా కింద పనికి మార్పిస్తాడు. ఒకవేళ మేస్త్రీనే మహిళా కూలీలని వేధిస్తే ఇక వారు పని మానుకొని ఇంటికి పోవాల్సిందే. పనిచేస్తున్న ప్రాంతాలల్లో పొరబాటున ప్రమాదాలకు గురి అయ్యే కార్మికుల బాగోగులు పట్టించుకునే వాళ్లు ఎవరు ఉండరు. ఇప్పుడిప్పుడు కొన్ని ఊర్లల్లో కొన్ని ప్రజాసంఘాలు పూనుకొని వారి కోసం లేబర్ ఆఫీసుల చుట్టూ తిరిగి స్మార్ట్ కార్డులను ఇప్పించగలిగారు. వీటితో రెండు లక్షల వరకు బీమా సౌకర్యం లభిస్తుంది. ఇది ప్రమాదంలో చనిపోయిన వారికి మాత్రమే వర్తిస్తుంది. శాశ్వతంగా అంగవైకల్యం కలిగిన అంటే ఇక ఏ పని కూడా చేయలేనట్టివారికి లక్ష రూపాయల బీమా సొమ్ము ముడుతుంది. ప్రమాదం జరిగి ఒక ఆరు నెలల పాటు విశ్రాంతి తీసుకునే కూలీలకు రోజుకు కేవలం యాభై రూపాయల కూలీ చొప్పున బీమా సొమ్ము అందుతుంది.

మహిళా కూలీలు తమ పని ముగించుకొని ఇంటికి పోతూ పొయ్యి కిందకు పనికి వస్తాయని దారిలో ఇన్ని పుల్ల పుడక ఏరుకోని పోతుంటారు. ఇంటికి పోతూనే వాళ్ల కోసం ఇంటి పని ఎదురు చూస్తూ ఉంటుంది. గౌండాలు పని పూర్తి చేసుకొని నేరుగా ఇళ్లకు పోకుండా కల్లు లేదా చీప్ లిక్కర్ సేవించి, సంపాదించే దాంట్లో సగం వాటికే ఖర్చు పెట్టి తీరిగ్గా ఇంటికి వస్తారు. ఇంట్లో తల్లీ, అక్క చెల్లెల్ల మీద పెత్తనం చెలాయిస్తూ, భార్యను చావబాదుతూ వాళ్లు వండి పెట్టింది తింటూ ఒళ్లెరగకుండా పడి నిద్రపోతారు. కొంతమంది అప్పుడప్పుడు ఏదో ఒక నెపం పెట్టి పనికి నామాలు పెడుతుంటారు. ఆ సమయాల్లో వీరు పూర్తిగా ఇంటి ఆడవారి రెక్కల కష్టంపై ఆధారపడి వారి మీదనే దాష్టికం చెలాయిస్తారు.

అభిమాన హీరో సినిమా విడుదల అయితే మొదటిరోజు మొదటి ఆట సినిమా టిక్కెట్టుకు ఎంత ధర అయినా చెల్లించి చూస్తారు. సొంత డబ్బులు ఖర్చు పెట్టుకొని తమ అభిమాన హీరో సినిమా పోస్టర్లకు జంతువులను బలి ఇచ్చి రక్తాభిషేకం చేస్తుంటారు. అభిమాన హీరో సినిమా పదిసార్లయినా చూస్తారు. అలా చూడడం హీరోయిజం అనుకుంటారు. ఈ టిక్కెట్ల వెంపర్లాటలో ప్రాణాలు పోగొట్టుకునే బడుగు జీవులు ఎందరో! టిక్కెట్ల కోసం వీళ్లు వెచ్చించే డబ్బులతో కోట్లకు పడగలెత్తుతున్న హీరోలు వీళ్లకు చేస్తున్నది శూన్యం. నేర్పిస్తున్న విషయాలు మాత్రం అత్యంత హానీకరమైనవి. ఈ సినిమాల ప్రభావం వల్ల వీరు మరింత అమాయకత్వం, అజ్ఞానం, వెనుకబాటుతనానికి గురి అవుతున్నారు.

భవన నిర్మాణ రంగంలో కార్మికులకు సంఘాలు పేరుకు మాత్రమే పని చేస్తున్నాయి. కూలీలను అందరినీ ఒక్కసారిగా గుంపు చేసుకొని పనిలో పెట్టుకోవచ్చు అనే ఉద్దేశ్యంతో మాత్రమే ఈ సంఘాలు నడుస్తున్నాయి అని భావించవచ్చు. ఇక్కడ చీటీలు కూడా నడుపుతుంటారు. ఈ సంఘాలకు నాయకులు మేస్త్రీలే. మేస్త్రీలకు సమస్యలు ఎక్కువ. కాబట్టి దయచేసి కూలీ రేట్లు పెంచమని మాత్రం అడగకండి. అడిగినా మేము పెంచలేం అని మేడే సభలోనే బహిరంగంగా ప్రకటిస్తుంటే, ఇక ఈ సంఘాలు కార్మికుల కోసం ఏదో చేస్తారని ఆశించడం నేతిబీరకాయలో నేతి కోసం వెతికినట్టే.

# విత్తన తయారీ హక్కు రైతులదే

*మంచి విత్తనాలను ఎంపిక చేసుకోవడం, పునరుత్పత్తి చేయడం, సహ రైతులతో పంచుకోవడం రైతుల ప్రాథమిక హక్కనీ, సామ్రాజ్యవాద కంపెనీల ఆధిపత్యాన్ని ఎదిరించాలనీ అంటున్నారు* **డా. కొల్లా రాజమోహనరావు**

వ్యవసాయ రంగానికి విత్తనం ప్రాణం. వ్యవసాయానికి కీలకమైన విత్తన తయారీలో వ్యవసాయదారులు ఎన్నో ప్రయోగాలు చేశారు. పరిస్థితులకు అనుగుణంగా నాణ్యతగల నూతన వంగడాలను అభివృద్ధి చేశారు. పొలంలో బాగా పెరిగిన పంటలోని నాణ్యమైన విత్తనాలను తీసి వాటిని తరువాత పంటకు వినియోగించేవారు. కొంతమంది రైతులు ప్రత్యేక శ్రద్ధ, నైపుణ్యంతో విత్తనాలను అభివృద్ధి చేస్తూ ఉన్నారు. విత్తనం తయారు చేసిన రైతుకూ, వినియోగించే రైతుకూ విత్తనంపై నమ్మకం ఉండేది. అందుకనుగుణంగానే నమ్మకంగా పంటలు పండేవి.

1970 తరువాత పత్తి పంట వాణిజ్య పంటగా విస్తారమైన ప్రాంతంలో ప్రారంభమైంది. ఈ ప్రాంత రైతులు వివిధ ప్రాంతాలకు వెళ్లి పత్తిపంటను సాగు చేశారు. విత్తనాలను వారే తయారు చేసుకున్నారు. ఎంసియు-5 విత్తనాన్ని కోయంబత్తూర్ యూనివర్సిటీ నుండి ఫౌండేషన్ సీడ్ తెచ్చుకొని మల్టిప్లై చేసి అమ్ముకునేవారు.

కొద్ది సంవత్సరాలకు హైబ్రిడ్ విత్తనాల తయారీ ప్రారంభమైంది. ఎచ్ 4 ప్రథమంగా వచ్చింది. తరవాత వరలక్ష్మి, డిసిఎచ్ 32, జెఎచ్ఎచ్, ఎచ్ 6, ఎచ్ 8 తదితర విత్తనాలు వచ్చాయి.

వెరైటీ, హైబ్రిడ్ పత్తి విత్తనాల పేరెంట్ సీడ్స్‌ని విశ్వ విద్యాలయాలు రైతులకు అందించాయి. లాంఫారం పరిశోధన కేంద్రం వారు లాం హైబ్రిడ్ పేరెంట్స్‌ని రైతులకు నేరుగా అందించారు. విశ్వవిద్యాలయాలు, నేషనల్ సీడ్ కార్పొరేషన్ గణనీయమైన పాత్రను విశ్వసనీయంగా నిర్వహించాయి. రైతులు అభివృద్ధి చేసిన విత్తనాలను విశ్వవిద్యాలయాలు తీసుకొని పరీక్షించి రైతులకు తిరిగి అందించాయి. పరస్పర సహకారంతో పనిచేశారు. ఈ విత్తనాలన్నీ రైతులే తయారు చేశారన్న విషయం మరువరాదు. కంపెనీల పాత్ర అప్రధానమైనది. రైతుల విశ్వసనీయతను బట్టి విత్తనాలను అమ్ముకోవడం, కొనుక్కోవడం జరిగేది.

తర్వాత సర్టిఫికేషన్ ఏజెన్సీని ఏర్పరిచారు. ఆంధ్రప్రదేశ్ స్టేట్ సీడ్ సర్టిఫికేషన్ ఏజెన్సీ (ఎపిఎస్ఎస్‌సి)ని ఏర్పరిచి సర్టిఫై చేయడం ప్రారంభించారు. సీడ్ ప్లాంట్ వేసేటప్పుడు ఎపిఎస్ఎస్‌సి వద్ద నమోదు చేసుకున్నవారి వద్ద విజిటింగ్ ఫీజు కట్టించుకొని, విత్తన క్షేత్రాన్ని పరిశీలించి విత్తనాభివృద్ధిని అధికారులు గమనించేవారు. విత్తనాలన్నిటినీ ఎపిఎస్ఎస్‌సి కి స్వాధీనం చేసిన పిదప మొలక శాతం 70 రోజులు పెంచిన తరువాత సర్టిఫై చేసేవారు. అప్పుడే రైతులు పేకింగ్ చేసుకొని అమ్ముకునేవారు.

ప్రభుత్వ సంస్థలు బలహీనం చేయబడ్డాయి. విశ్వవిద్యాలయాలు పేరంట్స్ లైన్స్ ఇవ్వడం తగ్గించాయి. ప్రైవేట్ కంపెనీలకు ద్వారాలు తెరిచాయి. బన్నీ, రాశీ, బ్రహ్మ తదితర పేర్లతో కంపెనీ విత్తనాలు ప్రవేశించాయి. పేరెంట్ సీడ్స్‌ని కంపెనీలు రైతులుకిచ్చి విత్తనాలను తయారుచేసే పద్ధతిని ప్రోత్సహించారు. వేలాది మంది రైతులు కంపెనీ లిచ్చిన పేరెంట్ సీడ్స్‌ను తయారు చేశారు. కంపెనీలకు విత్తనాలను సప్లయ్ చేశారు. వారి దగ్గరకు వచ్చిన పేరెంట్ సీడ్స్‌ని మల్టిప్లై చేసుకొని విత్తనాలను అమ్ముకునేవారు. రైతులు స్వతంత్రంగా విత్తనాలు తయారు చేసుకొని అమ్ముకోవడాన్ని కంపెనీలు సహించ లేకపోయాయి. తమ

---

భవన నిర్మాణాలు జరిగే ప్రాంతాల్లో కూలీలకు కనీస వసతులు కల్పించాలి. తాగునీరు, మరుగుదొడ్ల వసతి ఉంటేనే ఇంటి నిర్మాణాలకు అనుమతి ఇవ్వాలి. అదే విధంగా తమ ఇంటి నిర్మాణాల్లో కూలీలకు జరిగే ప్రమాదాలను నివారించడానికి అన్ని రకాల జాగ్రత్తలు తీసుకోవాలి. ముఖ్యంగా భవనం చుట్టూ వల లాంటిది ఏర్పాటు చేయాలి. భవనం చుట్టూ టార్పాలిన్ కవర్లు పెడితే తీవ్రమైన గాలి ఒత్తిడిని తగ్గించడానికి వీలు ఉంటుంది. ఇంటి వ్యయం, నిర్మాణం పూర్తిచేసే కాలాన్ని దృష్టిలో పెట్టుకొని కార్మికులకు బీమా ప్రీమియంను ఇంటి యజమానితో కట్టించుకునే బీమా సంస్థలు ఉన్నాయి. వాటిని అందరికీ ప్రచారం చేస్తూ కచ్చితంగా పాటించే విధంగా ఒత్తిడి తీసుకుని రావాలి.

భవన నిర్మాణ కార్మికులకు సంఘాలను ఏర్పాటు చేసే వాటిని రిజిష్టర్ చేయించి సంఘంలోని ప్రతి ఒక్కరికీ కనీస కూలీ గిట్టుబాటు అయ్యే ప్రయత్నాలు చేయాలి. కేవలం కర్ర పెత్తనానికి లొంగి తమ శ్రమ విలువను కోల్పోతున్న కార్మికులకు సరి అయిన అవగాహన కల్పించడం సమాజ బాధ్యత. ప్రజా సంఘాలు మరింత చొరవ తీసుకొని తమ కార్యకలాపాలను విస్తరించుకుంటూ భవన నిర్మాణ కార్మికుల వెనుకబాటుతనానికి మూలకారణాలు వారికి వివరించి అర్థం చేయించే ప్రయత్నం చేయాలి. కార్మికులలో కరడు గట్టిన పితృస్వామ్య భావజాలాన్ని తొలగించడానికి మహిళా సంఘాలు పూనుకోవాలి. సామాజిక, సాంఘిక, సాంస్కృతిక పరంగా వెనుకబడి ఉన్న భవన నిర్మాణ కార్మికుల జీవన ప్రమాణాలు మెరుగు పడడానికి అవసరమైన విద్యను అందివ్వడానికి ప్రభుత్వాల మీద ఒత్తిడి తీసుకురావాలి. మొక్కుబడిగానో, తద్దినాల పండుగల మాదిరిగానో మేడే ఉత్సవాలను నిర్వహించకుండా మేడే ప్రాముఖ్యతను తెలియజెబుతూ ఐక్యంగా ఏదైనా సాధించుకోగలం అనే స్ఫూర్తిని, ధైర్యాన్ని కలిగించే బాధ్యత కార్మిక సంఘాలదే.

*(రచయిత గణిత శాస్త్ర అధ్యాపకులు, మహిళా ఉద్యమ కార్యకర్త)* ∎

ఆదాయానికి గండి పడుతుందని కుళ్లుకున్నాయి. ప్రభుత్వ అధికారుల అండతో, ధనబలంతో, పోలీసుల సహాయంతో విత్తన ఉత్పత్తి రైతులపై నకిలీల పేరున దాడి ప్రారంభించారు. విత్తన రైతులను దొంగలుగా సృష్టించారు. కంపెనీల విత్తనాలే అసలైనవి అన్నారు. కంపెనీకి చెందనివన్నీ నకిలీవేనన్నారు. క్రమంగా రైతులు సాంప్రదాయిక హక్కైన విత్తన తయారీ నుండి దూరం చేశారు. అవగాహన లేని కొంతమంది రైతు నాయకులు కంపెనీల మాయాజాలంలో చిక్కుకొని రైతులు తయారు చేసిన విత్తనాలను నకిలీ విత్తనాలన్నారు. పేరెంట్ సీడ్స్‌ని రైతులకు విశ్వవిద్యాలయాల నుండి సప్లయ్ చేయించి రైతుల చేత విత్తనాలను తయారు చేయించే ప్రక్రియను ప్రోత్సహించలేక పోయారు. కంపెనీ ఉచ్చులో చిక్కుకున్నారు. విస్తారమైన ప్రాంతంలో విత్తనాలను తయారు చేసి కంపెనీలకు రైతులకు అందించుచున్నది విత్తన రైతులేనన్న విషయం మరుగున పడింది. అధిక సంఖ్యలో విత్తనాలను రైతులకు అందిస్తున్న రైతులను సప్లయ్‌దారులుగా పరిమితం చేయాలన్నది కంపెనీల ఆకాంక్ష. మొత్తం విత్తనాలన్నీ కంపెనీలే అమ్మాలనే ధ్యేయంతో రైతులను విత్తన రంగం నుండి నెట్టివేసే ప్రయత్నం జరుగుతూ ఉంది. ప్రభుత్వం కంపెనీలకు దన్నుగా నిలబడింది. అయినా పరస్పర విశ్వాసంతో విత్తనాన్ని తయారు చేసుకునే హక్కుని నిలబెట్టుకుంటూనే ఉన్నారు.

మాన్‌శాంటో, డూపాంట్, నొవార్టిస్ లాంటి కంపెనీలు విత్తన రంగంలో పరిశోధనలు ప్రారంభించాయి. కొన్ని వేల జీన్స్ ఉన్న విత్తనంలో ఒక జీన్‌ని మార్పు చేయడంతో జనెటిక్ ఇంజనీరింగ్‌ని అభివృద్ధి చేశారు. క్రైవన్ ఎసి జీన్స్‌ని అభివృద్ధి చేశారు. మోన్‌శాంటో కంపెనీ జీన్ మార్పిడి ప్రక్రియలో వ్యవసాయ రంగంపై ప్రపంచ ఆధిపత్యం సాధించవచ్చని నమ్మింది. వ్యాపార ఎత్తులతో ప్రపంచ వ్యాపితంగా విత్తనంపై పెత్తనాన్ని పొందాలనే ప్రయత్నం ప్రారంభించింది.

నవభారత కంపెనీ అనధికారికంగా తెచ్చుకున్న బిటి విత్తనాలను అభివృద్ధి చేసింది. బిటి పేరెంట్ సీడ్స్‌ను కర్నూలు రైతులకిచ్చి విత్తనాలను తయారు చేయించుకున్నారు. కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల్లో లక్షలాది ప్యాకెట్ల విత్తనాలు తయారయ్యాయి. అనధికారికంగానే ఎటువంటి రాయల్టీలు లేకుండానే ఆంధ్ర, గుజరాత్, మహారాష్ట్ర, కర్ణాటక తదితర ప్రాంతాలలో విస్తరించాయి. విస్తారమైన ప్రాంతాలలో బిటి పత్తిసాగు ప్రారంభమైంది.

2002లో మోన్‌శాంటో కంపెనీ అధికారికంగా ప్రభుత్వం నుండి బిటి విత్తనాల తయారీకి అనుమతి పొందింది. పేరెంట్ లైన్స్ రైతులకిచ్చి విత్తనాలను తయారు చేయించింది. నవభారత కంపెనీ ఇచ్చిన బిటి విత్తనాలకు మోన్‌శాంటో ఇచ్చిన బిటి విత్తనాలకు తేడాలేదు.

విత్తనాలు తయారు చేసే రైతుకి రు. 250 ఇచ్చి 750 గ్రాముల విత్తనాలను మోన్‌శాంటో కంపెనీ తీసుకున్నది. పత్తి పండించే రైతుకి 450 గ్రాముల విత్తనాలను రు. 1850 మించి అమ్మింది. తన విత్తనాలను అమ్మడానికి స్థానిక విత్తన కంపెనీలతో మిలాఖత్ అయింది. రాయల్టీ పేరు రు. 1250 వసూలు చేసింది. ఇది అమెరికా, చైనాలలో కన్నా ఎక్కువ. ఏ దేశంలోనూ లేనంత ఎక్కువగా మన దేశంలో రాయల్టీ ఫీజును వసూలు చేసింది. లాభాలకు పరిమితిలు లేవని నిరూపించింది. మోన్‌శాంటో కంపెనీ విత్తనాలను కొనేటప్పుడు తయారు చేసిన రైతును మోసం చేస్తున్నది. కంపెనీ విత్తనాలను అమ్మేటప్పుడు కొనే రైతును మోసం చేస్తున్నది. దేశాలలోని సంపదను కొల్లగొట్టడంలో మోన్‌శాంటో కంపెనీ ప్రపంచ మంతటిలో ముందున్నది. హైబ్రిడ్ విత్తనాలైనా, బిటి విత్తనాలనైనా రైతులకు, కంపెనీలకు సప్లయ్ చేసింది, చేస్తున్నది, చేసేది మన రైతులేనన్న విషయం మరువరాదు.

మోన్‌శాంటో కంపెనీకి కప్పం (రాయల్టీ) కట్టవద్దని, రైతులకు విత్తనాన్ని తయారు చేసే హక్కు ఉన్నదని రైతులు ప్రథమంగా గుంటూరు జిల్లాలో 2005 జూన్ నెలలో ఆందోళన ప్రారంభించారు. 25 గ్రామాలలో రైతుల సమావేశాలు జరిపి మోన్‌శాంటో రాయల్టీలు, రైతుల విత్తన హక్కు విత్తన చట్టం గురించి విస్పష్టంగా చర్చలు జరిపారు. నల్లమడ రైతు సంఘం అవగాహన ఆధ్వర్యంలో జూలై 4, 2005న వావిలాల సంస్థలో రైతు సంస్థలో రైతు సదస్సు జరిపారు. జూలై 7న గుంటూరు జిల్లా కలెక్టర్ ఆఫీసు వద్ద ధర్నా జరిపారు. పత్తి విత్తనాల ధర రు. 500 కి మించరాదని, రాయల్టీని రద్దు చేయాలని, రైతు విత్తనాన్ని తయారు చేసే హక్కుపై దాడి చేయరాదని ఎలుగెత్తి చాటారు.

ఈ ఆందోళనను గమనించిన రైతు నాయకులు, ప్రభుత్వం ఎంఆర్‌టిపిల మోన్‌శాంటో కంపెనీపై పిటిషన్ వేసి పత్తి విధానాల ధరను రు. 1850 నుండి రు. 750కి పరిమితం చేశారు.

మోన్‌శాంటో లాంటి కంపెనీలు రాకముందు అమెరికాలో రైతులకు విత్తనాలు తయారు చేసుకోవడానికి, నిల్వ చేసుకోవడానికి, అమ్ముకోవడానికి సాంప్రదాయకంగా అడ్డంకులేవీ లేవు. చట్టపరం గానూ, ఆచరణలోనూ ఎటువంటి అభ్యంతరాలూ, అడ్డంకులూ లేవు. దాదాపు మన దేశంలో లాగానే విత్తనాలను తయారు చేసుకునే హక్కు సాంప్రదాయంగా ఉంది. విత్తన కంపెనీలు బలోపేతమై, వివిధ దేశాలకు విస్తరించిన బహుళజాతి కంపెనీలుగా (ఎంఎన్‌సి) మారి, అమెరికన్ ప్రభుత్వానికి చోదక శక్తిగా మారిన తరువాత విత్తనాలు తయారు చేసుకునే సాంప్రదాయిక హక్కు నుండి రైతులను దూరం చేశాయి. 1970లో ప్లాంట్ వెరైటీ ప్రొటెక్షన్ చట్టం తెచ్చారు. (పివిపిఎ) విత్తన చట్టాలను తెచ్చారు. పాప్ అండ్ మామ్ సీడ్స్‌పై దాడి చేశారు. తన వ్యాపార రక్షణ కోసం అనేక చట్టాలను కంపెనీలు చేయించుకోగలిగాయి. రౌండ్ ఆఫ్ రెడీ సీడ్ అంటే కలుపు మందును తట్టుకునే జీన్ (గ్లైఫోసేట్ రెసిస్టెంట్ జీన్)ని ప్రవేశపెట్టి పయనీర్ కంపెనీతో అగ్రిమెంటై విత్తనాలను ఇచ్చారు. కాటన్‌లో బిటిని డెల్టా ఆండ్ పైన్‌లాండ్ (డిపిఎల్) కంపెనీకి ఇచ్చారు. చట్టాలను కంపెనీల లాభాలకు అనుకూలంగా ఉపయోగించడం, బెదిరించడం ప్రారంభించారు. సొంత విత్తనాలను వాడుకున్న రైతుల వివరాలను కంపెనీకి అందించడానికి డిటెక్టివ్‌లను ఏర్పాటు చేశారు. టోల్‌ఫ్రీ టెలిఫోన్ నెంబర్ సర్వీస్ ఏర్పాటు చేశారు. దయల్ 1-800 రౌండ్ ఆఫ్‌కి ఫోన్ చేసి వివరాలిచ్చిన వారికి ప్రోత్సాహకాలను ఇచ్చారు. ఫోన్ చేసిన వారి పేర్లను గోప్యంగా ఉంచుతామన్నారు.

1997లో విపరీతంగా ప్రకటనలిచ్చి రైతులను హడలగొట్టారు. రేడియోలో, టివిలలో విడవకుండా చెప్పారు. ముఖ్యమైన ప్రకటన: ఆ జీన్ మోన్‌శాంటో కంపెనీ ఆస్తి. ఆ విత్తనాలను తిరిగి నాటుకోరాదు. తన పంటలోని విత్తనాలను శుద్ధి చేసుకొని తిరిగి వాడుకొనం అని

అగ్రిమెంట్ కాంట్రాక్టుపై సంతకం పెట్టి కొనుక్కోవాలి. ఆ నిబంధనలను అతిక్రమించిన పక్షంలో పెనాల్టీ విత్తన ధర కన్నా 120 రెట్లు అధికంగా ఉంటుంది అని ప్రచారం చేశారు. కోర్టులలో రైతులపై కేసులు వేశారు. రైతులు కోర్టుల చుట్టూ తిరిగారు. కంపెనీ కోర్టు ఖర్చులు కూడా రైతులే భరించాలన్నారు. మూడు సంవత్సరాల వ్యవసాయ రికార్డులను తనిఖీ చేసే హక్కు మోన్‌శాంటో కంపెనీకి ఉందన్నారు. రైతులు భయపడి కోర్టు వెలుపల సెటిల్‌మెంట్‌లు రాజీలు చేసుకుని బుద్ధిగా కంపెనీల వద్ద విత్తనాలు కొనుక్కుంటున్నారు. ఇలా చేయడానికి అమెరికాలో పదిహేను సంవత్సరాలు పట్టింది. మన దేశంలో మూడు సంవత్సరాలు టైమ్ ఇవ్వకుండా రైతులపై దాడికి పూనుకున్నారు. ప్రభుత్వం, పోలీసులు మోన్‌శాంటో కంపెనీకి వత్తాసుగా నిలబడి రైతుల విత్తనం తయారు చేసుకొనే హక్కుపై దాడి చేస్తున్నాయి.

1979లో జాన్ డాయల్, ఫౌలర్ లాంటి వారు విత్తనాలు, జీన్స్ ద్వారా వ్యవసాయంపై కార్పొరేట్ కంపెనీల ఆధిపత్యాన్ని ప్రశ్నించారు. విత్తన రంగంలో మోన్‌శాంటో లాంటి కంపెనీల ప్రవేశంతో మానవాళికి జరగబోయే విపత్తును ముందే ఊహించి అమెరికన్ ప్రజలకు తెలిపారు. విత్తనం ఆధిపత్యంతో ప్రపంచ ప్రజల ఆహార లభ్యతకు, సామాన్య ప్రజల జీవనానికి తీవ్ర ప్రమాదం జరగబోతోందని హెచ్చరించారు. ఈ రోజున సహజ వనరు భూమి లేక ఆయిల్ కాదు. అసలైన సహజ వనరు జన్యువు (డిఎన్ఎ) అని అన్నారు. దీర్ఘకాలంలో జీన్స్ టెక్నాలజీకి ఎవరు సొంతదారులో వారిదే ఆర్థిక పెత్తనం అని నిర్ద్వందంగా చెప్పారు.

అమెరికన్ ప్రజలు, మోన్‌శాంటో లాంటి కంపెనీలు వీరి మాటలు లెక్కచేయలేదు. ఐటి నుండి బిటి కి అన్నారు. మైక్రోసాఫ్ట్ కంపెనీ కంప్యూటర్‌లను తయారు చేయదు. కంప్యూటర్ వాడే విండోస్ ఆపరేటింగ్ సిస్టమ్ లేకుండా కంప్యూటర్‌లు ఎలా పనిచేయవో మోన్‌శాంటో జీన్స్ లేకుండా విత్తన కంపెనీలు మనజాలని పరిస్థితిని పేటెంట్ చట్టాలతో కల్పించారు. ఫ్రీ సాఫ్ట్‌వేర్ ఉద్యమం ఊపందుకుంటున్నట్లుగానే, విత్తనాలను తయారు చేసుకునే హక్కును రైతులు వదులుకోకుండా ఉద్యమించాలి.

ప్రకృతిలో అనేక పదార్థాలున్నట్లుగానే జీవ పదార్థాలున్నాయి. అనేక వేల జీన్స్ ఉన్న విత్తనంలోకి ఒక జీన్‌ని జీన్ గన్ ద్వారానో, బార్ పద్ధతి ద్వారానో ప్రవేశపెట్టి మొత్తంగా ఆ విత్తనంపై హక్కులు ఉన్నాయంటు న్నారు. ఈ విధానాల గురించి, బయోటెక్నాలజీ గురించి ప్రశ్నించితే ఆరు నెలలు జైలుకెళ్లాల్సి వస్తుందనే బిల్లుని భారత ప్రభుత్వం తేబోతున్నది. ప్రపంచాధిపతి అమెరికాకు సార్వభౌమ దేశమైన భారత ప్రభుత్వం ఇవ్వబోతున్న కానుక చాలా విచిత్రంగానూ, దుర్మార్గంగానూ ఉన్నది. నాలెడ్జి ఇనీషియేటివ్ పేరున భారతీయ వ్యవసాయరంగంలో గుత్తాధిపత్యం కోసం, రైతులను తమ చెప్పు చేతులలో ఉంచుకోవడం కోసం అమెరికన్ ప్రభుత్వం పన్నుతున్న భయానక కుట్రను గమనించాలి.

వ్యవసాయానికి భూమి తరువాత రసాయనిక ఎరువులు, పురుగు మందులు, విత్తనాలు ప్రధాన పెట్టుబడి. వీటిలో రైతులు తయారు చేసుకోవడానికి అవకాశం ఉన్నది ఒక్కటే. అది విత్తనాలు తయారు చేసుకోవడమే. విత్తనాలను తయారు చేసి కంపెనీలకు సప్లయ్ చేయడమే మీ పని, అమ్ముకోవడానికి మీకు హక్కు లేదు అని అంటున్నారు.

మామిళ్లపల్లి, ఎర్రబాలెంల బీర, కాకుమాను గోరుచిక్కుడు, పెదవడ్లపూడి కరివేపాకు విత్తనాలకు ప్రమాదం ముంచుకొచ్చింది. ఆ విత్తనాలు తయారు చేసే రైతుల హక్కులను హరించడానికి కంపెనీలు పూనుకుంటున్నాయి. రైతుకున్న ఆ హక్కుని నిలబెట్టాలి. ప్రోత్సహించాలి. మేధోసంపత్తి పేరున భూప్రపంచంపై ఉన్న సర్వ సంపదపై, విత్తనాలపై, చెట్లపై, జంతువులపై, మానవులపై సర్వ హక్కులను భుక్తం చేసుకోవడమే బహుళజాతి కంపెనీల అంతిమ లక్ష్యం. ప్రపంచంలో చమురు నిల్వలపై పట్టు సంపాదించినట్లుగానే జన్యువుల పరిశోధన ఆధారంగా జీవ ప్రపంచంపై, వ్యవసాయంపై అధికారం కోసం అమెరికా ప్రయత్నిస్తున్నది.

మన దేశంలో బిటి ప్రవేశపెట్టగానే మోన్‌శాంటో కంపెనీతో కలిసి పనిచేసి, మిలాఖత్ అయి రాయల్టీని రైతులచే కట్టించడానికి దేశీయ విత్తన కంపెనీలు వరుసలో నిలబడ్డాయి. అమెరికా, చైనాలలో చెల్లించే రాయల్టీల కన్నా ఎక్కువ వసూలు చేస్తున్నా దేశీయ కంపెనీలు ప్రతిఘటించలేకపోవడం వెనుక రహస్యం తెలిసిందే. పరిశోధన ద్వారా బిటి జన్యువును ప్రవేశపెట్టడం సాధ్యమన్న భారత ప్రభుత్వ శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం కరువైంది. విత్తన ఉత్పత్తికి సహకరిస్తున్న రైతుల విత్తనాలను నకిలీలని వెంట బడుతున్నారు. అమెరికాలో కన్నా వీరోచితంగా కంపెనీల విత్తనాలను మాత్రమే కొనాలంటున్నారు. నూజివీడు సీడ్స్, మహికో లాంటి కంపెనీలు భారత రైతుల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాయి. వారు అమ్మే విత్తనాలు మినహా మిగతావన్నీ నకిలీ విత్తనాలు అంటున్నారు. నకిలీలు రావడానికి కారణం అధిక ధరలే కదా. రాయల్టీని ఎత్తివేసి, పేరెంట్ లైసెన్సుని రైతులకు సప్లయ్ చేస్తే, విత్తనాభివృద్ధి కార్యక్రమాన్ని తీవ్రంగా చేపట్టితే నకిలీలు ఎక్కడ నుండి వస్తాయి. నకిలీలంటే ఏమిటి?

1. ట్రూత్‌ఫుల్ లేబుల్ అంటించిన కంపెనీ విత్తనాలే అసలైనవి. మిగతావన్నీ నకిలీలే.

2. పేరున్న బ్రాండెడ్ విత్తనాల పేకింగ్‌ను అనుసరించడం నకిలీ.

3. హైబ్రిడ్ చేయకుండా జిన్నింగ్ చేసిన రెండవ తరం విత్తనాలను మొదటి తరం విత్తనాలుగా అమ్మడం నకిలీ.

విత్తనాలను మామూలు కవర్‌లలో అమ్ముకుంటున్న రైతుల విత్తనాలు కంపెనీ విత్తనాలు అని భ్రమించడానికి అవకాశమే లేదు. అవి రైతు విత్తనాలు అని కొనే రైతుకు కూడా తెలుసు. వీటిని నకిలీ విత్తనాలని రైతులను వెంటపడి వేధిస్తున్నారు.

కంపెనీ విత్తనాలకు సర్టిఫికేషన్ ఎవరు చేస్తున్నారు? సెల్ఫ్ సర్టిఫికేషన్ విశ్వసనీయత ఎంత? వంచన, మోసం, దొంగతనం, లంచాలివ్వడం, లాబీలను నడపడం, వాస్తవ సైన్స్ పరిశోధనలను దాచడం లాంటి నీతి బాహ్యమైన పద్ధతుల ద్వారా లాభాలను గడిస్తున్న మోన్‌శాంటో చరిత్రను అందరూ తెలుసుకోవాలి.

రైతులు విత్తనాలు తయారు చేసుకునే హక్కును పరిరక్షించుకోవాలి. మోన్‌శాంటో లాంటి కంపెనీల గుత్తాధిపత్యాన్ని ఎదిరించాలి. విత్తనాలపై రాయల్టీని రద్దు చేయాలి. సీడ్ విలేజెస్‌ను ప్రోత్సహించాలి.

*(రచయిత నల్లమడ రైతు సంఘం)*

# 'అభివృద్ధి నిరోధకుల' అభివృద్ధి కార్యక్రమాలు

*దండకారణ్య ఆదివాసులు విప్లవోద్యమంలో భాగమై ప్రకృతినీ, ఖనిజ వనరులనూ, తమని తామూ కాపాడుకోవడమే కాకుండా, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను ఎలా నిర్మించుకుంటున్నారో వివరిస్తున్నారు* **సోను**

ఈనాడు దండకారణ్యం రెండు రకాలుగా దేశ ప్రజల చర్చల్లో కేంద్రంగా ఉంది.

ఒకటి, దండకారణ్యంలో ముప్పై రెండు సంవత్సరాలుగా విప్లవోద్యమం కొనసాగుతూ అపారమైన అక్కడి ప్రకృతి సంపదలు దేశ దళారీ బూర్జువాలు, విదేశీ సామ్రాజ్యవాద శక్తులు కొల్లగొట్టుక పోకుండా 'అడవుల పై ఆదివాసులకే సర్వాధికారాలు' స్ఫూర్తితో దేశ భవిష్యత్తు కోసం వాటిని కాపాడుతున్న ప్రాంతంగా గుర్తింపులోకి వచ్చింది.

రెండు, 'జనతన సర్కార్లకే సర్వాధికారాలు' లక్ష్యంతో దండకారణ్యం లో ఒక నూతన ప్రత్యామ్నాయ రాజకీయ, ఆర్థిక వ్యవస్థ ఆవిర్భవిస్తోందనీ ప్రజలకు ఎరుకైంది.

పై రెండు విషయాలూ దండకారణ్యంలో మూడు దశాబ్దాలకు ముందే ప్రారంభమై పెంపొందుతున్న ప్రజా యుద్ధంలో నుంచే పుట్టుకొచ్చినవని ప్రత్యేకంగా గుర్తించాల్సిన అవసరం ఉంది. ఎక్కడైతే పోరాటం ఉంటుందో అక్కడే ప్రజల అస్తిత్వం, ఆత్మగౌరవం, ప్రకృతి వనరులు, ప్రజల హక్కులు, సంపదలు రక్షించబడుతాయనీ నిర్ద్వంద్వంగా దండకారణ్యం చాటుతోంది. ఆ పోరాటానికి ఒక సైన్యం కావాలనీ, ఆ సైన్యం యుద్ధం చేయాలనీ, ఆ యుద్ధం విప్లవ (ప్రజా) యుద్ధం కావడం ద్వారానే సరైన లక్ష్య సాధన దిశలో పురోగమిస్తుందనీ అది చేపట్టిన సిద్ధాంతం వెలుగులో తన కార్యాచరణ కొనసాగుతూ సంపద్వం తమవుతుందనీ దండకారణ్యం పదే పదే గుర్తు చేస్తోంది.

దండకారణ్యంలోని అపార, అమూల్య ప్రాకృతిక సంపదలను దోపిడీ పెట్టుబడి తరలించుకపోకుండా ప్రజా యుద్ధం అడ్డుకుంటున్నది. ఈ యుద్ధంలో ఇప్పటికే దాదాపు రెండు వేలకుపైగా ప్రజలు, విప్లవకారులు తమ అమూల్యమైన ప్రాణాలను పణంగా పెట్టారు. గత పదేళ్లుగా ఈ యుద్ధం చాలా తీవ్రమవుతోంది. పన్నెండు సంవత్సరాల క్రితం వెనుకటి మధ్యప్రదేశ్ నుంచి ఈనాటి చత్తీస్‌గఢ్ విడిపోయి ప్రత్యేక రాష్ట్రంగా ఉనికిలోకి వచ్చింది. రెండు కోట్ల ముప్పై లక్షల జనాభాతో ఏర్పడిన ఈ చిన్న రాష్ట్రంలో మూడవ వంతు ప్రజలు ఆదివాసులు. ఇక్కడి విశాల అడవుల్లో జీవిస్తున్నారు. సిరులు గల అడవుల్లో పేదరికం పాలై జీవిస్తున్న ఆదివాసులు తమకంటూ బస్తర్ ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుకుంటూనే ప్రత్యేక చత్తీస్‌గఢ్ రాష్ట్ర ఏర్పాటును ఆహ్వానించారు. అదే సమయంలో దోపిడీ పాలకవర్గాలు చిన్న రాష్ట్రాన్ని తమ జేబు సంస్థగా మార్చుకొని చిత్తం వచ్చినట్లు ప్రజల ఆస్తులను ప్రపంచ బజార్లో కారుచౌకగా అమ్మకానికి పెట్టి అవగాహన ఒప్పందాలు కుదుర్చుకోవడాన్ని సమరశీల పోరాటా లతో ప్రతిఘటిస్తున్నారు. ఆత్మగౌరవం, స్వావలంబన, ప్రజాస్వామ్యం కోసం పోరాడుతున్నారు. వీళ్ల యుద్ధాన్ని అంతం చేయడానికి దోపిడీ పాలకవర్గాలు సామ్రాజ్యవాదుల దన్నుతో వేల సంఖ్యలో పోలీసు, పారా మిలిటరీ బలగాలను దింపి విధ్వంసకరమైన సైనిక దాడులకు తలపడుతున్నాయి. వర్తమాన సైనిక దాడులకు 'గ్రీన్‌హంట్ ఆపరేషన్' అనే పేరు పెట్టుకున్నారు. ఇది 2009 జూలై నుంచి సాగుతూ గత ముప్పై మూడు మాసాల్లో మూడవ దశలోకి ప్రవేశించినట్లుగా ఆపరేషన్ సూత్రధారులు ప్రకటిస్తున్నారు. దీని మొత్తం కాల వ్యవధి ఏడేళ్లుగా నిర్ణయించుకొని ప్రారంభించారు. దీనిని ఎదుర్కొంటున్నందుకు భారత అంతరంగిక భద్రతకే అత్యంత ప్రమాదకర వామపక్ష ఉగ్రవాదంగా విప్లవోద్యమం పాలకవర్గాల ఎజెండా పైకి వచ్చింది. విప్లవ కార్యక్రమాలన్నీ అభివృద్ధి నిరోధకంగానే ఆ పాలకవర్గాలు సహజంగానే ప్రచారం చేస్తున్నాయి. ఆ వర్గాల వృద్ధి కోసం కావాలి గనులు, ఖనిజాలు, అడవులు, జల వనరులు. వాటి తరలింపుకు వేసే రోడ్లు, రైల్వే లైన్లు అభివృద్ధి కార్యక్రమాలంటున్నారు. వీళ్ల పరిశ్రమల స్థాపనకు, నిర్వహణకు కావాలి అడవులు, విశాల భూఖండాలు, జల వనరులు. వాటి వినియోగానికి 'మౌలిక సదుపాయాల' రూపకల్పన చేస్తున్నారు. దాన్ని అభివృద్ధిగా నమ్మమంటున్నారు. అవి కాదంటే మావోవాదం, ఉగ్రవాదం, అభివృద్ధి నిరోధకం, ప్రమాదకరం అంటూ ప్రచారం చేస్తున్నారు. ప్రజా యుద్ధం వీటన్నింటినీ ఎదుర్కొంటూండడం ద్వారానే అన్ని వనరులూ ఈ దేశం కోసం, ఈ ప్రజల కోసం, భూస్వామ్య-దళారీ పెట్టుబడిదారుల నుంచీ, సామ్రాజ్యవాదుల నుంచీ రక్షించబడుతున్నాయి. అభివృద్ధికి ప్రభుత్వం ఇస్తున్న నిర్వచనం అర్థమవుతే తప్ప ప్రత్యామ్నాయ అభివృద్ధి గురించి అవగతం కాదు.

దండకారణ్య ఆదివాసీ ప్రజలు ప్రజా యుద్ధం ద్వారా వనరులను కాపాడుకుంటూనే ప్రజల నిజమైన అభివృద్ధికి - మౌలిక సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. వాళ్ల కృషిలో వ్యవసాయమే ప్రధానమైనది. భారతదేశం వ్యవసాయ ప్రధాన దేశం అని గుర్తిస్తేనే (త్రికరణశుద్ధిగా) వ్యవసాయరంగం పునాదిగా వ్యవస్థ అభివృద్ధి దారులు నిర్మాణమవుతాయి.

దండకారణ్య ప్రజల వ్యవసాయంలో మౌలికమైన మార్పులు తేవాల్సిన అవసరం ఉందని విప్లవోద్యమం గుర్తించింది. దండకారణ్య ఆదివాసీ ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయమే. ప్రధానమైన పంట వరి. వరి సాగును అభివృద్ధి చేయడంలో భాగంగా భూమి చదను చేయడం, మళ్ల నిర్మాణం, సాగునీటి వ్యవస్థను కల్పించడం, మెరుగైన స్థానిక విత్తనాలను ప్రోత్సహించడం, నాట్లు వేయడం, కలుపు తీయడం, అవసరమైన సేంద్రీయ రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందులను వాడడం ద్వారా భూసారాన్ని పరిరక్షించడం లాంటి చర్యలన్నీ చేపట్టాలనీ స్థానిక జనతన సర్కార్లు (ప్రజలు ఎన్నుకుంటున్న రాజ్యాధికార సంస్థలు) భావిస్తున్నాయి. ప్రస్తుతం అమలులో ఉన్న వ్యవసాయ సాగు పద్ధతులలో మౌలికమైన మార్పు తీసుకరావడానికి వాటినన్నింటినీ ప్రవేశ

పెట్టాల్సిన అవసరం ఎంతగానో ఉంది. దీనికి ముందు ఆదివాసీ ప్రజల జీవితాలు, వారి వ్యవసాయ పద్ధతులు లోతుగా అర్థం కావాలి.

దండకారణ్య రైతాంగం తమ సాగుకు అవసరమైన భూములను విప్లవోద్యమం ద్వారా సంపాదించుకోగలిగారు. ఆ భూములలో ప్రాథమికమైన వ్యవసాయసాగు పద్ధతులను ఉపయోగిస్తూ పంటలు పండిస్తున్నారు. దీనితో సగటు దిగుబడి ఎకరానికి 3-5 క్వింటాళ్లు మించడం లేదు. రైతాంగానికి సాగుభూములు లభ్యం కావడంతో వాళ్ల ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో చెప్పుకోతగిన సకారత్మక మార్పులున్నమాట నిజమే. కానీ శ్రమకు తగిన ఫలితం, పెరుగుతున్న అవసరాలు తీర్చుకోగలగడం లాంటి పలు కోణాల్లో ఆలోచిస్తే నేటి దిగుబడిని పెంచుకోవలసిన అవసరం గంభీరంగా ఉంది. ప్రజాయుద్ధం అవసరాల కోణంలో కూడా ఆలోచించి ప్రజాసైన్యాన్ని (వర్తమాన పిఎల్‌జిఎ) తప్పనిసరి ఉత్పత్తిలో భాగం చేయడం ద్వారా పెద్ద ఎత్తున శ్రమశక్తి వినియోగంలోకి వచ్చి దిగుబడి పెరుగుదల ప్రక్రియలో తోడ్పడుతోంది. ఇవన్నీ ఒక ఎత్తుకాగా, సాగు పద్ధతులను, అందులోని మెళకువలను, అధిక దిగుబడి ప్రాముఖ్యతను వృత్తిపరంగా, రాజకీయంగా అర్థం చేసుకొని విప్లవ పట్టుదలతో అమలు చేయడానికి పరిణతి చెందిన అనుభవజ్ఞుల అవసరం దండకారణ్య విప్లవోద్యమం ముందు సీరియస్‌గా ఉంది. విప్లవోద్యమ ప్రాముఖ్యతనూ, దాని అవసరాలనూ గుర్తించిన వాళ్లలో నుంచే ఇలాంటి శక్తులు రావాలి.

సగటు ఉత్పాదకత పెంచే లక్ష్యంలో భాగంగా గత రెండేళ్లుగా వ్యవసాయ రంగంలో ప్రజాకాంపెయిన్‌ల నిర్వహణ ముందుకొచ్చి మంచి ఫలితాలనే ఇస్తోంది. ఇప్పటివరకు ప్రధానంగా అధ్యయన, నిర్మాణ, ప్రచార, సైనిక రంగాలలోనే కాంపెయిన్‌ల నిర్వహణ అనుభవాన్ని గడించిన విప్లవోద్యమం ఈ రెండేళ్లుగా దీనిని వ్యవసాయరంగానికి కూడా విస్తరించి లక్షిత ఫలితాలు సాధించడంలో మంచి ప్రగతి సాధిస్తోంది. 2011లో మొదటిసారిగా 'భూమి చదును - మళ్లీ నిర్మాణం' లక్ష్యంతో మూడు వారాల ప్రజా కెంపెయన్ నిర్వహించారు. (2011 ఏప్రిల్, జూలై వీక్షణం సంచికలలో వివరమైన రిపోర్టులు వచ్చాయి.) ఆ మొదటి కాంపెయిన్ అనుభవాలను సమీక్షించుకున్న తర్వాత జనతన సర్కార్ జోన్ సన్నాహక కమిటీ తిరిగి రెండవ కాంపెయిన్ నిర్వహణకు 2011 నవంబర్‌లో పిలుపునిచ్చింది. మొదటి కాంపెయిన్ సందర్భంగా ఎంచుకున్న లక్ష్యిత కార్యక్రమాలు అసంపూర్ణంగా మిగిలిన చోట రెండవ కాంపెయిన్‌లో వాటిని పూర్తి చేస్తూనే నూతన టార్గెట్‌లను ఎన్నుకోవల్సిందిగా సన్నాహక కమిటీ కోరింది. ఈసారి కాంపెయిన్‌ను నలభై రోజులు కొనసాగించాల్సిందిగా కమిటీ పిలుపునిస్తూ నూతన సంవత్సర ఆరంభం జనవరి 1 నుంచీ భూంకాల్ దినం (ప్రజా రాజ్యాధికార స్థాపనా దినం) - ఫిబ్రవరి 10 వరకు సమయావధిని నిర్ణయించింది. 2011లో సాగిన మూడువారాల కాంపెయిన్‌లో ఐదు లక్షలకు మించిన పని దినాల నిమిత్తం ఖర్చు చేసిన 65 లక్షల రూపాయల బడ్జెట్‌ను 2012లో నడవాల్సిన నలభై రోజుల కాంపెయిన్‌ను దృష్టిలో పెట్టుకొని కోటిన్నర రూపాయలకు పెంచింది. ఇందుకు అవసరమైన నిధుల సమీకరణకు విప్లవాభిమానులకు విజ్ఞప్తి చేసింది.

ప్రజా కాంపెయిన్‌ను నలభై రోజులకు పొడిగించడం వెనుక గల ప్రధాన కారణాలను ఇక్కడ చెప్పుకోవడం కూడా చాలా అవసరమే. 'ఆవశ్యకతను అర్థం చేసుకోవడమూ, ఆవశ్యకతను మార్చడమే స్వేచ్ఛ' అనే అవగాహన నుంచి ప్రజాపంథా భావించిన కారణాలిలా ఉన్నాయి. 2011 వర్షాకాలం ఎటమటం కావడంతో కొన్నిచోట్ల పంటలు పూర్తిగా దెబ్బతిన్నాయి. జనతన సర్కార్లు పని చేస్తున్న కొన్ని ప్రాంతాల్లో రైతాంగం దుక్కులు దున్నకుండా బీళ్లుగా తమ భూములను వదిలేసిన ప్రాంతం గణనీయంగానే ఉంది. తమ వర్షాభావ పరిస్థితులతో సతమతమవుతున్న రైతాంగాన్ని ఆర్థికంగా ఆదుకోవడానికి జనతన సర్కార్లు ఈసారి ప్రత్యేకించి నలభై రోజుల కాంపెయిన్‌ను చేపట్టాయి. కరువుతో నకనకలాడే రైతాంగం పొరుగున ఉన్న ఆంధ్రప్రదేశ్ సహా దూర, దూర ప్రాంతాలకు వలస వెళ్లడాన్ని తగ్గించడంలో భాగంగా కాంపెయిన్‌ను ఐదు వారాలకు పొడిగించడంతో పాటు జనవరి ఒకటి నుంచీ ఫిబ్రవరి పది వరకు పనులు నడిపించాలని భావించారు. ఇలా చేయడం ద్వారా రైతాంగం అధిక దినాలు తమ గ్రామాల్లో, తమ పనుల్లో ఉండడమే గాకుండా శత్రువు తీవ్రం చేయ తలపెట్టిన గ్రీన్‌హంట్ దాడుల కాంపెయిన్‌ను ప్రతిఘటిస్తూనే 'భూమి చదను - మళ్లీ నిర్మాణం' కాంపెయిన్‌ను జయప్రదం చేయాల్సి ఉంటుందన్న రాజకీయ అవగాహనను కూడా యుద్ధమే జీవితమైన ఆదివాసీ రైతాంగానికి జనతన సర్కార్లు అందించాయి. మావోయిస్టు పార్టీ నాయకత్వంలోని కార్మిక - కర్షక సంయుక్త ప్రజాస్వామ్య నియంతృత్వ రాజ్యపు రాజ్యాధికారం ప్రాదుర్భావ దశలోనే ఉన్నప్పటికీ అది ఆ వర్గాల చేతిలోని అత్యంత శక్తిమంతమైన వర్గపోరాట సాధనం. దాని నాయకత్వం లేకుండా సంఘటిత మానవ శక్తిని ప్రజాహిత రాజకీయ చైతన్యంతో వినియోగించడం సాధ్యమే గాదని జనతన సర్కార్ల అనుభవం స్పష్టం చేస్తోంది. దోపిడీ ప్రభుత్వాలు కొనసాగిస్తున్న గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల వైనం గురించి ఒక ఉదాహరణగా ఇక్కడ చెప్పుకోడం సందర్భోచితంగా ఉంటుంది.

దండకారణ్యంగా విప్లవోద్యమం పేర్కొంటున్న ప్రాంతాలలో కొండగాం జిల్లా ఒకటి. ఇది 2012కు ముందు బస్తర్ జిల్లాలోనే భాగంగా ఉండింది. కానీ చత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ 2012లో నూతనంగా ప్రకటించిన తొమ్మిది జిల్లాల్లో కొండగాం ఒక కొత్త జిల్లాగా 12 బ్లాకులతో (మండలాలు) ఏర్పడింది. ఈ 12 బ్లాకులలో 2010-11లో తీవ్ర కరువు పీడిత రైతాంగానికి మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి పథకం (మన్‌రేగా) కింద కేవలం పదకొండు రోజుల పనులే దొరికాయి. ఈ 12 బ్లాకులలో 2,29,115 కుటుంబాలు రిజిస్టర్ చేసుకున్నవి ఉన్నవి. కుటుంబానికి ముగ్గురు పనిచేసే సగటు లెక్కన 6,87,645 మందికి పనులు దొరకాలి. కానీ వీరిలో 1,17,740 కుటుంబాలకు చెందిన 3,53,220 మందికి మాత్రమే ఆ పదకొండు రోజుల పనులు దొరికాయి. నిజానికి ఆ పథకం కింద ఏడాదిలో వంద రోజులు పని కల్పించాలి. కానీ కొండగాం సహా దండకారణ్యంలోని ఏ జిల్లాలో కూడా మన్‌రేగా కింద పని చేయడానికి తమ పేర్లు రిజిష్టర్ చేయించుకున్న రైతాంగానికి వంద రోజుల పని దినాలు దొరకనే లేదు. పదకొండు రోజులు పని చేసిన కూలీలకు రు. 1342 దొరికాయి. ఇదీ మన్‌రేగా తీరంటూ దినపత్రికలే వెక్కిరిస్తున్నాయి. ఇక వీళ్లు చేసిన పనుల వివరాల్లోకి వెళితే కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు వివరించే అభివృద్ధి కార్యక్రమాల్లో భాగంగా ఇక్కడ వనరుల తరలింపుకు రోడ్లు పోయడం అన్న విషయాన్ని గుర్తు పెట్టుకుంటే ప్రత్యామ్నాయ రాజ్యాధికార వ్యవస్థ దృష్టికోణం, పనితీరు సులువుగానే బోధపడుతుంది. రెండు వ్యవస్థల మధ్య ఉన్న మౌలికమైన తేడా కూడా అర్థమవుతుంది.

సమాజంలో శ్రమ చేయగలిగే శక్తులన్నింటినీ కాంపెయిన్‌లో భాగం చేయాలన్న స్ఫూర్తితోనే పనులు చేపట్టారు. దండకారణ్యంలోని జనతన సర్కార్లు పనుల ప్రారంభానికి నెల రోజుల ముందే ఏరియాల వారీగా (15-20 స్థానిక సర్కార్లున్న ప్రాంతం) వర్క్‌షాపులు నిర్వహించాయి. ఈ వర్క్‌షాపులకు జనతన సర్కార్ల స్టాండింగ్ కమిటీ సభ్యులు (సర్కార్ అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, ఆర్థిక, రక్షణ, ప్రజా సంబంధాల శాఖల బాధ్యులు) హాజరైనారు. వీళ్లు గత సంవత్సరపు సమీక్షలను మరోసారి చర్చించి నూతన టార్గెట్‌లను ఎన్నుకున్నారు. ఇందులో ప్రధానంగా పేద రైతాంగం, ఉద్యమంలో అసువులు బాసిన అమరవీరుల పేద కుటుంబాలు, ఉద్యమంపై కొనసాగుతున్న సైనిక దాడులకు గురై జైలు పాలైన పేద కుటుంబాలు, ప్రజా సైన్యంలో చేరిన పేద గెరిల్లాల కుటుంబాలతో పాటు శ్రమచేసే శక్తులు లేని అనాథ కుటుంబాలకు చెందిన భూములలో పని చేయడం తమ ప్రాధమ్యాలుగా నిర్ణయించారు. ఈ వర్క్‌షాపులలోనే కాంపెయిన్ దినాలకు సరిపడా తిండి దినుసులు, శ్రమ పరికరాలు, విద్యాబోధన, వైద్య సహాయం, సాంస్కృతిక కార్యక్రమాలు ప్లాన్ చేసుకున్నారు. ఆయా ప్రాంతాలలో ఎక్కడికక్కడే స్థానికంగా జరిగే సంత రోజులను సెలవు దినాలుగా ప్రకటించుకున్నారు. జోన్ జనతన సర్కార్ నుంచి వచ్చిన స్వల్ప నిధులతో పాటు స్థానిక జనతన సర్కార్లు తమ వద్దనున్న నిధులలో నుంచి కొంత మొత్తాన్ని కేటాయించడంతో పాటు ప్రజలు సమకూర్చగలిగే సరుకులు (బియ్యం, కూరగాయలు మొదలైనవి) కూడా అంచనా వేసుకొన్నారు. వర్క్‌షాపులు ముగిశాక జనతన సర్కార్లు తాము రూపొందించిన మొత్తం కార్యక్రమాల వివరాలను ప్రజల్లో చర్చకు పెట్టి వారి ఆమోదం తీసుకున్నాయి. పనులు జరిగే రోజుల్లో తీసుకోవలసిన రక్షణ చర్యలు ప్రత్యేకంగానే చర్చించి అవసరమైన నిర్ణయాలు తీసుకున్నారు.

పార్టీకి చెందిన అన్ని స్థాయిల్లోని కమిటీ సభ్యులు, సాధారణ పార్టీ కార్యకర్తలు, పిఎల్‌జిఎ గెరిల్లాలు ఎవరు, ఎక్కడ, ఎన్ని రోజులు ప్రజా కాంపెయిన్‌లో పాల్గొనాలో నిర్ణయించుకొని తమ నిర్మాణ, సైనిక, రాజకీయ కర్తవ్యాలతో పాటుగా భూమి చదను - మళ్లీ నిర్మాణ కాంపెయిన్‌లో పాల్గొని తమ వంతు పనులు పూర్తిచేశారు.

డిసెంబర్ నాటికి సన్నాహాలన్నీ పూర్తి చేసుకున్న విప్లవ జనతన సర్కార్లు జనవరి మొదటివారంలో దండకారణ్య వ్యాప్తంగా ప్రజా కాంపెయిన్‌ను ప్రారంభించాయి. ఇక్కడ నిర్దిష్టంగా ఒక ఏరియాలో జరిగిన పనుల వివరాలు ఇలా ఉన్నాయి. ఈ ఏరియాలో పదకొండు గ్రామ విప్లవ జనతన సర్కార్లున్నాయి. ఈ అన్ని సర్కార్లలోని ప్రజలు భూమి చదను - మళ్లీ నిర్మాణ కాంపెయిన్‌లో పాల్గొన్నారు. చాలా సర్కార్లలో 25-35 రోజులు ప్రజలు పనిలో పాల్గొన్నారు. సంత రోజులు పోనూ ముందే నిర్ణయమైన వ్యక్తిగత, సామాజిక కార్యక్రమాలు (పెళ్లిళ్లు, పండగలు తదితర కార్యక్రమాలు) ఉన్న రోజుల్లో ప్రజలు పనిలో పాల్గొనలేకపోయిన ఫలితంగా నలభై రోజుల పని ఎక్కడా జరగలేదు. పదకొండు గ్రామ విప్లవ జనతన సర్కార్‌లలో నుంచి ఒక సర్కార్ పరిధిలో జరిగిన కాంపెయిన్ వివరాలు ఇలా ఉన్నాయి:

ఒక విప్లవ జనతన సర్కార్ పరిధిలో మూడు గ్రామాలున్నాయి. ఇక్కడ రెండు వందల కుటుంబాలు వెయ్యికి పైగా జన సంఖ్య ఉంది. ఈ సర్కార్‌లో పద్దెనిమిది రోజులు మాత్రమే ప్రజలు పనిలో పాల్గొన్నారు. మొత్తం రోజులలో పనిలో పాల్గొన్న పురుషులు - 1771 (18×94), మహిళలు - 1633 (18×90), అమ్మాయిలు - 291 (18×16), మగపిల్లలు - 230 (18×13) కలిపితే మొత్తం పని దినాలు 4,148 ఉన్నాయి. సామూహిక వంట విధులలో రోజూ 14 మందితో కూడిన బ్యాచ్ పద్దెనిమిది రోజులు పాల్గొని రోజూ రెండు పూటలు భోజనాలు తయారు చేసేది. పైన పేర్కొన్న 4,148 పని దినాలలో వంట బ్యాచ్ పని దినాలు 252 కూడా కలిశాయి. వీరు కాకుండా రోజూ పదకొండు మందితో పని పరిసరాల్లో ప్రజా మిలీషియా కార్యకర్తలు సెంట్రీ చేశారు. వీరు పై లెక్కల్లో రాలేదు.

మరొక విప్లవ జనతన సర్కార్ నాయకత్వంలో పేద ప్రజలకు చెందిన పదమూడు కుటుంబాల వారి పద్దెనిమిది ఎకరాల భూమి చదను చేసి అరవై రెండు మళ్లు నిర్మించారు. ప్రజా విముక్తి గెరిల్లా సైన్యంలో చేరిన నిరుపేద గెరిల్లాల మూడు కుటుంబాలకు చెందిన నాలుగు ఎకరాలు, ఒక అమరవీరుడి కుటుంబానికి చెందిన ఎకరం భూమిని చదను చేసి మళ్లు నిర్మించారు. ఈ సర్కార్ పరిధిలో భూమి చదను, మళ్ల నిర్మాణంతో పాటుగా మూడు కుంటలు, రెండు చెక్‌డ్యాంలు నిర్మించారు. పనిలో పాల్గొన్న ప్రజలకు అవసరమైన శ్రమపరికరాలలో కొన్ని విప్లవ జనతన సర్కార్ సమకూర్చగా చాలావరకు ప్రజలు తమ ఇండ్ల నుంచే తెచ్చుకొని పనిలో పాల్గొన్నారు. గునపాలు, పారలు, పికాసలు, బుట్టలు, మట్టి మోసుకెళ్లడానికి మారీలు ప్రజలు సమకూర్చుకున్న వాటిలో ఉన్నాయి. పని పరిసరాల్లో రక్షణ బాధ్యతల్లో ఉన్న వారు ప్రధానంగా సంప్రదాయక ఆయుధాలతో పగలూ-రాత్రీ తమ విధులు నిర్వర్తించారు. 4,148 పని దినాలకు స్థానిక విప్లవ జనతన సర్కార్ ఏడువేల రూపాయలు ఖర్చు చేయగా పై నుంచి రు. 55,000 నిధి సమకూరింది. జనతన సర్కార్ సమకూర్చిన ఏడువేల రూపాయలకు తోడుగా ప్రజలు ఉప్పు, మిరపకాయలు, చింతపండు, బియ్యం, నూనె చందాల రూపంలో సేకరించుకున్నారు. పని దినాలలో జబ్బు పడిన 247 మంది వ్యాధిగ్రస్తులకు జనతన సర్కార్ వైద్య విభాగం వారు ఐదు వేల రూపాయల మందులు ఇచ్చి వారికి వైద్యం చేసి నయం చేశారు.

ఒక విప్లవ జనతన సర్కార్ పద్దెనిమిది రోజులే పనిచేసిన వివరాలు పై విధంగా ఉండగా, మొత్తం ఏరియాలో 81 ఆదివాసీ గ్రామాలలో (11 ఆర్‌పిసిల పరిధిలోని గ్రామాలు) 168 పేద కుటుంబాలకు చెందిన 168 ఎకరాల భూమిలో భూమి చదను, మళ్ల నిర్మాణ పనులు జరిగాయి. వీరిలో అమరవీరుల కుటుంబాలు 14, గెరిల్లాల కుటుంబాలు 33, జైలు పాలైన వారి కుటుంబాలు రెండు ఉన్నాయి. ఈ ఏరియాలో మొత్తం పనిలో పాల్గొన్న పురుషుల పని దినాలు 54,024, మహిళల పనిదినాలు 38,606, ఆడపిల్లల పనిదినాలు 4,948గా, మగపిల్లల పనిదినాలు 4,947గా నమోదయ్యాయి. పనులు జరిగినన్ని రోజులు చేతనా నాట్యమంచ్ కళాకారుల బృందాలు సాంస్కృతిక ప్రదర్శనలు ఇచ్చాయి. ఈ సందర్భంగా 127 పాటలు, 6 నాటికలు ప్రదర్శించ బడినాయి. భూమి చదను, మళ్ల నిర్మాణంతో పాటుగా ఈ ఏరియాలో 35 చెక్‌డ్యాంలు, 19 కుంటలు పోసుకున్నారు. ఐదు కాలువలు నిర్మించుకున్నారు.

ఇక్కడ వివరించిన ఏరియాలో గత సంవత్సరం చేపట్టిన మూడు వారాల ప్రజా కాంపెయిన్‌లో ప్రజలు 3-18 రోజులు పనులలో పాల్గొన్నారు. వీరి పనిదినాలు 4,609గా నమోదయ్యాయి. కాగా ఈ సంవత్సరం ప్రజా కాంపెయిన్‌లో ఈ ప్రాంతం ప్రజలు పాల్గొన్న పనిదినాలు 1,02,525గా ఉన్నాయి. అంటే గత సంవత్సరం కన్నా ఈ సంవత్సరం ప్రజలు దాదాపు 22 రెట్లు అధికంగా పాల్గొన్నారు. (ఈ సంవత్సరం పనిలో ఎక్కువ రోజులు పాల్గొన్నారు. ఈ సంవత్సరం 33 రోజులు పనిలో పాల్గొన్నారు.)

2011లో సిపిఎంఎం కార్యకర్తలు, జనతన సర్కార్ విద్యా, సంస్కృతి-ప్రచార విభాగం వారు 'నారు పోయండి - నాట్లు వేయండి' కార్యక్రమాన్ని నినాద రూపంగా మలచుకొని పెద్ద ఎత్తున ప్రజల్లోకి తీసుకెళ్లారు. ఫలితంగా జనతన సర్కార్లు గత పదిహేను సంవత్సరాల కాలంలో నిర్మించిన చెరువుల కింద 345 కుటుంబాలు సకాలంలో ముప్పై క్వింటాళ్ల వరి నారు పోసుకొని నాట్లు వేసుకున్నారు. ఈ కుటుంబాలు వరిలో కలుపు కూడా పెట్టుకున్నారు. దీంతో వీరికి 32 టన్నుల ధాన్యం పండింది. ఇక్కడి ఆదివాసులు హెక్టార్‌కు ఒక క్వింటాలు ధాన్యం విత్తుతారు. కానీ ప్రయోగాత్మకంగా నారు పోసుకొని నాట్లు వేసుకోవడంతో 30 క్వింటాళ్ల నారు పోసుకొని 45-50 ఎకరాల్లో నాట్లు వేసుకోవడంతో తీవ్ర వర్షాభావం ఎదురైనప్పటికీ పంట చేతికొచ్చి దిగుబడి పెరగడంతో రైతాంగం ఉత్సాహంగా ఉన్నారు. ఈ రైతులు పంట భూమిలో సేంద్రియ ఎరువులు కానీ మరే ఇతర రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందులు వాడలేదు.

సగటున 33 రోజులు ప్రజా కాంపెయిన్‌లో పాల్గొన్న ఆదివాసీ రైతాంగం ఒకరోజు సమిష్టిగా ఎద్దు, కోళ్లు, మేకలు, పంది మాంసంతో 'విందు' చేసుకున్నారు. ఈ ఖర్చు ప్రభుత్వాలే భరించాయి. జనతన సర్కార్లు ఇచ్చిన పిలుపుతో రెండవ విడత 'భూమి చదను - మళ్ల నిర్మాణం' ప్రజా కాంపెయిన్‌లో పాల్గొన్న రైతాంగం ఫిబ్రవరి 8,9 తేదీలలో పని సమీక్ష తమ గ్రామసభలలో జరుపుకొని ఫిబ్రవరి 10 భూంకాల్ దినం (ప్రజా ప్రభుత్వాల నిర్మాణ దినం) నాడు జరుపుకున్న బహిరంగ సభలో యావత్తు ప్రజల ముందు జనతన సర్కార్ల అధ్యక్షులు ఆ సమీక్షను పెట్టి వారి ఆమోదం తీసుకున్నారు.

ఫిబ్రవరి 10 తర్వాత ఒక ఏరియాలోకి కొంతమంది రైతులు తమ భూముల్లో సంప్రదాయబద్ధంగా 'పొత్తుంకామ్' (సమిష్టిపని) తీసుకున్నారు. ఏ రైతు తన భూమిలో గ్రామస్తులతో పని చేయించుకుంటాడో ఆ రైతు పనికి వచ్చిన గ్రామస్తులకు సాయంకాలం ఎద్దు మాంసం ఇస్తాడు. కొంతమంది మేక, పంది మాంసం ఇచ్చే సంప్రదాయం కూడా ఉంది. బర్రె మాంసం ఇచ్చిన రైతు గ్రామస్తులతో రెండు రోజులు పని తీసుకుంటాడు. కొన్ని ప్రాంతాల్లో ఇప్పటికీ భోజనం కూడా పెట్టే సంప్రదాయం ఉంది. పొత్తుం పని కింద ఈ ఏరియాలో 20 ఎద్దు, 33 మేకలు, 6 పందులు, 3 దున్నపోతుల మాంసంతో రైతాంగం వ్యక్తిగతంగా తమ భూముల్లో కట్టలు పోసుకున్నారు. ఈ మాంసం తినని వాళ్లకు 91 కోళ్లు, 18 బాతుల మాంసం ఇచ్చారు. వీటన్నింటి విలువ స్థానిక జనతన సర్కార్లు నిర్ణయించిన ధరలలో ఒక లక్షా 98 వేల 510 రూపాయలుగా లెక్కించారు.

2011, 2012 సంవత్సరాలలో 'దేశ అంతర్గత భద్రతకు అత్యంత ప్రమాదకరమైన అభివృద్ధి నిరోధకమైన శక్తులు' చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాల వివరాలు పైన తెల్పిన విధంగా ఉన్నాయి. ఈ శక్తులే రానున్న సంవత్సరాలలో 'సాగునీటి వ్యవస్థ రూపకల్పన ప్రజా కాంపెయిన్' చేపట్టాలని ఆలోచిస్తున్నాయి. సాగునీటి వ్యవస్థ రూపకల్పనలో భాగంగా జనతన సర్కార్లు బోర్ల తవ్వకాన్ని నిరుత్సాహపరుస్తూ చెరువులు, కుంటల నిర్మాణానికి ప్రాధాన్యతను ఇవ్వాలనే ప్రచారాన్ని చెపట్టేయి. జనతన సర్కార్లు చేపట్టిన ప్రజా అభివృద్ధి కార్యక్రమాలు పూర్తిగా విజయవంతం గావాలని ఆశిద్దాం. జనతన సర్కార్లు చేస్తున్న విజ్ఞప్తిని దృష్టిలో పెట్టుకొని వాళ్లు చేపట్టిన స్వావలంబన ఆర్థిక వ్యవస్థ నిర్మాణంలో దేశభక్త, ప్రజాస్వామ్య శక్తులు, విద్యార్థి - ఉద్యోగులు, అన్ని సెక్షన్ల ప్రజానీకం తమ శక్తి కొద్ది ఆర్థికంగా, హార్దికంగా సహాయం చేసి ఆదుకుంటారని ఆశిస్తున్నాను.

2007 అక్టోబర్‌లో హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో (తాను చదువుకున్న దిక్కదే) దేశీయ వ్యవహారాల మంత్రి చిదంబరం ఇచ్చిన ఒక ఉపన్యాసంలో మన దేశ 'స్వాతంత్ర్యం' అనంతరపు మూడు దశాబ్దాలను 'నష్టపోయిన దశాబ్దాలుగా' పేర్కొన్నారు. 2011 అక్టోబర్‌లో విశ్వభారతీ వాళ్లు నిర్వహించిన సర్దార్ పటేల్ స్మారకోపన్యాసంలో జైరాం రమేశ్ మాట్లాడుతూ ఏకంగా అరవై ఏళ్లుగా ఆదివాసీలను అన్ని ప్రభుత్వాలూ నిర్లక్ష్యం చేశాయన్నారు. ఇప్పుడు వాళ్ల ఉద్ధారణ కోసం పోలీసు, అర్ధ సైనిక బలగాల అణచివేతల చర్యలతో పాటుగా తాను చేపట్టిన గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను జోడించడం ద్వారానే మావోయిస్టుల సమస్యను నిర్మూలించవచ్చని అన్నారు. ఈ మధ్య 'మోర్ మైన్స్ - మోర్ మావోయిజం' అని వ్యాఖ్యానించిన గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు తన స్మారకోపన్యాసంలో ఈ విషయం స్పష్టం చేశారు. ఈయన తన అభివృద్ధి కార్యక్రమాల మీద అనేక ప్రయోగాలు చేస్తున్నారు. గత ఎన్నికల (2011)లో మహారాష్ట్రలోని గడ్‌చిరోలి జిల్లా లేఖామేండా గ్రామంలో వెదురు అమ్మకాలను గ్రామస్తులతో (ఊరి పెద్దలు) ప్రారంభింపచేసి దేశంలోనే మొట్టమొదటి ప్రయోగం అన్నాడు. 2012 ఏప్రిల్‌లో లేఖామేండా వార్షికోత్సవాలు జరుపుతూ, ఆ ప్రయోగాన్ని యావత్తు దేశ ఆదివాసీలకు వర్తింపజేస్తానన్నారు. కానీ ఆ జైరాం రమేశ్, లేఖామేండా ఊరిపెద్దలు ఆరు మాసాలు తిరగకముందే గ్రామ ప్రజల తీర్పుతో దేహశుద్ధికి గురయ్యారన్న వాస్తవాన్ని వార్షికోత్సవాల సందర్భంగా మాటవరుసకైనా ఎత్తుకోక పోవడం అంటే అది తన ప్రయోగ విస్తరణకు విఘాతమనే భావించి ఉంటాడు. ఈయన గారు ఈ మధ్య మరో కొత్త ప్రయోగాన్ని ముందుకు తెచ్చాడు. 2010 నవంబర్‌లో కేంద్రం నక్సల్ ప్రభావిత ప్రాంతాల - ఆనాడు అరవై జిల్లాలన్నారు - అభివృద్ధి కోసం 'సమగ్ర అభివృద్ధి పథకం'లో భాగంగా దాదాపు రు. 1300 కోట్లు కేటాయించారు. ఆ నిధులకు ఎప్పటికప్పుడూ మరిన్ని కోట్లు కలుపుతూ నిధులు పెంచుతూ వస్తున్నారు.

ఆ నిధులన్నీ ఉండగానే తన అభివృద్ధి రథం వేగం మరింత వేగం అందుకోవడానికి కొత్త ప్రయోగం 'భారత రూరల్ లైవ్‌లీఉడ్ ఫౌండేషన్' (బిఆర్ఎల్ఎఫ్)ను దేశంలోని 170 ఆదివాసీ జిల్లాల కోసం (ఈయన లెక్కల ప్రకారం వీటిలో ఇప్పుడు 78 మావోయిస్టుల ప్రాంతాలయ్యాయి.) ముందుకు తెచ్చారు. మావోయిస్టులను అంతమొందించడానికి బహుళజాతి కార్పొరేషన్ల సాయం పొందాలనీ, కనీసం వంద కోట్ల రూపయాలు సేకరించాలనీ ముందుగా కార్పస్ ఫండ్‌గా రు.200 కోట్లు కేంద్రం కేటాయించింది. ఇప్పటికే దండకారణ్యంలో ప్రత్యేకంగా మాడ్ లాంటి ప్రాంతంలో పిపిపి (పబ్లిక్ ప్రైవేట్ పార్టనర్‌షిప్) పథకాలతో చత్తీస్‌గడ్ ప్రభుత్వం వైద్య సేవలను ప్రైవేట్ పరం చేసేసింది. ఇక రమేశ్‌గారి కల నిజమైతే 'అభివృద్ధి నిరోధకుల' అభివృద్ధి కార్యక్రమాలకు నారుమడి సిద్ధమవుతుందని ఆశిద్దాం. వారి అభివృద్ధి కార్యక్రమాలు వేగవంతం కావడానికి మీ వంతు కృషి మీరు చేస్తారనీ విప్లవ ప్రజల నుంచి ఆశిస్తున్నాం.

(నోట్ : 2011 భూమి చదును - మళ్ల నిర్మాణం పనులలో చాలా చురుగ్గా పాల్గొని నాకు మొత్తం రిపోర్టు చెప్పి 2011 ఆగస్ట్ 21 నాడు గడ్‌చిరోలీ జిల్లాలోని చార్‌గాం ప్రాంతంలో మాకుడ్‌చువ్వ దగ్గర సి-60, సిఆర్‌పిఎఫ్ బలగాలతో హోరాహోరిగా పోరాడి మహిళా లోకానికే వన్నె తెచ్చి అమరురాలైన చార్‌గాం ఏరియా జనతన సర్కార్ అధ్యక్షురాలు కా. రణీతతో నాకున్న రెండు దశాబ్దాల కామ్రేడ్లీ స్మృతులలో...)

*(రచయిత మావోయిస్టు ఉద్యమ కార్యకర్త)*

# జీవవైవిధ్యపు కాణాచి మధ్యభారతం

***దేశానికే గుండెకాయ వంటి మధ్య భారత ప్రకృతి వైవిధ్యాన్ని, వనరుల్ని, ప్రజల్ని కాపాడుకోకపోతే, విధ్వంసకర మైనింగ్‌ను ఆపకపోతే సామాన్యులే మూల్యం చెల్లించుకోవాల్సి ఉంటుందని అంటున్నారు* లోక సంచారి**

మొదట మీకు ఒక ఆశ్చర్యకరమైన వాస్తవం చెపుతాను. యూరప్ ఖండంపై ఎగిరే విమానాలు వదిలే పొగ కాలుష్యం వల్ల భారత దేశంలో దాదాపు సంవత్సరానికి మూడు వేలకు పైగా భారతీయులు చనిపోతున్నారని స్వయంగా యూరప్ ఖండ దేశాలు ఏర్పరచుకున్న యూరోపియన్ యూనియన్ తన రిపోర్ట్‌లో బహిర్గత పరిచింది. ఈ వార్త ఒక ప్రముఖ భారత ఆంగ్ల దినపత్రికలో ఎక్కడో ఒక మూల చిన్న వార్తగా ప్రచురింపబడింది. (భారతీయుల ప్రాణాలకు విలువ లేదని భోపాల్ గ్యాస్ తర్వాత మరోసారి నిరూపిస్తున్నారు. అదే యూరప్ దేశాల్లోనైతే ఏటా అన్ని వేల మంది చావుకు కారణమవుతున్న ఆ విమానయాన సంస్థల నుండి ఆ దేశ ప్రజలు లేదా హక్కుల సంస్థలు వేలాది కోట్ల రూపాయల నష్టపరిహారం వసూలు చేస్తారు.) ఇక విషయానికి వస్తే, భారతదేశానికి కొన్ని వేల మైళ్ల దూరంలో ఉన్న యూరప్ ఖండంపై ఎగిరే విమానాలు వదిలే పొగ కాలుష్యం వల్ల భారతదేశంలో ఏటా అన్ని వేల మంది భారతీయులు ఎందుకు చనిపోతున్నారు? యూరప్ ఖండంపై వీచే గాలులు ప్రకృతి సిద్ధంగా కొన్ని వేల కిలోమీటర్లు ప్రయాణిస్తూ భారతదేశం వరకు కూడా వీస్తున్నాయి. అలా ప్రయాణిస్తున్న క్రమంలో కొన్నివేల అడుగుల ఎత్తున ఎగురుతున్న విమానాలు వదిలే పొగ కాలుష్యాన్ని కూడా తమ వెంట తెస్తున్నాయి.

ఈ భూమండలంపై ఒక మూలనున్న ప్రాంతంలో జరిగే కాలుష్యం, వినాశనం వల్ల కొన్ని వేల మైళ్ల దూరంలో ఇంకో మూలనున్న ప్రాంత ప్రజలు కూడా దాని దుష్పరిణామాల్ని ఎదుర్కోక తప్పదనేది ఈ వాస్తవం మనకు నేర్పే గుణపాఠం. దూరంతో నిమిత్తం లేకుండా ప్రకృతిపరంగా సుదూర ప్రాంతాలు ఒకదానితో ఒకటి ఎలా ముడిపడి ఉన్నాయో ఈ వాస్తవం ద్వారా మనకు అర్థమవుతుంది.

నిజానికి, ఇలాంటి ఆశ్చర్యకరమైన వాస్తవాలు కొన్ని లక్షల కొలదిగా ఉన్నాయి. మనుషుల్లో కొందరు 'అభివృద్ధి', 'నాగరికత'ల పేరు మీద ప్రకృతికీ, జీవజాతికీ, చివరికి మానవజాతికీ కూడా చేస్తున్న వినాశనాన్ని ఇప్పటికైనా అర్థం చేసుకోవాలి. మన తర్వాత తరాలను ఈ 'శ్మశాన అభివృద్ధి', 'పిప్పి నాగరికత'ల నుండి కాపాడాలనుకుంటే, ఇలాంటి లక్షలాది ఆశ్చర్యకర వాస్తవాలు మనం తెలుసుకోవాలి. వేల మైళ్ల దూరంలో జరిగే వినాశనం మనదేశ ప్రజల చావుకు కారణం అవుతుంటే, అంతకంటే కొన్ని లక్షల రెట్టింపు స్థాయి వినాశనం ఏకంగా మనదేశ నడిబొడ్డులోనే జరుగుతోంది అని తెలిస్తే మరింత ఆశ్చర్యం, బాధ కలుగుతుంది.

ఈ వినాశనం వలన భవిష్యత్‌లో భారతదేశంలోని అత్యధిక ప్రాంతాల్లో నదులు పూర్తిగా ఎండిపోయి, భూభాగం ఎడారిగా మారిపోతుంది. భూమిలో నీటిమట్టం ప్రమాదకర స్థాయిలోకి పడిపోయే ప్రమాదం ఉంది. అయినప్పటికీ, ఈ వినాశనం ఎందుకు చేపిస్తున్నారు, దాని వెనుక ఎవరున్నారు అనే విషయాలు తెలుసుకుందాం.

మీ జీవితంలో మీరు ఎన్ని కిలోమీటర్ల ట్రాఫిక్ జామ్ చూశారు? హైదరాబాద్ లాంటి సిటీల్లో ఏడు, ఎనిమిది కిలోమీటర్ల ట్రాఫిక్ జామ్ గురించి విన్నాం. అమెరికా లాంటి దేశాల్లో ఓ యాభై మైళ్ల ట్రాఫిక్ జామ్ గురించి విన్నాం. కాని భారతదేశంలో ఓ మారుమూల అటవీ ప్రాంతంలో ప్రతిరోజూ మూడు వందల కిలోమీటర్ల ట్రాఫిక్ జామ్ ఉంటుందనే వాస్తవం మీకు తెలిస్తే ఆశ్చర్యం కలగకమానదు. ఆ ప్రాంతంలో పనిచేసే ఓ మిత్రుడు నాకు చెప్పినప్పుడు నేను ఆశ్చర్య పోయాను. భారతదేశంలోని ఓ మారుమూల అటవీ ప్రాంతంలో అక్షరాల మూడు వందల కిలోమీటర్ల పై బడి, అది కూడా ప్రతిరోజూ ట్రాఫిక్ జామ్ ఎందుకు ఉంటుందో తెలుసుకుంటే, మీ గుండెకు సప్లయ్ అయ్యే ఆక్సిజన్ కూడా జామ్ అవుతుంది.

దండకారణ్యం పరిధిలోకి వచ్చే ఒడిశా రాష్ట్రంలోని కేవలం ఒక్క జిల్లాలో లక్షలాది ఎకరాల అడవిని నరికేసి, పర్వత శ్రేణుల్ని పిప్పి చేస్తున్నారు. మైనింగ్ చేస్తూ, ఆ భూమి నుండి రకరకాల ఖనిజాలను వెలికితీస్తున్నారు. వాటిని ప్రతిరోజూ కొన్ని వేల కొలది లారీల్లోకి నింపి, అక్కడి నుండి నౌకాశ్రయాలకు తరలించి, ప్రధానంగా విదేశాలకు తరలిస్తున్నారు. ఆ ఖనిజాలను తీసుకువెళ్తున్న లారీలు ప్రతిరోజూ కొన్ని వేల సంఖ్యలో ఉంటాయి కాబట్టి మూడు వందల కిలోమీటర్ల మేర ట్రాఫిక్ జామ్ ఏర్పడుతుంది.

కేవలం ఒక్క జిల్లాలోని ఒక ప్రాంతంలోనే లక్షల సంవత్సరాల క్రితం ఏర్పడిన అడవిని నరికేస్తూ, ప్రకృతి సంపదను ఈ స్థాయిలో కొల్లగొడుతూ విదేశాలకు అమ్ముకొని వేల కోట్లు సంపాదిస్తుంటే, ఎన్నెన్నో రాష్ట్రాలకు విస్తరించిన మొత్తం దండకారణ్యపు అటవీ ప్రాంతంలో పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు.

అడివే కదా పోతే పోయిందిలే అని అనుకుంటున్నారా? అయితే, యూరప్ ఖండం విమానాల పొగ కాలుష్యపు దుష్పరిణామాల గురించి మీరు మళ్లీ చదవాలి.

భారతదేశంలో పర్యావరణ సమతుల్యత, నదుల ద్వారా నీటి లభ్యత, భూమిలో నీటి మట్టం, భూ ఆరోగ్య భవిష్యత్ మొత్తం దండకారణ్య అటవీ ప్రాంత ఆరోగ్యంపై ఆధారపడి ఉంది. బ్రెజిల్ దేశ పర్యావరణ సమతుల్యతకు అమెజాన్ అటవీ ప్రాంతం ఎలా గుండెకాయ లాంటిదో, అలా భారత దేశ పర్యావరణ సమతుల్యతకు దండకారణ్య అటవీ

ప్రాంతం కూడా గుండెకాయ లాంటిది. ఇది తప్ప మొత్తం భారతదేశంలో ఒకే దగ్గర కొన్ని లక్షల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం గల అటవీ ప్రాంతం ఎక్కడా లేదు. అలాంటి దండకారణ్యంలో ఉన్న కోటానుకోట్ల వృక్షజాతి పుణ్యమాని, ఆంధ్రప్రదేశ్‌తో సహా ఎన్నో రాష్ట్రాల్లో నీటి వనరులు మనకు లభ్యమవుతున్నాయి. దండకారణ్యంలో వృక్షాలు ఉండడం వలన కురుస్తున్న వర్షాల ద్వారా ఎన్నెన్నో పెద్ద నదులు అక్కడే పుట్టి మైదాన ప్రాంతాల గుండా సముద్రం వైపు ప్రవహిస్తున్నాయి. వృక్షాలు నరికివేయడం వలన వర్షపాతం దెబ్బతింటుంది. వర్షాలు పడినా వృక్షాలు లేక ఆ నీరు భూమిలోకి సరిగా ఇంకక నీటి మట్టం క్రమంగా తరిగిపోతుంది. వృక్షాలు లేక వర్షపు నీరు భూమిని కోస్తూ తనతోపాటు భూసారాన్ని కూడా తీసుకెళ్లి సారంలేని అనారోగ్యకర భూమిని ఆ ప్రాంతంలో మిగులుస్తుంది. ఈ సత్యాలు మనకు ప్రకృతి ఆయా ప్రాంతాల్లో గుణపాఠాలుగా నేర్పింది. ఆంధ్రప్రదేశ్‌నే తీసుకున్నా వృక్షాలు నరికివేయబడ్డ జిల్లాల్లో ఈ రోజు తీవ్ర వర్షాభావ పరిస్థితులు నెలకొన్నాయి. అనంతపురం జిల్లాలో ఏకంగా ఏడారి ఛాయలు కూడా మొదలయ్యాయి.

చుట్టూ మంచుకొండలు ఉన్నా, ఉండాల్సిన స్థాయిలో వృక్షాలు లేక అమెరికాతోపాటు స్విట్జర్లాండ్, యు.కె.లోని స్కాట్లాండ్ తదితర యూరప్ దేశాల్లో ఎండాకాలంలో కొన్ని రాష్ట్రాలను వారు తీవ్ర కరువు ప్రాంతాలుగా ప్రకటించి, నీరు వాడకంపై ఆంక్షలు విధిస్తున్నారు. మంచు కొండలతో నిండిన ఆ దేశాల పరిస్థితే అలా ఉంటే కేవలం రుతుపవనాలపై ఆధారపడే భారతదేశ పరిస్థితి ఎలా ఉండబోతుందో ఊహించుకోండి. సతత హరిత అరణ్యాలుగా పిలువబడే బ్రెజిల్ దేశంలోని అమెజాన్ అటవీ ప్రాంతాన్ని రకరకాల ఖనిజ వనరుల కోసం కాఫీ, అరటి తోటలు, సోయా, మొక్కజొన్న లాంటి పంటల కోసం కోట్లాది ఎకరాల అటవీ ప్రాంతాన్ని ప్రభుత్వం అండతో ఆక్రమించి, వృక్షాల్ని నరికివేసి, పర్వత శ్రేణుల్ని పిప్పిచేసి వేల కోట్ల డాలర్లను సంపాదించాయి బ్రెజిల్, పాశ్చాత్య దేశాల కార్పొరేట్ కంపెనీలు. కొన్ని దశాబ్దాలుగా అమెజాన్ అడవిని నాశనం చేసిన పర్యవసానంగా ఈరోజు బ్రెజిల్ దేశంలో తీవ్ర కరువు, వర్షాభావ పరిస్థితులు నెలకొన్నాయి. నదులు ఎండిపోయి, కలుషితం అయ్యాయి. ఈ మధ్యే అంతర్జాతీయ పర్యావరణ శాస్త్రవేత్తలు మరో విషయం బయటపెట్టారు. అమెజాన్ అడవిని నాశనం చేయడం వలన మొత్తం భూమండలంలో సుదూర ఖండాల్లో కూడా దాని దుష్పరిణామాలు బయట పడుతున్నాయనీ, గ్లోబల్ వార్మింగ్ కూడా పెరిగిందనీ చెప్పారు. నిజానికి, ఈ రోజు మనిషి స్వార్థం తారాస్థాయికి వెళ్లి దేశాలు, ఖండాలు అని సరిహద్దులు ఏర్పర్చుకున్నారు కాని, కోట్ల కొలది సంవత్సరాల క్రితం పరిణామ క్రమంలో భూమిపై ఇప్పుడున్న ప్రకృతి ఏర్పడినపుడు, అప్పుడు మనుషులు ఇంకా పుట్టలేదు. అప్పుడు మొత్తం భూమిపై ఉన్న ప్రకృతి అంతా ఒక గొలుసు లాంటి లింక్‌లో భాగంగా పరిణామం చెందుతూ ఈ స్థాయికి చేరింది. ఇప్పుడు మనుషుల్లో కొందరు స్వార్థపరులు ఈ లింక్ అర్థం అయినా కానట్టుగా నటిస్తూ, అధికారం తమ చేతుల్లో ఉంది కాబట్టి తమని ఎవరూ అడ్డుకోలేరనే పొగరుతో, ఎక్కడికక్కడ ప్రకృతిని సర్వనాశనం చేస్తూ మొత్తం మానవ జాతికే ముప్పు తెస్తున్నారు.

అటవీ ప్రాంతాల్లో ఉన్న ఖనిజ వనరులను తవ్వడం ద్వారానే దేశం 'అభివృద్ధి' చెందుతుందనే వాదనతో అడవులను ఎన్ని దేశాల్లో నాశనం చేసారో, అన్ని దేశాలు కూడా ఇప్పుడు తీవ్ర కరువు, వర్షాభావ పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నాయి. చివరికి, ఆ దేశాలు తిండి గింజలను కూడా ఇతర దేశాల నుండి కొనుక్కోవలసిన దుస్థితి ఏర్పడింది.

మరి ఈ నేపథ్యంలో దండకారణ్య అటవీ ప్రాంతంలో జరుగుతున్న ప్రకృతి వినాశనాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి? ఆంధ్రప్రదేశ్, ఒడిశా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్, పశ్చిమబెంగాల్ లాంటి అతిపెద్ద రాష్ట్రాలల్లో లక్షలాది చదరపు కిలోమీటర్ల పరిధిలో విస్తరించి ఉన్నది దండకారణ్యం.

ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణ ప్రాంతంలో ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాలు, సీమాంధ్ర ప్రాంతానికి చెందిన పశ్చిమ గోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం లాంటి అతి పెద్ద జిల్లాలు దండకారణ్య పరిధిలోకి వస్తాయి. మొత్తం దండకారణ్యంలో ఉండే ఆదివాసీలు, దాని అంచుల్లో ఉండే గ్రామాలు, పట్టణాల జనాభా కొన్ని కోట్లలోనే ఉంటుంది.

ఇంత విస్తారమైన దండకారణ్యం, కోట్లాది వృక్షాలకు, లక్షల కొలది పర్వతాలకు, లోయలు, వాగులు, నదులు, సరస్సులు, జీవరాసులకు నిలయం. మొత్తం భారతదేశంలో ఎక్కడా లేని జీవ వైవిధ్యం దండకారణ్యంలో ఉంది. భారతదేశంలోని సింహ భాగం భూమిలోని నీటి మట్టంకు ప్రధాన కారణం దండకారణ్యంలోని వృక్షాలు, పర్వత శ్రేణులు. దండకారణ్యంలోని కోట్లాది వృక్ష సంపద వలన అక్కడ విస్తారంగా వర్షాలు పడతాయి. ఆ వర్షపు నీరును పర్వతాలు, వృక్షాలు భూమి లోపలి పొరల్లోకి పంపిస్తాయి. తద్వారా వందల కిలోమీటర్ల దూరంలో ఉన్న భూమి పొరల్లో కూడా నీటి మట్టం అందుబాటులో ఉంటుంది. ఖనిజ వనరుల కోసం అడవులను నరికేసి, పర్వతశ్రేణుల్ని పిప్పిచేసి మైనింగ్ చేయడం వలన ఆ ప్రాంతం నుండి వందల కిలోమీటర్ల పరిధి వరకు భూపొరల్లో నీటి మట్టం పూర్తిగా దెబ్బతిని భూమి క్రమంగా ఎడారివలె తయారవుతుంది. పర్వతశ్రేణులను పిప్పి చేయడం వలన భూమి బ్యాలెన్స్ దెబ్బతిని, దండకారణ్య ప్రాంతంలోనే కాకుండా వందల కిలోమీటర్ల సుదూర ప్రాంతాల్లో కూడా భూకంపాలు రావచ్చు. ఇక వృక్షాలు నరికివేతతో వర్షాలు పడక గోదావరి, ప్రాణహిత లాంటి దండకారణ్యం గుండా ప్రవహించే నదులు ఎండిపోతాయి. ఒకవేళ వర్షాలు పడినా, మైనింగ్ వ్యర్థాలు ఆ నదుల్లో కలిసి ప్రవహించడం వలన ఆ నీళ్లు దేనికీ పనికి రాకుండా పోతాయి. దండకారణ్య పరిధిలోని కొన్ని నదులు ఇప్పటికే కలుషితం అయ్యాయి.

దండకారణ్య అటవీ పరిధిలో పది, పదిహేను ఏళ్ల క్రితమే పెద్ద ఎత్తున మైనింగ్ మొదలు అయినా అది ఇంకా అంతటా విస్తరించలేదు. ఇంకా ఇరవై నుండి ముప్పై సంవత్సరాల లోపు మొత్తం దండకారణ్యాన్ని మైనింగ్‌తో పిప్పిచేసే లక్ష్యంతో మైనింగ్ వ్యాపారంలో ఉన్న బడా పారిశ్రామికవేత్తలు, రాజకీయ నాయకులు ఆలోచిస్తున్నట్టు అర్థం అవుతోంది.

ఇది కొంచెం అతిశయోక్తిగా అనిపించినా నిజం. ప్రపంచ ఖనిజ సంపద నిల్వలపై మనం అధ్యయనం చేస్తే మనకు విషయం స్పష్టంగా అర్థమవుతుంది. యూరప్‌లో ఖనిజ నిల్వలను రెండు వందల ఏళ్ల క్రితమే ఊడ్చుకుతిన్నారు. ఉత్తర అమెరికాలో ఖనిజ నిల్వలు చెప్పుకోదగ్గ

స్థాయిలో ఏమీ లేవు. దక్షిణ అమెరికా ఖండంలో ఖనిజ నిల్వలు దాదాపు చివరిస్థాయిలో ఉన్నాయి. ఒకప్పుడు చిట్టడవులతో చీకటిగా ఉండే చీకటి ఖండంగా పిలవబడిన ఆఫ్రికా ఖండాన్ని మూడు వందల ఏళ్లుగా పాశ్చాత్యులు కేవలం ఖనిజ వనరుల దోపిడీకే వాడుకొన్నారు. ఇప్పుడు వారికి కేవలం కరువు, కాటకాలు, ఎడారి, పేదరికం మిగిల్చిపోయారు. నిజానికి ఖనిజ వనరుల గురించి, అడవులను నాశనం చేసి చివరికి ప్రజలకు పర్యావరణపరంగా, సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఎంతో వినాశనాన్ని బహుమతిగా ఇచ్చారు. తాము మాత్రం ట్రిలియన్ల కొలది డాలర్లు సంపాదించుకొని వెళ్లారు. ఇది అర్థం చేసుకోవాలంటే, ఆఫ్రికా ఖండంలోని ఒక్కొక్క దేశ చరిత్ర చదువుతూ ఉంటే అర్థమవుతుంది. ఇక మిగిలింది ఆసియా ఖండం. దీంట్లో గల్ఫ్ దేశాల్లో ఆయిల్ తప్ప ఏమీ లేదు. అది కూడా ఇంకా ముప్పై నలభై ఏళ్లకు మించి రాదని శాస్త్రవేత్తలు 'పీక్ ఆయిల్ థియరీ' ద్వారా చెప్పారు. ఫార్ ఈస్ట్ దేశాలైన జపాన్, రెండు కొరియాలు, చైనా దేశాల్లో చెప్పుకోదగ్గ స్థాయిలో ఖనిజ నిల్వలు ఏమీ లేవు. మిగిలిన చిన్నా, చితక ఆసియా దేశాల్లో అదే స్థాయిలో ఖనిజ నిల్వలు ఉన్నాయి. ఇక భారతదేశానికి వస్తే, ప్రస్తుతం మొత్తం ప్రపంచంలోనే ఖనిజ నిల్వలకు అత్యంత హాట్‌స్పాట్‌గా భారతదేశం ఉంది. అందునా ప్రధానంగా దండకారణ్య ప్రాంతం ఉంది. ఒక అంచనా ప్రకారం కేవలం దండకారణ్యంలోనే తొమ్మిది వేల లక్షల కోట్ల రూపాయల విలువైన ఖనిజ సంపద అక్కడ ఉంది. ఒకవేళ అత్యంత అరుదైన ఖనిజాలు మైనింగ్ చేసే క్రమంలో లభిస్తే ఈ అంచనా ఊహకందని స్థాయికి పెరుగుతుంది. ఇండియాతో సహా అమెరికా, ఇజ్రాయిల్, యూరప్ దేశాల పెట్టుబడిదార్ల కన్నంతా ఇప్పుడు దండకారణ్యంలో ఉన్న ఖనిజ సంపదపై పడింది. దండకారణ్యాన్ని ఓ ముప్పై ఏళ్లలో ఎలాగైనా దండుకొని అక్కడ అరణ్యం అనేది ఒకప్పుడు ఉందనే ఆనవాళ్లు కూడా లేకుండా చేయాలని వారి లక్ష్యంగా పెట్టుకున్నారు. ఇది అర్థం కాని బ్రహ్మపదార్థం ఏమీ కాదు. అసలు ఈ మైనింగ్ వలన ఎవరు లాభపడుతున్నారు అనే విషయాన్ని చూద్దాం.

ఒడిశాలోని దండకారణ్య పరిధిలో మైనింగ్ సంస్థలో పనిచేసే నా మిత్రుణ్ని మీ సంస్థ మైనింగ్ చేసిన ఖనిజ వనరులను ఎక్కడ అమ్ముతుంది అని అడిగితే, మంచి నాణ్యతది చైనాకు, తక్కువ నాణ్యతది గల్ఫ్ దేశాలకు ఎగుమతి చేస్తున్నారు అని చెప్పాడు. గల్ఫ్ ఎడారి ప్రాంతం కాబట్టి ఆ ఇసుక దిబ్బల మీద పైప్ లైన్లు, భవంతులు కట్టలేరు కాబట్టి, ముందు పునాదులల్లో దండకారణ్యపు ఖనిజాల ఓర్‌తో దాన్ని ఫిల్లింగ్ చేస్తారట.

అంటే, వేరే దేశాలలో పునాదులలో పటుత్వం కోసం భారతదేశం పర్యావరణ సమతుల్యతకు గుండెకాయలాంటి దండకారణ్యాన్ని పిప్పి చేస్తున్నారు. అయితే, ఇది కేవలం ఒక్క ఖనిజం కోసం ఒక్క ప్రాంతంలో జరుగుతున్న వినాశనం. ఇలా ఎన్నో రకాల ఖనిజాల గురించి దండకారణ్యంలోని ఎన్నో ప్రాంతాల్లో మైనింగ్ జరుగుతోంది.

నిజానికి, పర్యావరణ సమతుల్యతలో భాగంగా కొన్ని లక్షల సంవత్సరాల పరిణామ క్రమంలో ఏర్పడిన అరణ్యాలు, పర్వత శ్రేణులు ఆ దేశ ప్రజలందరి సంపద. వాటిని సమస్త జీవజాతి క్షేమం కోసం అలానే ఉంచాలి. కాని, వాటిని అన్ని పార్టీలకు చెందిన పాలకులు తమ స్వార్థంకోసం మైనింగ్ కంపెనీలకు ధారాదత్తం చేసి, ఆ కంపెనీలలో బడా పారిశ్రామికవేత్తలతో పాటు తాము కూడా బినామీ భాగస్వాములుగా చేరి లక్షలాది కోట్ల రూపాయల లాభాల్ని ఆర్జిస్తున్నారు. ఆ దేశ ప్రజలందరికీ చెందాల్సిన అటవి సంపదను నాశనం చేస్తూ, లక్షల కోట్ల రూపాయలు వారు సంపాదిస్తున్నారు. ఈ ప్రకృతి వినాశనం వలన ఇప్పటికే జరుగుతున్న, భవిష్యత్‌లో జరగబోయే ఊహకందని స్థాయి వినాశనానికి మాత్రం దేశ ప్రజలందరూ బలి అయ్యేట్లు చేస్తున్నారు. ఇదెంత దుర్మార్గం. లక్షల కోట్ల రూపాయలు వాళ్లకి, కోట్ల కొలది సమస్యలు ప్రజలకా?

మీకు ఇంకో ఆశ్చర్యకరమైన విషయం చెపుతాను. భారతదేశంలోని అత్యంత ధనవంతులలో ఒకరైన ఓ బడా పారిశ్రామికవేత్త (అతనికి ఉన్న ఎన్నో వ్యాపారాలలో మైనింగ్ వ్యాపారం కూడా ఒకటి) ఇంటిలో సహాయకునిగా పనిచేసే ఓ వ్యక్తి నాకు పరిచయమయ్యాడు. బిలియనీర్ల జీవన విధానం ఎలా ఉంటుందో తెలుసుకోవాలనే ఆసక్తితో బిలియనీర్ అయిన తన యజమాని ఎలాంటి నీళ్లు తాగుతాడని ఆయన్ని అడిగాను. "అతను భారతదేశం నీళ్లు తాగడు. ప్రపంచం మొత్తంలో అసలు ఎలాంటి కాలుష్యానికీ గురికాని మంచినీళ్లు నార్వే దేశపు భూభాగంలో సుదూర మంచు కొండల్లో దొరుకుతాయి. ఆ నీరు లీటర్‌కు పదిహేను వేల రూపాయలు ఉంటుంది. వాళ్ల కుటుంబం అంతా కలిసి దాదాపు రోజుకు ఇరవై లీటర్ల వరకు తాగుతారు" అని చెప్పాడు. అంటే, వారి కుటుంబం కేవలం తాగునీరుకే రోజుకు మూడు లక్షల రూపాయలు ఖర్చు చేస్తుంది. అంతే కాకుండా వాళ్ల భవంతిలో బయటి నుండి వచ్చిన కాలుష్యపు గాలిని స్వచ్ఛంగా మార్చడానికి అతి పెద్ద యంత్రాలున్నాయనీ, కార్లను కడగడానికి, తోటలకు ఏ రకమైన కలుషితాలు లేని నీటిని తయారు చేయడానికి అతి పెద్ద నీటి శుద్ధి యంత్రాలున్నాయనీ, ఎలాంటి భూకంపాల్ని అయినా తట్టుకోగలిగే భవంతి ఉందనీ, ఆ భవంతి లోపల నాలుగు వేల కోట్ల రూపాయలకు పైగా ఖర్చు చేసి ఇంటీరియర్ డెకొరేషన్ చేయించుకొన్నారనీ, ఏదైనా అత్యవసర పరిస్థితి ఏర్పడితే వారి భవంతిపైన ఇరవై నాలుగు గంటలు హెలికాప్టర్ సిద్ధంగా ఉంటుందని, విదేశాలకు ఏ క్షణం పోవాలనిపిస్తే అప్పుడు వెళ్లడానికి విమానాశ్రయంలో ఇరవై నాలుగు గంటలు వారి స్వంత విమానం సిద్ధంగా ఉంటుందనీ, కేవలం షాపింగ్ చేసి రావడానికి తమ స్వంత విమానంలో వారి పిల్లలు అమెరికా, యూరప్ దేశాలు పోయి వస్తారనీ, ఇలాంటి ఎన్నెన్నో మెదడు దిమ్మ తిరిగే వాస్తవాలు చెప్పాడు. ఇంకా చాలా విషయాలు ఇక్కడ రాయలేనివి కూడా ఉన్నాయి.

అంటే ప్రజలందరికీ చెందాల్సిన సంపదను, వీరు అక్రమ, అనైతిక పద్ధతుల ద్వారా తమ పరం చేసుకొని, తద్వారా తాము లక్షల కోట్ల రూపాయలు సంపాదించి బిలియనీర్లు అవుతూ, గాలి, నీటి కాలుష్యాలకు అతీతంగా తాము అత్యంత విలాసంగా బతుకుతూ, ప్రజలను మాత్రం అన్ని రకాల కాలుష్యాలకు, రోగాలకు, అప్పులకు, పేదరికానికి గురి చేస్తూ, జరగబోయే అతి పెద్ద వినాశనాన్ని ప్రజలందరూ భరించేటట్టుగా చేయడం దారుణం. అత్యవసరంగా విదేశాలకు వెళ్లిపోవడానికి ఇరవై నాలుగు గంటలు హెలికాప్టర్లు, విమానాలు, విదేశాల్లో డబ్బులు సిద్ధంగా ఉన్నాయంటే, వారికి భవిష్యత్‌లో ఏమి జరగబోతుందో స్పష్టంగా తెలుసు. కాని తెలుసుకోవాల్సింది మనలాంటి సామాన్య ప్రజలే.

మరి శాస్త్రవేత్తలకు జరుగుతున్న, జరగబోయే వినాశనం గురించి తెలువదా? కొందరికి మాత్రం స్పష్టంగా తెలుసు. మరి, వారు ప్రజా

పక్షం వహించి ఎందుకు మాట్లాడడం లేదు? ఎందుకంటే, తమ ఉద్యోగ భద్రత గురించి, ఆ ఉద్యోగం ద్వారా లభిస్తున్న విలాస జీవితం గురించి. రెండవ కారణం, తమ తోటి శాస్త్రవేత్తలు తమను వెలి వేస్తారనే భయం. తమ తోటి శాస్త్రవేత్తల సహకారం, పియర్ రివ్యూ లేకుండా, శాస్త్రవేత్తగా ఉండడం చాలా కష్టం. ఇంకొందరు డబ్బుకు అమ్ముడుపోతున్నారు.

మరి ఈ వాస్తవాలు టివి ఛానెళ్లకు, పత్రికలకు తెలువయా? తెలిసినా, వారు ఈ వాస్తవాలను బయటకు చెప్పరు. ఎందుకంటే, కార్పొరేట్ కంపెనీల ప్రకటనలతోనే ప్రధానంగా మీడియా లాభాలు గడిస్తోంది. దాదాపు అన్ని కార్పొరేట్ కంపెనీలు ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని మైనింగ్ వలన లాభాలు గడిస్తున్నాయి.

మరి రాజకీయ పార్టీలు ఎందుకు ప్రజాపక్షం వహించడం లేదు? ఎందుకంటే, రాజకీయ పార్టీలకు మనలాంటి సామాన్య ఓటర్లు విరాళాలు ఇవ్వరు. ఒకవేళ, ఎవరో ఒకరు ఆ పార్టీపై అభిమానంతో ఇచ్చినా మహా అయితే యాభై లేదా వంద రూపాయలు విరాళంగా ఇస్తారు. అదే ఒకే ఒక బడా పారిశ్రామికవేత్త వివిధ పార్టీలకు వారి వారి బలాలను బట్టి, ప్రతి సంవత్సరం కోట్లల్లోనే ముట్ట చెపుతాడు. పైగా ప్రాంతీయ, జాతీయ రాజకీయ పార్టీలలోని ప్రముఖ రాజకీయవేత్తల్లో చాలా మందికి మైనింగ్ వ్యాపారంతో విడదీయలేని సంబంధాలున్నాయి. కాబట్టి తమ కన్నును తామే ఎందుకు పొడుచుకుంటారు? నిజానికి, బ్రిటిష్ వాడు భారతదేశ ప్రకృతిని నాశనం చేసిన దానితో పోలిస్తే, ఇప్పుడు జరుగుతున్న ప్రకృతి వినాశనం కొన్ని కోట్ల రెట్టింపు స్థాయిలో ఉంది. అయినా, శాస్త్రవేత్తలు, మీడియా, రాజకీయ పార్టీలు స్వచ్ఛంద సంస్థలు ఎవరి స్వార్థం కొరకు వారు అమ్ముడుపోయి, భవిష్యత్ తరాలకు ఎనలేని అన్యాయం తలపెడుతున్నాయి.

అంతగా అవసరమయితే, మైనింగ్ కంపెనీలు తమ 'కిరాయి' శాస్త్రవేత్తలతో, మేధావులతో మీడియాను వాడుకొని దండకారణ్యంలో మైనింగ్ వలన దండకారణ్య జీవ వైవిధ్యంకు ప్రమాదం లేదని, భారత పర్యావరణ సమతుల్యతకు కూడా ప్రమాదం లేదని చెప్పి ప్రజలను మభ్యపెట్ట చూస్తారు. గోదావరి, ప్రాణహిత లాంటి ఎన్నో నదులపై భారీ ప్రాజెక్టులు వేల కోట్ల రూపాయల ఖర్చుతో ప్లాన్ చేస్తున్నారు. కాని మైనింగ్ పేరుతో దండకారణ్యంలోని కోట్ల కొద్ది వృక్షాలను నరికి, లక్షలాది పర్వత శ్రేణులను పిప్పి చేసిన తర్వాత అక్కడ వర్షాలు ఎలా పడతాయి? దండకారణ్యం గుండా ప్రవహించే ఈ నదులలో నీళ్లు ఎలా నిల్వ ఉంటాయి? ఒకవేళ వర్షాలు కొంచెం పడినా, అవి మైనింగ్ వ్యర్థాలతో నిండిపోయి, తాగడానికీ, వ్యవసాయానికీ, దేనికీ పనికి రాకుండా ఉంటాయి. మరి హైదరాబాద్ లాంటి పట్టణాలకు, వేల గ్రామాలకు సాగు, తాగు నీరు ఈ ప్రాజెక్టుల నుండి ఇస్తామనే వాగ్దానం మాటేమిటి?

ఎవరికి తోచిన తీరుగ మనం, మన పిల్లలు, వారి పిల్లలు సుఖంగా ఉండాలని ఆస్తులు, బంగారాలు కూడబెడుతున్నాం. కాని భవిష్యత్తు ఎలా ఉండబోతోందంటే, ఎంత ఆస్తి, బంగారం ఉన్నా ఆ డబ్బు కేవలం స్వచ్ఛమైన నీటిని, గాలిని, తిండి గింజలను కొనడానికి కూడా సరిపోవు. అలాంటి సారం లేని పిప్పి నాగరికతను, శ్మశానం లాంటి అభివృద్ధిని వారికి ఆ స్థితితో పాటు బహుకరించినందుకు వారు తమ పైతరాల్ని అసహ్యించుకొని శాపనార్థాలు పెడతారు. మైనింగ్ వలన పర్యావరణ పరంగా వినాశనమే కాదు, సామాజికంగా, రాజకీయంగా కూడా తర్వాత తరాలు ఎంతో వినాశనాన్ని ఎదుర్కోబోతున్నాయి. మైనింగ్ డబ్బుతో ఇప్పటికే రాజకీయ హింస ఎంతో స్థాయిలో జరుగుతోంది. కార్పొరేట్ కంపెనీలు రాజకీయ నాయకుల్ని, అధికారుల్ని కొనేసి వేల కోట్ల రూపాయల టాక్స్‌లు ఎగవేస్తున్నాయి. పర్యావరణ కాలుష్యం చేయడం, రాజ్యాంగాన్ని, కార్మికుల, పౌరుల హక్కులను కాలరాచి వేయడం చేస్తున్నాయి. ప్రైవేట్ ఆర్మీలు స్థాపించి మైనింగ్‌ను ఎదుర్కొంటున్న ఆదివాసీలను ఊచకోత కోస్తున్నాయి. పోలీసు, పారా మిలిటరీ బలగాలతో అణచివేస్తున్నాయి.

దండకారణ్యాన్ని మైనింగ్‌తో నాశనం చేసిన తర్వాత అక్కడున్న కోట్లాది ఆదివాసీలు, ఇతర ప్రజలు జీవనోపాధి లేక, పట్టణాలల్లోకి వలస వస్తే, ఇప్పటికే ప్రెషర్ కుక్కర్‌లలా తయారైన పట్టణాలల్లో ఎన్నో రకాల సామాజిక సమస్యలు వస్తాయి.

భారతదేశంలోనే తమకంటూ ప్రత్యేక దేశాన్ని నిర్మించుకున్న బిలియనీర్లకు జరగబోయే అతిపెద్ద వినాశనం వల్ల వచ్చే నష్టమేమీ లేదు. ఎందుకంటే, వారు తినే తిండి, తాగే నీరు, పీల్చే గాలి అన్నీ వేరు. వారికి ఈ దేశంలోనే ప్రత్యేక నౌకాశ్రయాలు, విమానాశ్రయాలు, విమానాలు, హెలికాప్టర్‌లు ఉన్నాయి. జరగబోయే నష్టమంతా మామూలు ప్రజలే భరించాల్సి ఉంటుంది.

నిజంగా దేశంపై ప్రేమ ఉన్నవారు, కనీసం తమ తర్వాత తరాలపైనైనా ప్రేమ ఉన్న వారంతా, తక్షణమే మేల్కొని దండకారణ్య అటవీ ప్రాంతంలో జరుగుతున్న మైనింగ్‌ను అడ్డుకోవడానికి మరో స్వాతంత్ర్య సంగ్రామం స్థాయిలో దేశ వ్యాప్త ఉద్యమం మొదలు పెట్టాలి. దీని కొరకు గ్రామ, గ్రామాన, కాలేజీలల్లో, స్కూళ్లల్లో, దండకారణ్య జీవ వైవిధ్య పరిరక్షణ కమిటీలు నెలకొల్పి పెద్ద ఎత్తున ఉద్యమించాలి.

దండకారణ్య పరిధిలోని వివిధ రాష్ట్రాలలో జరుగుతున్న మైనింగ్ తక్షణమే ఆపాలని, అన్ని మైనింగ్ ఒప్పందాలను రద్దు చేయాలని, భారత దేశ పర్యావరణ సమతుల్యతకు గుండెకాయ అయిన దండకారణ్య ప్రాంతం అంతటా పర్మనెంట్‌గా మైనింగ్ నిషేధిస్తున్నట్టు పార్లమెంటర్‌లో బిల్లు పాస్ చేయాలని, మైనింగ్‌ను ఎదుర్కొంటున్న ఆదివాసీలను అణచడానికి దింపిన పోలీసులు, పారా మిలిటరీ బలగాలను వెనకకి తీసుకోవాలని డిమాండ్ చేస్తూ దేశవ్యాప్త ఉద్యమం చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. నిజానికి, ఇది ఇప్పటికిప్పుడు ఆదివాసీల అస్తిత్వ సమస్య అయినా, ఇది మొత్తం భారతదేశ పర్యావరణ సమతుల్యత దెబ్బ తీసేది కాబట్టి, ఇది మొత్తం భారత ప్రజల అస్తిత్వ సమస్య కూడా. ఇది తక్షణమే మేల్కొని ఉద్యమించాల్సిన తీవ్ర సమస్య. ఎందుకంటే ఇప్పుడు ఎలాంటి మైనింగ్ టెక్నాలజీ అందుబాటులో ఉందంటే, ఇంత పెద్ద దండకారణ్యాన్ని కేవలం ఇరవై ఏళ్ల లోపే ఒక క్రికెట్ మైదానంలా మార్చవచ్చు. ఈ రోజు ఈ వినాశనాన్ని ప్రశ్నించకపోతే, రేపు జరగాల్సిన నష్టమంతా జరిగిన తర్వాత నష్టపరిచిన వారిని ప్రశ్నించడానికి వెళితే, అక్కడ ఎవరూ ఉండరు. ఎందుకంటే, విదేశాలకు వెళ్లడానికి వారి విమానాలు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి. వారి భవిష్యత్తు పట్ల వారికి మంచి స్పష్టత ఉంది. ఇక తేల్చుకోవాల్సింది ప్రజలు తమ భవిష్యత్ ఏమిటని?

*(రచయిత అనేక దేశాల్లో పని చేసిన సామాజిక కార్యకర్త)* ✦

# జడ్జి ఊళ్లో వెట్టి చాకిరీ, సాంఘిక బహిష్కరణ

***రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి ఊళ్లోనే అమలవుతున్న అగ్రకుల, భూస్వామ్య అణచివేతను, అక్కడ చోటు చేసుకున్న సంఘటనల ఆధారంగా వివరిస్తున్నారు*** **చిమ్మె జాన్ బర్నబాస్**

ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి బాణా శేషశయన రెడ్డి స్వగ్రామం కర్నూలు జిల్లా బనగానపల్లి మండలం టంగుటూరు. ఆ గ్రామంలో దాదాపుగా 150 రెడ్డి కుల భూస్వామ్య కుటుంబాలు, 150 గొల్ల కుటుంబాలు, ఈడిగ (గాడ్), కురువ, బెస్త, వంద ముస్లిం కుటుంబాలు, నలభై రజకుల (చాకలివారు) కుటుంబాలు, మాల-మాదిగ కుటుంబాలు 120 జీవనం సాగిస్తున్నాయి. పొగాకు, పత్తి, మిరప లాంటి వాణిజ్య పంటలు పండే నల్లరేగడి భూమి కలిగిన గ్రామం. దాదాపు నలభై సంవత్సరాల క్రితమే జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ఉండడం చేత దాదాపుగా ఎక్కువమంది (అగ్రకులస్తులలో) విద్యావంతులు ఉన్న గ్రామం. బనగానపల్లె మండల కేంద్రానికి కేవలం పద్నాలుగు కిలోమీటర్ల దూరంలో మాత్రమే ఉండే గ్రామం.

8 ఏప్రిల్ 2012 (ఆదివారం) రోజున రజక (చాకలి) కుటుంబాల వారిని పంచాయితీకి పిలిపించి, అక్కడ గ్రామ నడిబొడ్డున ఉన్న చౌడేశ్వరీ దేవీ ఆలయం దగ్గర మేర (వార్షిక జీతం) పాత సంవత్సరంలో మాదిరి గానే అనగా సంవత్సరానికి రు. 1800 మాత్రమే ఉంటుందని అనగా అందుకు రజకులు బొగ్గుల రేట్లు, సబ్బుల రేట్లు, వాషింగ్ పౌడర్ రేటు పెరిగాయి కాబట్టి, ఇప్పుడున్న పరిస్థితుల రీత్యా సంవత్సరానికి రు. 4000 పెంచాలని విజ్ఞప్తి చేశారు. దాదాపు పది సంవత్సరాల నుంచి రు. 1800 మాత్రమే సంవత్సర కాలానికి చెల్లిస్తూ వస్తున్నారు. ఇంతవరకూ పెంచలేదు. అంతే కాకుండా, గత సంవత్సరం బకాయి, ఊరు మొత్తం మీద దాదాపుగా ఐదు లక్షల రూపాయలు ఉంటుందని గ్రామస్తులు మాతో అన్నారు. అందుచేత మేము బట్టలు ఉతకడం మానేస్తామని అన్నారు. అప్పుడు గ్రామానికి చెందిన కొంతమంది రెడ్డి కుల స్త్రీలు, చాకలి వారిపై నానా దుర్భాషలాడుతూ దాడిచేసి కొట్టారు. భయకంపితులై, చాకలి వారు ఆ ప్రదేశం వదిలి తమ ఇళ్లకు వచ్చారు. ఈ గ్రామంలో ఎవరూ వారితో మాట్లాడరాదనీ, అంగళ్లలో సరుకులు ఇవ్వారాదనీ, పాలు, టీ, ఏదీ వారికివ్వవద్దనీ, ఆటోలు కూడా ఎక్కించుకోరాదనీ ఆదేశాలిస్తూ, గ్రామంలో ఉండకుండా వెళ్లిపోవాలనే దృష్టితో గ్రామ బహిష్కరణ చేస్తూ గ్రామంలో దండోరా వేశారు. ఆ సమయంలో చాకలి వారికి అండగా మాల - మాదిగ కులాలల కుటుంబాలు మాత్రమే నిలిచాయి. ఒక దళితుడు ఆటోలో చాకలి వారిని ఎక్కించుకున్నందుకు, గ్రామ పెద్దలు రు. 4000 అపరాధ రుసుం వేశారు. అయినప్పటికీ ఆ దళిత యువకుడు భాతరు చేయలేదు.

ఈ సంఘటనపై ఆ గ్రామ చాకలివారు (మరుసటి రోజు 9 ఏప్రిల్ 2012) బనగానపల్లె మండల రెవెన్యూ అధికారికి, పాణ్యం సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌కు ఫిర్యాదు చేశారు. స్థానిక మండల తహసీల్దార్ గానీ, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ గానీ ఈ అగ్రకుల పెత్తందారులపై ఏ మాత్రమూ చర్యలు తీసుకోకుండా, ఆ గ్రామంలో 'పోలీస్ పికెట్' ఏర్పాటు చేశారు. ముగ్గురు పోలీసు కానిస్టేబుళ్లను గ్రామ నడిబొడ్డున ఉండే విధంగా ఆదేశించి వెళ్లారు గానీ, ఆ గ్రామ చాకలివారిని పిలిపించి, గ్రామం నడిబొడ్డున, సంఘటన జరిగిన ప్రదేశంలో అగ్రకులస్తులను పిలిపించి విచారణ ఏ మాత్రమూ జరుపలేదు. ఇది పూర్తిగా స్థానిక పోలీసు అధికారి (సిఐ) అగ్రకుల దురహంకారులకు మద్దతు ఇచ్చే విధంగానే ప్రవర్తించారు. పోలీస్ పికెట్ కొనసాగుతుండానే ఏప్రిల్ 9న సాయంత్రం దాదాపు నాలుగున్నర సమయమప్పుడు మొత్తం గ్రామ అగ్రకులస్తులంతా ఏకమై, వారికి దొరికిన ఆయుధాలు (కత్తులు, బరిసెలు మొదలైనవి) కట్టెలు తీసుకొని దాదాపు రెండు వందల మంది చాకలిపేటపై పడి దాడి చేయగా, అప్పటికే వారంతా ఊరిలో లేరు కాబట్టి బతకగలిగారు. ఆ సమయంలో లింగన్న అనే కొత్త వ్యక్తి (చాకలి కులస్తుడే) ఆ గ్రామంలో బంధువులు ఉన్నారని వచ్చి స్థిరపడ్డాడు. అతనిపై దాడి చేసి కొట్టగా కుడి చేయి విరిగింది. ప్రస్తుతం ఆయన ఆ గ్రామం విడిచి కోవెలకుంట్లలో శస్త్ర చికిత్స పొందుతున్నాడు.

పై సంఘటన రెండవ సంఘటన. దీనిపై కూడా ఇంతవరకూ కేసు నమోదు కాలేదు. ఈ ఘటన జరిగిన తర్వాత దాదాపు పది చాకలి కుటుంబాల వారు గ్రామం విడిచి, వారి వారి బంధువుల దగ్గరకు వెళ్లారు. నంద్యాల, పాణ్యం, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తదితర పట్టణాలలో బతకడానికి మూట, ముల్లె సర్దుకొని వెళ్లారు. వారి ఆచూకీ కూడా ఇంతవరకూ, గ్రామంలో ఉన్న మిగతా చాకలి కులస్తులకు తెలియకుండా వారు జాగ్రత్త పడుతున్నట్లు తెలిసింది. ఈ దేశంలో రాజ్యాంగం ఇచ్చిన పౌరహక్కులు ఏ విధంగా అణచివేయబడుతున్నాయో, రాయలసీమ జిల్లాలలో ఇదొక ఉదాహరణ మాత్రమే.

కర్నూలు జిల్లాలో ఇలాంటి గ్రామాలు ఎన్నో. కేవలం అగ్రకుల 'రెడ్డి' భూస్వామ్య దురహంకారంతో కొంతమంది వ్యక్తులు గ్రామాలను శాసిస్తూ, ప్రభుత్వ, పోలీసు అధికారులను తమ చేతుల్లో పెట్టుకొని, దళిత, బి.సి. కులాల వారిని అణచివేస్తూ, ఎవరినీ, ఏమీ మాట్లాడనీయ కుండా (రెడ్డి కులస్తులు ఏమైనా చేయవచ్చు, మాట్లాడవచ్చు) ఒక్కొక్క కులాన్ని నయాననో, భయాననో విభజిస్తూ, తమ ఆధిపత్యాన్ని చాటుకుంటున్నారు. రాష్ట్ర హైకోర్టు సీనియర్ న్యాయమూర్తి జస్టిస్ బి. శేషశయనరెడ్డి స్వగ్రామంలోనే ఈ విధంగా జరుగుతుంటే, మిగతా గ్రామాలలో ఏ విధంగా ఉంటుందో ఊహించుకోవచ్చు. ఈ గ్రామంలోని రెడ్డి కులస్తులంతా ఈయనకు సమీప బంధువులే.

ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయం ఏమిటంటే, దళితులు (మాల – మాదిగ కులాలవారు) దాదాపు 120 కుటుంబాలు మొత్తంగా చాకలి వారికి అండగా నిలబడడం. ఈ గ్రామ మిగతా కులాల వారంతా ఇది జీర్ణించుకోలేక పోతున్నారు. తాము 'గ్రామ బహిష్కరణ' గావించిన వారితో ఎందుకు సఖ్యతతో ఉన్నారని మరింత ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. దళితులలో చాలామంది ఆర్థికంగా చాకలి వారికన్నా పేదరికంలో ఉన్నవారే. మాల – మాదిగ – చాకలి కులాల వారంతా కలిసి, గ్రామం బయట ఒకే కాలనీలో ఉంటున్నారు. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల కూడా వీరిళ్ల మధ్యనే ఉంటుంది. ఈ మూడు కులాల మధ్య ఉన్న ఆప్యాయత, సానుభూతి, సహకారం, అనురాగం కర్నూలు జిల్లాలో ఏ గ్రామంలో కూడా కనబడలేదు. ఇది శుభపరిణామం. ఎందుకనగా, రెడ్ల పొలాలలో, ఇళ్లలో పనిచేసే వారంతా దళితులే. దాదాపు దళిత కుటుంబాలన్నీ వ్యవసాయ కూలీలు గానే జీవిస్తున్నారు. తమ స్వంత కష్టార్జితంతో మాత్రమే జీవనం సాగిస్తున్నారు. (చాకలి వారికి కొంతమందికి ఒకటి, రెండు ఎకరాల పొలం ఉన్నది). అయిన ప్పటికీ నైతికంగా, మానసికంగా, మనోధైర్యంతో ఇంత పెద్ద భూస్వామ్య గ్రామంలో దళితులూ – చాకలి వారు ఒక్కటిగా నిలబడినందుకు, మరోసారి, అగ్రకులస్తులు దాడి చేయలేకపోయారని, నేను స్వయంగా, రెండుసార్లు ఆ గ్రామాన్ని సందర్శించినప్పుడు బయటపడిన విషయం. ఇది చాలా అరుదైన విషయం. ఎందుకనగా ఈ నియోజకవర్గంలోని ప్రతి గ్రామమూ రెడ్డి కుల భూస్వాములతోనే ఉంటుంది. వారి ఆధిపత్యం కిందనే గ్రామాలు ఉంటాయి. దళితులు పూర్తిగా ఏదో ఒక రెడ్డి భూస్వామి ఆధిపత్యం కిందనే, ఆ పరిధిలోనే ఆలోచిస్తూ ఉంటారు. ఇటువంటి పరిస్థితులలో చాకలి వారిని తమ సోదరులుగా భావిస్తూ, వారికి మద్దతు నివ్వడం హర్షించదగినది, ఆహ్వానించవలసిందే.

భారత రాజ్యాంగం ప్రసాదించిన పౌరహక్కులు (ఆర్టికల్ 14-32) వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యపు హక్కులను ఈ సంఘటన పూర్తిగా కాలరాసినట్లే. 1955లో డా. బి.ఆర్. అంబేద్కర్ న్యాయశాఖా మంత్రిగా ఉన్న సమయంలోనే రూపొందించబడిన 'పౌరహక్కుల, పరిరక్షణ చట్టం 1955', 'వెట్టిచాకిరీ నిర్మూలనా చట్టం 1976' అన్నీ కూడా టంగుటూరు గ్రామంలో పూర్తిగా కాలరాయబడ్డాయి. పోలీసు, రెవెన్యూ అధికారులు ఈ గ్రామ భూస్వామ్య శక్తులతో కుమ్మక్కై ఇంతవరకూ కూడా చాకలిపేటను సందర్శించలేదు. వారికి మనోధైర్యం ఇవ్వలేదు. విచారకరమైన విషయం ఏమిటంటే, ఈ గ్రామంలో ఏ విధంగా వెట్టి చాకిరీని పునరుద్ధరించాలని ప్రయత్నిస్తున్నారు. ఇది పూర్తిగా అన్యాయం, దారుణం – రాజ్యాంగ వ్యతిరేకం.

ఏ వ్యక్తి అయినా తన కష్టార్జితం జీవనానికి సరిపోనపుడు తన ఆదాయ వనరును పెంచుకోవడానికి ప్రయత్నిస్తాడు. అందులో భాగం గానే ఇక్కడి చాకలి వారు కూడా మేర (వార్షిక భృతి) పెంచాలని డిమాండ్ చేశారు. ఆశ్చర్యకరమైన సంగతేందంటే, గత సంవత్సరం ఇవ్వవలసిన మేర కూడా ఇంతవరకూ అందజేయకుండా తమ కాళ్ల దగ్గరకు వచ్చిపడి ఉండాలనే భూస్వామ్య దురహంకారంతో ఆ గ్రామ రెడ్డి భూస్వాములు వ్యవహరిస్తున్నారు. 'వాటిని కూడా చెల్లించం. ఏమి చేసుకుంటారో చేసుకోండి' అంటూ బెదిరిస్తూ చాకలివారు ఆకలి చావులకు గురవ్వాలనే దుష్టబుద్ధితో వ్యవహరిస్తున్నారు.

కొంతమంది చాకలి యువకులు ప్రాణభయంతో జీవిస్తున్నారు. కొంతకాలం వేచి ఉండి, మళ్లీ దాడిచేసే ప్రమాదం ఉందని వారు భయాందోళనకు గురవుతున్నారు. కావున వీరికి రక్షణ కల్పించవలసిన బాధ్యత పూర్తిగా ఈ రాష్ట్ర ప్రభుత్వానిదే. మహాత్మాగాంధీ జాతీయ ఉపాధి హామీ పథకం (ఎంజిఎన్ఆర్ఇజిఎస్) వెంటనే ఈ గ్రామంలోని చాకలి కుటుంబాలకు వర్తింపజేయాలని డిమాండ్ చేస్తున్నాం.

స్థానిక తహసీల్దార్ గానీ, సబ్ ఇన్‌స్పెక్టర్ గానీ ఆ గ్రామ రెడ్డి కుల భూస్వాములపై ఏ మాత్రం చర్యలు తీసుకోలేదు కాబట్టి, వారిని వెంటనే సస్పెండ్ చేయాలని డిమాండ్ చేస్తున్నాం. చాకలివారిపై దాడి చేసిన వారిని వెంటనే అరెస్ట్ చేయాలని, మొత్తం సంఘటనపై గ్రామసభ ద్వారా విచారణ జరిపించాలనీ, జిల్లా కలెక్టర్‌కు విజ్ఞప్తి చేస్తున్నాం. స్థానిక శాసనసభ్యుడు కాటసాని రామిరెడ్డి ఇంతవరకూ ఆ గ్రామాన్ని సందర్శించకపోవడం, ఆ గ్రామంలోని అగ్రకుల రెడ్డి భూస్వామ్య దురహంకారుల పట్ల సానుకూల వైఖరే కారణం – ఇది అగ్రకుల పక్షపాతానికి నిదర్శనం.

ప్రజలందరినీ సమానంగా చూడవలసిన శాసనసభ్యుడు, ఈ విధంగా ప్రజల సమస్యలను పరిష్కరించడంలో నిర్లక్ష్యం వహించడం రాజ్యాంగ విరుద్ధం. భారత రాజ్యాంగం మీద ప్రమాణం చేసిన పాలకులు, ఏ విధంగా ప్రజలను విభజించి, పాలిస్తున్నారో అర్థమవుతుంది. ఈ విధంగా రాజ్యాంగ హక్కులను కాలరాసే వారిని వెనకేసుకొని రావడం అనైతికం, ప్రజల దౌర్భాగ్యం. ప్రజలు – పోరాడేతత్వాన్ని కలిగి ఉన్నప్పుడే, ఇలాంటి సమస్యలను పరిష్కరించుకోవచ్చును. రాజ్యాంగ హక్కులను పరిరక్షించ వలసిన అధికారులు, అగ్రకుల పెత్తందారుల కొమ్ముకాయడం మాని వేసేంత వరకూ, ఇలాంటి సంఘటనలు పునరావృతం అవుతూ ఉంటాయి. కావున ప్రజాస్వామికవాదులు వివిధ ప్రజాసంఘాలు ఇలాంటి సంఘటనలు జరిగినప్పుడు తీవ్రమైన ప్రతిఘటన ద్వారానే, అగ్రకుల పెత్తందారీ తనాన్ని ఎదుర్కోవచ్చు, నిరోధించవచ్చు. రాజ్యాంగ హక్కుల పరిరక్షణే ధ్యేయంగా ఉద్యమించినప్పుడే ఇలాంటి ఘటనలు పునరావృతం కావు. ప్రజలను మరింత చైతన్యవంతులను చేయాలి. పోరాటాలను తీవ్రతరం చేయాలి.

*(రచయిత న్యాయవాది,*
*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)*

# తిరుమలలో కార్మికుల హక్కుల ఉల్లంఘన

***రోజూ కోట్లాది రూపాయలు ఆర్జించే 'దేవుని' సన్నిధిలో కార్మికులపై కొనసాగుతున్న దోపిడీనీ, వేతనాలు, హక్కులు, సదుపాయాలు, భద్రతలలో అమలవుతున్న వివక్షనూ వివరిస్తున్నారు* ఎం.కె. కుమార్**

తిరుమల తిరుపతి దేవస్థానం (తితిదే) ప్రపంచంలోనే వాటికన్ సిటీ తర్వాత రెండవ అతిపెద్ద ఆధ్యాత్మిక కేంద్రం. సాక్షాత్తు విష్ణువే కలియుగంలో తిరుమలలో వెలసి భక్తుల పాపాలను హరణం చేసి మోక్షాన్ని కల్గిస్తాడని ప్రతీతి. తిరుమలకు రోజూ సుమారు అరవై వేల మందికి పైగా భక్తులు వస్తుంటారు. క్షణమాత్రపు దర్శనం కోసం గంటల తరబడి క్యూ లైన్లలో మగ్గుతుంటారు.

తితిదేలో పనిచేసే ఉద్యోగులందరూ ఎన్నో జన్మల పుణ్య ఫలితంగా శ్రీవారి సేవలో తరిస్తున్నారనీ, వీరికి సేవచేసే అవకాశాన్ని వెంకన్నే స్వయానా కలుగజేశాడనీ భక్తుల నమ్మకం. బాలాజీ ముందర అందరూ ఉద్యోగులు ఇఓ నుండి స్వీపర్ వరకు సేవకులే అయినప్పటికీ ఆ దేవుని కరుణ కాంట్రాక్టు కార్మికుల మీద సరిగా ప్రసరించడం లేదు. ఒకవేళ దేవుడు వరమిచ్చినా అధికారులు వివక్ష చూపుతూనే ఉన్నారు.

తితిదేలో పర్మినెంట్ సిబ్బంది ఏడు వేలుండగా, తాత్కాలిక సిబ్బంది (కాంట్రాక్ట్ / ఔట్ సోర్సింగ్) పదివేల మందికి పైగా ఉన్నారు. వీరందరూ తొంభై శాతం నాల్గవ తరగతి ఉద్యోగులే. వీరు దాదాపుగా ఎనిమిది సంవత్సరాలుగా శ్రీవారి సేవ చేస్తున్నా వీరికి నెలకి రు.4030 మాత్రమే జీతంగా ఇస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం స్వయంగా ఉద్యోగికి కనీస వేతనం రు. 6700 నెలకి ఉండాలని జిఓ నెం 3ని జనవరి 2011లో జారీ చేసినా, ఈ జిఓ తితిదేలో అమలు కావడం లేదు.

2006-07లో తితిదే బడ్జెట్ 756 కోట్ల రూపాయలు ఉండగా, 2011-12లో 2010 కోట్ల రూపాయలకు చేరింది. కాని కార్మికుల జీతాలు మాత్రం వీసమంతైనా పెరగలేదు. అయిదేళ్ల క్రితం ఉద్యోగుల జీతాలకు 138 కోట్ల రూపాయలు కేటాయించగా, 2011-12కి పర్మినెంట్ ఉద్యోగులకు 300 కోట్ల రూపాయలు కేటాయించారు. ఇది బడ్జెట్‌లో 23 శాతంగా ఉంటే, తాత్కాలిక ఉద్యోగులకే చెల్లించే జీతం ఐదు శాతంగా కూడా ఉండడం లేదు. 2011లో హుండీ ఆదాయం 731 కోట్ల రూపాయలు వచ్చింది. మిగిలిన ప్రసాదాల అమ్మకం, సేవా టిక్కెట్ల విక్రయం, వసతి గృహాల అద్దె తదితరవన్నీ కలిపి 1800 కోట్ల రూపాయలు ఆదాయం వచ్చింది.

ఇప్పటి వరకు తితిదే 4700 కోట్ల రూపాయలు వివిధ బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసింది. దీనిమీద ప్రతి సంవత్సరం వడ్డీ 400 కోట్ల రూపాయలు వస్తుంది. ఇదిగాక ప్రతి సంవత్సరం తితిదే 700 కోట్ల రూపాయలు ఫిక్స్‌డ్ డిపాజిట్ చేస్తోంది.

ఒకవేళ తితిదే పదివేల మంది కార్మికుల జీతాన్ని నెలకి రు.4030 నుండి రు.6700కి పెంచితే అదనపు భారం సంవత్సరానికి 36 కోట్ల రూపాయలు మాత్రమే. ఇది తితిదే ఫిక్స్‌డ్ డిపాజిట్ మీద వచ్చే వడ్డీలో 12 శాతం మాత్రమే.

2012-13 ఆర్థిక సంవత్సరానికి 15.39 కోట్ల రూపాయలను కొత్తగా 15 కళ్యాణ మండపాలను రాష్ట్రంలో వివిధ చోట్ల నిర్మించాలనుకుంది. మొత్తం ఇప్పటికే 254 కళ్యాణ మండపాలు దేశంలో పలు ప్రాంతాలలో ఉండగా వీటిలో 145 మంటపాలనే తితిదే నిర్వహిస్తోంది. మిగిలిన 109 మంటపాలను ప్రైవేట్ వ్యక్తులకు లీజుకిచ్చారు. ఏటా వీటి నిర్వహణకు మూడు కోట్ల రూపాయలు ఖర్చు పెడుతుంటే, రెండు కోట్ల రూపాయలు మాత్రమే అద్దె రూపేణా వస్తోంది.

ఇప్పుడు అదనంగా నిర్మించే కళ్యాణ మంటపాలు నిరుప యోగంగా మారే పరిస్థితి ఏర్పడుతుంది. బస్‌స్టాండ్ లేనిచోట కూడా మంటపాలు నిర్మించారు.

ధర్మ ప్రచారానికి వంద కోట్ల రూపాయలు కేటాయించారు. దేశంలో, విదేశాలలో 150 కళ్యాణాలు 2012లో చేయాలని సంకల్పించారు. అసలే కళ్యాణాలు ఎస్‌విబిసి ఛానల్‌లో ప్రత్యక్ష ప్రసారం వల్ల దాని పవిత్రత తగ్గిందని భక్తులు బాధపడుతుంటే ప్రజల వద్దకే కళ్యాణాల వల్ల కమర్షియల్ కలరే అంటుకుంటుందనీ, ఇది ఆగమ శాస్త్ర విరుద్ధమనీ కొంతమంది భక్తులు హైకోర్టులో పిల్ వేశారు.

వివిధ రాష్ట్రాలలో మూడు చోట్ల దేవాలయాల నిర్మాణానికి యాభై కోట్లు కేటాయించారు. తిరుమలనే భక్తుల మనోభావాల కనుగుణంగా తీర్చిదిద్దాలనీ, మిగిలిన చోట్ల నిర్మాణాలవసరం లేదనీ, తిరుపతిలోని వెంకన్న తల్లి వకుళాదేవి ఆలయాన్ని ఇంతవరకు పట్టించుకోలేదనీ కొంతమంది స్వామీజీలు తిరుమలలో నిరసన ప్రదర్శనలు జరిపారు.

రిటైరయిన ప్రభుత్వ, తితిదే అధికారులను దాదాపు ముప్పై మందికి పైగా తితిదే తీసుకుంది. వీరికి సంవత్సరానికి జీతం, అదనపు సౌకర్యాల ఖర్చులు కలిపి పదికోట్లకు పైగా అవుతుంది.

రాష్ట్రంలో అన్ని చోట్ల జి.ఓ. నెం. 3ని అమలు చేస్తూ, కనీస వేతనం రు.6700 నెలకి ఇస్తుంటే, తితిదేలో దీన్ని అమలు చేయమని పాలకమండలి తీర్మానం చేసినా, ఏవో సాంకేతిక కారణాలు చూపి తితిదేలో అధికారులు అమలు చేయడం లేదు.

వార్షిక బడ్జెట్ 50 కోట్ల రూపాయలు కూడా లేని తిరుపతి కార్పొరేషన్‌లో వెయ్యిమందికి పైగా కార్మికులకు కనీస వేతనం గత సంవత్సరంగా అమలు చేస్తున్నారు.

తితిదే అధికారులు చేసే వింతవాదన ఏమిటంటే పదివేల మంది కాంట్రాక్టు కార్మికులకు పోస్టులు తితిదేలో లేవనీ, పోస్టులు లేకుండా

కనీస వేతనం ఇవ్వలేమని. మరి పోస్టులు లేకుండా ఇంత మందిని ఎందుకోసం పెట్టుకున్నారని, గత ఎనిమిది సంవత్సరాలుగా ఎందుకు వెట్టిచాకిరీ చేయించుకుంటున్నారని అడిగితే సమాధానం రాదు.

తితిదేలో పదివేల మంది కాంట్రాక్టు కార్మికులు పనిచేస్తున్నారు. రోజుకు మూడు షిఫ్టులుంటాయి. షిఫ్టు ఎనిమిది గంటలుంటుంది. మరుగుదొడ్డి, కాటేజీలలో నాలుగు వేల మంది, గార్డెన్‌లో వెయ్యి మంది, అడివిలో రెండు వేల మంది, ఆసుపత్రి, క్యాంటిన్‌లలో వెయ్యి మంది, రోడ్లు ఊడ్చడానికి ఐదు వందల మంది, ఇంకా మిగిలిన నాల్గవ తరగతి శ్రమలలో మిగిలిన వారు పనిచేస్తున్నారు.

వీరు ఒక్కరోజు పని మానేస్తే తిరుమల దుర్గంధ పూరితమౌతుంది. డ్రైనేజ్ అస్తవ్యస్తమౌతుంది. చుక్కనీరు రాదు. తితిదే పర్మినెంట్ సిబ్బంది తొంభై శాతం మేధో శ్రమ రంగంలోనే పనిచేస్తుంటారు. పది శాతం మాత్రమే శారీరక శ్రమ చేసే రంగాలలో పనిచేస్తున్నారు.

మరి శ్రీవారికి చిరునవ్వుని వరమిచ్చిన ఈ శ్రామికుల మోహాలలో మాత్రం విషాదఛాయలు అలుముకుంటున్నాయి.

తిరుమల, పద్మావతి అమ్మవారి దేవాలయాలలో పనిచేసే ప్రసాదం సిబ్బందికి, తితిదే నెలకి రు. 13,600 ఇస్తోంది. మరి ఏ జి.ఒ. లేకుండానే వారిమీద ఎందుకంత ప్రేమో అర్థం కాదు. ఎందుకంటే వారు వైష్ణవ బ్రాహ్మణులు కాబట్టి. ఇందులో కూడా వివక్ష ఏమంటే వైష్ణవేతర బ్రాహ్మణులకు నెలకు రు. 9600 ఇస్తున్నారు. మరి వీరికి కూడా తితిదేలో పోస్టులు లేవు.

కాంట్రాక్టు కార్మికులలో ఏడు వేల మంది దళితులున్నారు. మహిళలు దాదాపుగా నాలుగు వేల మంది ఉన్నారు. దీన్ని బట్టి తితిదేలో కుల న్యాయం ఎలా అమలవుతుందో చూడొచ్చు. ఈ మధ్యే కార్మికుల పోరాటాల వలన మహిళలను క్షురకులుగా తీసుకొన్నారు.

కుల వివక్ష ఈ విధంగా ఉంటే వర్గ వివక్ష కూడా తితిదేలో అమలవుతోంది. తితిదే అధికారుల పర్మినెంట్ ఉద్యోగాల బంధుగణం, కుటుంబ సభ్యులు పనిచేసే ఎస్‌విబిసి ఛానల్‌లోనూ, తితిదేలో పనిచేసే కాంట్రాక్టు కంప్యూటర్ ఆపరేటర్లకి జి.ఒ. నెం. 3 అమలవుతోంది. వీరికి పర్మినెంట్ ప్రాతిపదికపై పోస్టులు లేవు.

తితిదే కార్మికుల పట్ల చూపుతున్న ఈ వివక్షను ప్రశ్నించిన తితిదే ఎస్.సి., ఎస్.టి., బి.సి., ట్రేడ్ యూనియన్ నాయకులను తితిదే బెదిరింపులకు గురిచేస్తూ మెమోలు జారీచేస్తుంది. అంతేగాకుండా తితిదే అత్యవసర సర్వీసుల విభాగం (ఎస్మా) చట్ట పరిధిలోకి వస్తుందని ఇక్కడ ధర్నాలు, నిరాహార దీక్షలు, సమ్మెలు చేయరాదని హుకుం జారీచేస్తోంది.

వినని నాయకులపై ప్రైవేట్ వ్యక్తులచే తప్పుడు కేసులు బనాయించి కోర్టులు చుట్టూ తిప్పుతోంది. కనీసం కార్మికుల దయనీయ స్థితిని పత్రికా ముఖంగా తెలియజేసినా, నాయకులపై తితిదే క్రమశిక్షణా చర్యలకు పాల్పడుతుందంటే తితిదే అసహనాన్ని అర్థం చేసుకోవచ్చు.

మూడుసార్లు తితిదే బోర్డు తీర్మానం చేసిన దాన్ని ప్రభుత్వానికి పంపి జి.ఒ. నెం. 3 తితిదేకి వర్తించదని లెటరు తెచ్చుకున్నారు. కాని ప్రభుత్వం జారిచేసే పిఆర్‌సి, డిఎ ఇతర బెనిఫిట్లు అన్నీ తితిదేకి వర్తిస్తున్నప్పుడు ఇది ఎందుకు వర్తించదో తితిదే సమాధానం చెప్పదు. తితిదే ఆక్ట్ 30/1987 ప్రకారం రూల్సును అనుసరిస్తూ, సర్వీసు నిబంధనలకు సంబంధించి జి.ఒ. 1060 ప్రకారం నడుచుకుంటుంది. ఇవన్నీ కూడా ప్రభుత్వ విభాగాలకు సంబంధించిన అన్నీ ఉత్తర్వులు తితిదేకి వర్తిస్తాయని స్పష్టంగా చెపుతున్నాయి.

శ్రామికులు, కార్మికులు, దళితులు అంటే తితిదేకి చిన్న చూపుంది. అందుకే వివక్ష చూపుతోంది. కూలీపనికి వెళితే రోజుకు రు. 350 చొప్పున నెలకి రు. 10,500 వస్తాయి. కానీ తితిదేలో ఎనిమిది గంటలు పైనే పనిచేసినా నెలకి రు. 4030 కూడా రావడం లేదు. కలియుగ వైకుంఠం తితిదే కార్మికులకు నరకలోకం అయిపోయింది.

రాష్ట్ర ప్రభుత్వ అధికార లెక్కల ప్రకారమే ఒక న్యూక్లియర్ కుటుంబం తన జీవనం సాగించడానికి నెలకి రు. 10,700 అవసరం అవుతాయని లెక్కగట్టింది. అందులో 70 శాతాన్ని కూడా తితిదే ఇవ్వలేకపోతోంది.

అంతేగాకుండా, తితిదే కార్మికులు దేవుని దర్శనానికి పోలేరు. లడ్డూకార్డులు, మెడికల్ కార్డులు లేవు. పి.ఎఫ్., జి.ఎస్. సౌకర్యం ఈనాటికీ యాభై శాతం మందికి లేవు. పేరుకు తితిదేలో ఉద్యోగం, కాని కనీస హక్కులు కూడా వారికి ఉండవు. మహిళా కార్మికులకు తిరుమలలో రాత్రిపూట గుడ్డలు మార్చుకునే దానికి వసతి లేదు. వారికి రక్షణ లేదు. వారిపై కాంట్రాక్టర్లు లైంగిక వేధింపులకు అనునిత్యం పాల్పడుతుంటారు. అడిగే నాథుడు లేదు.

వీటన్నిటినీ ఇప్పటివరకు పంటి బిగువున సహిస్తున్న కార్మికులు ఇప్పుడిప్పుడే తమ హక్కుల కోసం ఉద్యమాలు చేస్తున్నారు. ఈ ప్రజాస్వామిక ఉద్యమానికి అందరూ మద్దతు తెలిపి తమ సహాయ సహకారాలను అందించి, ఉద్యమాన్ని తీవ్ర రూపంలోకి తెచ్చే ప్రయత్నాలు మొదలయ్యాయి.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)*

**రాబోయే సంచికలలో...**

- భారతదేశంలో పన్నుల ఎగవేత, నల్లధనం దుష్ఫలితాలు - డి. నరసింహారెడ్డి
- శత్రుదేశాలు కావవి... ఆదివాసీ కుగ్రామాలు - రాంకో హిచ్చామి
- విద్య - శాస్త్రీయత - మహమూద్
- మార్కెట్ గుప్పిట్లో విద్య - పర్యవసానాలు - ఎ. నర్సింహారెడ్డి
- ఇదేనా ఆదివాసుల ప్రగతి? - ఎం. నాగమణి
- దోపిడీకి గురవుతున్న ఆదివాసీ సంస్కృతి - వూకే రామకృష్ణ

# గ్రామ అధ్యయనాల పద్ధతులు

***ఇప్పటి వరకూ సాగిన గ్రామ అధ్యయనాలను బట్టి ఏయే పద్ధతులలో, ఏయే పరికరాలతో గ్రామ అధ్యయనం చేసే అవకాశం ఉందో వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

గ్రామ అధ్యయనాల అవసరాన్నీ, ఇంతవరకూ జరిగిన గ్రామ అధ్యయనాల చరిత్రనూ తెలుసుకున్న తర్వాత ఆ అధ్యయనం జరపడానికి ఏయే పద్ధతులున్నాయో, అవి ఉపయోగించే పరికరాలేమిటో, వాటి అవకాశాలూ పరిమితులూ ఏమిటో తెలుసుకోవాలి.

గ్రామాన్ని అధ్యయనం చేయడమంటే ఏమిటి? దానికి ఏదైనా నిర్దిష్ట పద్ధతి ఉందా? ఏ గ్రామాన్నయినా అధ్యయనం చేయవచ్చా? గ్రామాన్ని అధ్యయనం చేయడానికి ఎంతకాలం పడుతుంది? గ్రామం అనగానే వందల, వేల అంశాలు ఉంటాయి గదా, వాటిలో ఏ అంశాలు అధ్యయనం చేయాలి? ఎలా అధ్యయనం చేయాలి? ఆ అధ్యయనానికి ఉపయోగపడే పరికరాలు ఏమిటి? గ్రామాల అధ్యయనం చేసే పద్ధతులు నేర్చుకోవచ్చునా? గ్రామాన్ని అధ్యయనం చేయాలనే ఆసక్తి, కోరిక ఉన్నవారికి ఇటువంటి అనేక ప్రశ్నలు తలెత్తే అవకాశం ఉంది.

ఇప్పటివరకూ జరిగిన గ్రామ అధ్యయనాలను చూస్తే అవి అనేక పద్ధతులలో సాగినట్టు అర్థమవుతుంది. తక్షణ అవసరాల కోసం గ్రామానికి వెళ్లి అప్పటికప్పుడు వెలువరించిన నిర్ధారణలు ఉన్నాయి. గ్రామం మీద అభిమానంతో, ఆసక్తితో అభిరుచి ప్రధానంగా సాగిన అధ్యయనాలున్నాయి. వివిధ సామాజిక శాస్త్రాలు రూపొందించిన దీర్ఘకాలిక అధ్యయన పద్ధతులు, శాస్త్రీయ పరికరాలు ఉన్నాయి. గ్రామం అంటే ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల సమాహారం, గ్రామ అధ్యయనమంటే గ్రామ వనరులను, సామాజిక సంబంధాలను, చలనాన్ని అధ్యయనం చేయడం అనే దృక్పథంతో వర్గ పరిశీలన చేసే మార్క్సిస్టు దృక్పథం ఉంది. పరిశీలనాంశాన్ని బట్టి, పరిశీలకుల దృక్పథాన్ని బట్టి, పరిశీలనా లక్ష్యాన్ని బట్టి, పరిశీలకులు ఇవ్వగల సమయాన్ని, పరిశీలకుల శక్తిసామర్థ్యాలను బట్టి ఇప్పటివరకు సాగిన గ్రామ అధ్యయన పద్ధతులు వేరువేరుగా ఉన్నాయి.

దేశవ్యాప్తంగానూ, రాష్ట్రంలోనూ గత దశాబ్దాలలో వేరువేరు పద్ధతులలో మొత్తంగా వందలాది గ్రామ అధ్యయనాలు జరిగి ఉంటాయి. అధ్యయన పద్ధతులను బట్టి ఆ అధ్యయనాలను కనీసం ఐదు రకాలుగా విభజించి చూడడానికి అవకాశం ఉంది. ఈ విభజనకు ఆస్కారమిచ్చేది ఆయా అధ్యయనాలలో ఉపయోగించిన పద్ధతులు మాత్రమే కాదు, దృక్పథం లోనూ, లక్ష్యంలోనూ, ఫలితాలలోను, పర్యవసానాలలోను కూడ ఈ విభజన వ్యక్తమవుతుంది. ఆ అధ్యయన పద్ధతులను స్థూలంగా 1. పైపై పరిశీలనా పద్ధతి, 2. అభిరుచి ప్రధాన వివరణ పద్ధతి, 3. పాలనా అవసరాల కోసం జరిపే అధ్యయన పద్ధతి, 4. విద్యా సంబంధమైన సూక్ష్మ పరిశోధనా పద్ధతి, 5. సామాజిక పరివర్తన లక్ష్యంతో మార్క్సిస్టు దృక్పథంతో జరిపే సమగ్ర అధ్యయన పద్ధతి అని చెప్పవచ్చు.

వీటిలో మొదటి నాలుగు పద్ధతులకు కొన్ని అనుకూలాంశాలు – అవకాశాలు, కొన్ని ప్రతికూలాంశాలు – పరిమితులు ఉన్నాయి. అధ్యయనానికి పట్టే కాల వ్యవధి రీత్యా, అధ్యయన క్రమంలో ఉండే సౌలభ్యం రీత్యా, వివరణలోని సరళత్వం రీత్యా, ముందే నిర్ణయించుకున్న నిర్ణీతమైన పరిశీలనాంశాల చట్రం రీత్యా ఈ నాలుగు పద్ధతులు కొంత వరకు సులభం. కాని వాటిలో ఏ ఒక్క పద్ధతిని ఎంచుకుని అధ్యయనం చేసినా గ్రామం గురించి సమగ్రమైన, సారభూతమైన చిత్రం అందడం కష్టం. అందువల్ల ఇటీవలి కాలంలో ఈ నాలుగు పద్ధతులను, లేదా నాలుగు పద్ధతులలోని మేలయిన పరికరాలను కలిపి అధ్యయనం చేయడం జరుగుతోంది. మార్క్సిస్టు అధ్యయన పద్ధతి ఈ నాలుగు పద్ధతులకన్న భిన్నమైనది మాత్రమే కాక విభిన్న శాస్త్రాల పరికరాలను సంలీనం చేసుకుని, గ్రామ సంబంధాల రూపాన్నీ సారాంశాన్నీ కూడ అధ్యయనం చేస్తుంది గనుక సమగ్రమైన చిత్రాన్ని ఇవ్వగలుగుతుంది. ఆ అధ్యయన లక్ష్యం సాధారణంగా సామాజిక పరివర్తనా మార్గాలను అన్వేషించడం గనుక అది చలనశీలంగా కూడ ఉంటుంది.

ఇప్పుడు ఒక్కొక్క పద్ధతిని మరికొంచెం వివరంగా చూద్దాం:

**పైపై పరిశీలనా పద్ధతి:** ఇది నిజానికి పరిశోధన, అధ్యయనం అని చెప్పగలిగినది కాదు. ఒక గ్రామంలో ఏదైనా ఒక ఘటన జరిగినప్పుడు తక్షణమే, స్వల్పకాలికంగా ఆ గ్రామానికి వెళ్లి, ఆ ఘటన మీద వ్యాఖ్యానించడం కోసం ఈ పరిశీలన జరుగుతుంది. లేదా ఆసక్తి కొద్దీ ఒక గ్రామానికి వెళ్లి కొద్దిసేపో, కొద్ది రోజులో గడిపి, దృష్టికి వచ్చిన అంశాలను నమోదు చేయడం జరుగుతుంది. ఈ రకమైన పరిశీలనను ఎక్కువగా పాత్రికేయులు, సామాజిక పరిణామాల మీద వ్యాఖ్యాతలు, రాజకీయవాదులు చేస్తున్నారు. ఉదాహరణకు, పాదిరికుప్పం, కారంచేడు, నీరుకొండ, చుండూరు, వేంపెంట, పాపిలి వంటి గ్రామాలలో దళితులపై మారణకాండ, వివక్ష అమలయిన ఘటనలు వెలుగులోకి రాగానే ఆయా గ్రామాల గురించి పత్రికలలో ఇటువంటి పరిశీలనలు వచ్చాయి. సోంపేటలో థర్మల్ విద్యుత్ కర్మాగారాన్ని నిరసిస్తున్న ఉద్యమకారుల మీద కాల్పులు జరిగినప్పుడు ఇటువంటి పరిశీలనలు వచ్చాయి. పోలేపల్లిలో ప్రజలు ప్రత్యేక ఆర్థిక మండలాన్ని వ్యతిరేకిస్తూ ఆందోళన జరిపినప్పుడు ఇటువంటి పరిశీలనలు వచ్చాయి. ఇటీవల అభివృద్ధి పథకాల పేరిట విధ్వంసం జరుగుతున్న ప్రతి గ్రామం గురించీ, రైతుల ఆత్మహత్యలు జరిగిన గ్రామాల గురించి, చారిత్రక, సాంస్కృతిక ప్రత్యేకతలు ఉన్న గ్రామాల గురించి ఇటువంటి పరిశీలనలు వచ్చాయి. ప్రపంచీకరణ ఫలితంగా గ్రామాలలో ఏ మార్పులు వచ్చాయో, వస్తున్నాయో వివరించడానికి ప్రయత్నించిన పరిశీలనలు వచ్చాయి. ఈజాబితా చూస్తే ఈ పరిశీలనలన్నీ ఒక ఘటనను, బిందువును చూసే ప్రయత్నాలే తప్ప పరిణామాన్ని, ధారను మొత్తంగా చూసినవి కావు.

పత్రికలు, ప్రచార సాధనాలు పట్టించుకోవాలంటే కేవలం ఘటనలు, బిందువులు కూడ కాదు, సాధారణంగా సంచలనాత్మక ఘటనలు, బిందువులు కావాలి. వాటికి దీర్ఘకాలిక పరిణామాలు, సంక్లిష్ట ప్రక్రియలు, అదృశ్య కార్యకారణ సంబంధాలు పట్టవు. గ్రామంలో ఒక సంచలనాత్మక ఘటన జరగగానే పత్రికా విలేఖరులు ఆ గ్రామానికి వెళ్లి తాము చూసిన విషయాల ఆధారంగా, తమను కలిసిన మనుషులు చెప్పే విషయాల ఆధారంగా నివేదిక తయారు చేస్తారు. అంటే అక్కడ జరిగిన ఘటన తీవ్రత, విలేఖరి అక్కడికి వెళ్లిన సమయానికి కనబడిన, వినబడిన విషయాలు ఆ పరిశీలనకు పరిమితులు విధిస్తాయి.

ఆ ఘటన రాజకీయ, సామాజిక పర్యవసానాలు ఉన్నదయితే రాజకీయవాదులు కూడ జోక్యం చేసుకుని ఆ ఘటన పూర్వాపరాలను, చరిత్రను కూడ జోడిస్తారు. ఒక్కోసారి సామాజిక శాస్త్రవేత్తలు కూడ ఆ ఘటన పట్ల ఆసక్తి కనబరచి మరికాస్త లోతయిన విశ్లేషణ చేయడానికి ప్రయత్నిస్తారు.

ఈ అన్ని పద్ధతుల్లోను గ్రామం, పరిశీలన, నివేదిక ఉన్నాయి గనుక వీటిని గ్రామ అధ్యయనాలు అని అనవచ్చుగాని, ఇవి మొత్తం గ్రామానికి సంబంధించినవో, పరిణామక్రమానికి సంబంధించినవో కావు, ఒకానొక ఘటనకు, సంబంధిత వ్యక్తులకు మాత్రమే సంబంధించినవి. పరిశీలకులు ఆ ఘటన పరిశీలనకు వెచ్చించే సమయం అతిస్వల్పం. అన్నిటికన్న ముఖ్యంగా ఈ పరిశీలనలు రూపాన్ని మాత్రమే చూసి వ్యాఖ్యానించగలవు తప్ప సారం లోకి వెళ్లే శక్తి ఉన్నవి కావు. అందువల్ల ఆ పరిశీలన పాఠకులకు సారం గురించి అవగాహనను అందించజాలదు.

ఎప్పుడైనా రూపమూ సారమూ ఒకటి కాదు. రూపానికీ సారానికీ తేడా మాత్రమే కాదు, పరస్పర భిన్నత్వం కూడ ఉండవచ్చు. రూప సారాల మధ్య తేడా గుర్తించడం, కనిపించే సరళ రూపాలను అధిగమించి కనబడని సంక్లిష్ట సారాన్ని గ్రహించడం మార్క్సిస్టు తాత్విక దృక్పథంలో చాల ముఖ్యం. "...ఇది విరోధాభాసగా, రోజువారీ అనుభవానికి వ్యతిరేకంగా ఉన్నదని అనిపించవచ్చు. కాని భూమి సూర్యుని చుట్టూ తిరుగుతుండడం, నీరు అనే పదార్థంలో అతి తీవ్రమైన దహ్యమాన వాయువులు రెండు కలిసి ఉండడం కూడ విరోధాభాసలే. రోజువారీ అనుభవాన్ని బట్టి చూస్తే శాస్త్రీయ సత్యం ఎప్పుడూ విరోధాభాసగానే ఉంటుంది. ఎందుకంటే రోజువారీ అనుభవం వస్తువుల భ్రమగొలిపే రూపాలను మాత్రమే పట్టుకోగలుగుతుంది" అని **వేజెస్, ప్రైస్ అండ్ ప్రాఫిట్** (1865) అనే ఉపన్యాసంలో కార్ల్ మార్క్స్ అన్నాడు. "వస్తువుల బైటికి కనబడే రూపమూ, అంతస్సారమూ సరాసరిగా ఒక్కలాగే ఉంటే శాస్త్రమంతా అనవసరమైపోతుంది" అని **కాపిటల్** మూడో సంపుటంలో రాశాడు.

అయితే సమస్య ఏమంటే చూపు, వాసన, వినికిడి, రుచి, స్పర్శ అనే మనిషి పంచేంద్రియాలకు రూపాలను మాత్రమే గ్రహించే శక్తి ఉంది. సారం గ్రహించాలంటే కార్యకారణ సంబంధాలను, చరిత్ర పరిణామాన్ని, హేతుబద్ధతను, సంక్లిష్టతను అవగాహన చేసుకోగలిగిన విశ్లేషణాశక్తి కావాలి. మనిషి మెదడుకు ఆ పని చేసే సామర్థ్యం ఉంది గాని, ఆ సామర్థ్యం సహజాతమైనది కాదు. అందుకు శిక్షణ, అనుభవం, నిరంతర సాధన కావాలి. పైపై పరిశీలనా పద్ధతి ఒక్కొక్కసారి చాల ఆశ్చర్యకరమైన, కళ్లుమిరుమిట్లు గొలిపే వాస్తవాల్ని వెలికి తెచ్చే అవకాశం ఉన్నప్పటికీ రూపం దగ్గర ఆగిపోవడమే దాని పరిమితి. అయితే అటువంటి అనేక రూపాలను చూసి విశ్లేషించిన చిరకాల అనుభవం, సారాన్ని గ్రహించాలనే తపన ఉంటే కొన్నిసార్లు స్వల్పకాలిక పరిశీలన నుంచి కూడ లోతైన విశ్లేషణ సాధించవచ్చు.

ఒక ఉదాహరణ చూద్దాం. గ్రామానికి గతంలో తారు రోడ్డు లేదు, ప్రస్తుతం ఉంది అనే రూపం అందరూ చూసేదే. దాని నుంచి విశ్లేషణలు, నిర్ధారణలు కూడ చేయవచ్చు. 'గ్రామానికి బయటి సమాజంతో సంబంధం పెరిగింది', 'గ్రామానికి ఆధునికత వచ్చింది', 'గ్రామం మారిపోయింది', 'గ్రామం అభివృద్ధి చెందింది' వంటి నిర్ధారణలు చేయవచ్చు. రూపాన్ని మాత్రమే చూసి చేసిన ఈ నిర్ధారణలన్నీ సారాంశంలో సంపూర్ణ సత్యాలు కాకపోవడానికి, అర్ధసత్యాలో, అసత్యాలో కావడానికి అవకాశం ఉంది. ఆ రోడ్డును ఉపయోగించుకునే వాళ్లెవరు, వాళ్ల ఆర్థికస్థితి ఏమిటి, బయటి సమాజంలోకి వాళ్లు ఎందుకు వెళ్తున్నారు, వాళ్లు ఊళ్లో పని దొరకక పని కోసం బైటికి వెళ్లే రోజుకూలీలా, భూమిలేని నిరుపేదలా లేక గ్రామంలో భూస్వాములుగా, మధ్యరైతులుగా ఉండి వ్యవసాయోత్పత్తిలో మిగులును పెట్టుబడిగా పెట్టడానికో, విలాసాల మీద ఖర్చు పెట్టడానికో బైటికి వెళ్తున్నారా, గ్రామంలోకి ఆధునికత వస్తే అందరికీ సమానంగా వచ్చిందా, అసమానంగా వచ్చిందా, గ్రామం మారిపోయిందంటే ఏయే వర్గాలకు ఎలా మారిపోయింది, కొందరికి చాల మారి, మరికొందరికి ఏమీ మారకుండా ఉండిపోయిందా, అందరికీ ఎంతో కొంత మారిందా, గ్రామం అభివృద్ధి చెందడం అంటే ఏమిటి, అభివృద్ధిని ఎలా నిర్వచించాలి, అసలు గ్రామం అనేది ఒక శిలాసదృశమైన ముద్దనా, అందులో ఆర్థిక సామాజిక రాజకీయ విభజనలు ఉన్నాయా, విభజనలు ఉంటే ఏ పరిణామమైనా ఆయా విభజనలకు అతీతంగా ఉండగలదా లాంటి అనేక ప్రశ్నలకు ఈ రూపపరమైన నిర్ధారణలు తావిస్తాయి. అసలు రూపాన్ని ఏ కొద్దిసేపటికోసమో అరకొరగా చూసి ఇటువంటి నిర్ధారణలు చేయవచ్చునా, గ్రామం గురించిన నిర్ధారణ చేయడంలో బైటినుంచి వెళ్లే పరిశీలకుల పరిమితులు ఏమిటి వంటి ప్రశ్నలు తలెత్తుతాయి. ఆ ప్రశ్నలకు జవాబులు వెతికే క్రమంలో సారం వైపు ప్రయాణించవచ్చు. అప్పుడు రూపం ఆధారంగా చేసిన నిర్ధారణలు అసలు చెల్లవనో, కొంతవరకే చెల్లుతాయనో అర్థమవుతుంది.

ఈ ప్రధానమైన లోపం ఉన్నప్పటికీ, ఈ పద్ధతి పరిశీలనలో అనుకూలాంశం ఏమంటే ఎక్కువ ముందస్తు శ్రమ లేకుండా, ఎక్కువ సమయం అవసరం లేకుండా అప్పటికప్పుడు పరిశీలించదలచుకున్న గ్రామానికి, ప్రత్యేక అంశానికి వెళ్లవచ్చు.

మరొక అనుకూలాంశం ఈ పద్ధతి పరిశీలన ఎవరయినా చేయవచ్చు. దీనికి ప్రత్యేకమైన శిక్షణ గాని, అధ్యయనం గాని అవసరం లేదు. ఆ అంశం మీద, గ్రామం మీద ఆసక్తి ఉంటే వెళ్లి అక్కడ తన పరిశీలనలో వెలువడిన విషయాలను వివరించవచ్చు.

ఈ పద్ధతి పరిశీలనకు ప్రత్యేకమైన పరికరాలేమీ లేవు. గ్రామానికి వెళ్లేముందు ఏమి తెలుసుకోవడానికి వెళ్తున్నామో స్థూలమైన అవగాహన ఉంటే చాలు. ఆ గ్రామం గురించి గాని, ఆ ప్రత్యేక అంశం గురించి గాని అంతకుముందే అచ్చయిన సమాచారం చదివి వెళ్లవచ్చు. ఇలాంటి సమాచార వనరులను సెకండరీ సోర్సెస్ అంటారు. ఆ అవగాహనతో గ్రామంలో సంబంధిత వ్యక్తులను గాని, గ్రామ సమాచారం మొత్తం అందించగల వ్యక్తులను గాని కలిసి వారి దగ్గర సమాచారం సేకరించవచ్చు. ఈ సమాచార వనరులను ప్రైమరీ సోర్సెస్ అంటారు.

ఆ సమాచార సేకరణ కోసం నిర్దిష్టమైన ప్రశ్నపత్రం తయారు

చేసుకున్నా, స్థూలంగా ఏయే రంగాలకు సంబంధించిన సమాచారం సేకరించాలో మనసులో పెట్టుకున్నా సరిపోతుంది. ప్రశ్న పత్రం తయారు చేసుకుని పోతే కచ్చితంగా మనకు కావలసిన సమాచారం సేకరించవచ్చు. ఆయా రంగాల మీద సమాచారం తెలుసుకోవాలను కుంటే ఎక్కువ సమాచారం దొరుకుతుంది గాని చెప్పేవారు తమ ధోరణిలో పడి అనవసరమైనవీ, సంబంధం లేనివీ ఎన్నో విషయాలు చెప్పవచ్చు. గ్రామంలో దొరికే సమాచారాన్ని విని జ్ఞాపకం ఉంచుకోవచ్చు. లేదా రాసుకుని రావచ్చు, లేదా వాయిస్ రికార్డర్‌లో రికార్డ్ చేసుకుని రావచ్చు. అయితే సాధారణంగా అవతలివాళ్లు మాట్లాడుతున్నప్పుడు మనం రాసుకుంటున్నట్టో, రికార్డ్ చేస్తున్నట్టో కనబడితే మాట్లాడేవాళ్ల ధార తెగిపోతుంది. మధ్యలో ప్రశ్నలు అడిగినా ధార తెగిపోతుంది.

ఆ సమాచారాన్ని జ్ఞాపకం నుంచి గాని, నోట్స్ నుంచి గాని, రికార్డ్ నుంచి గాని పునరుద్ధరించి నివేదిక రాయడం, ఆ నివేదిక రాసే సమయంలో సెకండరీ సోర్సెస్ మరొకసారి సంప్రదించడం మంచిది.

**అభిరుచి ప్రధాన అధ్యయనాలు:** గ్రామ అధ్యయనాలలో మరొక ముఖ్యమైన పద్ధతి అభిరుచి ప్రధాన అధ్యయనాలు. ఇవి గ్రామాలకు బైటి నుంచి వచ్చినవారు కూడ కొందరు చేసి ఉండవచ్చు గాని ప్రధానంగా, ఎక్కువగా ఆ గ్రామం మీద, గ్రామపు సామాజిక సాంస్కృతిక చారిత్రక అంశాల మీద ప్రేమ ఉన్న గ్రామస్తులు, ఔత్సాహికులు, రచయితలు ఇటువంటి అధ్యయనాలు చేశారు. వీటి పరిధి చాల ఎక్కువ. ఇవి గ్రామం గురించి తెలియవలసిన విషయాలన్నిటినీ ఒక్కచోట మూట కట్టాలనుకుంటాయి. ఇవి ప్రధానంగా గ్రామచరిత్రల రూపంలో ఉండి, సాంస్కృతిక, సామాజిక అంశాలతో పాటు గ్రామానికి సంబంధించిన ఇతర అంశాలను కూడ చిత్రిస్తాయి. కొంతవరకు ఇవి కైఫియత్‌లను పోలి ఉంటాయి.

ఈ గ్రామ చరిత్రలు ఎంత విస్తారమైనవంటే కృష్ణా జిల్లాలోని తన స్వగ్రామం గురించి గొర్రెపాటి వెంకటసుబ్బయ్య ఆరువందల పేజీల **ఘంటసాల చరిత్ర** పుస్తకం రాశారు. తమ గ్రామ చరిత్ర రాయాలని మొదట 1917లో ఆలోచన వచ్చిందని, 1937లో రాయడం పూర్తి చేశానని, 1947లో మొదటిసారి అచ్చువేశానని ఆయన రాశారు. అదే పుస్తకం 1966లో పునర్ముద్రణ పొందినప్పుడు ఇంకా విస్తరించారు. ఘంటసాల గ్రామానికి దాదాపు రెండువేల సంవత్సరాల చరిత్ర ఉంది గనుక ఆయన రచన ఆ చరిత్రకంతా అద్దంపట్టింది. కాని అంత సుదీర్ఘ చరిత్ర లేని గ్రామాల గురించి కూడ ఆతర్వాతి కాలంలో అధ్యయనాలు వెలువడ్డాయి. **కవుతరం చరిత్ర**, పాటిబండ్ల వెంకటపతి రాయలు రాసిన **వీరులపాడు**, ఎం. కోదండరాం, మల్లేపల్లి లక్ష్మయ్య, ఆర్. లింబాద్రి రాసిన **మోతె – తెలంగాణ బతుకు బాట** (2001), వంగా నర్సయ్య రాసిన **కాకతీయ సౌరభం – కుందవరం** (2007), జి. యాదగిరి రాసిన **ఎల్లమ్మ రంగాపురం గ్రామ చరిత్ర** (2011), కపిలవాయి కిశోర్ బాబు రాసిన **నాగర కర్నూల్ తాలూకా గ్రామాల చరిత్ర** (2011) వంటి వివరమైన గ్రామ అధ్యయనాలు, వ్యాసరూపంలో వెలువడిన సంక్షిప్త గ్రామ అధ్యయనాలు ఎన్నో ఉన్నాయి. కడపజిల్లా గ్రామనామాల గురించి కేతు విశ్వనాథ రెడ్డి చేసిన పరిశోధనను కూడ ఈ గ్రామ అధ్యయనాలలో చేర్చవచ్చు.

అయితే ఈ అధ్యయనాల దృష్టి సాహిత్యపరమైనదే, రాజకీయార్థిక మైనది కాదు. వీటి పూనిక గ్రామాల చరిత్ర, సంస్కృతిల పైననే గాని సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాల పైన కాదు. అందువల్ల ఇవి వందల సంవత్సరాల గ్రామ చరిత్రను వివరించినప్పటికీ గ్రామం గురించి అత్యవసరంగా తెలియవలసిన ముఖ్యమైన విషయాలెన్నో మిగిలిపోతాయి. ఈ రచనల దృక్పథం కూడ ప్రధానంగా రూపపరమైనదే గాని సారాంశం వైపు చూసేది కాదు. కొంతవరకు కథ, నవల ప్రక్రియలలో గ్రామ సారాన్ని కూడ పట్టుకునే ప్రయత్నం జరిగింది గాని అది కూడ సమగ్రమైనది కాదు.

ఇటువంటి అధ్యయనం సాగించడానికి సుదీర్ఘ అనుభవం, లోతైన అవగాహన కావాలి. గ్రామాన్ని ఒకటి రెండు రోజుల్లో, నెలలో చూసి ఇటువంటి అధ్యయనాన్ని వెలువరించడం సాధ్యం కాదు. గ్రామంతో, గ్రామ చరిత్ర, సంస్కృతులతో గాఢమైన అభినివేశం, ఆ గ్రామం పట్ల ప్రేమ, గ్రామంలో సంబంధాల చలనశీలత గురించి వాస్తవికమైన, సన్నిహితమైన సంబంధం ఉన్నప్పుడు ఇటువంటి అధ్యయనం సాధ్యమవుతుంది. నిజానికి ఇవి ఆయా రచయితలు అధ్యయనం చేస్తున్నామని తెలియకుండా చేసిన అధ్యయనాలు. నిత్యజీవిత గమనంలో వాళ్లు తమలో సంలీనం చేసుకున్న అంశాలెన్నో రచనలో వ్యక్తీకరణ పొందుతాయి. అవి ఒకసారి రచనగా వెలువడిన తర్వాత ఆ గ్రామం గురించి మాత్రమే కాక, అసలు మొత్తంగా గ్రామీణ వ్యవస్థ గురించే గొప్ప సెకండరీ సోర్సెస్‌గా ఉపయోగపడతాయి. ఇవి రాయడానికి వ్యక్తిగత అనుభవంతో పాటు, దశాబ్దాల పాటు రాసి పెట్టుకున్న నోట్స్, విశాలమైన సెకండరీ సోర్సెస్‌ను సంప్రదించడం, విస్తృతమైన అధ్యయనం, నిశితమైన విశ్లేషణా సామర్థ్యం అవసరమవుతాయి.

ఇటువంటి అధ్యయనాలతో ప్రధాన సమస్య ఇవి ఇంగ్లిష్ నుడికారం చెప్పినట్టుగా చెట్లను చూడడంలో పడి అడవిని చూడడం మరచిపోతాయి. ఒక కాల్పనిక భావోద్వేగంతో రూపాలను చిత్రించడం సాగుతుంది గాని కొంచెం బయటకు వచ్చి, నిర్మమకారంగా సారాన్ని వెతకాలనే ప్రయత్నం తక్కువగా ఉంటుంది. రచన చదువుతున్నప్పుడు చాల ఆసక్తిదాయకంగా, హృదయానికి హత్తుకునేట్టుగా సాగిపోతుంది గాని గ్రామంలోని చలనానికి మూలమైన సూత్రాలేమిటో, గ్రామ చలనానికి చోదకశక్తు లేమిటో తెలిసే అవకాశం తక్కువ.

అలాగే ఈ పద్ధతిలోనే భాగంగా చెప్పదగిన సాహిత్య ప్రక్రియ ఉంది. చాల మంది సృజనాత్మక రచయితలు తమ సాహిత్య ప్రక్రియలలో గ్రామాలను చిత్రించారు. ముఖ్యంగా కథ, నవల ప్రక్రియలలో గ్రామాల చిత్రణలు, అధ్యయనాలు, విశ్లేషణలు చాల సమర్థంగా వెలువడ్డాయి. కాళీపట్నం రామారావు రాసిన **యజ్ఞం** కథలో, అల్లం రాజయ్య రాసిన **కొలిమంటుకున్నది** నవలలో, మరెన్నో కథల్లో, నవలల్లో గ్రామం, గ్రామం లోని సామాజిక సంబంధాలు, ఘర్షణలు విస్పష్టంగా కనబడతాయి.

**ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల అధ్యయనాలు:** ముందే చెప్పుకున్నట్టు, 1947 తర్వాత పాలకులకు గ్రామాలను మార్చవలసిన, అభివృద్ధి పథకాలు రచించి అమలు చేయవలసిన బాధ్యతలు వచ్చాయి. ఆ బాధ్యతలను నిర్వర్తించడానికి ప్రభుత్వాలు గ్రామ అధ్యయనాలు ప్రారంభించాయి. పాలక విధానాల రూపకర్తలు, అధికారులు, ప్రభుత్వ సంస్థలు, ప్రభుత్వం నియమించిన ప్రభుత్వేతర సంస్థలు, కొంతవరకు ప్రభుత్వాల కోసం సామాజిక శాస్త్రవేత్తలు ఇటువంటి అధ్యయనాలు చేశారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల గ్రామీణాభివృద్ధి శాఖలు, వ్యవసాయ శాఖలు, ఇతర సాంఘిక సంక్షేమ శాఖలు తమ తమ విధానాల రూపకల్పన కోసం, అమలు కోసం గ్రామ అధ్యయనాలు సాగించాయి. దేశ స్థాయిలో జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థ (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ రూరల్ డెవలప్‌మెంట్ – ఎన్‌ఐఆర్‌డి), రాష్ట్రాల స్థాయిలో మరెన్నో

సంస్థలు (ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఆఫ్ రూరల్ డెవలప్‌మెంట్ – అపార్డ్) ఇటువంటి అధ్యయనాలు చేయడానికే ఏర్పాటయ్యాయి.

ఈ ప్రభుత్వ ప్రాయోజక అధ్యయనాలకు పెద్ద ఎత్తున వనరులు, సిబ్బంది, అవకాశాలు ఉన్నప్పటికీ, కొన్ని మౌలికమైన సమస్యలు ఉన్నాయి. అవి ఒకటి – ఆసక్తి, రెండు – కేంద్రీకరణ, మూడు – పాలనాపరమైన సమస్యలు, నాలుగు – పర్యవసానాలు.

ఈ పద్ధతిలో పరిశీలకులకు గ్రామ అధ్యయనం చేయాలనే ఆసక్తి ఉండకపోవడానికే ఎక్కువ అవకాశం ఉంటుంది. వారు కేవలం ఒక ఉద్యోగంగా, మరెవరో చెప్పిన పనిగా గ్రామానికి వస్తారు. మొదటి రెండు పద్ధతులలో పరిశీలకులకు గ్రామంతో సాన్నిహిత్యం, ఆసక్తి ఉంటాయి గాని ఈ పద్ధతి పరిశీలకులు కేవలం జీవనోపాధి అవకాశంగా మాత్రమే ఈ పనికి వస్తారు. వారికి గ్రామం గురించి విశ్వసనీయమైన, వాస్తవికమైన సమాచారం ఇవ్వాలని, అధ్యయనం జరపాలని పట్టుదల ఉండకపోవడానికే ఎక్కువ అవకాశం ఉంటుంది. ఈ ఆసక్తి లేమి, లేదా తక్కువ ఆసక్తి వల్ల గ్రామంలో వారు జరపవలసిన అధ్యయనం సక్రమంగా జరగదు. ఈ పద్ధతిలో ప్రశ్నపత్రాలు నింపడమే ప్రధానమైన పనిగా ఉంటుంది గనుక చాల వరకు పరిశీలకులు ప్రజలను కలవకుండానే తమ సొంత పరిజ్ఞానంతో ప్రశ్నపత్రాలు నింపడానికి ప్రయత్నిస్తారు.

ఈ పద్ధతిలో గ్రామం మొత్తాన్ని అధ్యయనం చేయాలనే అవగాహన విధాన రూపకర్తలకే ఉండదు. అప్పటికప్పుడు ప్రభుత్వం అడిగిన ఏదో ఒక సమాచారాన్ని రాబట్టడానికి ఒక ప్రశ్నపత్రం తయారు చేసి పరిశీలకులను గ్రామానికి పంపితే సరిపోతుందనుకుంటారు. అందువల్ల ఈ సమాచార సేకరణ ఎంత సంకుచితమైన కేంద్రీకరణగా ఉంటుందంటే ఏ అంశాన్ని గురించి అధ్యయనం చేస్తారో దానితో సన్నిహిత సంబంధంలో ఉండే ఇతర అంశాలేవీ పరిగణనలోకి రావు. ఉదాహరణకు ఐదు నుంచి పద్నాలుగేళ్ల లోపు బాలబాలికల్లో పోషకాహార లోపం అని అధ్యయనం చేసే వాళ్లు పోషకాహార లోపం లేకపోయినా ఇతర తీవ్ర వ్యాధులున్న పిల్లలను గురించి గాని, ఆ వయసు కన్న తక్కువ, ఎక్కువ ఉన్న పిల్లల గురించి గాని కనీసమైన సమాచారం కూడ నమోదు చేయరు. పోషకాహార లోపానికి కారణాలను కూడ నమోదు చేయరు. గ్రామంలోని ఆర్థిక, సామాజిక అంతరాలకూ పోషకాహార లోపానికీ ఉండే సంబంధాన్ని గురించి పట్టించుకోరు.

ఇక పరిశీలకులు నిజాయితీతో, సామాజిక నిబద్ధతతో పనిచేసినా, చెప్పని విషయాలు కూడ సేకరించినా ఈ పద్ధతిలో ప్రధాన లోపం సమాచార సేకర్తలు వేరు, ఆ సమాచారాన్ని విశ్లేషించి నివేదికలు రాసేవారు వేరు కావడం. సాధారణంగా కింది నుంచి అవసరమైన, ప్రజానుకూలమైన, కచ్చితమైన సమాచారమే వచ్చినా, ఆ సమాచారం ఆధారంగా నివేదికలు రాసి, విధానాలను తయారుచేయవలసిన అధికారులు పాలకవర్గ భావజాలంతో ఉంటారు. వారు తప్పనిసరిగా ఆ అధ్యయనాల పరిధిని కుదించి, సమస్యను తక్కువ చేసి చూపి, ఏవో నామమాత్రపు సంస్కరణ పరిష్కారాలు సూచించి చేతులు దులుపుకుంటారు. లక్షల రూపాయలు, కొన్నిసార్లు కోట్ల రూపాయలు వెచ్చించి జరిగే పరిశీలనలు, అధ్యయనాలు ఇలా చివరికి ఎందుకూ పనికిరాని నివేదికలుగా మారి విధానకర్తల, రాజకీయ నాయకుల, ప్రభుత్వ ఉన్నతాధికారుల కార్యాలయాలలో దుమ్ము కొట్టుకుంటూ ఉండిపోతాయి.

ఈ అడ్డంకులన్నీ ఏదో ఒకరకంగా దాటవచ్చుననుకున్నా ఈ అధ్యయనాల అంతిమ లక్ష్యం గ్రామాన్ని, వ్యవస్థను యథాతథంగా ఉంచడమే. గ్రామీణాభివృద్ధికి, గ్రామంలో మార్పుకు, గ్రామంలో వెనుకబడిన వర్గాల అభ్యున్నతికి తోడ్పడే విధానాల రూపకల్పనకే ఈ అధ్యయనాలు అని ఎంత చెప్పినప్పటికీ, గ్రామీణ సమాజంలోని అసమానతలను, దోపిడీ పీడనలను యథాతథంగా కొనసాగించడానికి పనిచేయడమే ఈ అధ్యయనాల లక్ష్యం. ఆ అసమానతలకు, దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా పోరాడడానికి సిద్ధపడే ప్రజలను మాయ చేయడమే, వారి సమస్యలకు తప్పుడు పరిష్కారాలు సూచించడమే ఈ అధ్యయనాల లక్ష్యం.

ఈ ప్రభుత్వ ప్రాయోజక గ్రామ అధ్యయనాలు ఎంత విరివిగా జరిగినా, ఎంత నిశితంగా జరిగినా, ఎంత మెరుగ్గా జరిగినా ఈ కారణాలవల్ల అవి నిరుపయోగమైనవే అవుతాయి. అయితే ఆరు దశాబ్దాల ప్రభుత్వ ప్రాయోజక గ్రామ అధ్యయనాలు పరిశీలనా పద్ధతులను బాగా అభివృద్ధి చేశాయి. పరిశీలనా పరికరాలను పదును పెట్టాయి. కనుక ఆ అధ్యయన పద్ధతితో దృక్పథంలో విభేదిస్తూనే, దాని పనితీరును, పరికరాలను జాగ్రత్తగా పరిగణనలోకి తీసుకోవలసి ఉంది. ఈ అధ్యయన ప్రణాళికలను ప్రధానంగా సామాజిక శాస్త్ర సంవిధానాలను వాడుకుని తయారుచేశారు గనుక వాటికి కొంత శాస్త్రీయత ఉంటుంది. ఈ పద్ధతిలో సాధారణంగా సమాచార సమాహారం (డాటా ఇన్వెంటరీ), నమూనా అధ్యయనాలు (సాంపిల్ స్టడీస్), ప్రశ్నపత్రాలు (క్వశ్చనీర్స్), చర్చనీయాంశాలు, విడిగా ఒక వ్యక్తినో, కుటుంబాన్నో, సమస్యనో తీసుకుని వివరమైన పత్రం రాయడం (కేస్ స్టడీ), సామాజిక చిత్రపటం తయారు చేయడం (సోషల్ మాపింగ్) వంటి సాంకేతిక ప్రక్రియలు ఉంటాయి. ఈ ప్రశ్నపత్రాలు చాల వివరంగా ఎన్నో ప్రశ్నలతో, ఎన్నో పేజీలు విస్తరించుకుని ఉంటాయి.

ఉదాహరణకు ఎన్ఐఆర్‌డి **మా గ్రామం కథ** అనే పరిశోధనా పథకంలో భాగంగా మా గ్రామచరిత్ర, మా గ్రామంలో భూమి చరిత్ర, మా గ్రామంలో అడవి చరిత్ర, మా గ్రామంలో సాంప్రదాయిక పాలనావ్యవస్థలు, ప్రభుత్వ అభివృద్ధి పథకాలు, గ్రామసభ – అభివృద్ధి, మా గ్రామంలో సౌకర్యాలు అనే ఏడు అధ్యాయాల కింద 102 చర్చనీయాంశాల మీద సమాచారం సేకరించింది. అదనంగా ప్రత్యేక ప్రశ్నలు అని మరొక పదిహేడు అంశాలు చేర్చింది. అలాగే గ్రామ సర్వే ప్రశ్నపత్రంలో పదిహేడు ప్రశ్నలు – ఒక్కొక్క ప్రశ్నకు సాధ్యమయిన అనేక జవాబుల ద్వారా సమాచారాన్ని రాబట్టింది. భూసంస్కరణల స్థితి సర్వేలో పందొమ్మిది చర్చనీయాంశాల ప్రశ్నపత్రం తయారుచేసింది.

ఇక అపార్డ్ 73, 74 రాజ్యాంగ సవరణల విషయంలో పంచాయతీరాజ్ శిక్షణా నిర్వాహకుల కోసం తయారు చేసిన మన ఊరి బ్రతుకు, మన ఊరి సంపద, మన ఊరి బాగు, సామాజిక చిత్రపటం అనే పత్రాలలో అనేక ప్రశ్నలు, చర్చనీయాంశాలు, శిక్షణా పరికరాలు సూచించింది.

ముందే చెప్పినట్టు ఈ పద్ధతి వెనుక ఉన్న దృక్పథంతో ఎన్ని విభేదాలున్నప్పటికీ, ఈ పద్ధతిని అర్థం చేసుకోవడం, ఈ పద్ధతిలోని మెరుగైన పరికరాలను ప్రజానుకూల గ్రామ అధ్యయన దృక్పథంలో భాగం చేసుకోవడం అవసరం.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

# విద్యార్థులకు చరిత్రను ఎలా బోధిస్తున్నాం?

***చరిత్రను దాని నిజమైన అర్థంలో నిజాయితీగా బోధిస్తే నడుస్తున్న తెలంగాణ ఉద్యమంలో యువత ఆత్మహత్యలకు పాల్పడేది కాదని అంటున్నారు* డా. జి. లచ్చయ్య**

సకల జనుల సమ్మెకు మంగళం పాడి, ఉప ఎన్నికల పోరు ముగిసిన ఇరవై నాలుగు గంటల్లోపే తిరిగి ఆత్మహత్యల పరంపర మొదలైంది. భోజ్యా నాయక్‌తో మొదలైన బలిదానాలు మరో శ్రీకాంత్‌తో, నవీన్‌లతో కొనసాగుతూనే ఉన్నాయి. అందరూ తమ మరణ వాజ్మూలంలో తెలంగాణ రాదేమోననే ఆందోళనను వ్యక్తపరుస్తూ చనిపోవడం జరుగుతున్నది. ఎప్పటిలాగా రాజకీయ వేదికలు సానుభూతిని కురిపించడం, 'ఆత్మహత్యలు వద్దు – పోరాటం ముద్దు' అనే పసందైన నినాదాన్ని నినదిస్తూ, ర్యాలీలు, ప్రదర్శనలు మొదలయ్యాయి. యువత మాత్రం వీటిని ఖాతర్ చెయ్యకుండానే తనువుల్ని తృణప్రాయంగా భావించి చాలిస్తున్నారు. ఈ బలిదానాల పరంపర మరెంత మందిని బలిగొంటుందోనని, ఏ ఇంట్లో ఏ క్షణాన కడుపుశోకాన్ని కలిగిస్తుందో తెలియని స్థితి దాపురించింది. ప్రస్తుతం పరీక్షల కాలం కూడా కావడంతో ఏ క్షణాన ఏ వార్త వినాల్సి వస్తుందోనని తల్లిదండ్రులు విపరీతమైన మానసిక క్షోభకు గురవుతున్నారు. దీనికి ఆరంభమే తప్ప అంతం కనబడడం లేదు.

తెలంగాణ ఏర్పాటే దీనికి విరుగుడని ఉద్యమ పార్టీలు అంటుంటే, టిడిపి, కాంగ్రెస్ పార్టీలు ఒకదానిపై ఒకటి బురద చల్లుకుంటున్నాయి. నువ్వంటే నువ్వని తిట్ల పురాణాన్ని లంఘించుకుంటున్నాయి. తెలంగాణ అంశం అంత సులువుగా తేలదని, తేలే అంశం కాదని అన్నీ రాజకీయ పార్టీలకు అంతర్గతంగా తేలిపోయింది. అయినా, 'ఇగొచ్చే, అగొచ్చే' అంటూ తెచ్చేది, ఇచ్చేది తామేనంటూ కాంగ్రెస్ జపం చేస్తుంటే, అభిప్రాయాల్ని ఎన్నిసార్లు చెప్పాలని తెలుగుదేశం కొత్తరాగం మొదలుపెట్టింది. ఎన్నికల దెబ్బనో ఏంటోగాని, తాను తెలంగాణ వ్యతిరేకిని కాను అంటూ బాబు కొత్త పల్లవి కూడా మొదలుపెట్టారు. ఇక ఉద్యమ పార్టీ అయిన టిఆర్ఎస్ ఎన్నికల్లో తెలంగాణవాదాన్ని గెలిపించి, నిరూపిస్తేనే అధిష్టానానికి దిమ్మతిరుగుతుందనీ, ఢిల్లీ దిగివస్తుందనీ గత 2004 నుంచి నెత్తినోరు కొట్టుకుంటూనే ఉంది. ఇప్పటికి ఎనిమిదిసార్లు తెలంగాణవాదాన్ని ఎన్నికల్లో చాటినా ఢిల్లీ దిగిరావడం గానీ, దిమ్మతిరిగి కాంగ్రెస్ అధిష్టానం పడిపోవడంగానీ జరక్కపోగా, టిఆర్ఎస్ పార్టీయే ఢిల్లీ చుట్టూ తిరగడం మొదలైంది.

మొన్నటి ఉపఎన్నికల్లో మహబూబ్‌నగర్ ఓటర్లు టిఆర్ఎస్‌కు దిమ్మతిరిగే విధంగా తీర్పు చెప్పారు. దీన్ని జీర్ణించుకోలేక సతమత మైతున్న టిఆర్ఎస్‌కు తిరిగి రాబోయే పరకాల ఉప ఎన్నిక అగ్ని పరీక్షగా మారబోతున్నది. తెలంగాణ సాధన ఏమోగాని, పరకాలలో విజయం టిఆర్ఎస్‌కు కత్తిమీద సాములాంటిదే. ఇంతకాలం ఉద్యమాన్ని తాను అనుకున్నట్లుగా నడుపుతూ, గాధి తప్పిస్తూ మధ్య మధ్యన యజ్ఞ యాగాలతో ఉద్యమానికి కళ్లెం వేస్తూ తన చెప్పు చేతుల్లో ఉంచుకున్న టిఆర్ఎస్‌కు పరకాల ఉప ఎన్నిక పీడకలగా పరిణమించబోతున్నది. టిఆర్ఎస్ ఒంటెత్తు పోకడలు గత సంవత్సరంలో జరిగిన సహాయ నిరాకరణ సమయంలో, మిలియన్ మార్చ్ సందర్భంలో, సకల జనుల సమ్మె సందర్భంలో స్పష్టంగా బయటపడింది. వీటిని గుణపాఠంగా గ్రహించని ఉద్యోగ జెఎసి, ఉపాధ్యాయుల జెఎసి, కార్మిక జెఎసిలు ఇంకా టిఆర్ఎస్ వెనుక ర్యాలీ కావాలని భావిస్తూ ఆడించినట్టల్లా ఆడడం పరిపాటైంది.

ఇక ఎంతో ఉద్వేగభరిత వాతావరణంలో ఏర్పాటైన తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టిపిఎఫ్) ఆచూకి లేకుండా పోతున్నది. ఫ్రంట్ ఆవిర్భావం రోజున ఎన్నికలకు పోవాలా వద్దా అనే చర్చ జరగ్గా, ఎన్నికలతో తెలంగాణ రాదని ఘంటాపథంగా చెప్పిన గద్దర్ పార్టీ వచ్చిన ఉప ఎన్నికల్లో పత్రికా ప్రకటనలకే పరిమితమైంది తప్ప ఉద్యమాన్ని నడపలేకపోయింది. పైగా ఇతర రాజకీయ పార్టీల్లాగానే, నాయకుల్లాగానే గద్దరన్న కూడా మీడియా పాయింట్లకు, ధర్నా టెంట్‌లకు పరిమితం కావడం శోచనీయం. తనకంటూ ఓ ఉద్యమ పంథాను ఎంచుకోలేని స్థితిలో టిపిఎఫ్ ఉండిపోవడం బాధాకరం. టిపిఎఫ్ ఆవిర్భావం తెలంగాణ ఉద్యమాన్ని ఓ మలుపు తిప్పుతుందనీ, టిఆర్ఎస్‌కు ప్రత్యామ్నాయంగా మారుతుందని భావించిన వారికి అంతా నిరాశనే ఎదురైంది. నిజానికి ఇదే తరహా చర్చ అక్టోబర్ 2010లో జరిగింది కూడా. కాని తలిచింది ఒకటైతే, జరిగింది, జరుగుతున్నది మరొకటి.

సహజంగా ఉద్యమ పార్టీలకు గతి తార్కికం ఉంటుంది. చారిత్రక సత్యాల్ని శోధిస్తాయి. గత అనుభవాల్ని క్రోడీకరించుకుంటాయి. అవసరాలకు అనుగుణంగా జనాన్ని మమేకం చేసుకుంటూ ఉద్యమానికి సారథ్యం వహిస్తాయి. ఈ సైద్ధాంతిక, తాత్విక చింతన టిఆర్ఎస్‌లో ఎక్కడా కనపడకపోగా, టిపిఎఫ్‌లో కూడా ఈ ఆలోచన లోపించింది.

ఎన్నికల్లో విజయం సాధించినప్పుడల్లా ఇక తెలంగాణ తథ్యమని ప్రకటనల్ని గుప్పించడం, కొంతకాలం తర్వాత ఉద్యమాలని యువతను రెచ్చగొట్టడం టిఆర్ఎస్‌కు పరిపాటైంది. ఎన్నికలప్పుడు తెలంగాణవాదం నిలబెట్టకపోతే తెలంగాణవాదం లేనట్లే అనే తప్పుడు భావనని జనాల్లో, యువకుల్లో కలిగించడం, దీంతో ఎన్నికల సమయంలో యువత ఎన్నికల ప్రచారంలో పాల్గొనడం, తిరిగి ఉద్యమబాట అనగానే, రోడ్లపై నినదించడం తెలంగాణ యువతకు తప్పనిసరైంది. ఇలాంటి గందరగోళ పరిస్థితిలో ఎటూ పాలుపోని యువత నిరాశా, నిస్పృహలకు లోనుకావడం, ఆత్మహత్యల్ని ఎంచుకోవడం సర్వసాధారణమైపోయింది. ఈ విషయాల్ని గుర్తించడంలో రాజకీయ పార్టీలు, ముఖ్యంగా టిఆర్ఎస్

రాజకీయ తాంత్రికతతో, చతురతతో కోల్పోయిన ఎంఎల్ఏల బలాన్ని తిరిగి పోందాలనే ఎత్తుగడలతో వ్యూహాత్మకంగా అడుగులు వేస్తోంది. దీన్ని గ్రహించని విద్యార్థిలోకం, ఉద్యోగ సంఘాలు వ్యూహాత్మక తప్పిదాలకు గురైతున్నాయి. ఈ తప్పిదాలే యువతకు శాపంగా మారి, బలిదానాల వైపు పురిగొల్పుతున్నాయి. వీటి నివారణకు మార్గాల్ని అన్వేషించాల్సిన రాజకీయ పార్టీలు, వాటి అనుబంధ సంస్థలు 'ఆత్మహత్యలు వద్దు – పోరాటం ముద్దు' అనే చిలుకపలుకు నినాదాలతో సరిపెట్టుకుంటున్నాయి. సకల జనుల సమ్మె ముగిసిన తర్వాత ఒక్క బలిదానం జరక్కపోగా, ఉప ఎన్నిక జరిగిన ఇరవై నాలుగ్గంటల్లోపే తిరిగి బలిదానాల పరంపర మొదలు కావడం వెనకగల కారణాలను విశ్లేషించుకోవాల్సిన అవసరం ఉద్యమ పార్టీకి, దీన్ని నమ్ముకున్న ఇతర వర్గాలకు ఎంతైనా ఉంది. ఆత్మ బలిదానాలకు కాంగ్రెస్ కారణమంటే, టిడిపి ద్వంద్వ వైఖరిని మరొకపార్టీ దుమ్మెత్తి పోస్తున్నది. ఈ రెండు పార్టీలు టిఆర్ఎస్ ఒంటెత్తు పోకడల్ని ఎండగడుతున్నాయి. మధ్యన అవకాశం కోసం చూస్తున్న బిజెపి కేంద్రంలో అధికారం కోసం కాచుకొని కూచుందే తప్ప, ఆత్మహత్యల నివారణకై నిజాయితీతో కూడిన ఉద్యమానికి రూపకల్పన చేయలేకపోతున్నది. కారకులు ఎవరైనా, కారణాలు ఏవైనా, కాలి బూడిదైతున్నది మాత్రం తెలంగాణ యువతనే.

బలిదానాల సందర్భంగా ఈ మధ్యన కొత్త నినాదాలు చోటు చేసుకుంటున్నాయి. భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్, సీతారామరాజు పేర్లు వినబడుతున్నాయి. వారిలాగా పోరాడాలని, పోరాడి సాధించాలని, ఆత్మహత్యలు పిరికి చర్యలని, ఉద్యమంలో చంపి చావాలని, ఆత్మహత్యలు తెలంగాణ సాధనకు పరిష్కారాలు కావనే ప్రకటనలు గుప్పుమంటు న్నాయి. ఇంతవరకు బాగానే ఉంది, కానీ, ఈ దేశభక్తుల్ని బ్రిటిష్ వారి కాలంలోనే నాటి రాజకీయ పార్టీలే వారిని దేశభక్తులుగా గుర్తించలేక పోయాయి. అందులో మొట్టమొదటి వ్యక్తి గాంధీజీ కాగా, కాంగ్రెస్ మొదటి పార్టీ కావడం గమనార్హం. భగత్‌సింగ్‌ను 'షహీద్' అని నినదిస్తున్న నేటి బిజెపి రూపంలోని నాటి సంఘ్ పరివార్ భగత్‌సింగ్ చర్యలను ఒప్పుకోక పోగా, అసలు భగత్‌సింగ్ బాటనే ఉచ్చరించడానికి ఇబ్బంది పడుతుంది. ఇక టిఆర్ఎస్‌కు ఏ వారసత్వం లేకపోగా, అన్ని పార్టీల సంగమంగా తయారైనా, మతతత్వ భావజాలమే దానికి మెండుగా ఉంది. ఈ వాసనతోనే కెసిఆర్ చండీయాగాల్ని చేపడుతుంటే, ఆయన అనుంగు ఉద్యమకారులు ఆ హోమానికి 'సమరు'కు (నెయ్యి) ధారపోస్తున్నారు. విధిలేక కొమురం భీంను ముందేసుకోవాల్సి వచ్చింది. నిజానికి భగత్‌సింగ్ అగుడు జాడల్లో నడుస్తున్న యువత తెలంగాణ కోసమే కాదు, యావత్ భారత ప్రజల విముక్తికై పోరాడుతున్నారు. వీరిపట్ల టిఆర్ఎస్ అభిప్రాయం ఎలా ఉంటుందో టిఆర్ఎస్ అధికారం లోకి వస్తే తెలుస్తుంది. టిఆర్ఎస్ అధికారంలోకి వస్తే అన్ని పాలక పక్షాల్లాగే నేటి భగత్‌సింగ్‌ల పట్ల వ్యవహరిస్తుంది. ఇది కాదనలేని వాస్తవం. అలాంటప్పుడు తెలంగాణ యువత భగత్‌సింగ్ అవసరమైతే, (అవసరం ఎప్పుడో ఎవరికి తెలియదు) తల నరుక్కుంటానని, కెసిఆర్ చచ్చుడో, తెలంగాణ తెచ్చుడో అనే ప్రకటనలు యువతను రెచ్చగొట్టాయి. ఆ ప్రకటనల ఫలితాల్ని తెలంగాణ తల్లులు గర్భశోకంతో అనుభవిస్తూనే ఉన్నారు. వీటిని సత్వరమే నివారించే మార్గాల్ని ఆలోచించకుండా, ఉద్యమ ఎత్తుగడల్ని రూపొందించకుండా, కేవలం 'ఆత్మహత్యలు వద్దు' అనే నినాదం యువతను ఆలోచింప చేస్తుందా? భగత్‌సింగ్ లాగా మార్చుతుందా?

ఓ చారిత్రక నేపథ్యం లేకుండా, తార్కికం లేకుండా, ఉద్యమాన్ని ఎలా నడపాలో స్పష్టత లేకుండా నడిపితే ప్రస్తుత పరిణామాలే ఉంటాయి. ఉద్యమ గమ్యం ఆలస్యంగా చెరుకున్నా ఫరవాలేదు గాని, ఉద్యమానికి వక్రభాష్యం చెప్పడం తప్పుడు సంకేతాల్ని యువతలోకి పంపించడం సరియైన విధానాలు కావని గుర్తించే స్థితిలో టిఆర్ఎస్‌తో పాటు ఏ రాజకీయ పార్టీ లేకపోగా, ఆత్మహత్యల్ని రాజకీయం చేసుకుంటున్నాయి. ఇక మేధావి వర్గం ప్రేక్షకపాత్రను పోషిస్తున్నది. నిజానికి ప్రాపంచిక దృక్పథంతో, చరిత్రను చెప్పాల్సిన విధంగా, విమర్శనాత్మక దృష్టితో విద్యార్థులకు చెపితే ఏ యువకుడూ ఆత్మహత్యను ఎంచుకోడు. తెగించి పోరాడుతాడు. ఆ తెగింపును స్వీకరించే స్వభావం, హుందాతనం నేటి రాజకీయ పార్టీలకు ఉందా? ఉంటుందా అనేది ప్రశ్న! జాతీయోద్యమ కాలం నాటి చరిత్రను అహింస చుట్టూ, గాంధీజీ చుట్టూ తిప్పుతూ ఇదే నిజమైన స్వాతంత్ర్య పోరాట చరిత్ర అని మన చరిత్ర పాటాలు ఘోషిస్తుంటే, అచ్చు గుద్దినట్లు, లైను లైనును మన చరిత్ర ఉపాధ్యాయులు చెబుతుంటే, అదే చరిత్ర పుటలల్లో భగత్‌సింగ్‌కు చోటు లేకుండా పోయిందని, రాజ్‌గురు, సుఖదేవ్‌ల పేర్లు మాయమయ్యాయని ఎంతమంది ఉపాధ్యాయులు చెప్పగలుగుతున్నారు? నిజాంకు ఎదురొడ్డి పోరాడిన కొమురం భీం గురించి కాని, ఆంగ్లేయులతో పోరాడిన సీతారామరాజు గురించి గాని ఆ చరిత్రలోనే మిళితం చేసి విమర్శనాత్మక దృష్టితో చెప్పే ఉపాధ్యాయులు ఎంతమంది? చాకలి ఐలమ్మ, దొడ్డి కొమురయ్య, షోయబుల్లా ఖాన్‌ల గురించి చెప్పే సాహసం ఎంతమంది కుంది? కాకతీయుల వైభవం గురించి పొగుడుతాం. కాని వీరికి వ్యతిరేకంగా పోరాడిన గిరిజన నాయకులైన పడిగిద్ద రాజు, సమ్మక్క, సారలమ్మల గురించి, వారి వర్గ దృక్పథం గురించి వివరించే శక్తిమనకుందా? అసలు మనకో వర్గ దృక్పథం ఉంటే దాన్ని తరగతి గదిలో వినియోగించుకోవాలని ఉంటే చరిత్రను ఎలా బోధించాలో తెలుస్తుంది. అలాంటి బోధన మన తరగతి గదుల్లో మొదలైతే ఏ యువకుడు ఆత్మహత్యను ఎంచుకోడు. ఈ విషయాల్ని గుర్తించకుండా, గుర్తించే ప్రయత్నం చేయకుండా, పాలక పక్షాలు రాయించిన చరిత్రనే చరిత్ర పాఠాల్లాగా బోధిస్తే మిగిలేది బాధలే.

చెగువేరా, కెన్‌సారోవివాల బొమ్మల్ని మల్టినేషనల్ కంపెనీలు టీషర్టుల పైన ముద్రించి సొమ్ము చేసుకుంటే, వారెవరో తెలియకుండానే సరదాగా ఆ టీషర్టుల్ని మన యువత వాడుతుంటే ఏ ఒక్క ఉపాధ్యాయు డైనా వారి గురించి చెప్పగలుగుతున్నారా? మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల పేర్లను ఉచ్చరిస్తేనే ఎక్కడ మననమైపోతామోనని జడుసుకునే నేటి ఉపాధ్యాయ వర్గం భగత్‌సింగ్ పేరు చెప్పి విద్యార్థుల్ని రెచ్చగొట్టడం సరియైతుందా? గాంధీజీకి జిందాబాద్‌తో మొదలై నెహ్రూ, పటేల్ తదితరులకు జైకొట్టి, చివరకు భారతమాతకు 'జై'తో ముగుస్తుంది మన జెండా పండుగ. అసలీ ముగ్గురికీ వైరుధ్యాలున్నట్టు గుర్తించే స్థితిలో లేని ఉపాధ్యాయ వర్గం మధ్య మధ్యన సుభాష్‌ను చేర్చి సంతోషిస్తుంది. ఈ నలుగురికి భరతమాత ఎందుకు తోడైతుందో, ఈమె పుట్టుక ఏంటో ఎవరికీ తెలియదు. ఉన్న దేవతలు సరిపోరని భరతమాతను, తెలుగు తల్లిని తెచ్చిపెట్టాం. వీటికి పోటీగా తెలంగాణ తల్లి వచ్చేసింది. అసలు

మన తల్లులు, అక్కలు, అమ్మలు ఎలా ఉంటారో తెలియదా? అరవై సంవత్సరాల తర్వాత కూడా ఉపాధి హామీ కూలీ కోసం బొమిడివరం (అతుకు) చీర కట్టుకున్న మన అవ్వలు మనకెందుకు కనబడడం లేదు. ఎవరికోసం ఈ దేవతామూర్తుల్ని సృష్టిస్తున్నాం? రాణి రుద్రమదేవి, ఝాన్సీ లక్ష్మీబాయి (ఝల్కారి బాయి అని కొత్తవాదం)లను సమ్మక్క సారలమ్మలతో పోల్చగలమా? మన తల్లులంతా చాకలి అయిలమ్మ లాగా, దూబగుంట రోషమ్మ లాగుంటే జీర్ణించుకోలేని మనం పట్టుచీరతో నెత్తిన కిరీటాన్ని తగిలించి చారిత్రక తప్పిదం చేస్తుంటే మనం జేజేలు కొడుతున్నాం.

నాలుగు కోట్ల తెలంగాణ జనాభాలో, రెండు కోట్లు ఆడవారనుకుంటే, అందులో నడివయస్సు స్త్రీలు ఒక కోటి అనుకుంటే ఇందులో ఒక్కరంటే ఒక్కరు తెలంగాణ తల్లిలాగా ఉండరు. మరో వెయ్యి సంవత్సరాల తర్వాత కూడా అలా ఉండలేరు. ఈ విషయాలన్నీ మనకు తెలియకుండానే జరుగుతున్నాయా? తెలిసినా మనకెందుకు పట్టింపు లేదు? విమర్శనాత్మక దృష్టి ఎందుకు లోపించింది?

దేశంలో ఎన్నో ఉద్యమాలు జరుగుతున్నాయి. సాయుధ బలగాల ప్రత్యేక అధికారిక చట్టాన్ని రద్దు చేయాలని ఇరోం షర్మిల అనే మణిపూర్ సామాజిక కార్యకర్త తన 28వ ఏట నవంబర్ 2009 నుంచి ఆమరణ నిరాహార దీక్ష చేస్తోంది. ప్రస్తుతం ఆమె వయస్సు 39 సంవత్సరాలు. ఆమెను బలవంతంగా హాస్పిటల్‌కు తరలించి ముక్కు నుంచి ద్రవ పదార్థాల్ని ఎక్కిస్తున్నా ఆమె దీక్షను కొనసాగిస్తున్నది. కాని పదవికి రాజీనామా చేసి జంతర్‌మంతర్ వద్ద నిరసన దీక్ష చేసిన మాజీ పోలీసు అధికారిణి నేడు ఎంఎల్ఎ టికెట్ కోసం పాకులాడుతున్నది. ఇది ఎలాంటి ఉద్యమస్ఫూర్తి?

ఇది వ్యక్తిగతమని భావిస్తే, మధ్య మధ్య ఉద్యమ బావుటాలను ఎందుకు ఎగురవేస్తున్నారు? యువతను ఎందుకు రెచ్చగొడుతున్నారు? అదే మణిపూర్‌లో కుకీలు అధికంగా ఉండే సదరన్ హిల్ కౌన్సిల్ ప్రాంతాన్ని ప్రత్యేక జిల్లాగా ఏర్పాటు చేయాలని గత నలభై సంవత్సరాలుగా డిమాండ్ చేస్తే పట్టించుకోని ప్రభుత్వం గత సంవత్సరం ఆగస్ట్ నుంచి అక్టోబర్ దాకా మూడు నెలల పాటు రాష్ట్ర రాజధాని ఇంఫాల్‌తో అనుసంధానమైన రెండు జాతీయ రహదారుల్ని (2, 37) దిగ్బంధానికి గురిచేస్తే వెంటనే దిగివచ్చింది. అది రాజకీయ పోరాటమంటే! కాని మనవారు ఉద్యమం ఉధృతమైన సమయంలో పోటీలు పడి దీక్షలు చేపడతారు. వారం రోజులు ముగియకుండానే, ఏ హామీని పొందకుండానే దీక్షలు విరమిస్తున్నారు. దీక్షలు చేపడుతుంది వారే, విరమిస్తుంది వారే! కాని ఉద్యమానికి అవి ఎలాంటి స్థితిని కలుగజేస్తాయో వీరు పట్టించుకోకపోగా ఉద్యమాన్ని స్వప్రయోజనాలకు వాడుకోవడం తెలంగాణలో పరిపాటైంది. వీరు ఉద్యమ బాటనెంచు కున్నప్పుడు జై కొట్టడం యువత వంతు అవుతున్నది.

అలాగే పంజాబ్ రాష్ట్ర ఆవిర్భావానికి దీక్షల పేరున మోసం చేసిన తారాసింగ్‌ను, ఫతేసింగ్‌ను ఇప్పటికీ ఆ రాష్ట్ర ప్రజలు అసహ్యించు కుంటారు. దీక్ష చేపట్టి ప్రాణాలొదిలిన దర్శన్‌సింగ్‌ను నేటికీ కొలుస్తారు. బొంబాయి కేంద్రంగా గుజరాత్‌ను వేరుపర్చి మహారాష్ట్ర ఏర్పాటుకు జరిగిన పోరాటంలో 105 మంది అసువులు బాసారు. ఈ సందర్భంగా నాటి నెహ్రూ కెబినేట్‌లోని ఆర్థిక మంత్రి సిడి దేశ్‌ముఖ్ తన కేంద్రం పదవికి రాజీనామా చేసాడు. ఈ విషయం మన జయపాల్‌రెడ్డికి ఆదర్శం కాదు. ఈ చారిత్రక అంశాల్ని చెప్పే ఉపాధ్యాయులు నేడు కరువయ్యారు. పైగా ఉద్యమాల్ని సరదా కోసం, కాలక్షేపం కోసం ఉపయోగించుకునే వర్గం ఎక్కువైంది. వివిధ సమ్మెల కాలంలో ఈ విషయం స్పష్టమైంది కూడా. ఎప్పుడూ వచ్చే ఉపాధ్యాయ వర్గం ఉద్యమాల్లో పాల్గొంటే, మిగతా వారు స్వంత పనులను చక్కదిద్దుకున్నారు. ఈ వర్గాలే భగత్‌సింగ్‌కు, భరతమాతకు, నేడు తెలంగాణ తల్లికి జై కొడుతున్నారు.

ఇలాంటి తప్పుడు విధానాల్ని ఎత్తి చూపాల్సిన మనం ఎత్తి చూపక పోగా, రాజకీయ పార్టీల వెనుక ర్యాలీ అవుతున్నాం. వ్యక్తుల నీడన నడవాలని అనుకుంటున్నాం. ఇలా ర్యాలీ కావడం ద్వారా, నడవడం ద్వారా లబ్ధిని పొందవచ్చు అని భావించే మేధావి వర్గం అన్ని కాలాల్లో కనిపిస్తారు. ఇలాంటి వారే నాడు రాజపోషకులుగా అవతరించారు. నేడు ఎగువ సభలకు, నామినేటెడ్ పోస్టులకు ఎంపికైతున్నారు. వీరే వర్తమాన చరిత్రకు రూపకల్పన చేస్తారు. పాలకులు ఈ చరిత్రనే చరిత్ర పుస్తకాల్లోకి ఎక్కిస్తారు. దీన్ని పూసగుచ్చినట్లు మన ఉపాధ్యాయ వర్గం పిల్లల మెదళ్లోకి ఎక్కిస్తూ ఉంటారు. ఈ చరిత్రను విన్న మన పిల్లలు తాము నిమిత్తమాత్రుల మని, అంతా దైవానుగ్రహమని, తమ కర్మకు తామే బాధ్యులమని తమను తాము తిట్టుకోవడం తప్ప ఏమీ చేయలేరు. చేసే విధంగా వారిని చైతన్యం చేసే బోధన ఈ రోజు మచ్చుకు కూడా మన తరగతి గదుల్లో కనపడదు.

భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్, కొమురం భీం, సీతారామరాజు, సమ్మక్క, సారలమ్మలు ఎవరో, వారెందుకు నాటి పాలకులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసారో చెప్పడానికే ఇబ్బందిపడే మనం, ఆత్మహత్యలు చేసుకుంటున్న పిల్లల్ని భగత్‌సింగ్‌లుగా మారాలని ఉద్బోధిస్తే బలిదానాలు ఆగుతాయా? నిజంగానే మన యువకులు తెలంగాణ సాధనకై భగత్‌సింగ్‌లుగా మారితే వారిని మనం స్వాగతించగలమా? కాంగ్రెస్, టిడిపి కాదు – టిఆర్ఎస్ అభినందిస్తుందా? వారికి టిఆర్ఎస్‌లో స్థానం కల్పించి వారికి వెన్నుదన్నుగా నిలుస్తుందా? ఇది మిలీనియం ప్రశ్ననే! కాని సమాధానం అందరికి తెలుసు. రెచ్చగొట్టి, సొమ్ము చేసుకోవాలని తపించే మనం ఉద్యమానికి సమిధలం కాకున్నా ఫర్వాలేదు కాని, ఇతరులను సమిధలుగా మార్చకుంటే చాలు. తెలంగాణ అంటూ ఏర్పడితే, అది కెసిఆర్ యజ్ఞయాగాల ద్వారానే సాధించబడిందని చరిత్ర లిఖించబడితే, కనీసం ఆ చరిత్రనైనా విమర్శనాత్మక దృష్టితో చెప్పే ఉపాధ్యాయులు కావాలని ఆశిద్దాం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.

– సం.

# అసమానతల మధ్య నలిగిపోతున్న బాలికలు - స్త్రీలు

*రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలన్నిటిలో మహిళలు శ్రమిస్తున్నా, వాళ్లు అన్నివిధాలా వివక్షకు గురి అవుతున్నారనీ, ఈ పరిస్థితి మారడానికి అందరూ కృషి చేయాలనీ అంటున్నారు* **తిరుక్కోవెల పద్మావతి**

మన సమాజంలో స్త్రీ, పురుషుల మధ్య వివక్ష నేటికీ చాలా ఉంది. ఇది మన సమాజ ప్రగతిని దెబ్బతీస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో ఈ అసమానత భావన ఎక్కువగా ఉంది. ఐక్యరాజ్య సమితి నివేదిక ప్రకారం స్త్రీలు ప్రపంచంలో మూడింట రెండొంతులు పని చేస్తున్నారు. దారిద్ర్యం, పేదరికం మహిళలపరం అవుతున్నాయి. ఈ కష్టాలు అభివృద్ధి చెందని దేశాల్లో కాదు, ధనిక దేశాల్లో కూడా ఇప్పటికీ స్పష్టంగా కనిపిస్తోంది. ఓర్పుగా దీర్ఘకాలంగా, నిర్విరామంగా చేసే పనులకు స్త్రీలను, బాలికలను మాత్రమే ఉపయోగిస్తున్నారు.

భారతదేశంలో 2001 జనాభా లెక్కల ప్రకారం ఒక కోటి ఇరవై లక్షల మంది బాల కార్మికులు ఉన్నారు. ఇందులో ఆడపిల్లల శాతమే ఎక్కువ. వీరంతా శారీరక, మానసిక హింసకు గురవుతూనే శ్రమిస్తున్నారు. సమాజం వీరిని అవహేళన చేస్తూనే ఉంది. దీని వల్ల ఆత్మన్యూనత భావంలో మునిగిపోతున్నారు బాలికలు. దీంతో వీరి అభివృద్ధి కూడా కుంటుపడుతోంది. వీరి శ్రమకు సరైన ఫలితం అందడం లేదు. శ్రమ దోపిడీకి గురవుతున్నారు. మన రాజ్యాంగం ఒకే రకమైన పనికి స్త్రీ, పురుషులకు సమాన వేతనం చెల్లించాలని నిర్దేశించింది. అయినప్పటికీని బయట వాస్తవంగా స్త్రీలకు న్యాయం జరగడం లేదు. సమ వేతనం అందడం లేదు. బాలికలైనా, స్త్రీలు అయినా ఎదిరించి మాట్లాడరు కనుక తక్కువ కూలీ చెల్లించి వారితో పనిచేయించుకోవడం సమాజానికి అలవాటుగా మారింది.

బాలికలు స్వేచ్ఛగా బయట అడుగు పెట్టలేకపోతున్నారు. ఏ సమయాన ఎటునుంచి ఎలాంటి దుర్ఘటన జరుగుతుందేమోనని భయ భ్రాంతులతో బతుకులు వెళ్లదీస్తున్నారు. స్త్రీ జాతికి రక్షణ కరువైన నేటి సమాజంలో స్వతంత్రంగా, ఆనందంగా జీవించే అవకాశం వీరికి లేకుండా పోయింది.

వ్యవసాయ పనుల్లో, సంప్రదాయక వృత్తి పనుల్లో మహిళలు శ్రమ దోపిడీకి గురవుతున్నారు. పాడి పరిశ్రమ, చేనేత వంటి వృత్తి పనుల్లో అరవై శాతం పైనే పిల్లల శ్రమ ఉంటోందని ఇటీవల సర్వేలు వెల్లడించాయి. వీరు చేసే శ్రమ లెక్కలోకే రావడం లేదన్నది నిత్య సత్యం.

కన్యాశుల్కం పేరిట జరిగే బాల్య వివాహాలు కొంత వరకు ఆపుకోగలిగాం గాని, వరకట్న సమస్య పెరిగిపోతూనే ఉంది. స్త్రీల స్వేచ్ఛను హరించడం, అసమానతలు పాటించడం అనేవి మాత్రం సమాజం నుండి తొలగించుకోలేకపోతున్నాం. ఎందరో మహనీయుల కృషి వలన ఎన్నో సాంఘిక దురాచారాలను ఆపుకోగలిగినప్పటికినీ, నేడు అభివృద్ధి చెందుతున్న ఆధునిక ప్రపంచంలో స్త్రీ, పురుష వివక్షతను ఎంత మాత్రం రూపుమాపుకోలేక పోతున్నాం.

ఎన్నో సామెతలు నేటికీ మన నాలుకలపై కదులుతూనే ఉన్నాయి. 'ఆడది తిరిగి చెడ్డది, ఆమె, తిరుగుబోతు, ఆడదంటే అలుసు, చులకన' అనే మాటలు నిత్యం మనం వింటూనే ఉన్నాం. ఇలాంటి భావాలను సామెతల్లో వాడుతూ స్త్రీలను అణచిపెడుతుండడం శోచనీయం. వీరి అభివృద్ధిని కుంటుపరచడం అన్యాయం. రాణి రుద్రమ్మ, ఝాన్సీ లక్ష్మీ, మదర్ థెరిస్సా, ఇందిరాగాంధీ వంటి మహిళలు ఎందరో స్త్రీ జాతికి వన్నె తెచ్చారు. నేటి ప్రపంచంలో ఎందరో మహిళలు వీరజవాన్లుగా, పైలట్‌లుగా, శాస్త్ర సాంకేతిక రంగంలో ఒకటి కాదు రెండు కాదు, అన్నిరంగాలలో సమర్థవంతంగా తమ నైపుణ్యాన్ని నిరూపించు కుంటున్నారు. పంజాబ్, హర్యానా వంటి రాష్ట్రాలలో మహిళలు ట్రాక్టర్లు నడుపుతూ వ్యవసాయాన్ని అభివృద్ధి పరుస్తున్నారు.

తరతరాలుగా స్త్రీలు, బాలికలు ఇంటా బయటా పని భారంతో కృంగిపోతున్నారు. శారీరకంగా, మానసికంగా ఎదగలేకపోతున్నారు. శక్తికి మించి పని చేయడం వలన ఆరోగ్యాలు క్షీణిస్తున్నాయి. ఎన్నో చోట్ల వీరు చెప్పనలవి కానటువంటి దుర్భర జీవితాలను అనుభవిస్తున్నారు. నేటి కొన్ని వాస్తవ పరిస్థితులను మనం ఇలా చూడవచ్చు.

– అమ్మాయిలు విద్యలో రాణించి ఉద్యోగాలు చేస్తున్నప్పటికీ పురుషులతో పాటు సంపాదిస్తున్నప్పటికీ కట్నం ఇవ్వడం అనేది తప్పడం లేదు.

– కుటుంబ వ్యవహారాలలో స్త్రీలు అణిగి ఉండాలనే భావన ఇంకా బలంగానే కొనసాగుతోంది.

– ఆధిపత్య భావజాలం, కట్టుబాట్లు రూపుమాపడం కష్టతరమవు తోంది.

– జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకునేందుకు పూర్తి స్వేచ్ఛ లేదు.

– అత్యాచారం, వ్యభిచారం, అక్రమంగా కిడ్నాప్‌లు బాలికల పట్ల హింసలు యథేచ్ఛగా కొనసాగుతున్నాయి.

– స్త్రీల ఎదుగుదలను, ప్రశ్నించే తత్వాన్ని, ధైర్యాన్ని చూసి పురుషులు సహించలేకపోతున్నారు.

– ఐక్య రాజ్య సమితి లెక్కల ప్రకారం ఒక సామాన్య గృహిణి ఇంట్లో పది–పదకొండు గంటలు శ్రమ చేస్తోంది. దీనికి విలువ కట్టడం లేదు.

ఇలా మరెన్నో అడ్డంకులను, హింసలను ప్రతిరోజూ వీరు అనుభవిస్తూనే ఉన్నారు. వీటన్నింటిని ప్రభుత్వం రూపుమాపకపోతే సమాజం హీనస్థితికి దిగజారిపోతుంది. వీటి నిర్మూలనకు చక్కని ప్రణాళికలను సిద్ధం చేయాల్సిన అవసరం ఎంతో ఉంది. నేటి పాలకులు దీన్ని గురించి క్షుణ్ణంగా ఆలోచించాలి. బాలికలను చైతన్య పరచడానికి తగిన కార్యాచరణ చేపట్టాలి.

# మానవ మనుగడకు సవాలు - పర్యావరణ కాలుష్యం

*భూమీ, నీరూ, గాలీ, జీవావరణం అంతా ప్రమాదకర కాలుష్య కారకాలతో నిండిపోయిందనీ, వెంటనే కాలుష్య నియంత్రణకు పూనుకోకపోతే మనిషి మనుగడకే ప్రమాదమనీ అంటున్నారు* **డా. సి.ఎచ్. శ్రీనివాస్**

ప్రకృతి సమతుల్యానికి, ప్రజాశ్రేయస్సుకు భంగం కలిగిస్తూ ప్రపంచ వ్యాప్తంగా కోరలు చాచిన పర్యావరణ కాలుష్యం మానవ మనుగడనే సవాల్ చేస్తున్నది. పర్యావరణంలోని మార్పులు దేశ సామాజిక, ఆర్థిక, ఆరోగ్య జీవన విధాన గమనాన్నే మార్చేస్తున్నది. నాగరికత పెరుగుదలగా నిర్వచించబడుతున్న విలాస వస్తు వినియోగ పెరుగుదల, దానిలోని మార్పులు స్వచ్ఛమైన పర్యావరణం లోకి క్లోరోఫ్లోరో కార్బన్ (సిఎఫ్‌సి) సమ్మేళనాలు వెదజల్లబడి, భూగోళం వేడెక్కి వాతావరణంలో తీవ్రమైన మార్పులు సంభవిస్తున్నాయి. దీనివల్ల వర్షపాతం తగ్గి కరువు, కాటకాలను ఏర్పర్చడమే కాకుండా వ్యవసాయరంగ ఉత్పాదకత తగ్గడంతో పాటు నాణ్యమైన, పోషక విలువలతో కూడిన ఆహార పదార్థాల ఉత్పత్తిపై తీవ్ర ప్రభావాన్ని చూపి ఆహార కొరతకు దారితీస్తుంది. 9 జనవరి 2012న భారత ప్రధాని మన్మోహన్ సింగ్ విడుదల చేసిన నాంది సర్వే, మన దేశంలోని 40 శాతం పిల్లలు పౌష్టికార లోపాన్ని కలిగి ఉన్నారని తెలుపడం దీనికి నిదర్శనం.

నవగ్రహాలలో ప్రస్తుతం భూమి ఒక్కటే మానవ నివాసయోగ్యం. కాని అడ్డు అదుపు లేకుండా పెరుగుతున్న జనాభా వల్ల, తదనుగుణంగా వసతుల, సౌకర్యాల కల్పన, ఆర్థికాభివృద్ధి కోసం మానవుడు నిర్వర్తించే కార్యకలాపాలు ప్రకృతి నాణ్యతను క్షీణింపజేసి పర్యావరణ కాలుష్యాన్ని పెంచుతాయి.

భూగోళంపై లభించే వనరులు జీవకోటి అవసరాలు తీర్చడానికి సరిపోతాయి, కానీ ఏ ఒక్కరి (మానవుని) దోపిడీకి సరిపోవని మహాత్మాగాంధీ పేర్కొన్నాడు.

పర్యావరణాన్ని ఒక్క మానవజాతి మాత్రమే కలుషితం చేస్తుందని, జీవావరణ వ్యవస్థలో మానవ జాతి ఒక్కటే సిగ్గుపడవలసిన జాతి లేదా సిగ్గుపడడానికి కారణం కలిగి ఉన్న జాతి అని మార్క్ ట్వెయిన్ అన్నాడు.

అభివృద్ధి ప్రాథమిక దశలో వెనుకబడిన దేశాలలో అధిక జనాభా వృద్ధిరేటు, పేదరిక తీవ్రత వల్ల వనరుల వినియోగం పెరిగి పర్యావరణ వనరుల నాణ్యత దెబ్బతినే స్థాయిలో దోపిడీ జరుగుతోందని సైమన్ కుజ్‌నెట్స్ వివరించాడు.

పర్యావరణ వస్తువుల విలువలలో చేకూరుతున్న లాభనష్టాలలో మన దేశంలో పర్యావరణ క్షీణత దాదాపు 4.5 శాతం జాతీయాదాయానికి సమానంగా ఉంటుంది. జాతీయాదాయ మథింపులో 'పర్యావరణం' తప్పనిసరిగా చేర్చవలసిన అంశం అని షర్మిలా బెనర్జీ అనారు.

ఆధునిక ప్రపంచంలో ఆర్థిక కార్యకలాపాల నిర్లక్ష్య ధోరణి, దోపిడీతత్వం, పర్యావరణానికి గల వనరుల సరఫరా సామర్థ్యానికి పరిమితులను విధిస్తున్నవి. తద్వారా వ్యర్థాలను విలీనం చేసుకొనే సామర్థ్యం కూడా పర్యావరణానికి క్రమంగా తగ్గిపోతోంది. బ్రిటిష్ ఆర్థికవేత్త కెన్నెత్ బౌల్డింగ్ – 'భూమి అనేది ఒక రోదసీ నావలాంటిది. ఇందులో ప్రాణాధారమైన వనరులు పరిమితంగా ఉంటాయి. కాబట్టి మానవజాతి తన వినియోగాన్ని పెంచుకోవడానికి బదులు, వీలైనంత వరకు తగ్గించుకుంటే మంచిది' అని హెచ్చరించాడు. మాల్థస్ నుంచి నేటి వరకు చాలా మంది ఆర్థిక, సామాజిక, పర్యావరణ వేత్తలు పర్యావరణాన్ని, దాని విభాగాలను న్యాయబద్ధంగా మానవాళి వాడుకోవాలని హెచ్చరిస్తూ వస్తున్నప్పటికీ, వాటిని ఖాతరు చేయకుండా మనం పర్యావరణాన్ని దోపిడీ చేస్తున్నాం.

మన దేశంలో పర్యావరణ పరిరక్షణ కోసం క్రిమినాశన చట్టం (1968), వైల్డ్ లైఫ్ ప్రొటెక్షన్ చట్టం (1972), నీటి కాలుష్య నియంత్రణ చట్టం (1974), అడవుల పరిరక్షణ చట్టం (1980) పర్యావరణ పరిరక్షణ చట్టం (1986) వంటి దాదాపు ముప్ఫై చట్టాలతోపాటు పర్యావరణ పరిరక్షణ చర్యలను సూచించడానికి ఏర్పాటైన తివారీ కమిటీ సిఫారసుల కనుగుణంగా 1981లో పర్యావరణ విభాగాన్ని భారత ప్రభుత్వం ప్రత్యేకంగా ఏర్పాటు చేసింది. కాని ఎన్ని చట్టాలున్నా ప్రభుత్వం, ప్రజల మనసుల్లో, చేతల్లో చిత్తశుద్ధి కొరవడడం వల్ల దేశవ్యాప్తంగా కాలుష్యం విస్తృతమై పెనుభూతంగా మారింది.

సాధారణంగా వాతావరణంలో కలుషిత పదార్థాలు ఉండి అవి మానవ ఆరోగ్యాన్ని, వృక్ష జంతు శ్రేయస్సును తగ్గించడాన్ని వాయు కాలుష్యంగా భావించవచ్చు. ప్రపంచ వాణిజ్య సంస్థ 'మానవ చర్యల వల్ల గాలిలోని కొన్ని వాయువులు అధిక పరిమాణంలో కేంద్రీకృతమై,

---

ముఖ్యంగా మగవారు మహిళలపై, బాలికలపై పెత్తనం చేయడం పూర్తిగా విడనాడాలి. ప్రతి పనిలోనూ పురుషులతో పాటు స్త్రీలపై సమభావన దృష్టి కలిగి ఉండాలి. స్త్రీ శక్తిని అర్థం చేసుకొని గౌరవించే స్థాయికి మన సమాజం ఎదగాలి.

ఈ ఆధునిక భావాలు ప్రతి ఒక్కరూ అలవరుచు కోవాలి. రాబోయే కాలంలో మంచి సమాజాన్ని చూడాలంటే అందుకు తగినంత కృషి చేయడానికి మనం పూనుకోవాలి. అపుడే అసమానతల మధ్య నలుగుతున్న స్త్రీ జాతికి విముక్తి లభిస్తుంది. బాలికలు, మహిళలు ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మ స్థైర్యాన్ని మెరుగు పరచుకోవాలి. ఒక అపజయం మరొక విజయానికి సోపానంగా భావించి ముందడుగు వేయాలి. మంచి వ్యక్తిత్వమే మహత్తర కార్యాలను చేయించగలదు.

*(రచయిత తెలుగు పండిట్)*

మానవుని సౌకర్యాన్ని, భద్రతను లేదా ఆరోగ్యానికి ఇబ్బంది కలిగించడాన్ని వాయు కాలుష్యం'గా నిర్వచించింది. పరిశ్రమలు, వాహనాలు, న్యూక్లియర్ పరీక్షలు, గనుల తవ్వకం, విద్యుత్ ఉత్పత్తి వంటి మానవ చర్యల వల్ల కార్బన్ మోనాక్సైడ్, సల్ఫర్ ఆక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్, ఏరోసాల్స్ వంటి విషపదార్థాలు విడుదలై వాయు కాలుష్యాన్ని కలిగిస్తున్నాయి.

వాయు కాలుష్యం వల్ల శ్వాసకోశ వ్యాధులు, ఉబ్బసం, బుద్ధి మాంద్యం, రక్తహీనత, ఊపిరితిత్తుల క్యాన్సర్, కళ్లు, చర్మ ఎలర్జీలు మొదలైన వ్యాధులు మానవ ఆరోగ్యంపై తీవ్ర ప్రభావాన్ని చూపుతాయి. ఈ కాలుష్యం వల్ల మొక్కలపై గల పత్రహరితం క్షీణించడం, ఆమ్ల వర్షాల వల్ల వ్యవసాయరంగ ఉత్పాదకత తగ్గడం, పరిశ్రమల యంత్ర పరికరాలు తుప్పు పట్టి తరుగుదలకు గురి కావడం, ఓజోన్ పొర పల్చబడడం వంటి దుష్పరిణామాలు ఏర్పడుతున్నాయి.

భూభాగంపై జీవరాశుల మనుగడకు, మానవ, జంతుజాలాల ఆరోగ్యానికి, పరిశ్రమలు, వ్యవసాయ, ఇతర కార్యకలాపాలకు స్వచ్ఛమైన నీరు అతి ముఖ్యమైనది. కాని జనాభా విస్ఫోటనం వల్ల గృహాల్లోని వ్యర్థాలు, మానవ వ్యర్థాలు, పారిశ్రామిక వ్యర్థాలు, రసాయనాలు, ఉష్ణద్రవాలు, రసాయనిక, క్రిమసంహారక మందులు, రేడియో ధార్మిక పదార్థాలు, కుళ్లిన పదార్థాలు నీటిలోకి విసర్జించబడి నీటి స్వచ్ఛతను అధమస్థాయికి దిగజార్చి నీటి కాలుష్యాన్ని పెంచుతున్నాయి.

నీటి కాలుష్యం వల్ల వైరస్, బ్యాక్టీరియా మొదలైన సూక్ష్మ క్రిములు వ్యాప్తిచెంది కలరా, టైఫాయిడ్, కామెర్లు, విరోచనాలు వంటి అంటువ్యాధులు ప్రబలడమే కాకుండా చిన్న పిల్లలకు పేగు సంబంధ వ్యాధులు, ప్రజలు కలుషిత నీటి వినియోగం వల్ల అనారోగ్యం పాలై పని గంటలు తగ్గి ఆర్థిక భారాన్ని మోయవలసి వస్తోంది. అంతేకాకుండా కలుషిత నీటిలో గల నిర్జీవ లవణాల వల్ల పంట దిగుబడి క్షీణించి తద్వారా ఆహార ధాన్యాల ఉత్పత్తి తగ్గి ఆహార కొరత ఏర్పడుతోంది.

సాధారణంగా మానవులు 140 డిబిఎ (డెసిబుల్స్) శబ్దాన్ని ఏ ఇబ్బంది లేకుండా వినగలరు. కాని ఎక్కువ స్థాయిలో గల శబ్దాలు ఇబ్బందికరంగా మారి మానవ ఆరోగ్యంపై తీవ్ర పరిణామాన్ని కలిగిస్తాయి. కేంద్ర కాలుష్య నియంత్రణ సంఘం సిఫారసు చేసిన శబ్దస్థాయికి మించి వివిధ ప్రదేశాలలో గల ధ్వని ఉత్పత్తి శబ్ద కాలుష్యాన్ని పెంచుతున్నది.

కేంద్ర కాలుష్య నియంత్రణ సంఘం సిఫారసు చేసిన శబ్దస్థాయి

| ప్రదేశం | శబ్ద స్థాయి డెసిబుల్స్‌లో | |
|---|---|---|
| | పగలు | రాత్రి |
| నివాస ప్రాంతాలు | 55 | 45 |
| వాణిజ్య ప్రదేశాలు | 65 | 55 |
| పారిశ్రామిక వాడలు | 75 | 70 |
| ఆసుపత్రులు, విద్యాసంస్థల ఆవరణలు | 50 | 40 |

థర్మల్ పవర్ స్టేషన్లు, మోటారు వాహనాలు, ఉద్గ్రహన కార్యకలాపాలు, రైలు, విమానాశ్రయాలు, బస్సులు వంటి రవాణా సాధనాలు, పరిశ్రమలు, సినిమా థియేటర్లు, టపాసులు కాల్చడం వంటి చర్యలు శబ్దకాలుష్యాన్ని కలిగిస్తున్నాయి.

విపరీతమైన శబ్దస్థాయి వల్ల చెముడు, నరాల బలహీనత, ఏకాగ్రతా భంగం, రక్తపోటు పెరగడం, గర్భస్థ శిశువు జ్ఞానేంద్రియాలు దెబ్బతినడం, మానసిక వైకల్యం వంటి దుష్పరిణామాలు ఏర్పడతాయి.

ఒక గ్రామం నేలలోగల కీటకాలు, వైరస్‌లు, బ్యాక్టీరియాలు దాని నాణ్యత, భూగర్భ జలాల పరిమాణంను నిర్ణయిస్తాయి. సారవంతమైన నేల వ్యవసాయ కార్యకలాపాలకే కాకుండా గృహాలు, వాణిజ్య భవన నిర్మాణం, పరిశ్రమల స్థాపన వంటి, వ్యవసాయేతర కార్యకలాపాలకు అవాంఛనీయం. కాని భూమికోత, ఎడారీకరణ, లవణీకరణ, అధికస్థాయి రసాయనిక ఎరువుల వినియోగం, అమ్లీకరణం, వ్యర్థ పదార్థాల ద్వారా భూమిని పూడ్చడం వంటి చర్యల వల్ల నేల కాలుష్యం పెరుగుతోంది.

నేల కాలుష్యం వల్ల మానవ ఆరోగ్యం, వ్యవసాయ ఉత్పాదకత, నేలసారం దెబ్బతింటోంది. దీనివల్ల భూగర్భ జలాల నాణ్యత తగ్గడం, వాతావరణంలో రేడియేషన్ పెరగడం, క్షార ద్రావణాల గాఢత పెరగడం ముఖ్యంగా భూనాణ్యత, వ్యవసాయ ఉత్పాదకత, ఉత్పత్తి, పంట పొలాల విస్తీర్ణత తగ్గి వ్యవసాయరంగం సంక్షోభంలోకి నెట్టి వేయబడుతుంది.

## పర్యావరణ పరిరక్షణ చర్యలు

బాల్యం నుండే పిల్లలకు ఆరోగ్యం, పారిశుధ్య కార్యక్రమాలు, సహజ వనరుల వినియోగంపై అవగాహన కల్పిస్తూ పర్యావరణ పరిరక్షణ చర్యలలో పాల్గొనేటట్లు ప్రోత్సహించాలి. ప్రాథమిక విద్య నుండి ఉన్నత విద్య వరకు పర్యావరణ విద్యను తప్పనిసరి పాఠ్యాంశంగా చేయాలి. పల్లెల నుండి పట్టణాలకు వలసలను సాధ్యమైనంత వరకు తగ్గించి, ప్రశాంత వాతావరణంలో కూడిన పల్లెలను ప్రోత్సహించాలి. గ్రామీణ ప్రాంతాలలో ఆరోగ్యం, మంచినీరు, పారిశుధ్యం వంటి సౌకర్యాల కల్పనతో పాటు సరస్సులు, అడవుల సంరక్షణపై చర్యలు చేపట్టాలి. గృహ వ్యర్థాలను సేంద్రీయ ఎరువులుగా మార్చే వ్యవసాయ రంగంలో రసాయనిక ఎరువుల వాడకాన్ని క్రమంగా తగ్గించాలి. పట్టణాలు వెదజల్లే మురుగునీటిని శుద్ధిచేసి వాటిని పంట పొలాలకు అందించడం ద్వారా పారిశుధ్యాన్ని పెంచడమే కాకుండా నీటి కొరతను తగ్గించవచ్చు. జీవవైవిధ్యం, దాని పరిరక్షణపై ప్రజలకు సరియైన అవగాహనను కల్పించాలి. ప్రత్యామ్నాయ ఇంధన వనరులను కనుగొనడం, ఆధునిక మైన వ్యర్థ పదార్థాల అదుపు విధానాల అమలు ద్వారా కాలుష్యాన్ని తగ్గించాలి. చెట్లను ఎక్కువ సంఖ్యలో పెంచి, పునరావృతమయ్యే శక్తి వనరుల వినియోగాన్ని పెంచాలి. వర్షపు నీటి సంగ్రహణ, నిల్వ కార్యక్రమాలను మహిళల సహకారంతో కొనసాగించాలి. పర్యావరణ చట్టాలను కఠినంగా అమలు పర్చడంతో పాటు 'కలుషితం చేసే వారే చెల్లించాలి' అనే నియమాన్ని అమలు పర్చాలి.

పర్యావరణ పరిరక్షణ సమిష్టి బాధ్యత. యునివర్సీటీలు, శాస్త్ర పరిశోధన సంస్థలు, ప్రభుత్వ సంస్థలు, కళాశాలలు, పాఠశాలలు, ప్రజలు సమిష్టి బాధ్యత, సహకారంతో పనిచేసి కొనసాగించగలిగే అభివృద్ధితో కూడిన సమ్మిళితవృద్ధి సాధన దిశగా కృషిచేయాలి.

*(రచయిత అర్థశాస్త్ర అధ్యాపకులు, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

# బాలల భవితవ్యంపై టెన్త్ 'స్పాట్'

***పోటీ మాత్రమే ప్రధానం అయిపోయి, విలువలు, విద్య నాణ్యతా ప్రమాణాలు మరుగున పడిపోయాయనీ, ఆత్మస్థైర్యంలేని, వ్యక్తిత్వం వికసించని విద్యార్థులతో దేశ భవిష్యత్తుకూ ప్రమాదమేననీ అంటున్నారు*** **కె. ప్రభాకర్**

**ఇం**టర్ ఫస్టియర్‌లో అనుకున్న మార్కులు రాక ఆత్మహత్య చేసుకున్న విద్యార్థి మరణంతోపాటు నూటికి ఎనభై శాతంకు మించి, నూటికి నూరు శాతం ఫలితాలు సాధించడానికి అధికార యంత్రాంగం, ప్రభుత్వం, ఆధ్యాపక, ఉపాధ్యాయ విద్యార్థుల కృషి పదవ తరగతిలో ఫలించినట్లుగా, ఇంటర్ స్థాయిలో విఫలం కావడానికి కారణాలేమిటో విశ్లేషించాలి.

ఏప్రిల్ 13 నుండి 28 వరకు, మార్చ్‌లో జరిగిన పదవ తరగతి పరీక్షల తీరు, టెన్త్ స్పాట్ విధానాలను పరిశీలిస్తున్నప్పుడు, ప్రభుత్వం, విద్యార్థులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు గుర్తించాల్సిన అంశాల పట్ల చర్చించడం అవసరం మాత్రమే కాదు, అది విద్యార్థుల భవితవ్యం గురించి సమాజం స్పందించాల్సిన, ప్రభుత్వం దృష్టి సారించాల్సిన అంశాలను ఆలోచించాల్సి ఉంది.

ఇవ్వాళ మొత్తం విద్యారంగం ప్రాథమిక స్థాయి నుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు రెండు విభాగాలుగా విడిపోయి ఉన్నది. కొద్దో గొప్పో ఆర్థిక వెసలుబాటు ఉన్న తల్లిదండ్రుల పిల్లలకు ప్రైవేట్ పాఠశాలలతో పాటు ఆర్థికంగా పరిపుష్టి ఉన్న వాళ్లకు ఆర్కిడ్స్ వంటి లక్షలాది రూపాయల ఫీజులతో విద్యను అందించే ప్రైవేట్ వ్యవస్థ అమలవుతున్నది.

ఇంకొక వైపు ఏ దిక్కూ లేని రెక్కాడితేగాని డొక్కాడని నిరుపేద తల్లిదండ్రుల బిడ్డలకు, ప్రభుత్వ పాఠశాలలు తప్ప మరొక అవకాశం లేకుండా పోయిందనేది వాస్తవం.

కనుకనే విద్యారంగంతో పాటు సమాజంలో వివిధ రంగాల్లో వీటి విషమ ఫలితాలను రోజూ చూస్తున్నాం.

రెండు రకాల పాఠశాలల్లో ఒకటి నుండి పది దాకా చదువుకున్న పిల్లల భవితవ్యాన్ని టెన్త్ స్పాట్ కేంద్రాల్లో మూల్యాంకనం చేయడం చూస్తూన్నాం. చాలా సహజంగానే రెండు వేర్వేరు యాజమాన్యాల్లో చదివే విద్యార్థుల ప్రతిభా పాఠవాలు ఎట్లా ఉంటాలో అర్థం చేసుకోవచ్చు. అట్లాంటి మూల్యాంకన కేంద్రాల్లో నిర్లక్ష్యంగా పేపర్ వాల్యుయేషన్ చేశారన్న ఆరోపణలతో వివిధ జిల్లాల్లో వేలాది మంది టీచర్ల మీద క్రమశిక్షణా చర్యలు తీసుకొన్నారు. స్పాట్‌లో నిర్లక్ష్యంగా తప్పుడు, తక్కువ మార్కులు వేస్తున్న బాధ్యతారాహిత్యాన్ని క్షమించ కూడదు. కాని ఇంతకన్నా ముందు అసలు పదవ తరగతి పరీక్షల నిర్వహణ, బోధన అంశాల పట్ల దృష్టి సారించని ప్రభుత్వం, అధికార యంత్రాంగంపై ఎవరు చర్యలు తీసుకోవాలి.

ఇవ్వాళ చదువంటే రాయడం, చదవడం, పరీక్షలు, మార్కులు, ర్యాంకులు తప్ప మరొకటి కాదు కనుక, ప్రభుత్వం, అధికార యంత్రాంగం చాలా సహజంగా మూలాల్లోకి వెళ్లకుండా పరీక్షలు నిర్వహించడం, ఫలితాలు తొందరగా వెల్లడించడం, వీలైతే విద్యార్థులకు జిరాక్స్ ప్రతులను అందజేసి తన పారదర్శకతను నిరూపించుకోవడం చూస్తున్నాం.

కాని టెన్త్ స్పాట్ కేంద్రాల్లోకి వస్తున్న పేపర్లను జాగ్రత్తగా పరిశీలిస్తే పిల్లలు చదివినా, చదవకపోయినా, అది ప్రభుత్వ, ప్రైవేట్ టెక్నో స్కూల్ అయినా 'పార్ట్ బి'లో ఆన్సర్ చేసిన విధానం చూస్తే ఒకే రకమైన ప్రింటెడ్ ఆన్సర్స్ అందరు విద్యార్థుల పేపర్లలో కనిపించడం వెనుక ఆంతర్యం ఏమై ఉంటుందో పరిశీలించాలి.

టీచర్లున్నా, లేకున్నా పుస్తకాలు అందినా, అందకున్నా ఆందోళనల పేర, అవాంతరాల పేర తరగతులు నడిచినా, నడవకున్నా డిసెంబర్ నాటికి సిలబస్ పూర్తి చేయాలన్న ఒత్తిడితో పాటు, ఆ లాంగ్వేజెస్ టీచింగ్‌ను వదిలేసి కేవలం ఐఐటి, కాన్సెప్ట్‌లో ఆప్షనల్ సబ్జెక్టులో బోధించే పాఠశాలలు కూడా ఎట్లా ర్యాంకుల కోసం పోటీ పడుతుంటాయో తరిచిచూస్తే కాని అర్థం కాదు.

ఇట్లాంటి మాల్ ప్రాక్టిస్ చర్యల వల్ల ప్రభుత్వం పాఠశాలలపై కూడా ఇవ్వాళ అధికారుల, ప్రభుత్వం ఒత్తిడి పెరుగుతున్నది. గత కొంతకాలం వరకు అమలైన మెరుగైన విద్యకు బదులుగా 'నూరు శాతం' ఫలితాల వైపు పరుగులు తీస్తున్నది. స్టడీ మెటీరియల్ పేర సబ్జెక్టును, సమయాన్ని కుదిస్తున్నది.

జిల్లాలో విద్యాశాఖ అధికారులు, కలెక్టర్లు ఏనాడు బడి మొహం చూడకుండా, అక్కడ బోధన పర్యవేక్షణ విద్యార్థుల సమస్యల పట్ల దృష్టి సారించకుండా 'మీరేమన్నా చేయండి' మన జిల్లా ఫలితాల్లో మెరుగైన స్థానంలో ఉండాలన్న ప్రయత్నం చేస్తున్నారు. అందుకు కొన్ని జిల్లాలు 'మొదటి' స్థానం కోసం ఏ పద్ధతులనైనా అవలంబిస్తున్నవి.

దీనికి తోడు ఇవ్వాళ సీమాంధ్ర, తెలంగాణ విద్యార్థులు తమ ఉనికి బయటపడితే పేపర్లు దిద్దే వాళ్ల వివక్షకు బలికావాల్సి వస్తుందని ఆందోళన చెందడం చూస్తున్నాం. దీనికి కొన్ని ఉపాధ్యాయ సంఘాలు పదవ తరగతి పరీక్షల నిర్వహణ దగ్గర నుండి పేపర్లు దిద్దే స్పాట్ కేంద్రాల వరకు తమ ఆధిపత్యాన్ని సెంటర్లలో కొనసాగించడం వల్ల బాహాటంగానే 'బిట్ పేపర్' డిక్టేట్ చేయడం జరుగుతుందన్నది బహిరంగ రహస్యం.

ఇంకా అత్యధిక మార్కులు సాధించడానికి తావే కావాల్సిన 'మెటీరియల్'ను అందివ్వడం యథేచ్ఛగా సాగుతున్నది.

అధికార యంత్రాంగం బజార్లో జిరాక్స్ సెంటర్లను మూయించి, లోపల ప్రింటెడ్ మెటీరియల్‌ను అందించే అవకాశాలు కల్పిస్తున్నది. పర్యవసానంగా అసలు సంవత్సరమంతా కష్టపడడం కంటే పరీక్ష కేంద్రాల్లో ఆ 'రెండు గంటలు' తమ ప్రతాపాన్ని చూపించే 'సబ్జెక్టు' టీచర్లను అధికార యంత్రాంగమే కొనసాగిస్తున్నది. సిట్టింగ్, ఫ్లైయింగ్ స్కాడ్‌లు ప్రైవేట్ యాజమాన్యాల మెప్పుకోసం అధికారుల కన్నుసన్నల్లో విధులు నిర్వహిస్తున్నారు. పదవ తరగతి పరీక్షల నిర్వహణ పట్ల, ఫలితాలు వెలువరించడం పట్ల చూపిస్తున్న శ్రద్ధ విద్యా ప్రమాణాల పట్ల చూపించకపోవడం వల్ల భిన్నమైన ఫలితాలు చూస్తున్నాం. దీనికోసం మార్చ్ నుండి ఎన్నికల డ్యూటీ లాగా పేపర్లు, కస్టోడియన్ చీఫ్‌లు, పోలీస్ స్టేషన్లు తిరగడానికి, ప్రాథమిక పాఠశాలల టీచర్లను ఇన్విజిలేషన్ కోసం డ్యూటీలు వేసి ప్రాథమిక పాఠశాలలు నడవకుండా చేయడం, పరీక్షా కేంద్రాల్లో మిగిలిన తరగతుల విద్యార్థులను, వాళ్ల చదువులను పూర్తిగా నిర్లక్ష్యం

చర్చ

# విగ్రహ రాజకీయాలు

***మన సమాజంలోని విగ్రహ రాజకీయాలను, విగ్రహ సంస్కృతిని ప్రశ్నిస్తూ, సత్యాన్ని చెప్పడంలో మేధావులకు అవకాశవాదం పనికిరాదంటున్నారు*** **ఎం. కృష్ణ ఆదిత్య**

ఇటీవల రాష్ట్ర రాజకీయాలు అంబేద్కర్ విగ్రహం చుట్టూ కూడా ప్రదక్షిణలు చేస్తున్నాయి. ముఖ్యంగా కోస్తా, తెలంగాణ జిల్లాల్లో అనేక చోట్ల విగ్రహాలను కూలగొట్టడం జరిగింది. ఇది ఖండించాల్సిన నేరం. అందరూ ఖండిస్తూనే ఉన్నారు. అయినా ఇలాంటి సంఘటనలు డజనుకి మించిపోయాయి. దీని వెనుక ఏ రాజకీయాలు, ఏ కుట్రలు ఉన్నాయి? అంబేద్కర్‌ని బాహాటంగా వ్యతిరేకించే రాజకీయ శక్తులేవయినా ఈ పని చేసినాయా? అలాటి దాఖలాలేవీ లేవు. నిజానికి ఈ సంఘటనలు జరగడానికి కావలసిన రాజకీయ సందర్భం కూడా లేదు. రాజకీయ గందరగోళం, దిశా రాహిత్యం, కుల వైషమ్యాలను సృష్టించడానికి ఇది జరుగుతున్నదని భావించడానికి ఆస్కారం ఉంది. ఇది ఇలా ఉండగా, అసెంబ్లీ ఆవరణలో అంబేద్కర్ విగ్రహం పెట్టాలని కెసిఆర్ కూతురు కవిత ఆందోళన చేస్తున్నారు. వ్యతిరేకులెవ్వరూ కనపడని ఆందోళన. అంతా పోటీలుపడి బలపరుస్తున్న ఆందోళన.

మతమైనా, కులమైనా, రాజకీయమైనా, ఏదో ఒక పేరిట మన దేశంలో విగ్రహారాధన పుష్కలం. అందులో తలమునకలయ్యే వారికి తరచుగా ఆ విగ్రహం గురించిన లోతైన అవగాహనతో పనిలేదు. అదే విగ్రహారాధకుల ప్రత్యేకత. వారికి కావలసిందల్లా ఆర్భాటమే, అట్టహాసమే. అంబేద్కర్ విగ్రహానికీ ఇది వర్తిస్తుంది. ఈ సందర్భంగా అంబేద్కర్ రాజకీయ ప్రస్థానంలో కొన్ని ఘట్టాలను పేర్కొనడం ఈ వ్యాస లక్ష్యం. వందలాదిగా ఉన్న అంబేద్కర్ విగ్రహాలలో 90 శాతం పైగా ఒకే పద్ధతిలో ఉంటాయి. చేతిలో రాజ్యాంగం పట్టుకుని వేలుతో దారి చూపుతూ ఉంటాయి. అంబేద్కర్ అనగానే రాజ్యాంగ నిర్మాత అని, రాజ్యాంగ పథంలో మార్గదర్శి అని దాని భావం అని వేరే చెప్పనక్కర్లేదు. ఈ విషయం గురించే కొన్ని విషయాలు గుర్తు చేసుకుందాం.

1. 1950 జనవరి 26న అమలులోకి వచ్చిన రాజ్యాంగం, స్వతంత్ర, గణతంత్ర, ప్రజాస్వామిక వ్యవస్థకు ప్రతిరూపంగా చెప్తున్న ఉద్గ్రంథం. ఇది ఎంత వరకూ నిజం? ఈ రాజ్యాంగంలోని అత్యధిక భాగం '1935 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్ట్'కి నకలు అని రాజ్యాంగ నిపుణులు నిగ్గు తేల్చారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో – మొదట కాంగ్రెస్‌తో సహా – అంతా వలస ప్రతీకగా తిరస్కరించినది 1935 చట్టం. దాని నుంచి పేరాలకు పేరాలు – యథాతథంగా – 1950 రాజ్యాంగంలోకి దించేసారని కొందరు సోదాహరణంగా వివరించారు.

2. సామ్రాజ్యవాదులపై పరాధీనతను, దళారులతో కలిసి వారు సాగిస్తున్న దోపిడీని, భూస్వామ్య దోపిడీ, దౌర్జన్యాలను గత అరవై ఏళ్లుగా పరిరక్షిస్తున్న రాజ్యాంగం ఇది. ప్రజలపై నిరంకుశత్వాన్ని, ఎమర్జెన్సీ (ఆర్టికల్ 352, 358, 359) నిబంధనలను, ప్రివెంటివ్ డిటెన్షన్ (ఆర్టికల్ 22/4)

---

చేయడం, కేవలం పదవ తరగతి పరీక్షల నిర్వహణే ముఖ్యమై పోయింది.

మిగిలిన తరగతులకు కనీసం చదివించడం, పరీక్షలు, 'హోం ఎగ్జామ్స్' నిర్వహించడం లాంటి పనులేవి చేయకుండా, మధ్యలోనే స్పాట్ నిర్వహించడం తదితర అంశాలతో మొత్తం పాఠశాల వ్యవస్థ అస్తవ్యస్తంగా మారిపోయింది.

ప్రత్యామ్నాయాల గురించి ఆలోచించకుండా నిర్వహిస్తున్న పరీక్షలు, పరీక్షలు జరుగుతున్న తీరు మిగిలిన తరగతుల విద్యార్థుల భవితవ్యం ఓ 'స్పాట్'లో మారిపోతున్నది.

ఇంతచేసి పదవ తరగతి పరీక్షల్లో అత్యున్నత మార్కులు సాధించిన విద్యార్థులు ఇంటర్‌లో కనీస మార్కులు పొందలేక ఆత్మహత్యలకు పాల్పడడం లేదా ప్రైవేట్ కళాశాలల్లో ఎంసెట్ మోజుకు అప్పుల పాలై ఎందుకూ కొరగాని ఒక జులాయి గుంపుగా గ్రామాల్లో, పాఠశాలల చుట్టూ తిరగడం ఇవ్వాళ్టి సామాజిక వ్యవస్థకు అవరోధంగా మారుతున్నది.

ఇన్నేళ్ల చదువు ఎన్ని మార్కులు తెచ్చినా కనీసం ఆత్మస్థైర్యంతో ఆలోచించలేని, ఆత్మహత్యలకు పాల్పడాల్సి, చెడు వ్యసనాలకు, అమ్మాయిల వేధించే రోమియోలుగా మారే విష సంస్కృతికి గురై అసలు పరీక్షల్లో కాపీ కొట్టనివ్వని టీచర్లను పొడిచి చంపే, కారుతో గుద్ది చంపే దురవస్థ నేడు కొనసాగుతున్నది.

విద్యా హక్కు చట్టంలో భాగంగా 6 నుండి 14 సంవత్సరాల పిల్లల బాధ్యత మాత్రమే అంటే, 8వ తరగతి వరకే మా బాధ్యత అని స్వయంగా కేంద్ర మానవ వనరుల మంత్రి కపిల్ సిబల్ మాట్లాడ్డం ఆందోళన కలిగిస్తున్నది. ఎనిమిదో తరగతి తర్వాత పిల్లలేం చేయాలి? అంటే అది విద్యాహక్కులో భాగం కాదన్న వైఖరిని ప్రభుత్వాలు ప్రదర్శిస్తున్నాయి.

విద్యా హక్కు చట్టంలో పొందుపరిచినట్లయినా అందరికీ సమానమైన, నాణ్యమైన విద్యావకాశాలు సాధ్యం కావనేది గత రెండేళ్ల అనుభవం నిరూపిస్తున్నది. దీనికి తోడు ఇరవై ఐదు శాతం పేద విద్యార్థులకు ప్రైవేట్ స్కూళ్లలో అడ్మిషన్ ఇవ్వాలన్న ఆలోచన ఆ పిల్లలకు ఏ మాత్రం అందుబాటు లోకి రాకపోగా ప్రైవేట్ విద్యా సంస్థలకు ఓ బంగారు బాతులాగా మారబోతున్నది.

మరొకవైపు ఈ మాత్రం చదవగలిగిన పిల్లలు లేని ప్రభుత్వ పాఠశాలలు మరణశయ్యపై మృత్యుగీతం పాడుతూ త్వరలోనే మూతబడిపోవడం ఖాయం. ఈ పర్యవసానాల నేపథ్యంలో కోట్లాది రూపాయల కుంభకోణా లను నియంత్రిస్తే అందరికీ సమాన విద్యావకాశాలు ఉచితంగా అందించడం అసాధ్యమేమీ కాదు. అందుకు విద్యారంగంతో సంబంధమున్న శక్తులన్నీ కలిసి పోరాడాల్సి ఉంది.

ఏ పాఠశాల ప్రోగ్రెస్ కార్డుల్లో తొంగి చూసినా లేని మార్కుల శాతం ఎస్ఎస్‌సి స్పాట్ పరీక్షల్లో పొందడం తేలిక కావచ్చుకాని, విద్యార్థులు మానవీయంగా ఎదగలేని మార్కుల చదువుల గురించి తీసుకు రావాల్సిన మార్పుల గురించి యావత్ సమాజం దృష్టి సారించాలి.

*(రచయిత కన్వీనర్, తెలంగాణ టీచర్స్ ఫోరం)* వీ

అధికారాలను, రాష్ట్ర ప్రభుత్వాలను వందలాది సందర్భాలలో రద్దు చేసిన 356 నిబంధనను, ప్రభుత్వోద్యోగులను విచారణ కూడా లేకుండా బర్తరఫ్ చేయగల నిరంకుశాధికారాలను (311-2-ఎ,బి,సి) కలిగి ఉన్న, ప్రయోగించిన రాజ్యాంగం ఇది. 1950 జనవరి తరువాత రెండేళ్ల తెలంగాణ రైతాంగంపై యాభై వేల సైన్యాలతో మారణకాండ సాగించింది, తరువాత మరికొంత కాలం మిలిటరీ పాలన సాగింది ఈ రాజ్యాంగం ప్రకారమే. ఆ సందర్భంగా నాలుగు వేల మంది ప్రజలను కాల్చి చంపారు. లక్ష మందిని జైలుపాలు చేశారు.

3. ఈ రాజ్యాంగాన్ని రచించిన రాజ్యాంగసభ వయోజన ఓటింగ్ ద్వారా ఎన్నికైంది కాదు. 1935 చట్టం ప్రకారం నూటికి 90-95 మంది ప్రజలకు ఓటింగ్ హక్కు లేని స్థితిలో ఎన్నికైన కులీనుల, సంపన్నుల రాజ్యాంగ సభ ఇది. దాని పుటకే అప్రజాస్వామికమైనది.

ఈ వాస్తవాలన్నీ తెల్సినవారు, విప్లవ పార్టీలుగా, గ్రూపులుగా, ప్రజాతంత్ర వాదులుగా చెలామణీ అవుతున్న అనేకులు కూడా పై విషయాల పట్ల మౌనం దాల్చి, అంబేద్కర్ రాజ్యాంగ మార్గదర్శిత్వాన్ని కొనియాడడం నేటి రాజకీయ విచిత్రం. 1935 వలస చట్టం ఆధారంగా రూపొందిన దానికి ఎవరైనా 'నిర్మాత', రచనా శిల్పి ఎలా అవుతారు? ఒకవేళ అవుననుకున్నా, అది గర్వకారణమా?

4. 1946లో పరోక్ష ఎన్నికల ద్వారా 296 మందితో రాజ్యాంగ సభ ఎన్నికైంది. వారిలో అంబేద్కర్ మహారాష్ట్ర నుంచి ఎన్నిక కాకుండా వల్లభాయి పటేలు గట్టి చర్యలు తీసుకున్నాడు. అప్పుడు బెంగాల్‌కి చెందిన ఎస్‌సి ఫెడరేషన్ నాయకుడు జి.ఎస్. మండల్ తమ రాష్ట్రం నుంచి (తన సీటు వదులుకుని) అంబేద్కర్ ఎన్నికయ్యేలా చూశారు. 1946 నవంబర్‌లో ఇచ్చిన రాజ్యాంగ సభ ఉపన్యాసంలో 'పటిష్టమయిన, సమైక్య, భారతం' ఉండాలని ఆయన కోరారు. కాని దేశ విభజనతో ముక్కలై, ఆయన సీటు తూర్పు పాకిస్తాన్‌లోకి పోవడంతో, ఆయన సీటు కోల్పోయారు. 1947 ఆగస్ట్ స్వాతంత్రం తరువాత మహారాష్ట్ర నుంచి పరోక్ష ఎన్నిక ద్వారా అంబేద్కర్ రాజ్యాంగ సభకు, ఆ తరువాత రాజ్యాంగ రచనా కమిటీ చైర్మన్ గాను ఎన్నికయ్యేలా కాంగ్రెస్ నాయకత్వం చర్యలు తీసుకుంది. అదే నెలలో ఆయన నెహ్రూ మంత్రివర్గంలో చేరారు. 1951 అక్టోబర్ దాకా కొనసాగారు. కొన్ని సమస్యలపై విభేదించి ఆయన అప్పుడు రాజీనామా చేశారు. ఆ కారణాల్లో తెలంగాణలో మారణకాండ లేదని గమనించాలి.

5. అలా రాజీనామా చేసిన అంబేద్కర్‌ని కొత్త రాజ్యాంగం ప్రకారం జరిగిన లోక్‌సభ తొలి ఎన్నికల్లో (1952) కాంగ్రెస్ వారు ఓడించారు. కానీ కొద్ది నెలల్లోనే రాజ్యాంగ సభకు పరోక్షంగా ఎన్నుకున్నారు. కాంగ్రెస్‌పై ఆధారపడడం ఇష్టంలేని అంబేద్కర్ 1953 (1954?) ఏప్రిల్‌లో వచ్చిన ఒక ఉప ఎన్నికల్లో మళ్లీ పోటీ చేశారు. అలా భండారా లోక్‌సభ స్థానంలో ఆయన్ని కాంగ్రెస్ వాళ్లు మళ్లీ ఓడించారు. ఇలా రెండుసార్లు (1952-1953) కాంగ్రెస్ వారు రిజర్వుడు సీటులోనే ఓడించడంతో మనస్తాపం చెందిన అంబేద్కర్ 1955 డిసెంబర్ 27 నాటి ఉపన్యాసంలో అసెంబ్లీకి, పార్లమెంట్‌కి గల రిజర్వేషన్‌ని రద్దు చేయాలని పిలుపునిచ్చారు. తాను స్థాపించిన, ఎన్నికల్లో పోటీ చేసి దెబ్బతిన్న ఎస్.సి. ఫెడరేషన్‌ని రద్దుచేసి రిపబ్లికన్ పార్టీని స్థాపించారు. హిందూ మతాన్ని వీడి, బౌద్ధం స్వీకరించారు. ఆయన బతికున్న చివరి ఏడాదిలో ఈ పరిణామాలు జరిగాయి.

ఆయన మరణం తర్వాత అంబేద్కర్ అనుయాయులుగా చెప్పుకున్న చాలా మంది – దళిత ప్యాంథర్స్ వంటి ఉద్యమకారులతో సహా – కాంగ్రెస్, జనతాదళ్‌లే కాక, చివరికి హిందూ ఫాసిస్టు పార్టీ శివసేనలో కూడా చేరిపోయారు. అంబేద్కర్ స్థాపించిన రిపబ్లికన్ పార్టీ మహారాష్ట్రలో మూడు ముక్కలైంది. ఆ ముక్కలు తరచూ పై పార్టీలతో ఎన్నికల పొత్తులు పెట్టుకొని ఒకటి అరా సీట్లు గెలుస్తున్నవి. అంబేద్కర్ వారసత్వాన్ని చెప్పుకొనే బి.ఎస్.పి. మహారాష్ట్రలో ఒక్క సీటూ గెలవలేక పోతున్నది. మన రాష్ట్రంలో కూడా ఆర్.పి.ఐ.కి, బి.ఎస్.పి.కి (గతంలో ఒకొక్క స్థానం తప్ప) అసెంబ్లీలో స్థానం లేదు. అంబేద్కర్ రాజకీయ వారసత్వానికి స్థానం లేకుండా చేసినవారే రాష్ట్రం అంతటా వందలాది విగ్రహాలు మాత్రం నెలకొల్పారు. ఆ విగ్రహాల చుట్టూ రాజకీయ ప్రదక్షిణలు చేస్తూ మౌలిక సమస్యల నుంచి ప్రజల దృష్టిని పక్కకు మళ్లిస్తున్నారు.

అంబేద్కర్ జీవిత కథను చిత్రిస్తూ గతంలో (1990) మంచి సినిమా వచ్చింది. ప్రసిద్ధ మరాఠీ దర్శకుడు జబ్బార్ పటేల్ నిర్మించిన ఆ చిత్రం తెలుగులోకి చక్కగా డబ్ చేయబడింది. ఆ చిత్రం (ఒకటి రెండు చోట్ల తప్ప) రాష్ట్రంలో ఎక్కడా దాదాపు విడుదల కాలేదు. విడుదలైనా వారం కూడా ఆడలేదు. చెత్త చిత్రాలకు నెలవైన తెలుగు నాట ఇలాంటి జీవితకథకు స్థానం లేకుండా పోయింది. విగ్రహాలకు పూలదండలు, పాలాభిషేకాలు (హిందూత్వ పద్ధతిలో) చేయడం తప్ప, ఈ జీవిత గాథను చూపెట్టాలని ఎవరికీ ఆసక్తి లేదు. ఈ విషయంలో అంబేద్కర్ వాదులు చేసిందీ సున్నా. అధికార పార్టీల రాజకీయాల్లో చిన్న వాటా తప్ప, వారికి ఇలాంటివి ఏమీ అక్కరలేదు. ఇది కొమురం భీం సినిమాకీ వర్తిస్తుంది. 1990 దగ్గరలో విడుదలైనప్పుడు – దాదాపు ఎక్కడా వారం కూడా నడవలేదు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం తర్వాత ఈ మధ్య రెండోసారి (ఐటిడిఎ సహకారంతో) మళ్లీ విడుదల చేసినప్పుడు కూడా స్పందన నామమాత్రమే. రెండు సందర్భాల్లోనూ తమ తమ ముఠా రాజకీయాల కోసం ప్రకటనల అట్టహాసమే తప్ప, చిత్తశుద్ధితో కూడిన ఆసక్తి చాలా కొద్దిమందికే ఉంది.

విగ్రహ రాజకీయాల విషాదం ఇదే.

మత విషయాల్లో భక్తి మోక్షానికి మార్గమేమో కానీ, రాజకీయాల్లో భక్తి, వీరపూజ కచ్చితంగా పతనానికి, అంతిమంగా నియంతృత్వానికి దారితీస్తుంది అని అన్నారు అంబేద్కర్. రాజ్యాంగ సభ చర్చల్లో భాగంగా అన్న ఈ మాటలను హిందూ దినపత్రిక మే 14 సంపాదకీయంలో ఉటంకించింది. ఎన్‌సిఇఆర్‌టి పదకొండో తరగతి పుస్తకంలో అంబేద్కర్, నెహ్రూలపై ప్రచురించిన ఒక కార్టూన్ గురించి మే నెలలో పార్లమెంట్‌లో గొడవ జరిగిన సందర్భంగా, కేంద్ర మంత్రి క్షమాపణ కోరడం, చర్య తీసుకుంటామనడం, ప్రొఫెసర్లు రాజీనామా చేయడం తెలిసినవే. అదే పుస్తకంలో నెహ్రూపై ఇంకా అనేక కార్టూన్లున్నాయి. ఈ ఉదంతం సందర్భంగా సంపాదకీయం అది.

మంత్రి, వివిధ పార్టీల నాయకులు పార్లమెంట్‌లో వ్యవహరించిన తీరు గురించి అలా అన్నారా అన్నట్టున్నాయి అంబేద్కర్ వ్యాఖ్యలు. కానీ ఆయనపై వీరభక్తి ప్రదర్శించిన అనేకులు సంయమనం కోల్పోయి వ్యవహరించారు. కాగా రాజస్తాన్‌కి చెందిన మేధావులూ, దళితవాదులూ కొందరు ఈ వీరభక్తి అంతా ఓట్ బ్యాంక్ రాజకీయాల్లో భాగం అని ఖండించారు. దళితనాయకులు కొందరు పుస్తక ప్రచురణలో భాగస్వామి అయిన ప్రొ. సుహాస్ పల్షీకర్‌పై దాడి చేయడాన్ని పిరికి చర్యగా దళిత యాక్టివిస్టు, డైమండ్ ఇండియా పత్రిక సంపాదకుడూ అయిన భన్వర్ మేఘవంశి ఖండించారు. ఇదంతా ఫాసిస్టు పోకడలతో కూడి ఉన్నదని ప్రొ. రాజీవ్ గుప్తా అన్నారు. అనేక మంది మేధావులు సంయుక్త ప్రకటనపై సంతకం చేశారు.

దీనికి విరుద్ధంగా వీరభక్తి ప్రదర్శించిన వారిలో తెలుగు మేధావులూ, నాయకులూ కూడా ఉన్నారు. వారిలో ప్రజాతంత్ర వాదులుగా చెప్పుకొనే వారు, పత్రికా సంపాదకులు కూడా ఉండడం విచారకరం. తెలుగుజాతి రాజకీయాల్లో ప్రవేశించిన అవకాశవాదాన్ని, ప్రజాస్వామ్యం ముసుగు లోనే నిరంకుశ ధోరణులు స్వైర విహారం చేయడాన్ని మరోసారి ఈ సందర్భంగా చూస్తున్నాం. ఈ పోకడలను వ్యతిరేకించడం మన బాధ్యత.

*(రచయిత పాత్రికేయులు)*

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 15

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

*(గత సంచిక తరువాయి...)*

పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు నడపడానికి కావలసిన పెట్టుబడి సహకార సంఘాల ద్వారా, బ్యాంకుల ద్వారా అందేది. (1868లో హైదరాబాద్ లో బ్యాంక్ ఆఫ్ బెంగాల్ శాఖను నెలకొల్పారు. 1942లో హైదరాబాద్ స్టేట్ బ్యాంక్ నెలకొల్పే వరకు అదే ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా పేరుతో ప్రభుత్వ బ్యాంకుగా చలామణీ అవుతూ ప్రభుత్వ పరిశ్రమలకు, సహకార సంఘాలకు అప్పులు ఇస్తూ ఉండేది). ఈ బ్యాంకులు వడ్డీ వ్యాపారస్తులకు, సహకార సంఘాలకు, మరాఠీ వ్యాపారస్తులకు, భూస్వాములకు ఫైనాన్స్ ఏజెంట్లుగా పనిచేసాయి. వీరు ఈ బ్యాంకుల ద్వారా పంటలు నిల్వ చేసుకోవడానికి, మార్కెట్‌కు తీసుకెళ్లడానికి, ఓడరేవులకు చేర్చడానికి, మార్కెట్ గోదాముల నుంచి విక్రయ కేంద్రాలకు తీసుకెళ్లడానికి రుణ సదుపాయం పొందేవారు. ఈ బ్యాంకులు ఎప్పుడూ కూడా సాధారణ రైతుకు ఆర్థిక సహాయం కింద అప్పు ఇచ్చేవి కావు.

కుటీర పరిశ్రమలు, పెద్ద పరిశ్రమలలో పని చేయడానికి భూమిలో పంట సరిగ్గా పండకపోతేనో, పంట సమయం దాటిన తరువాత ఉండే ఖాళీ సమయాలలో (సీజన్) రైతులు పనిచేస్తుండే వారు. వీటితోపాటు మైనింగ్ పనికి, ఇటుకల తయారీకి, క్వారీ పనికి, అటవీ ఉత్పత్తులకు సంబంధించిన పనులకు కూలీకి పోతుండేవారు. రైల్వేలలోనూ, బొగ్గుగనులలోనూ కాంట్రాక్టర్ల ద్వారా మాత్రమే పనులు చేయించుకునేవారు. ఒకవైపు భూమిలో పంట పండకపోవడం, శిస్తు కట్టలేదని భూములు లాక్కోవడం, అప్పు కింద భూమిని స్వాధీనం చేసుకోవడంతో బాధపడుతున్న సామాన్య రైతు, వ్యవసాయ కూలీ పరిశ్రమలలో పనిచేయడానికి వస్తే, కాంట్రాక్టర్ కమిషన్ ఏడు అణాలు ఉంటే లేబర్ కూలీ ఐదు అణాలు మాత్రమే ఉండేది. చాలమంది కాంట్రాక్టర్లు వడ్డీ వ్యాపారులుగా ఉండి అప్పు తీర్చలేని వారితో ఈ వెట్టి చాకిరీ చేయించేవారు. 1930లో ఫ్యాక్టరీ చట్టాన్ని పని గంటలు, వేతనం, బాల కార్మికుల బాధలు తొలగించడానికి చేశారు. కాని ఈ చట్టాన్ని అమలు పరిచే అధికారం తాలూకాదార్లు, తహసిల్దార్ల చేతిలో ఉండడం వలన వాస్తవ పరిస్థితిలో పెద్దగా మార్పు రాలేదు.

ప్రభుత్వం చేతి వృత్తుల వారికి సహకార సంఘాల ద్వారా సహాయం చేస్తుండేది. ఈ సహాయాన్ని రెండవ ప్రపంచ యుద్ధం మొదలైనప్పటి నుంచీ బాగా తగ్గించింది. చాలాచోట్ల ఆపేసింది. దీనితో నేతపని వారే కాకుండా, కుటీర పరిశ్రమలైన బీడీ పరిశ్రమ, తోళ్ల పరిశ్రమ, బొమ్మలు, గాజు వస్తువుల తయారీ, మట్టితో తయారు చేసే బొమ్మల పరిశ్రమలు ఉత్పత్తి చెయ్యడం తగ్గిపోయింది. ఉదాహరణకు నెలకు అరు వేల బేళ్ల (పత్తి) అవసరమైతే ప్రభుత్వం 1940లో 3865 బేళ్లు కేటాయించింది. వాస్తవానికి అందులో 1900 బేళ్లు మాత్రమే సరఫరా జరిగింది. ప్రతి చేతి వృత్తి పనివారికి ముడిసరుకు దొరక్కపోవడం వలన అంగడి కేంద్రాలు మూతబడ్డాయి. 1945 కంతా ఉన్న ముప్పై తోళ్ల పరిశ్రమలలో పదిహేను మూతపడ్డాయి. సాంకేతిక నైపుణ్యం అందుబాటులో లేకపోవడం, క్రయవిక్రయాల సదుపాయం లేకపోవడం కుటీర పరిశ్రమలు తగ్గిపోవడానికి, ప్రభుత్వ పరిశ్రమలు మూతపడడానికి ఒక కారణం. ఇంకో కారణం చేతివృత్తుల వారు తమ ఉత్పత్తులను తప్పనిసరిగా జాగీర్దారుకు, దేశ్‌ముఖ్‌లకు, పటేల్, పట్వారీ, మునసబు, తహసిల్దార్, గిరిదావర్, నాయబ్ తహసిల్దార్‌కు ప్రతిఫలం లేకుండా ఉచితంగా ఇవ్వాలి. భూమిపైనే కాకుండా వస్తూ ఉత్పత్తిని కూడా వెట్టిపని లాగ చెయ్యాల్సిన పరిస్థితులలో బతకడం చేతగాక మగవాళ్లు బొంబాయి ప్రెసిడెన్సీకి నిరంతరం వలసలు వెళ్తుండేవారు. దీంతో కుటుంబ భారమంతా స్త్రీలపై పడేది. 1945లో చేసిన సర్వేలో ఆరు లక్షల చేనేత మగ్గాలపై పనిచేసే వారిలో స్త్రీలు 42 శాతం ఉంటే, సిల్క్ నేతలలో 50 శాతం ఉన్నారు. నిజామాబాద్‌లో అయితే బీడీ పనిలో 95 శాతం మంది స్త్రీలే ఉన్నారు. పరిశ్రమల యజమానులుగా జాగీర్దారులు, ఉన్నత ప్రభుత్వోద్యోగులు ఉంటే మాత్రం ప్రభుత్వం చేసే కొద్దిపాటి ఆర్థిక సహాయం వారికే దక్కేది.

రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించి కావలసిన ఖర్చుకు గాను, ధాన్యాన్ని లెవీగా వసూలు చేశారని ముందే చెప్పుకున్నాం. ఈ లెవీని ప్రభుత్వం అత్యవసర ఆదేశం ద్వారా (ఆర్డినెన్స్) అమలులోకి తీసుకొచ్చింది. లెవీ రు. 1 భూమి శిస్తుకు ఎనిమిది శేర్లు బియ్యంగా వసూలు చేసేవారు. అదే జొన్నలు ఇతర చిరు ధాన్యాలను రు. 1 భూమి శిస్తుకు నాలుగు శేర్లుగా వసూలు చేసేవారు. చివరకు ప్రభుత్వం పరిశ్రమలకు వారి ఉత్పత్తుల నుంచి, రెవెన్యూ ఉద్యోగులకు ప్రజల ద్వారా, రైతుల ద్వారా వసూలవుతున్న పన్ను, భూమి శిస్తు, ధాన్యం లెవీ ద్వారా యుద్ధ నిధి వసూలు కావడానికి లక్ష్యాలను నిర్దేశించి ఒక్క 1943-45 మధ్యే 28.57 మిలియన్ ఖరీదు చేసే ఉత్పత్తులను పరిశ్రమల ద్వారా లెవీ ద్వారా బ్రిటిష్ ప్రభుత్వ యుద్ధావసరాల నిమిత్తం హైదరాబాద్ రాష్ట్రం నుంచి పంపింది.

ఒకవైపు పండిన పంటలను లెవీ రూపంలో, పంట వేయడానికి చేసిన అప్పు తీర్చడానికి, భూమి పన్ను కట్టడానికి రైతులకు స్తోమత లేకుండా పోతుంటే, ఇంకోవైపు చేతివృత్తుల వారికి వారి వృత్తి కొనసాగించడానికి కుదరక, వృత్తిపై వచ్చే ప్రతిఫలం చాలక ఇబ్బందులు పడుతుండేవారు. కార్మికులు, ఇతర కూలీలు పరిశ్రమలు మూతపడడం, ఇచ్చే వేతనం చాలా తక్కువగా ఉండడం, చేసే పని చాలా కఠినంగా ఉండడంతో పాటు ఎక్కువ పని గంటలతో వెట్టి చాకిరీ చేయాల్సొచ్చింది.

1942లో అన్ని నూలు మిల్లులు, వజీర్ సుల్తాన్ టొబాకో కంపెనీ, ఆల్విన్, సిమెంట్, చక్కెర కర్మాగారాలు, సింగరేణి బొగ్గు గనులు, రైల్వేలు,

హైదరాబాద్ పాతబస్తీలో ఉన్న బటన్ ఫ్యాక్టరీలలోని కార్మికులు 45 రోజులు సమ్మె చేశారు.

వీటికి తోడు సాంఘిక ఆచారాల పేరుతో పెద్ద రైతు, చిన్న రైతనే కాకుండా, కులంతో పని లేకుండా స్త్రీలను జమీందారుల పెళ్లి సమయంలో అతనితోపాటు పంపించే దురాచారం (ఆడబాపలని వీరిని అంటారు) కూడా ఉండేది.

అన్ని వర్గాల ప్రజలలో పెరుగుతున్న అలజడి గుర్తించి, ఆంధ్ర మహాసభ వారి అవసరాల కోసం పోరాడడానికి 1930 నుంచి హైదరాబాద్ రాష్ట్రంలోని తెలుగు మాట్లాడే ప్రాంతంలో ప్రజలను కూడగట్టుకొని సభలు సమావేశాలు తరచుగా గ్రామాలలో జరుపుతూ వారిని తమ సమస్యలపై పోరాడడానికి సన్నద్ధులను చేస్తూ పోయింది. 1944 సంవత్సరానికంతా ఆంధ్ర మహాసభలోని మెజారిటీ వర్గం కమ్యూనిజం వైపు ఆకర్షితమై భూమి కోసం, భూమిపై హక్కుల కోసం ప్రజలతో కలిసిపోరాడడం మొదలు పెట్టింది. ప్రజలు నిత్యం పాలకులతో భూ సంబంధ హక్కుల కోసం రెవెన్యూ యంత్రాంగంతో పోరాడే అవసరాలకు మద్దతునిచ్చింది. 1944లో వారు చేసిన తీర్మానంలో అంశాలు ఇలా ఉన్నాయి.

1. జమీందార్లు, జాగీర్దార్లు, వతన్‌దార్లు, మక్తాదార్లు, ఇజారాదార్లు, భూస్వాములు, వడ్డీ వ్యాపారుల గుత్తాధిపత్యం నుంచి భూమిని అందరికీ పంచాలి.

2. సాగుచేసుకొనే కౌలుదార్లందరికీ హక్కు పత్రాలు ఇవ్వాలి. అప్పటి వరకూ కౌలుదారులను భూమి నుండి వెళ్లగొట్టకూడదు.

3. పోరంబోకు భూములు, బంచరాయి, ఖరిజ్ ఖాతా (రెవెన్యూ కట్టకపోవడం వలన స్వాధీనం చేసుకున్న భూములు లేదా స్వంతంగా వదులుకున్న భూములు) భూములలో వ్యవసాయం చేస్తున్న వారికి హక్కు పత్రాలివ్వాలి. ఈ భూములపై హక్కు పత్రాల పంపిణీ తరువాత రెవెన్యూ అధికారులకు, జాగీర్దారులకు వీటిపై ఎలాంటి హక్కు, అధికారం ఉండకూడదు.

4. ధనం రూపంలో, ధాన్యం రూపంలో రైతులు తీర్చాల్సిన బాకీలను మాఫీ చెయ్యాలి.

5. అడవులలో పశువులను మేపుకోవడానికి, వంట చెరుకు తెచ్చుకోవడానికి అనుమతించాలి. రిజర్వ్ అటవీ భూములలో సాగు చేసుకుంటున్న వారికి హక్కు పత్రాలివ్వాలి.

6. భూములపై కచ్చితమైన సర్వే సెటిల్‌మెంట్ చేయాలి.

7. జాగీర్దారీ వ్యవస్థను రద్దు చేసి, ఎక్కువ మొత్తంలో విధిస్తున్న పన్నులను తగ్గించాలి.

8. వెట్టి చాకిరీని నిర్మూలించాలి.

9. ధాన్యం లెవీ సేకరణ ఆపేయాలి.

ఆంధ్ర మహాసభలోని చీలిక వర్గం చేస్తున్న ఈ డిమాండ్లకి యువకులు, రైతులు (ధనిక పేద అనే తేడా లేకుండా) వ్యాపారులు, తయారీదారులు, మధ్యతరగతి వారు, వ్యవసాయకూలీలు, కార్మికులు అందరూ ఏకమయ్యారు. ముందు సత్యాగ్రహం రూపంలో, ఆందోళన రూపంలో తమ నిరసనలను, డిమాండ్లను గ్రామస్థాయి నుంచి పట్టణస్థాయి వరకూ చెయ్యడం మొదలు పెట్టారు. నిజాం పాలనకు వ్యతిరేకంగా భారత ప్రభుత్వంలో కలవాలని డిమాండ్ కూడా ఈ ఆందోళనలో కలిసింది.

ఇత్తెహదుల్ - ముస్లమాన్ పార్టీని బహదూర్-యార్-జంగ్ నిజాంను ముస్లింలకు చివరి ప్రతినిధిగా గుర్తించడం అనే స్లోగన్‌తో స్థాపించారు. అతను చనిపోయిన తరువాత ఖాసిం రజ్వీ ఆధ్వర్యంలో (రజాకారులనే పేరుతో) ప్రైవేట్ సైన్యాల్ని నడుపుతూ దేశ్‌ముఖ్‌లు, పటేల్, పట్వారీల స్వంత గూండాలు, పోలీసులతో కలిసి ఆందోళ చేస్తున్న ప్రజలపై దాడి చెయ్యడం, వారి ఆస్తులను ధ్వంసం చెయ్యడం, శారీరిక హింసకు గురిచెయ్యడం, భూములను లాక్కోవడం మొదలుపెట్టారు. ప్రజల అలజడిని కొంత సద్దుమణిగేటట్లు చెయ్యడానికి, 1940లో నియమించిన కౌలుదారీ కమిటీ సిఫారసులలో భాగంగా 1947లో ఆసామి షిక్మిదార్ చట్టం చేశారు. ఈ చట్టం ప్రకారం 1933-43 ల మధ్యకాలంలో ఆరు సంవత్సరాలు ఒకే భూమిపై సాగు చేయడం ద్వారా రైతులు తమ ఆక్రమణను నిరూపించుకుంటే వారిని రక్షిత కౌలుదారుగా పరిగణించి, ఆక్యుపెన్సీ రైటును వారికి ఇస్తారు. కానీ ఈ చట్టం రావడానికి ముందు వేసిన కేశవ అయ్యంగార్ కమిటీ తన నివేదికనందించిప్పటి నుంచీ యాజమాన్య హక్కులు, పరిపాలనా హక్కులు ఉన్నవారు తమ ఆధీనంలోని భూములను సాగు చేసుకొనేవారికి ఆక్యుపెన్సీ రైట్ రావడం లేదా రక్షిత కౌలుదారు అవుతాడని ఏదో ఒక సాకుతో భూముల నుండి వెళ్లగొట్టడం, వేరే కొత్త రైతులకు భూమిని కౌలుకు ఇవ్వడం చేస్తున్నారు. ఈ కొత్త చట్టంతో అది మరింత ఎక్కువై దేశ్‌ముఖ్‌లు ఇతర రెవెన్యూ అధికారులు, జాగీర్దారులు బంజరు భూములలో ఏళ్ల తరబడి సాగు చేసుకుంటున్న వారిని కూడా పొలాల నుంచి తమ వ్యక్తిగత సిబ్బందితో వెళ్లగొట్టించి వాటిని దురాక్రమణ చేసుకోవడం మొదలుపెట్టారు. వీరికి మద్దతుగా గ్రామ రెవెన్యూ యంత్రాంగమైన పటేల్‌లు, పట్వారీలు, దేశ్‌ముఖ్‌ల, జాగీర్దార్ల, జమీందార్ల భూ ఆక్రమణలకు చాల చోట్ల అండగా నిలిచారు. పైగా భూ రికార్డులను నేర్పుగా తారుమారు చెయ్యడం, భూమి శిస్తు, ఇతర పన్నులు కట్టలేదని భూములను బలవంతంగా స్వాధీనం చేసుకోవడం, ఇంటిలో ఉన్న వస్తువులను వేలం వేయడం లాంటివి గిర్‌దావర్లు, తహసిల్దార్ల సహాయంతో వీరు చేస్తుండేవారు.

భూములలో వ్యవసాయం చేస్తున్న కౌలుదారులను తొలగించడం, రక్షిత కౌలుదారుగా గుర్తించకుండా ఉండడం, భగేలాల ద్వారా చాకిరీ చేయించడం, బేగారి వృత్తి ద్వారా ప్రతిఫలం ఇవ్వకుండా పని చేయించుకోవడం, సామాజిక వివక్ష, అధిక పన్నుల వసూలు, లెవీ వసూలుతో బతికే మార్గం లేక లక్షలాది తెలుగు మాట్లాడే నిజాం పాలనలోని ప్రజలు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో దేశ్‌ముఖ్‌ల, రెవెన్యూ అధికార యంత్రాంగం, పోలీసుల, రజాకార్ల సాయుధ అణచివేతకు వ్యతిరేకంగా భూమిపై హక్కు కోసం సాయుధ పోరాటం చేయడం మొదలుపెట్టారు. ఈ పోరాటంలో ధనిక, మధ్యతరగతి, సామాన్య, పేద రైతులు, వ్యవసాయ కూలీలు, వెట్టి చాకిరీ చేసేవాళ్లు (భూమితో సంబంధం ఉన్న దాదాపు అందరూ), కులవృత్తుల వాళ్లు కలిసి పాల్గొన్నారు. ప్రజలు ఈ పోరాటానికి ఉత్తేజితులు కావడానికి, వారి సమస్యలను కళ్లకు కట్టినట్లుగా చూయించడానికి ప్రజా నాట్య మండలి గరికపాటి రాజారావు ఆధ్వర్యంలో సాంస్కృతిక కార్యక్రమాలు, సుద్దాల హనుమంతు లాంటి వారి బుర్రకథలు చాలా తోడ్పడ్డాయి. రావి నారాయణ రెడ్డి, భీమిరెడ్డి నరసింహారెడ్డి, పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావు, మల్లు స్వరాజ్యం, ఆరుట్ల కమలాదేవి మున్నగు వారి నాయకత్వంలో ప్రజలు తాము సాగుచేసే భూములను కాపాడు కోవడం, బంజరు భూములను ఆక్రమించడం, వ్యవసాయ కూలీ రేట్లు

పెంచే విధంగా పోరాటం చేయడం, భూములపై సర్వే చేయించడం ధాన్యం లెవీ సేకరణలో అవకతవకలను తొలగిపోయేటట్లు చూడడం, పొల్లాల్లో వెట్టిచాకిరీ రద్దు కోసం చాలాచోట్ల రజాకారులను, పోలీసులను, దేశ్‌ముఖల వారి గూండాలను తహసిల్దార్లను ఎదిరించి సాధించారు.

1948 మొదటికంతా దాదాపు రెండు వేల గ్రామాలలో ఈ మార్పులు అన్ని వర్గాల ప్రజల ఐకమత్యంలో, అవసరమైన చోట సాయుధ పోరాటం చేసి సాధించారు. 1947లో భారతదేశంలోని బ్రిటిష్ పాలిత ప్రాంతాలన్నీ యూనియన్ ఆఫ్ ఇండియా (భారత రాష్ట్రాల సమాఖ్య)గా ఏర్పడినా, నిజాం తన పాలనలోని భూభాగాన్ని భారతదేశంలో కలవడానికి నిరాకరించనందుకు నిరసనగా ప్రజలు హైదరాబాద్ రాష్ట్రమంతా నిరసనలు, అలజడులు చేయడం మొదలుపెట్టారు. నిజాం ప్రజలపై పోలీసు బలగాలను, రజాకారులను పంపి తుపాకులతో కాల్పులు జరిపించినా ప్రజలు భూమి కోసం, తమ హక్కుల కోసం ప్రాణాలు పోయినా నిలబడ్డారు. దొడ్డి కొమరయ్య లాంటి వాళ్ల ప్రాణత్యాగం, చాకలి ఐలమ్మ తన భూమి దురాక్రమణ కాకుండా పోరాడిన తీరు, బందగీ కోర్టు ద్వారా తన భూమిని దక్కించుకుని కూడా ప్రాణాలు కోల్పోవడం లాంటివి రైతులు, ఇతర వర్గాల ప్రజలకు భూమికోసం సమైక్యంగా పోరాడానికి మార్గం వేశాయి. రైతుకు మద్దతిచ్చిన విద్యావంతులను, నాయకులను జైళ్లలో వేశారు. ప్రజలపై దాడులు చేయడం కోసమే (1947-48 మధ్య) నిజాం ప్రభుత్వం పోలీసులు, సైన్యం, ప్రైవేటు సైన్యంలపై 11.84 కోట్ల రూపాయలను వెచ్చించింది. ఒకవైపు నిజాం భారత రాష్ట్రాల సమాఖ్యలో కలవకుండా స్వతంత్ర దేశంగా ఉండడానికి నిర్ణయం తీసుకోవడం, మరోవైపు రైతాంగం, ఇతర వృత్తుల వారిపై నిజాం సైన్యం, పోలీసులు, రజాకారులు సాగించే దమనకాండ, చివరికిది పూర్తి సాయుధ పోరాటంగా హైదరాబాద్ రాష్ట్రానికే పరిమితం కాకుండా మద్రాస్ ప్రెసిడెన్సీ పాలన నుంచి భారతదేశంలో కలిసిన ఆంధ్ర రాష్ట్ర ఇతర ప్రాంతాలకు పాకే అవకాశం ఉందని, భారత సైన్యం 1948 సెప్టెంబర్‌లో కేవలం నాలుగు రోజులలోనే నిజాంను ఓడించి 13 సెప్టెంబర్ 1948న హైదరాబాద్ రాష్ట్ర భూభాగాన్ని భారత రాష్ట్రాల సమాఖ్యలో కలిపింది.

పూర్తిగా పాలనపై పట్టు సాధించడానికి, రైతులు, ప్రజల సాయుధ పోరాటాన్ని అంతం చేయడానికి మిలిటరీ గవర్నర్‌ను హైదరాబాద్ రాష్ట్ర చీఫ్ అడ్మినిస్ట్రేటివ్‌గా నియమించారు. నిజాంను రాష్ట్ర ప్రముఖ్ (గవర్నర్)గా నియమించారు. ప్రజల కష్టాలు, వాటి మూల సమస్యలు, జరుగుతున్న పరిణామాలు, ఇప్పటి వరకూ వేసిన కమిటీలు ఇచ్చిన నివేదికలకు తోడు కొత్త కమిటీలను ప్రజల జీవనానికి ఆధారమైన వనరుల, స్థితిగతులపై అంచనాకు, పరిష్కారాలకోసం వేశారు. వ్యవసాయ సంబంధ సంస్కరణలపై నివేదిక కోసం గుల్జారీలాల్ నందా, ఆర్.కె. పాటిల్, కస్తూరిభాయ్‌లాల్ భాయ్‌లను; రాష్ట్ర ప్రభుత్వ పరిశ్రమలు, ప్రభుత్వ సహాయంతో నడిచే పరిశ్రమలపై నివేదిక కోసం రేజ్ కమిటీని కార్మికుల సమస్యలపై (పరిశ్రమలలోని) విజయలక్ష్మి పండిట్‌ను కుటీర పరిశ్రమలపై, టి.టి. కృష్ణమాచారిని ఆర్థికరంగంపై నివేదిక కోసం నియమించారు. హైదరాబాద్ రాష్ట్రం చీఫ్ అడ్మినిస్ట్రేటర్ పాలనలోకి వచ్చిన తరువాత, నిజాం తన స్వంత ఖర్చుల నిమిత్తం రాష్ట్రమంతటా ఉంచుకొన్న ప్రభుత్వం సర్ఫ్-ఇ-ఖాస్ భూములను 5 ఫిబ్రవరి 1949న స్వాధీనం చేసుకొంది. 1 ఆగస్ట్ 1949న సుబేదారీ పదవులను రద్దుచేసింది. ప్రజలంతా వందల సంవత్సరాల నుంచి అణచివేతకు గురవుతున్న జాగీర్దారు పరిపాలనా వ్యవస్థను 15 ఆగస్ట్ 1949న రద్దు చేసి జాగీర్దార్లకు నష్టపరిహారం ఇవ్వడానికి, జాగీరు భూములను సర్వే చేయించడానికి, ప్రభుత్వానికి జాగీరు భూముల సాగుదారుకు మధ్య మధ్యవర్తి లేకుండా సాగుదారులే ప్రభుత్వాన్ని సంప్రదించే వీలుగా జాగీరు అడ్మినిస్ట్రేటర్‌ను నియమించింది. ముఖ్యమైన భూ సంస్కరణల మొదటి మెట్టు పూర్తయిన తరువాత 1949 డిసెంబర్‌లో మిలిటరీ పరిపాలనను పౌర అధికారికి అప్పగించారు.

హైదరాబాద్ రాష్ట్రంపై భారత ప్రభుత్వ సైన్యం దాడి చేయబోయే ముందు మెజారిటీ ధనిక రైతులు, మధ్యతరగతి రైతులు, పేద రైతులు, కూలీలు, వ్యవసాయ కూలీలు, ముఖ్యంగా కౌలుదార్లు భూమి కోసం, సాగు చేస్తున్న భూమిపై హక్కుకోసం, వెట్టి చాకిరీ నిర్మూలన కోసం, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా, అప్పుల కింద భూములను స్వాధీనం చేసుకోవడానికి వ్యతిరేకంగా, భూమి శిస్తు ఇతర పన్నులు కట్టనందుకు భూములను స్వాధీనం చేసుకోవడాన్ని వ్యతిరేకిస్తూ చాలా చోట్ల కమ్యూనిస్టు పార్టీతో కలిసి, తమంత తాము కూడా రజాకారుల, దేశ్‌ముఖ్‌ల, రెవెన్యూ అధికార యంత్రాంగం, పోలీసుల దాడులకు వ్యతిరేకంగా పోరాడారు. వీరంతా మిలిటరీ జోక్యంతోనూ, ప్రభుత్వం చేపడుతున్న భూ సంస్కరణల నేపథ్యంలో చీలిపోయారు. ధనిక రైతులు, మధ్యతరగతి ప్రజలు తమ భూమిని కూడా పంపిణీ చెయ్యాలని పేద రైతులు, కౌలుదార్లు, వ్యవసాయ కూలీలు పోరాటం చేయడంతో వీరు సాయుధ పోరాటానికి మద్దతునివ్వడం, పాల్గొనడం మానేశారు. దీంతో సాయుధ పోరాటానికి సరైన మద్దతు లేక ఎక్కువ కాలం కొనసాగలేదు.

ఈ నేపథ్యంలో అన్నిటికంటే ముఖ్యమైన చట్టాన్ని కౌలుదార్లు, ప్రజలందరికీ మేలు కలిగే విధంగా ప్రభుత్వం చేసింది. కౌలుదారులు, వ్యవసాయ భూ పరిమితి చట్టం (హైదారాబాద్ టెనెన్సీ అండ్ అగ్రికల్చరల్ లాండ్ హోల్డింగ్ ఆక్ట్) 10 జూన్ 1950 నుంచి అమలులోకి వచ్చింది. ఈ చట్టం ద్వారా ప్రతి రక్షిత కౌలుదారుకు తను సాగుచేసే భూమిపై హక్కు వచ్చింది. అప్పటి వరకూ ఒక వ్యక్తికి ఉండాల్సిన భూమిపై గరిష్ట పరిమితి లేదు. ఈ చట్టం ద్వారా ఒక వ్యక్తికి అతని ఆధీనంలో ఉన్న భూమి సారాన్ని బట్టి, పంట దిగుబడిని బట్టి ఎన్ని ఎకరాల భూమి కనిష్టంగా, గరిష్టంగా ఉండొచ్చో కూడా నిర్ణయించ బడింది. ఈ జాగీరు, సర్ఫ్-ఇ-ఖాస్ భూములను రద్దు చేయడం ద్వారా లభించిన భూములను పర్యవేక్షించడానికి, వాటి పంపిణీకి 1950లో ఒక తాత్కాలిక పాలనా వ్యవస్థను నియమించి హైదరాబాద్ రాష్ట్ర భూభాగాన్ని భారత ప్రభుత్వం తన రాష్ట్రాలలో కలిపుకుంది. తాత్కాలిక ప్రభుత్వం ఆధ్వర్యంలో హైదరాబాద్ రాష్ట్ర చట్టాల్ని, రూల్స్‌ను, రెగ్యులేషన్ లన్నింటినీ భారతదేశ చట్టాల పరిధిలోకి తీసుకొచ్చారు. జిల్లా రెవెన్యూ అధికార వ్యవస్థలో ఉన్న మొదటి తాలూకాదారును కలెక్టరుగా, రెండవ తాలూకాదారును డిప్యూటీ కలెక్టరుగా మార్చారు. సర్ఫ్-ఇ-ఖాస్ భూముల హద్దులు, జాగీరు భూముల హద్దులు చెరిగిపోయిన తరువాత మద్రాస్ ప్రెసిడెన్సీలో ఉన్న కొన్ని గ్రామాలు హైదరాబాద్ రాష్ట్రంలోని తాలూకాలలోకి, హైదరాబాద్ రాష్ట్రంలోని గ్రామాలు మద్రాస్ ప్రెసిడెన్సీలోకి మారిపోయాయి. అదే రీతిలో తాలూకాలు కొన్ని పెరిగితే, కొన్ని తగ్గాయి. కొత్తగా కొన్ని కొత్త తాలూకాలు వస్తే, పాతవాటిలో మార్పులు, చేర్పులు జరిగాయి. ఈ మార్పులన్నీ 1951లో రెవెన్యూ అధికారుల పూర్తి పర్యవేక్షణ, వారి నిర్వహణలోనే జరిగాయి.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

# నిత్య జీవితపు వికిరణం

*సహజంగా, మన రోజువారీ జీవితంలో, వివిధ సందర్భాలలో మనం ఏ స్థాయిలో, ఏ మోతాదులో రేడియో ధార్మిక వికిరణం బారిన పడతామో వివరిస్తున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

**1986**లో చెర్నోబిల్ రియాక్టర్‌లో జరిగిన ప్రమాదం వంటిది సామాన్య ప్రజలను ఉలికిపాటుకు గురిచేసి, రేడియోధార్మికత గురించీ, కనబడని వికిరణంవల్ల మనకు వాటిల్లే హాని గురించీ ఆలోచించేలా చేస్తుంది. మనకు తగిలే వికిరణం యావత్తూ కృత్రిమంగా సాంకేతిక కార్యకలాపాలవల్ల తలెత్తేది కాదు. ఇదేదో అణుశక్తిని సమర్థించేవారి వాదనలాగా అనిపిస్తుందిగాని ఇది వాస్తవమే. రేడియోధార్మిక వికిరణం ప్రకృతిసిద్ధంగా మనచుట్టూ ఉంటూనే ఉంది. ఇది భూమీ, సూర్యుడూ, గ్రహాలూ రూపొందక మునుపే 500 కోట్ల ఏళ్ల క్రితం పేలిపోయిన ఏదో సూపర్నోవా అవశేషాలలో మిగిలి ఉన్న లక్షణం. పేలిన తారల కొలిముల్లో అణు సంయోగం వల్ల రూపొందిన భారీ మూలకాలన్నీ తమ తమ స్వభావసిద్ధమైన అస్థిరత కారణంగా వేరువేరు వేగాలతో క్షీణిస్తూ, రకరకాల వికిరణాన్ని వెలువరిస్తూవస్తున్నాయి. వాటన్నిటినీ తట్టుకుని ఆవిర్భవించిన భూమిమీది జీవరాశిలో మనమూ ఉన్నాం. అందుచేత ఇది అంత ప్రమాదకరం అనిపించుకోదు. ఈ వికిరణంలో ప్రాంతాన్నిబట్టి హెచ్చుతగ్గులుంటాయి. కేరళ సముద్రతీరాన ఇది ఎక్కువగా ఉంటుంది. కాని దానివల్ల అక్కడి ప్రజలకు నష్టమేమీ కలుగుతున్న దాఖలాలులేవు. అంతమాత్రాన రేడియేషన్ వల్ల అపాయం లేదనికాదు. సహజంగా ప్రకృతిలో కనబడే స్థాయిలో అది హాని కలిగించ లేదని మాత్రమే చెప్పగలం.

రేడియోధార్మిక పదార్థాలు కల్మషం, లేదా మాలిన్యం రూపంలో మనకు అంటుకోవచ్చు. కంటామినేషన్ అనే ఈ ప్రక్రియవల్ల ఘన, ద్రవ, వాయురూపాల్లో (కనబడినా, కనబడకపోయినా) ఇటువంటి హానికరమైన మాలిన్యం మన చర్మానికి తగలడమో, మన నోటిద్వారా జీర్ణవ్యవస్థలోకిగాని, ముక్కుద్వారా శ్వాసకోశవ్యవస్థలోకిగాని జొరబడ వచ్చు. మరొకరకం ప్రమాదం మనకు తగిలే వికిరణం. ఎండకు చర్మం కందిపోయే పద్ధతిలో ఎక్స్, గామాకిరణాలు మన దేహాలను ప్రభావితం చెయ్యగలవు. అణుసంబంధిత కార్యకలాపాల్లో పాల్గొనేవారు తప్ప సామాన్యప్రజలు మొదటిరకం ప్రమాదాలకు లోనవడం చాలా అరుదు. ఎక్స్‌రే పరీక్షలూ వగైరాలు జరిపినప్పుడు వికిరణం సోకే అవకాశాలే ఎక్కువ. అయితే మనదేశంలోనూ, మనకన్నా అభివృద్ధి చెందిన దేశాల్లోనూ వైద్య పరీక్షలకూ, ఒక్కొక్కప్పుడు చికిత్సకూ రేడియేషన్ తగిలే అవకాశాలు మునుపటికన్నా పెరుగుతున్నాయి.

సూర్యుడూ, సౌరవ్యవస్థా రూపొందడానికి కారణమైన బ్రహ్మాండమైన ఆదిమ ధూళిమేఘంలో ఎన్నో రేడియోధార్మిక పదార్థా లుండేవి. ఆ మట్టిలోనుంచి పుట్టిన మన శరీరాల్లోకూడా ఆ లక్షణాలు కొన్ని కనబడతాయి. ఉదాహరణకు మన రక్తంలోని పొటాసియంలో పొటాసియం-40 ఐసోటోప్ ఉంటుంది. పదివేల పొటాసియం అణువుల్లో ఒకటి ఈ రకం కావచ్చు. ఇది అతి నింపాదిగా 125 కోట్ల ఏళ్ల అర్ధాయుష్షుతో క్షీణతకు లోనవుతుంది కనక మన శరీరం వెలువరించే సహజమైన రేడియోధార్మికతలో ఇదికూడా ఉంటుంది.

భూమి పైపొరలలో యురేనియంవంటి సహజ రేడియోధార్మిక పదార్థాలూ, అవి క్షీణిస్తున్న క్రమంలో రూపొందే రేడాన్ వాయువువంటి ఇతర పదార్థాల రేడియోధార్మికతా ప్రకృతిలో మనకు తగులుతూనే ఉంటుంది. అలాగే అంతరిక్షంనుంచి ప్రసరించే కాస్మిక్‌కిరణాలుంటాయి. ఇవికాక కేన్సర్‌వంటి రోగాల చికిత్సకని రియాక్టర్లలో తయారై, గామా వికిరణాన్ని ఉత్పత్తి చేసే కోబాల్ట్-60వంటి పదార్థాలుంటాయి. వికిరణం ఎటువంటిదైనప్పటికీ అది తాను ప్రయాణించే పదార్థాలలోకి చొచ్చుకెళ్లే టప్పుడు తన శక్తిని కోల్పోయి, ఆ పదార్థాలలో అయనీకరణం సృష్టిస్తుంది. అంటే వాటి అణువుల పైపొరలలోని ఎలక్ట్రాన్లు కొన్ని వేరుపడడంతో అణువులకు తాత్కాలికంగా విద్యుదావేశం కలుగుతుంది. వికిరణం తీవ్రతను అంచనావెయ్యడానికి ఈ అయనీకరణం ఒక కొలతగా పనిచేస్తుంది.

ఈ లెక్కన సగటున ఏడాదికి ప్రతిమనిషికీ కాస్మిక్‌కిరణాలవల్ల 25 నుంచి 50 మిల్లీరెమ్ (millirem), భూమి వెలువరించే రేడియోధార్మికత వల్ల మరొక 30 మిల్లీరెమ్ మోతాదులో రేడియేషన్ డోస్ (తాకిడి) తగులుతుంది. ఒక మిల్లీరెమ్ అనేది రెమ్ (రెంట్‌గెన్ ఈక్వివలెంట్ మాన్ roentgen equivalent man) అనే కొలతలో వెయ్యోవంతు. ప్రస్తుతం దీనికి బదులుగా సీవర్ట్ (sievert) అనే కొలతను ఉపయోగిస్తున్నారు. ఒక సీవర్ట్ ఒక రెమ్‌కన్నా వందరెట్లు ఎక్కువ.

రోజువారీ జీవితంలో టీవీ చూడటంవంటివి మనకు ఏడాదికి ఒక మిల్లీరెమ్ చొప్పున ప్రసాదిస్తాయి. వైద్యపరీక్షల మాటకొస్తే దంతాల ఎక్స్‌రేవల్ల ఒక మిల్లీరెమ్, అదే కనక ఛాతీకి అయితే 6 మిల్లీరెమ్, థైరాయిడ్ స్కాన్‌వల్ల (thyroid scan) 14 మిల్లీరెమ్, కాట్‌స్కాన్‌వల్ల (CAT scan) 110 మిల్లీరెమ్, బేరియం ఎనీమావల్ల (barium enema) 400 మిల్లీరెమ్, ఇలా సందర్భాన్నిబట్టి మనకు రేడియేషన్ తగులుతుంది. విమానాల్లో ఎగిరేవారికి కాస్మిక్‌కిరణాల తాకిడి మరింత ఎక్కువ అవుతుంది. మొత్తంమీద సామాన్యప్రజలకు ఏడాదికి 300 మిల్లీరెమ్ తాకిడి సర్వసామాన్యం. దీనితో పోలిస్తే చెర్నోబిల్ దుర్ఘటన కారణంగా ఆ ప్రాంతపు బస్తీ వాసులకు ఒక్కపెట్టున చొప్పున 5 వేలనుంచి పదివేల మిల్లీరెమ్‌ల వికిరణం తగిలింది. మండుతున్న చెర్నోబిల్ రియాక్టర్‌ను ఆర్పడానికని హెలికాప్టర్ నడిపి అనేక ఉపశమనపదార్థాలను కురిపించిన గ్రిషెంకో అనే 52 ఏళ్ల పైలట్ ల్యూకీమియావల్ల చనిపోయాడు. తనకు

చావు తప్పదని తెలిసినప్పటికీ వెరవకుండా కర్తవ్యనిర్వహణలో ప్రాణాలను అర్పించాడు. 400 రెమ్‌ల తాకిడికి మనిషి చనిపోయే అవకాశాలు చాలా ఎక్కువ. చెర్నోబిల్ పేలినప్పుడు అక్కడున్నవారికి ఈ తాకిడి 50 సెకండ్లలోపునే తగిలి ఉంటుందని అంచనా.

వికిరణం తక్కువ మోతాదులో ఎక్కువ కాలం తగలడమే నయం. మనిషికి వయసు పెరుగుతున్నకొద్దీ శరీరానికి తగిలే మోతాదుకూడా పెరుగుతుంది కనక వికిరణంతో వృత్తిరీత్యా ప్రమేయమున్నవారి విషయంలో రోజుల, నెలల, సంవత్సరాలవారీగా దీన్ని నమోదుచేసే పద్ధతులుంటాయి. ఒక్కసారిగా పెద్దపెట్టున రేడియేషన్ తగలడం శ్రేయస్కరం కాదు.

వికిరణం ఎటువంటిదైనప్పటికీ అది తగులుతున్నప్పుడు మనకు ఏమీ తెలియదు. దుష్ఫలితాలన్నీ తరవాతనే బైటపడతాయి. అందుచేత బుద్ధిపూర్వకంగానో, వృత్తిరీత్యానో వికిరణం సోకే ప్రాంతాలలో పనిచేసేవారు దాన్ని గుర్తించే రకరకాల పరికరాలను వాడతారు. వీటిలో కొన్నిటిలో ఫోటోఫిల్మ్ వాడేవారు. కొన్నాళ్ల తరవాత ఆ ఫిల్మ్‌ను కడిగినప్పుడు రేడియేషన్ తాకిడికి అనుగుణంగా అది నల్లబడడం, అది ఎంత నల్లబడిందో లెక్కకట్టి దానిద్వారా వికిరణపు మోతాదును నిర్ణయించడం చేసేవారు. వికిరణం సంతానోత్పత్తి సమర్థ్యాన్ని దెబ్బతీస్తుంది కనక గర్భిణులనూ, 18 ఏళ్లలోపువారినీ అటువంటి ప్రాంతాలకు రానివ్వరు. ఆ తరవాత సంవత్సరానికి 2 రెమ్‌ల చొప్పున అనుమతిస్తారు. అంటే 20 ఏళ్ల వయసుగలవారి డోస్ (20-18)X2 అంటే మొత్తం 4 రెమ్‌లకు మించకూడదు. 58 ఏళ్ల వయసుగల వ్యక్తికి (58-18)X2 అంటే జీవితకాలం మొత్తంమీద 80 రెమ్‌ల మోతాదు అనుమతిస్తారు.

ఏడాదికి సుమారు 50 వారాలూ, వారానికి 40 గంటలూ పనిచేస్తారనుకుంటే ఇది గంటకు ఒక మిల్లీరెమ్ గరిష్ఠపరిమితిగా తేలుతుంది. ఇదైనా ఏడాది పొడుగునా రేడియేషన్ డోస్‌ను అంచనా వేసే సిబ్బంది విషయంలోనే. ఈ నిబంధనలకు లోబడని సామాన్య ప్రజలకు గంటకు ఒక మిల్లీరెమ్‌లో పదోవంతుకు మించిన వికిరణం తగలకూడదనే నిబంధన ఉంది. అయినప్పటికీ ప్రమాదాలు జరుగుతాయి. లోహపు అతుకుల తణిఖీకి ఎక్స్‌రే పద్ధతిలో ఉపయోగపడే కోబాల్ట్-60వంటి పదార్థాలు చూడటానికి స్టెయిన్‌లెస్ స్టీల్ కడ్డీలలాగే కనబడతాయి కనక ఆరుబయలు ప్రదేశాల్లో రేడియోగ్రఫీ పరీక్షలు జరుపుతున్నప్పుడు వీటిలో కొన్ని గల్లంతవడం, అవేమిటో తెలియక వాటిని దొంగతనంగా తీసుకెళ్ల ప్రయత్నించేవారికి తీవ్రమైన హాని కలగడం అప్పుడప్పుడూ చూస్తాం. కొన్ని రేడియోధార్మిక పదార్థాలు లోహపుచెత్తతోబాటు అమ్ముడుపోయి ప్రమాదాలకు కారణమవుతాయి. ఇలాంటి విషయాల్లో ఏమరుపాటు పనికిరాదు. వీ

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)*

*(... 4వ పేజీ తరువాయి)*

రెండూ ప్రజల డిమాండ్లు. కాని ప్రభుత్వాలు ఏ డిమాండ్లూ పూర్తిగా పరిష్కరించనందు వల్ల మరల మరల జరుగుతున్న కిడ్నాప్‌లకు ప్రభుత్వమే బాధ్యత వహించవలసి ఉంటుంది. జైళ్లలో ఉన్న పార్టీ నేతలపైన, ఆదివాసీలపైన కేసులు పెట్టారు. కేసులుండగానే మరల అక్రమ కేసులు పెడుతున్నారు. విశాఖ సెంట్రల్ జైల్లో ఉన్న ముగ్గురు మావోయిస్టు నేతలపై ఇలాంటి అక్రమ కేసులు ఉన్నాయి. రాజ్యాంగం, చట్టాలు ఈ విధమైన హక్కులు ప్రభుత్వాలకు ఎక్కడ, ఎప్పుడు ఇచ్చాయి? ఏండ్ల తరబడి చత్తీస్‌గడ్ జైల్లో తీవ్ర అనారోగ్యంతో ఉన్న పద్మకు వైద్యం లేదు, బెయిల్ లేదు. కిడ్నాపులు మొదలుపెట్టింది పోలీసులే. విశాఖ ఏజెన్సీలో ఇది సర్వసాధారణం. పోలీసులు అక్రమంగా ఎత్తుకుపోవడం రోజుల తరబడి నిర్బంధించిన సంఘటనలలో మేం స్పందించి ప్రకటనలు విడుదల చేసినప్పటికీ, అధికారులతో మాట్లాడినప్పటికీ విచారణ నిమిత్తం తీసుకొచ్చామంటున్నారు. తప్పు ఒప్పుకోరు. వందలాది మందిపై అక్రమ కేసులు పెట్టి కొంతమందిని లొంగదీసుకొని 'సరెండర్' చూపిస్తూ వాళ్ల అదుపు ఆజ్ఞలలో ఉంచుకొంటున్నారు. గతంలో కొంతమందిని కోవర్టులుగా మలచుకొన్నారు. ఏజెన్సీకి చెందిన తాంబేలు కమల (32) మూడేళ్లుగా జైల్లో ఉన్నారు. కొన్ని కేసులు కొట్టి వేయగా ఇంక ఇరవై కేసులున్నాయి. నిర్బంధం, రాజ్యహింస పెరిగింది. కిడ్నాపులను ఖండిస్తున్న వారికి రాజ్యహింస కనపడదు. జైలు గోడలలో నుండి వస్తున్న మూలుగులు, ఆవేదనలు, రోదనలు వినిపించవు. జైళ్లలో ఉన్న ఖైదీల స్థితిగతులు, అక్రమ కేసుల గురించి సమాచారం సేకరించి ప్రచురించ వలసిందిగా వీక్షణం పాత్రికేయ మిత్రులను కోరుతున్నాను.

**– తుంపాల శ్రీరామమూర్తి,** *గాజువాక, విశాఖపట్నం*

**వీ**క్షణం పత్రికలోని అంశాలన్నీ క్షుణ్ణంగా, పూర్తి అవగాహనతో కూడినవిగా ఉంటున్నందుకు కృతజ్ఞతలు. ఏ ఒక్క పేజీ కూడా అనవసరమైన విషయాలకు కేటాయించకపోవడం ఈ పత్రికలోని గొప్పతనం. ముందు తరాలకు విషయ సందేశాన్ని అందించడంలో వీక్షణం ముందంజలో ఉంది. ఉద్యోగులకే కాకుండా, యువతకు చాలా ఉపయోగకరంగా ఉంది. నేటి పోటీ ప్రపంచంలో పరీక్షలకు సిద్ధమవుతున్న గ్రూప్స్ విద్యార్థులకు కూడా ఎంతో ఉపయోగపడుతుంద నడంలో అతిశయోక్తి లేదు.

**– తిరుక్కొవెల పద్మావతి,** *నిర్మల్, ఆదిలాబాద్*

**కి**డ్నాపులలో రెండు రకాలు ఉంటాయి. ఒకటి ప్రభుత్వం చేసే కిడ్నాపులు, రెండవది రాజకీయ మిలిటెంటులు చేసే కిడ్నాపులు. మానవహక్కుల దృక్పథంలో ఏ కిడ్నాపులనూ సమర్థించలేం. పోలీసులు పాల్పడే కిడ్నాపుల పైన పత్రికలు రాయవు, టెలివిజన్లు మాట్లాడవు, జాతీయ చర్చలు జరగవు. మావోయిస్టులు చేసే కిడ్నాపులపైన పెద్ద ఎత్తున మీడియా ప్రచారం జరుగుతుంది. 'భారతదేశం బందీ', 'ప్రభుత్వం సరెండర్', 'హైజాక్', 'బ్లాక్‌మెయిల్' లాంటి వర్ణనలతో టెలివిజన్లలో చర్చలు జరుగుతాయి. ఒక అమాయక ఆదివాసీని ప్రభుత్వం కిడ్నాపు చేయడానికి, కలెక్టరును మావోయిస్టులు కిడ్నాపు చేయడానికి మధ్య వ్యత్యాసం ఏమిటి? ఒక సామాన్యమైన ఆదివాసీ ప్రాణాల విలువ, ఐ.ఎ.ఎస్ ఆఫీసరు ప్రాణాల విలువతో సమానం కాదా?

చత్తీస్‌గడ్ ప్రభుత్వం సోనీ సోరీ పైన అక్రమ కేసు పెట్టి, జైలులో బంధించింది, కలెక్టరు అలెక్స్ పాల్‌మీనన్‌ను మావోయిస్టులు బంధించారు. ఈ రెండు సంఘటనల నేపథ్యాన్ని విశ్లేషించాలి. సోనీ సోరీ ఒక ఆదివాసీ స్కూల్ టీచరు, ముగ్గురు పిల్లల తల్లి. అమెను ఇన్ఫార్మర్‌గా మారమని పోలీసులు ఒత్తిడి చేసారు. ఆమె ఒత్తిడిలకు తలొగ్గకుండా ధైర్యంగా నిలబడింది. పోలీసులు ప్రతీకారంతో, సోని సోరీ పైన అక్రమ కేసులు బనాయించారు. సోనీ సోరీ ని దంతేవాడ ఎస్.పి. అంకిత్ గార్గ్ పోలీసు కస్టడీలో థర్డ్ డిగ్రీ చిత్రహింసలు పెట్టారు. అత్యంత క్రూరంగా ఆమె జననాంగాలలో రాళ్లు పెట్టి హింసించారు. సుప్రీం కోర్టు ఆదేశంతో, కలకత్తాలోని ఎన్‌ఆర్‌ఎస్ మెడికల్ కాలేజీ పరీక్షలు జరిపి, ఆమె ఆరోపణలను నిర్ధారించింది. పోలీసుల దురాగతాలను ఆపాలని ఆదివాసీలు ఎన్ని విన్నపాలు చేసినా కలెక్టరు ఏనాడూ వాటిని పట్టించుకోలేదు. పైగా మానవహక్కుల ఉల్లంఘనకు పాల్పడిన ఎస్.పి. అంకిత్ గార్గ్‌కు రాష్ట్రపతి మెడల్ ఇవ్వాలని, కలెక్టరు అలెక్స్ పాల్ మీనన్ రికమెండేషన్ చేసారు. ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వం, ఒక ఆదివాసీ మహిళపైన ఇంత దుర్మార్గంగా ప్రవర్తించడం సమంజసమా?

మావోయిస్టులు సుకుమా కలెక్టరు అలెక్స్ పాల్ మీనన్‌ను కిడ్నాపు చేసి, పన్నెండు రోజులు బందీగా ఉంచారు. ఈ సంఘటన నేపథ్యంలో ఇద్దరు బాడీ గార్డులు, ఒక మావోయిస్టు ప్రాణాలు కోల్పోవడం చాలా విచారకరమైన అంశం. కలెక్టరు భార్య, కుటుంబ సభ్యులు కూడా చాలా మానసిక ఒత్తిడికి గురైనారు. కిడ్నాపుకు గురైన కలెక్టరు అలెక్స్ పాల్ మీనన్, ఒరిస్సా శాసనసభ్యుడు జిన్నా హికాకాలు మావోయిస్టులు తమను గౌరవంగానే చూసుకున్నారని మీడియాకు చెప్పారు. మావోయిస్టులు వీరిపైన హింస ప్రయోగించిన దాఖలాలు లేవు. సోని సోరీ పట్ల చత్తీస్‌గడ్ ప్రభుత్వం వ్యవహరించిన తీరు, మావోయిస్టులు శాసనసభ్యుడు, కలెక్టరుల తో వ్యవహరించిన తీరుల మధ్య చాలా వ్యత్యాసం ఉంది. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం నాయకుడు ప్రొఫెసరు జి. హరగోపాల్, ఐఎఎస్ ఆఫీసరు బ్రహ్మదత్తు శర్మ మావోయుస్టులతో చర్చలు జరిపి కలెక్టర్ అలెక్స్ పాల్ మీనన్ విడిపించారు.

చత్తీస్‌గడ్ పోలీసులు, సిఆర్‌పిఎఫ్ దళాలు ఆదివాసీల పైన దురాగతాలకు పాల్పడుతున్నాయి. సుప్రీం కోర్టు సల్వాజుడుం రాజ్యాంగ విరుద్ధమని ఇచ్చిన తీర్పును సైతం ప్రభుత్వం ఖాతరు చేయడం లేదు. చత్తీస్‌గడ్‌లోని బిజెపి ప్రభుత్వం వేలాది అమాయక ఆదివాసీల పైన అక్రమ కేసులు పెట్టి, జైళ్లలల్లో బంధించి, మానవ హక్కుల ఉల్లంఘనలకు పాల్పడుతోంది. భారత రాజ్యాంగంలోని ఐదవ, ఆరవ షెడ్యూళ్ల ప్రకారం, అటవీ భూములు పైన ఆదివాసీలకు పూర్తి హక్కులు ఉన్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రాజ్యాంగాన్ని ఉల్లంఘిస్తూ, వేలాది ఎకరాల అటవీ భూములను మైనింగ్ పేరుతో బడా కోటీశ్వరులకు ధారాదత్తం చేస్తున్నాయి. ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో వేలాది సిఆర్‌పిఎఫ్, పోలీసు సాయుధ బలగాలతో ఆదివాసీలపైన మారణకాండ సాగిస్తున్నాయి. శాంతియుతంగా ఆదివాసీ హక్కుల కోసం ఉద్యమించిన ఒడిశాలోని చాసీ మూలి ఆదివాసీ సంఘం, పశ్చిమ బెంగాల్‌లోని పీపుల్స్ కమిటీ ఎగెనెస్టు పోలీసు అట్రోసిటీస్ సంస్థలను అక్కడి ప్రభుత్వాలు అణచివేసి, ప్రజాస్వామిక భూమికకు స్థానం లేకుండా చేశాయి. ప్రభుత్వ దమనకాండ, పోలీసు దురాగతాలకు ప్రతిచర్యగా కిడ్నాపులు చేయవలసి వస్తున్నదని మావోయిస్టులు చెబుతున్నారు.

చత్తీస్‌గడ్ ప్రభుత్వం ఆదివాసీలపైన పోలీసు దమనకాండను ఆపాలి. ప్రజాస్వామిక హక్కులను, ఆదివాసీ అటవీ హక్కులను గౌరవించి, సెజ్‌లను రద్దు చేయాలి. చత్తీస్‌గడ్ జైళ్లలో ఉన్న రెండు వేల మంది ఆదివాసీలను, భారతదేశంలోని వివిధ జైళ్లలో మగ్గుతున్న ఇరవై వేల మంది ఆదివాసీలను, రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి. కుంటిసాకులు చెప్పకుండా, ఆదివాసీ ప్రాంతాలను అభివృద్ధి చేయాలి. పాఠశాలలు, ఆసుపత్రులు, మంచినీరు, వ్యవసాయానికి ఇరిగేషన్, ఉద్యోగాలు, పరిశ్రమలను ఏర్పాటు చేయాలి. అభివృద్ధి అంటే వేలకోట్ల తో సాయుధ బలగాలు తిరగడానికి రోడ్లువేయడం, లేదంటే పోలీసు కమ్యూనికేషన్ల కోసం 2000 సెల్‌ఫోన్ టవర్లు కట్టడం కాదు. ఆదివాసీల దగ్గర కార్లు లేవు, ఫోన్లు లేవు. ఆదివాసీల కోసం ప్రజాస్వామిక అభివృద్ధి నమూనాను అమలు చేయాలి. ప్రభుత్వాలు ఆదివాసీ హక్కులను ఆచరణలో అమలు పరచాలి. ఎన్నికైన ప్రభుత్వం ప్రజాస్వామిక పాలనను సాగించి, ఆదివాసీ అభివృద్ధిని అమలుచేసి, అటవీ హక్కులను గౌరవిస్తే కిడ్నాపులు ఆగిపోతాయి.

**– సాజీ గోపాల్,** అమెరికా

**ఎస్**సి, ఎస్‌టి సబ్‌ప్లాన్ నిధుల వ్యాసాలు బాగున్నాయి. దళితులు, ఆదివాసులు నిత్యం కులంపరంగా, వృత్తిపరంగా, సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా వివక్షకు గురయితున్నారని రచయితలు చాలా వివరంగా చెప్పారు. దళితుల, ఆదివాసుల అభ్యున్నతి కోసం రాజ్యాంగంలో చట్టాలను చేర్చడం జరిగింది. కాని అవి ఎప్పుడూ ఆచరణకు నోచుకోలేదు. దళితుడు రాజ్యాంగం రాసి ధనవంతుల (భూస్వాముల) చేతుల్లో పెట్టిండు. ధనవంతులు ధనస్వామ్య రక్షణకోసం రాజ్యాంగాన్ని తన చుట్టంలా మార్చుకున్నారు. ధనస్వామ్యానికి ప్రజాస్వామ్యమనే ముసుగు తగిలించి మరింత ధనవంతులుగా తయారవుతున్నారు. పేదవారిని మరింత పేదవాళ్లుగా మారుస్తున్నారు. దళితుల, ఆదివాసులకోసం రాజ్యాంగం కల్పించిన చట్టాలను, హక్కులను కాలరాస్తూ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఒత్తిడికి తలొగ్గి ఎస్‌సి, ఎస్‌టి నిధులతో కామన్‌వెల్త్ గేమ్స్ నిర్వహించారు. ఈ విషయాన్ని ఒప్పు కున్నారు చిదంబరం. అలాగే హూస్సేన్‌సాగర్ పూడికతీయడానికి, మూసి మురికి ఎత్తిపోయ డానికి అధికారంలో ఉన్న అన్ని రాజకీయపార్టీలు ఈ నిధులను వినియోగిం చాయి. రాజ్యాంగం కల్పించిన ఐదవ అధికరణ పత్రాన్ని మడతపెట్టి, బహుళజాతి కంపెనీల రహస్య ఒప్పందాన్ని అమలు చేస్తూ, పాశవిక, అటవిక చర్యలకు పాల్పడుతూ అడవుల నుంచి ఆదివాసులను వెళ్లగొట్టడానికి వారిపై యుద్ధం చేస్తోంది రాజ్యం. కుట్రపూరితంగా నేడు సెజ్‌ల పేరిట దళితుల భూములను కబ్జా చేసుకొని, వారి భూముల నుండి గెంటేస్తున్నారు. ఎస్.సి, ఎస్.టి సామాజిక వర్గం నుంచి ఎన్నికైన ప్రతినిధులు ఈ విషయం గురించి మాట్లడలేక పోతున్నారు. ఎందుకంటే వారు కూడా ఇందులో భాగస్వాములే కాబట్టి. ఎన్ని రాజకీయ పార్టీలు అధికారం చేపట్టినా దళితులకు, ఆదివాసులకు ఒరిగింది శూన్యమే. తలకిందులైనా భూమిని, తలకిందు లైనా సమాజాన్ని, తలకిందులైనా మనిషి జీవితాన్ని నిలబెట్టేది పోరాటం ఒక్కటే.

**– సృజన్,** *కల్వకుర్తి, మహబూబ్‌నగర్*

## గవర్నర్‌ల నియామకాలు

**కాం**గ్రెస్ పార్టీ కోర్ కమిటీ ఏప్రిల్ 27న సమావేశమై నాలుగు రాష్ట్రాల్లో గవర్నర్‌లను నియమించింది. ఆంధ్రప్రదేశ్‌లో ఇ.ఎస్.ఎల్. నరసింహన్‌ను, మహారాష్ట్ర గవర్నర్ శంకర్ నారాయణన్ పదవీ కాలాన్ని మరో ఐదేళ్లపాటు పొడిగించింది. ఎస్.పి.జి మాజీ చీఫ్ బి.వి. వాంఛూను గోవా గవర్నర్‌గా నియమించింది. మధ్యప్రదేశ్‌కు చెందిన సీనియర్ కాంగ్రెస్ నేత డాక్టర్ అజీజ్ ఖురేషీని మార్గరెట్ అల్వా స్థానంలో ఉత్తరాఖండ్ గవర్నర్‌గా నియమించింది. ఉత్తరాఖండ్ నుండి మార్గరెట్ అల్వాను రాజస్థాన్‌కు బదిలీచేసింది.

## కలెక్టర్ విడుదల

**మా**వోయిస్టులు నిర్బంధించిన సుక్మా జిల్లా కలెక్టర్ అలెక్స్ పాల్ మీనన్‌ను 12 రోజుల అనంతరం మే 3న విడిచిపెట్టారు. దక్షిణ బస్తర్ ప్రాంతంలోని తాడిమెట్ల గ్రామ పొలిమేరల్లో అక్కడి స్థానికుల సమక్షంలో మావోయిస్టు ప్రతినిధులు ప్రొఫెసర్ హరగోపాల్, బి.డి. శర్మలకు మీనన్‌ను అప్పగించారు. చర్చల్లో కుదిరిన ఒప్పందం మేరకు మావోయిస్టులు మీనన్‌ను ఒదిలిపెట్టారు.

## దాణా కుంభకోణం

**దా**ణా కుంభకోణం కేసులో సి.బి.ఐ. ప్రత్యేక న్యాయస్థానం మరో 69 మందిని దోషులుగా తేల్చింది. 1990లో జరిగిన రు.950 కోట్ల కుంభకోణానికి సంబంధించి మొత్తం 53 కేసులు నమోదు అయ్యాయి. 44వ కేసులో రాంచీలోని సి.బి.ఐ. ప్రత్యేక న్యాయస్థానం జడ్జీ గణపతి తివారి మే 3న తీర్పునిచ్చారు. 16 మందిని నిర్దోషులుగా తేల్చి, 29 మందికి ఏడాది నుంచి మూడేళ్ల వరకు జైలు శిక్ష విధించారు.

## మీడియా సామాజిక బాధ్యత

**సా**మాజిక, ఆర్థిక, అంశాల నుంచి ప్రజల దృష్టిని మళ్లించేందుకు భారతీయ మీడియా మూఢనమ్మకాలను, పాతకాలపు ఆలోచనలను ప్రచారం చేస్తోందని ప్రెస్ కౌన్సిల్ ఛైర్మన్ జస్టిస్ మార్కండేయ కట్జూ విమర్శించారు. మీడియా యజమానుల అవసరాలకు అనుగుణంగా పనిచేస్తోందని పేర్కొన్నారు. ప్రపంచ ప్రెస్ ఫ్రీడం డే సందర్భంగా కట్జూ మే 3న ఒక ప్రకటనలో తెలిపారు. ప్రజల్లో శాస్త్రీయమైన ఆలోచనలను పెంపొందించాల్సిన ప్రసార మాధ్యమాలు ఆ పనిచేయడంలేదన్నారు. వ్యక్తిగత జీవితాలు, క్రికెట్, జ్యోతిష్యం వంటి వాటిని కాకుండా విలేకరులు సామాజిక అంశాలకు ప్రాధాన్యత ఇవ్వాలన్నారు. ప్రజల్లో శాస్త్రీయత, హేతువాద ఆలోచనలను పెంచేలా పనిచేయాలన్నారు. దేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలకు ఇలాంటి ఆలోచనలతోనే పరిష్కారం లభిస్తుందని అన్నారు.

## బంగారు లక్ష్మణ్‌కు నాలుగేళ్ల జైలు శిక్ష

అవినీతి కేసులో బి.జె.పి. మాజీ అధ్యక్షుడు బంగారు లక్ష్మణ్‌ను విచారించిన కోర్టు ఏప్రిల్ 28న నాలుగేళ్ల జైలు శిక్ష విధించింది. ఆయనకు విధించిన శిక్షను నిలుపుదల చేయాలని ఢిల్లీ హైకోర్టులో పిటిషన్ దాఖలు చేశారు. శిక్షను నిలుపుదల చేయడానికి ఢిల్లీ హైకోర్టు మే 11న తిరస్కరించింది. లక్ష్మణ్ విజ్ఞప్తిపై సి.బి.ఐకి నోటీసులు జారీచేస్తూ జస్టిస్ ముక్తా గుప్తా జూలై ఐదో తేదీకల్లా జవాబివ్వాలని తెలిపింది. రక్షణ ఒప్పందానికి సంబంధించి తెహెల్కా డాట్ కామ్ జరిపిన స్టింగ్ ఆపరేషన్‌లో బంగారు లక్ష్మణ్ ముడుపులు తీసుకుంటూ పట్టుబడ్డారు. సంఘటన జరిగిన 11 ఏళ్ల తరువాత శిక్ష పడింది.

## మన గ్రామీణుల జీవితాలు

భారత గ్రామీణ జనాభాలో దాదాపు 60 శాతం మంది రోజుకు రు.35 కంటే తక్కువ ఖర్చుతోనే జీవిస్తున్నారు. నగరాల్లో రోజుకు రు.66తో బతుకుతున్నారు. ఆదాయం, ఖర్చులపై ప్రభుత్వం నిర్వహించిన సర్వేలో ఈ విషయం వెల్లడయింది. జాతీయ శాంపిల్ సర్వే సంస్థ (ఎన్‌ఎస్‌ఎస్‌ఒ) నివేదిక ముందుమాటలో ఆ సంస్థ డైరెక్టర్ జనరల్ జె. దాస్ పేర్కొన్నారు.

## ఎయిర్ ఇండియా పైలట్ల సమ్మె

పైలెట్ల సమ్మెను వ్యతిరేకిస్తూ ఏయిర్ ఇండియా సుప్రీంకోర్టులో మే 10న పిటిషన్ దాఖలు చేసింది. భారతీయ పైలెట్ల గిల్డ్ (ఐపిజి) చేపట్టిన సమ్మెవల్ల 20కి పైగా అంతర్జాతీయ, దేశీయ విమాన సర్వీసులు రద్దయ్యాయని పేర్కొంది. డ్రీమ్‌లైనర్ విమానంలో పైలెట్లకు శిక్షణ ఇచ్చే విషయమై తమ ఆదేశాలను ధిక్కరించినందుకు గాను ఇండియన్ పైలెట్స్ గిల్డ్(ఐ.పి.జి)పై దిక్కార చర్యలు చేపట్టాలన్న ఎయిర్ ఇండియా విజ్ఞప్తిని సుప్రీం కోర్టు మే 11న తిరస్కరించింది.

## తరిగిపోతున్న పంట భూములు

భారతదేశంలో పంట భూములు తరిగిపోవడంపై వ్యవసాయ రంగ నిపుణులు ఆందోళన వ్యక్తంచేస్తున్నారు. పంట భూములను ఇతర అవసరాలకు మళ్లించకుండా నిరోధించే పటిష్ఠమైన చట్టాలు తీసుకురావాలన్నారు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 2009–10లో దేశంలో పంట భూముల విస్తీర్ణం 18.25 కోట్ల హెక్టార్లుగా ఉంది. అది 2005–06లో 18.27 కోట్ల హెక్టార్లుగా ఉంది. అంటే ఈ ఐదేళ్లకాలంలో రెండు లక్షల హెక్టార్ల మేరకు పంట భూములు తగ్గిపోయాయని తెలుస్తోంది. ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణించాల్సిన అంశంగా ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్ డైరెక్టర్ అయ్యప్పన్ అన్నారు.

## మిర్డాల్‌పై నిషేధ యోచన!

ప్రముఖ స్వీడిష్ రచయిత యాన్ మిర్డాల్ భవిష్యత్తులో భారత్‌కు రాకుండా నిరోధించాలని కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తోంది. ఆయన్ను మావోయిస్టు మద్దతుదారుగా గుర్తిస్తూ ఈ నిర్ణయానికి వచ్చినట్లు తెలుస్తోంది. మిర్డాల్ మావోయిస్టు భావజాలానికి మద్దతు ఇస్తున్నట్లు కేంద్రం అంటున్నది. 2012 జనవరిలో భారత్ వచ్చిన ఆయన హైదరాబాద్, ఢిల్లీ, కోల్‌కత్తా, లూధియానాలలో జరిగిన మావోయిస్టు అనుకూల సదస్సుల్లో పాల్గొన్నారని హోంశాఖ ఆరోపిస్తున్నది. మిర్డాల్ భారతదేశంలో ప్రత్యామ్నాయంకోసం జరుగుతున్న ఉద్యమ ప్రాంతాల్లో పర్యటించి 1980లో 'ఇండియా వెయిట్స్' అలాగే 'రెడ్‌స్టార్ ఓవర్ ఇండియా' అను రెండు పుస్తకాలను రాశారు.

## భారీగా పెరిగిన పెట్రోల్ ధరలు

పెట్రోల్ ధర ఒక లీటరుకు రు. 7.54 పెంచుతూ ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ఈ రేటు మే 23 అర్ధరాత్రి నుంచే అమల్లోకి వచ్చింది. దీంతో ఒక లీటరుకు దేశంలోని ప్రధాన నగరాల్లో (ఢిల్లీ – 73.18, కోల్‌కత్తా – 77.88, ముంబై – 78.57, చెన్నై – 77.53, హైదరాబాద్ – 81.44) పెట్రోల్ ధరలపై ప్రభుత్వ నియంత్రణను 2010 జూన్‌లో ఎత్తివేశారు. పెట్రోల్ ధరల పెరుగుదలపై ప్రభుత్వ నిర్ణయం ఏమీలేదని ఇది చమురు కంపెనీల నిర్ణయమని ప్రణబ్ ముఖర్జీ చెప్పారు. రూపాయి విలువ పడిపోవడమే ఈ పెరుగుదలకు కారణమని చమురుశాఖ మంత్రి ఎస్. జైపాల్‌రెడ్డి మే 22న తెలిపారు. ✦

## స్విస్ బ్యాంకుల పట్ల భారత ప్రభుత్వ విధానం

స్విస్, తదితర బ్యాంకుల్లో భారతీయులు అక్రమంగా దాచుకున్న సంపదపై ప్రభుత్వం పార్లమెంట్‌లో శ్వేతపత్రం ప్రవేశపెట్టింది. అక్రమంగా దాచుకున్న వారి పేర్లను మాత్రం కేంద్ర ఆర్థిక మంత్రి వెల్లడించలేదు. అక్రమ సంపద స్విస్ బ్యాంకుల్లో ఉందన్నారు కాని దాన్ని బయటికి తీసుకు రావడానికి ఎటువంటి ప్రతిపాదనలను వెల్లడించలేదు. స్విస్ బ్యాంకుల్లోని డబ్బు గురించి వివిధ సంస్థలు వెల్లడించిన వివరాలను మాత్రమే ప్రభుత్వం తెలియజేసింది తప్ప ప్రత్యేకంగా చేసింది ఏమిలేదు. 2009 ఎన్నికల్లో బి.జె.పి. స్విస్‌బ్యాంకుల్లో ఉన్న అక్రమ సంపద గురించి ప్రచార అస్త్రంగా ఉపయోగించుకుంది. దాన్ని వెలికితీయడం దాని ఉద్దేశ్యం కాదు. ఈ డబ్బు 1930ల నుంచి పన్ను కట్టకుండా అక్రమంగా సంపాదించుకున్నదే. ఈ బ్యాంకుల్లో రహస్యంగా దాచుకున్న విదేశీ ఖాతాల్లోని నల్లధనం భారతీయులదే ఎక్కువగా ఉందని అనేక నివేదికలు తెలుపుతున్నాయి. కాని మన ప్రభుత్వం తిమ్మిని బమ్మిచేస్తూ ప్రవేశపెట్టిన శ్వేత పత్రంలో మన దేశం 15వ స్థానంలో ఉందని నమ్మించే ప్రయత్నం చేసింది. విదేశాల్లో దాచిన నల్లధనం 25 లక్షల కోట్ల రూపాయల దాక ఉందని స్వయంగా సిబిఐ డైరెక్టర్ ఎ.పి. సింగ్ ఈ మధ్యనే ఇంటర్‌పోల్ అంతర్జాతీయ సదస్సులో వెల్లడించారు. అక్రమంగా సంపాదిస్తున్న రాజకీయ నాయకులు, ప్రభుత్వ ఉన్నతాధికార్లు, మాఫియా, పన్నులు కట్టకుండా అక్రమంగా సంపాదించిన వ్యాపార వేత్తలు లక్షల కోట్ల రూపాయలను స్విస్ బ్యాంకులకి తరలించారు. ప్రపంచ ఆర్థిక సంక్షోభం కారణంగా అభివృద్ధి చెందిన అమెరికా, యూరోపియన్ దేశాల ఆర్థిక వ్యవస్థలు సమస్యల నెదుర్కొన్నాయి. దాంతో అమెరికా, నైజీరియా, ఫిలిప్పైన్స్, మెక్సికో, జర్మనీ తదితర దేశాలు స్విస్ బాంకుల్లో ఉన్న తమ దేశస్తులు దాచుకున్న అక్రమ ధనాన్ని తిరిగి తెచ్చుకున్నాయి. అదే సమయంలో అక్రమంగా దాచుకున్న భారతీయుల జాబితాను జర్మనీ మన దేశానికి అందజేసినప్పటికీ యు.పి.ఎ ప్రభుత్వం ఎలాంటి చర్యలు తీసుకోలేదు. విదేశీ చట్టాలు ఒప్పుకోవడంలేదనే సాకులతో తప్పించుకుంటూ అక్రమ సంపాదనాపరులకు అండగా నిలిచింది. గ్రామాల్లో సామాన్యులు మాత్రం రోజుకు రు.35 కంటే తక్కువ ఖర్చుతో జీవిస్తున్నారని జాతీయ శాంపిల్ సర్వే సంస్థ నిర్వహించిన సర్వేలో వెల్లడయింది.

## ఆజాద్, పాండేల ఎన్‌కౌంటర్ కేసు

ఆజాద్, హేమచంద్ర పాండేల ఎన్‌కౌంటర్‌పై ప్రత్యేక దర్యాప్తు బృందంతో న్యాయ విచారణ జరిపించాలన్న డిమాండ్‌తో వేసిన రిట్ పిటిషన్‌లను సుప్రీం కోర్టు మే 3న కొట్టివేసింది. ఈ ఎన్‌కౌంటర్‌కు సంబంధించి సిబిఐ దర్యాప్తు నిజాయితీగా లేదని, ప్రత్యేక దర్యాప్తు బృందంతో విచారణ జరిపించాలని స్వామి అగ్నివేశ్, బబితలు సుప్రీం కోర్టులో పిటిషన్‌లు వేశారు. ఈ డిమాండ్‌ను సిబిఐ తరఫున అదనపు సొలిసిటర్ జనరల్ హరేన్ రావల్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున వాదించిన అల్తాఫ్ అహ్మద్‌లు తీవ్రంగా వ్యతిరేకించారు. వృత్తిపరమైన నిబద్ధతతో, చిత్తశుద్ధితో సి.బి.ఐ. ఈ ఎన్‌కౌంటర్ కేసు దర్యాప్తు చేసిందని స్పష్టం చేశారు. ఇటువంటి సందర్భాల్లో మళ్లీ దర్యాప్తుకు ఆదేశిస్తే సిబిఐ విశ్వసనీయత, సమర్థతలపై ప్రభావం చూపుతుందని వ్యాఖ్యానించారు. పిటిషనర్ల ఆరోపణలకు ఆధారాల్లేవని జస్టిస్ అఫ్తాబ్ ఆలమ్, జస్టిస్ సికె ప్రసాద్‌లతో కూడిన బెంచ్ వ్యాఖ్యానించింది. దర్యాప్తు నివేదికను సంబంధిత పరిధిలోని మెజిస్ట్రేట్‌కు అందజేయాలని సి.బి.ఐ.ని కోరింది. నివేదికపై తుది నిర్ణయం తీసుకునే అధికారాన్ని స్థానిక మెజిస్ట్రేట్‌కు వదిలిపెట్టింది. 1 జూలై 2010న మావోయిస్టు పార్టీ నాయకుడు ఆజాద్‌ను, జర్నలిస్టు హేమచంద్ర పాండేలను ఆదిలాబాద్ అడవుల్లో పోలీసులు ఎన్‌కౌంటర్‌లో కాల్చిచంపారు. ఈ ఎన్‌కౌంటర్ తరువాత ప్రజలు ప్రజాస్వామిక వాదులు, మేధావులు, హక్కుల సంఘాలు ఇది బూటకపు ఎన్‌కౌంటర్ అని, దీనిపై న్యాయవిచారణ జరిపించాలని పెద్దఎత్తున ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చాయి. ఈ ఎన్‌కౌంటర్‌పై సుప్రీం కోర్టు స్పందిస్తూ 'భారత రిపబ్లిక్ తన సంతానాన్ని తానే చంపుకోవడాన్ని అనుమతించలేం' అని పేర్కొంది. సిబిఐ ఆంధ్రప్రదేశ్ పోలీసులపై హత్యనేరం కింద 21 మే 2011లో కేసు నమోదు చేసింది. ఆజాద్ ఎన్‌కౌంటర్‌కు ముందు మావోయిస్టుపార్టీతో తాము చర్చలకు సిద్ధమని కేంద్రం ప్రకటించింది. ప్రభుత్వ ప్రకటనకు స్పందించిన కొందరు మేధావులు, సామాజికవేత్తలు ప్రభుత్వం–మావోయిస్టు పార్టీ మధ్య చర్చలు జరగాలని కోరుకుంటూ ఆ ప్రయత్నాన్ని మొదలుపెట్టారు. ఈ క్రమంలోనే ఆజాద్‌ను, జర్నలిస్ట్ హేమ చంద్రపాండేను పోలీసులు ఎన్‌కౌంటర్‌లో చంపేశారు. మృతదేహాలను పరీక్షించిన ఫోరెన్సిక్ నివేదిక పోలీసు కథనంలోని రెండు ప్రధానమైన అబద్ధాలను బైటపెట్టింది. వాళ్లు కొండపైన ఉండగా తాము కొండ కింది నుంచి ఫర్లాంగు దూరం నుంచి కాల్పులు జరిపామని పోలీసుల కథనం. కాని, ఫోరెన్సిక్ నివేదిక ప్రకారం ఆజాద్ గుండెలో తూటా గుండెకు పైన రెండు సెంటిమీటర్ల దగ్గర ప్రవేశించి వీపులో గుండెకు దిగువన రెండు సెంటిమీటర్ల కింద బయటకు వెళ్లింది. అంటే, కచ్చితంగా కూచోబెట్టి పై నుంచి కాల్చారని అర్థం. అలాగే, తూటా ప్రవేశించిన చోటును బట్టి అది పది సెంటిమీటర్లలోపు దూరం నుంచే కాల్చి ఉంటారని ఫోరెన్సిక్ నివేదిక తెలియజెప్పింది. నిజాలు కనిపెట్టడంలో 'మహావీరుడు'గా పేరుపొందిన సిబిఐ జాయింట్ డైరెక్టర్ లక్ష్మీనారాయణ నాయకత్వంలోని బృందం ఈ ఫోరెన్సిక్ నివేదికను పక్కనపెట్టి పోలీసులు చేసింది నిజమైన ఎన్‌కౌంటర్ అని సుప్రీంకోర్టుకు చెప్పింది.

## 2జి స్పెక్ట్రం

2జి స్పెక్ట్రం కుంభకోణం ప్రధాన నిందితుడు, మాజీ టెలికం శాఖ మంత్రి ఎ. రాజాకు సిబిఐ ప్రత్యేక కోర్టు మే 15న బెయిల్ ఇచ్చింది. అరెస్ట్ అయిన 15 నెలల తరువాత ఆయనకు షరతులతో కూడిన బెయిల్‌ను ఇచ్చింది. ఈ కేసులో మిగతా 13 మంది నిందితులు ఇదివరకే బెయిల్‌పై విడుదలయ్యారు. రాజా 2011 ఫిబ్రవరి 2 నుండి కస్టడీలో ఉన్నాడని ఇప్పుడు కూడా తమ అదుపులో ఉంచడం వల్ల ఎలాంటి ఉపయోగం లేదని సిబిఐ ప్రత్యేక కోర్టు జడ్జి చెప్పారు. తమ న్యాయమైన హక్కులకోసం పోరాడుతున్న వందలాది మంది సామాన్యులు, ఆదివాసులు, ఉద్యమకారులు అక్రమకేసుల బారినపడి ఎటువంటి విచారణకు, బెయిళ్లకు నోచుకోకుండా ఏళ్ల తరబడి తమ జీవితాలను జైలుగోడల మధ్యనే గడుపుతున్నారు. 2జి స్పెక్ట్రం కుంభకోణాన్ని పరిశీలిస్తే ఎన్‌డిఏ ప్రభుత్వం నుంచి యుపిఎ ప్రభుత్వం వరకు టెలికం శాఖను నిర్వహించిన అందరికీ ఇందులో భాగస్వామ్యం ఉంది. స్వాన్–యునిటెక్ ఒప్పందాల విషయం అప్పటి ఆర్థికమంత్రి చిదంబరంకూ, ప్రధాన మంత్రి మన్మోహన్ సింగ్‌కూ తెలుసునని, ఆ ఒప్పంద పత్రాలను ఇద్దరికి పంపించానని కేసు వాదనలు జరుగుతున్న సందర్భంగా రాజా కోర్టుకు చెప్పారు. కాగ్ లెక్కల ప్రకారమే 2జి కుంభకోణంలో ప్రభుత్వం నష్టపోయింది ఒక లక్షా డెబ్బై ఆరువేల కోట్ల రూపాయలు అని తేలింది. మన దేశంలో వరుసగా జరుగుతున్న కుంభకోణాలకి జూన్ 24, 1991లో ప్రారంభించిన నూతన ఆర్థిక విధానాలే కారణం. 1991 నుండి 2010 నాటికి బయటపడిన కుంభకోణాల సంఖ్య కామన్‌వెల్త్ కుంభకోణంతో కలుపుకొని 31కి చేరాయి. మన దేశ పాలకులు అడ్డు అదుపులేకుండా అవినీతికి పాల్పడడానికి ప్రపంచీకరణ ఒకానొక కారణం. దేశ ప్రజలకు చెందాల్సిన సహజ వనరులను బహుళజాతి సంస్థలకు కారుచౌకగా కట్టబెడు తున్నారు. స్థానికులను నిర్వాసితులను చేస్తున్నారు. అవినీతి పాలకులపై, అధికారులపై విచారణల పేరుతో ప్రజల సొమ్మును వృధా చేస్తున్నారు. దేశ సహజ వనరులు విదేశాలకు చాలా సులభంగా తరలిపోవడానికి దోహద పడుతున్న ప్రపంచీకరణ విధానాలు రద్దుచేసి దేశ ప్రజలకు ఉపయోగపడే విధానాలను ప్రజల సమ్మతితో తీసుకు రావాలి. ప్రభుత్వాలు మారినా పాలకుల విధానాలు ఒకటేనని తేలిపోయింది. ఈ పరిస్థితిని మార్చాల్సింది ప్రజలే.

వార్త – వ్యాఖ్య : వై. రామచంద్రం

వీ

## అణువిద్యుదుత్పత్తికి జపాన్ స్వస్తి

జపాన్‌లో అణువిద్యుదుత్పత్తికి తాత్కాలికంగా తెరపడినట్లే. తోమారి అణు విద్యుత్కేంద్రంలోని చిట్టచివరిదైన మూడో రియాక్టర్‌ను నిర్వహణ పనుల నిమిత్తం మూసివేస్తున్నారు. గత ఏడాది వరకూ జపాన్ విద్యుత్ అవసరాల్లో 30 శాతం అణు విద్యుత్ నుంచే లభించేది. ఇప్పుడిక ఆ మేరకు కూడా అణువిద్యుత్ లభించదు. సునామి నేపథ్యంలో ఫుకుషిమా అణు విద్యుత్కేంద్రంలో సంభవించిన ఉత్పాతంలో జపాన్ ప్రభుత్వం అణు రియాక్టర్ల మూసివేతకు శ్రీకారం చుట్టింది. ప్రజాభద్రతే లక్ష్యంగా ఈ చర్యను చేపట్టింది. రియాక్టర్లన్నిటినీ నిర్వాహణ పనుల నిమిత్తం మూసివేయడం ప్రారంభించింది. ఇప్పుడిక భూకంపాలు సునామీలను తట్టుకొని నిలవగలిగే పరీక్షలను ఈ రియాక్టర్లు ఎదుర్కోవలసి ఉంటుంది.

## పరాగ్వే కమ్యూనిస్టులపై నిషేధం తొలగింపు

పరాగ్వే కమ్యూనిస్టులు 66 ఏళ్ల అనంతరం తిరిగివచ్చారు. ప్రచ్ఛన్న యుద్ధ ప్రమాదం పేరుతో నియంత ఆల్ఫ్రెడో స్ట్రోస్నర్ 66 ఏళ్ల క్రితం కమ్యూనిస్టులపై నిషేధం విధించాడు. వచ్చే సంవత్సరం సార్వత్రిక ఎన్నికలలో తమ పార్టీ పాల్గొనవచ్చని ఎన్నికల కోర్టులు రూలింగ్ ఇచ్చినట్లు కమ్యూనిస్టు పార్టీ సెక్రటరీ జనరల్ నజీబ్ అమడో అసోసియేటెడ్ ప్రెస్‌కు చెప్పారు. అయితే ఇప్పుడే 2013 ఎన్నికల్లో తమ పార్టీ అభ్యర్థులనుపోటీ పెట్టబోమని, దానికి బదులు 'బ్రాడ్ ఫ్రంట్' సంకీర్ణానికి మద్దతివ్వాలని యోచిస్తున్నట్లు అమడో తెలిపారు.

## మూడోసారి పుతిన్ ప్రమాణం స్వీకారం

వ్లాదిమిర్ పుతిన్ రష్యా అధ్యక్షుడిగా మూడోసారి ప్రమాణ స్వీకారం చేశారు. ఈ పదవిలో ఆయన 2018 వరకు కొనసాగుతారు. గతంలో ఆయన నాలుగేళ్ల పాటు ప్రధానిగా చేశారు. మొదటిసారిగా 2000లో ఆయన అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు.

## రష్యా ప్రధానిగా మెద్వదేవ్ ఎన్నిక

రష్యా ప్రధానిగా మాజీ అధ్యక్షుడు దిమిత్రీ మెద్వదేవ్ (46) ఎన్నికయ్యారు. పార్లమెంట్ దిగువ సభ డ్యూమా 299-144 ఓట్ల తేడాతో ఆయన్ను ఎన్నుకుంది. అధికార యునైటెడ్ రష్యా, లిబరల్ డెమొక్రటిక్ పార్టీ ఆఫ్ రష్యాలు ఆయనకు మద్దతివ్వగా, కమ్యూనిస్టు పార్టీ, ఎ జస్ట్ రష్యా పార్టీలు వ్యతిరేకంగా ఓటేశాయి. ఓటింగ్ ముగిశాక మెద్వదేవ్‌ను ప్రధానిగా నియమిస్తూ కొత్త అధ్యక్షుడు వ్లాదిమిర్ పుతిన్ తన సంతకంతో ఉత్తర్వులు జారీ చేశారు.

## ఈజిప్టులో దళాల దమనకాండ

కైరోలోని రక్షణ మంత్రిత్వ శాఖ వైపు వెళ్లేందుకు ప్రయత్నించిన నిరసనకారులను అడ్డుకునేందుకు ఈజిప్టు దళాలు నీటి ఫిరంగులు, బాష్పవాయువు, తుపాకులను ఉపయోగించారు. దీంతో ఒక సైనికుడితో సహా ఐదుగురు మృతి చెందగా పెద్ద సంఖ్యలో నిరసనకారులు గాయపడ్డారు. అక్కడ ఎన్నికలు జరగనుండగా ఈ ఘర్షణలు చోటు చేసుకున్నాయి.

## నేపాల్‌లో విమాన ప్రమాదం

ముక్తినాథ్ పుణ్యక్షేత్ర యాత్ర చేపట్టిన భారతీయ భక్తులు నేపాల్‌లో మే 14న ఘోర విమాన ప్రమాదం సంభవించింది. ఈ దుర్ఘటనలో 13 మంది భారతీయుల సహా 15 మంది మరణించారు. 21 మంది ప్రయాణికులతో కూడిన ఈ చిన్న విమానం ఉత్తర నేపాల్‌లో ఉన్న ఎత్తైన పర్వత ప్రాంతంలోని జామ్‌సమ్ విమానాశ్రయంలో దిగే ప్రయత్నంలో కొండ శిఖరాన్ని ఢీకొట్టడంతో ప్రమాదానికి గురైంది.

## యెమెన్‌లో సైనికుడి ఆత్మాహుతి దాడి

యెమెన్ రాజధాని సనాలో మే 21న ఒక సైనికుడు ఆత్మాహుతి దాడిలో 96 మందిని చనిపోయారు. 300 మంది గాయాల పాలైనారు. వీళ్లందరూ సైనికులే. ఉత్తర, దక్షిణ యెమెన్‌లు కలిసిపోయి 22 ఏళ్లు పూర్తికావస్తున్న సందర్భంగా ప్రభుత్వ కేంద్ర బలగాలు ఇక్కడి ప్రఖ్యాత సబీన్ స్క్వేర్‌లో పరేడ్ రిహార్సల్ నిర్వహిసున్నాయి. ఒంటి నిండా శక్తివంతమైన పేలుడు పదార్థాలు పెట్టుకొని వచ్చి ఈ పరేడ్‌లో పాల్గొన్న ఓ సైనికుడు ఉన్నట్టుండి ఆత్మాహుతి చేసుకున్నాడు. పేలుడు నుంచి యెమెన్ రక్షణ మంత్రి సురక్షితంగా బయటపడ్డాడు. అమెరికా అండతో యెమెన్ కొత్త అధ్యక్షుడిగా మన్సూర్ హాది బాధ్యతలు చేపట్టిన తర్వాత జరిగిన అతిపెద్ద ఆత్మాహుతి దాడి ఇదే.

## ఇటలీలో భారీ భూకంపం

ఈశాన్య ఇటలీలో మే 1న భారీ భూకంపం సంభవించింది. రిక్టర్ స్కేల్‌పై తీవ్రత 6.0గా నమోదైంది. ఈ భూకంపం ధాటికి పలు ఇళ్లు, ఫ్యాక్టరీలు, ప్రార్థనా మందిరాలు, చారిత్రక కట్టడాలు ధ్వంసమయ్యాయి. ఈ దుర్ఘటనలో ఏడుగురు మృతిచెందారు.

## పాలస్తీనా ఖైదీల నిరసన

ఇజ్రాయెల్ అక్రమంగా, నిరవధికంగా నిర్బంధించిన పాలస్తీనా ఖైదీలు పెద్ద సంఖ్యలో మే 3న నిరాహార దీక్షలు చేపట్టారు. దీక్షలో కూర్చుంటున్న వారి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతుండడంతో జైలు బయట ఆగ్రహంతో నిరసనలు అధికమవుతున్నాయి. ఇజ్రాయిల్ జైళ్లలో ఉన్నవారికి సంఘీభావంగా వెస్టుబ్యాంక్, గాజాలో నిరసన ప్రదర్శనలు, ర్యాలీలు జరిగాయి.

## ఆధునిక బానిస వ్యాపారం

అమెరికాలోని ప్రైవేట్ జైళ్లు కార్పొరేషన్లు ఆధునిక కాలపు బానిస వ్యాపారాలుగా మారుతున్నాయి. దేశంలోని అతి పెద్ద ప్రైవేట్ జైలు కంపెనీ కరెక్షన్స్ కార్పొరేషన్ ఆఫ్ అమెరికా ప్రస్తుతం గుండుగుత్తగా జైళ్లనే కొనే పనిలో పడింది. 25 కోట్ల డాలర్ల నిధితో ప్రారంభమైన ఆ కార్పొరేషన్ కంపెనీ ఈ సంవత్సరం ప్రారంభంలోనే న్యూయార్క్ స్టాక్ ఎక్స్ఛేంజ్‌లో లిస్టెడ్ కంపెనీగా మారింది. ఇప్పటికిప్పుడు జైళ్లను కొంటానంటూ ఆ కంపెనీ దేశంలోని 48 రాష్ట్రాలకు లేఖలు పంపింది. తన లాభాలకు ఏలాంటి ఢోకాలేకుండా ఉండేలా చూసుకునేందుకు ఆ జైళ్లు కనీసం 90 శాతం నిండి ఉంటాయని గ్యారంటీ ఇవ్వాలని కూడా షరతు పెట్టింది. అంతేగాక తమకు కనీసం 20 ఏళ్లు నిర్వహణ కాంట్రాక్టును ఇవ్వాలని కార్పొరేట్ జైలర్లు డిమాండ్ చేశారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 ఏప్రిల్ నుండి 31 ఏప్రిల్ 2012 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 2144)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | 7 | – | 34 | 28 | 9 | 7 | 4 | 6 | 4 | 8 | 7 | 5 | 8 | 32 | 38 | – | – | – | 2 | 10 |
| హైదరాబాద్ | – | – | – | 17 | 14 | – | – | – | 5 | 10 | 4 | 18 | – | – | 34 | 12 | – | – | – | 15 | – |
| కరీంనగర్ | 2 | 2 | 2 | 12 | 18 | 6 | 24 | 5 | 1 | 6 | 1 | 3 | 3 | 5 | 26 | 16 | – | – | – | – | 17 |
| ఖమ్మం | – | 3 | – | 4 | 8 | 1 | 2 | 3 | – | 1 | 2 | 6 | 2 | 3 | 26 | 4 | – | – | 1 | – | 18 |
| మహబూబ్‌నగర్ | – | 5 | – | 19 | 14 | 3 | 1 | 9 | 3 | 3 | 5 | 9 | 8 | 17 | 54 | 6 | – | – | – | – | – |
| మెదక్ | – | 6 | – | 5 | 12 | 1 | 3 | 1 | – | 1 | 7 | 10 | 4 | 15 | 40 | 23 | – | – | – | – | 2 |
| నల్గొండ | – | 2 | – | 14 | 15 | 1 | 1 | – | – | 7 | 2 | 2 | 1 | 10 | 56 | 19 | – | – | – | 8 | 28 |
| నిజామాబాద్ | – | – | – | 5 | 13 | 4 | – | – | – | 1 | 4 | 2 | 6 | 3 | 12 | 23 | – | – | – | – | – |
| రంగారెడ్డి | 1 | 3 | – | 18 | 22 | 8 | 6 | 2 | 3 | 12 | 7 | 3 | 2 | 5 | 40 | 6 | – | – | – | – | 4 |
| వరంగల్ | – | 6 | 2 | 7 | 8 | 8 | 6 | 3 | 1 | 1 | – | – | – | 13 | 25 | 9 | – | – | – | – | 11 |
| చిత్తూరు | – | – | – | 7 | 8 | 6 | 8 | – | 3 | 9 | 9 | 13 | 10 | 5 | 37 | 4 | – | – | – | – | 10 |
| అనంతపూర్ | – | 4 | – | 10 | 6 | 3 | 1 | 3 | 1 | 4 | 6 | 7 | 5 | 11 | 41 | 5 | – | – | – | – | – |
| కర్నూలు | – | 5 | – | 11 | 9 | 6 | 10 | 7 | 8 | 5 | 4 | 6 | 8 | 9 | 36 | 33 | – | – | – | – | 9 |
| తూర్పు గోదావరి | – | – | – | 2 | 7 | 3 | 1 | – | – | – | 1 | 4 | 3 | – | 35 | 19 | – | – | – | – | – |
| పశ్చిమ గోదావరి | – | 2 | – | 8 | 3 | – | 2 | 4 | – | 1 | 1 | 3 | 5 | 7 | 34 | 9 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | 2 | – | 1 | 6 | – | 4 | 2 | – | 1 | 3 | 1 | 2 | 3 | 16 | 2 | – | – | – | 1 | 4 |
| నెల్లూరు | – | – | – | – | 2 | – | – | – | – | 2 | – | – | 2 | 2 | 29 | 12 | – | – | – | – | 1 |
| విశాఖపట్నం | 2 | – | – | 9 | 12 | 1 | 2 | – | – | 8 | – | 4 | 9 | 3 | 20 | 27 | – | – | – | 13 | – |
| విజయనగరం | – | 3 | – | 8 | 6 | 2 | – | 3 | 3 | 6 | – | – | – | – | 22 | 11 | – | – | – | – | 4 |
| **మొత్తం** | **7** | **50** | **4** | **191** | **188** | **62** | **75** | **42** | **34** | **82** | **63** | **91** | **75** | **119** | **615** | **278** | **–** | **–** | **1** | **49** | **118** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 131 - June 2012 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/05/2012 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచిక రూపకల్పనలో పాలుపంచుకోండి

2012 డిసెంబర్ సంచికతో వీక్షణం పది సంవత్సరాలు పూర్తి చేసుకుంటుంది. తెలుగునాట ఇంతకాలం నిరాటంకంగా, నవనవోన్మేషంగా నడిచిన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక మరొకటి లేదు. ఈ పదికాలాల వీక్షణం సఫలజీవనం సంపూర్ణంగా పాఠకుల, అభిమానుల, రచయితల, శ్రేయోభిలాషుల ఆదరణవల్లనే సాధ్యమయింది. పదికాలాలపాటు నజావుగా నడిచిన వీక్షణంను మరొక పదికాలాలపాటు నిలవడానికి, మరింత ప్రజాప్రయోజనకరంగా నడపడానికి దిశానిర్దేశం చేసుకుని పునరంకితం కావలసిన సమయం ఆసన్నమవుతోంది. ఈ సమయంలో వెలువడే రెండో దశాబ్ది ప్రారంభ సంచిక, 2013 జనవరి సంచికను చిరకాలం దాచి ఉంచుకోదగిన ప్రత్యేక సంచికగా రూపొందించాలని ఆలోచిస్తున్నాం. వీక్షణం పాఠకులు, అభిమానులు, రచయితల నుంచి మా ఆలోచనలను పరిపుష్టం చేసే సలహాలు, సూచనలు కోరుతున్నాం. ప్రత్యేకంగా ఈ సంచిక తయారీ కోసమే ఒక కీలకమైన రచయితల, పాఠకుల సమావేశం ఏర్పాటు చేస్తున్నాం. జూలై 8, ఆదివారం జరగనున్న ఈ సమావేశానికి వీక్షణం పాఠకులు, రచయితలు, అభిమానులు అందరూ ఆహ్వానితులే. ఈలోగా మీ సలహాలు, సూచనలు లిఖితపూర్వకంగా ఇవ్వదలచుకుంటే రాసి పంపించవచ్చు. జూలై సమావేశానికి హాజరై వివరంగా చర్చించవచ్చు.

ఇప్పటిదాకా వీక్షణం అభివృద్ధిలో ప్రతి అడుగులోనూ మీ సహాయ సహకారాలు ఉన్నాయి. ఇకముందు కూడ అలాగే మీ ఇతోధిక సహాయ సహకారాలు ఉంటాయని ఆశిస్తున్నాం.

స్థలం : **ఎమెస్కో సమావేశ మందిరం,** సాధురాం కంటి ఆసుపత్రి పక్కన,
లిబర్టీ చౌరస్తా, దోమల్‌గూడ, హైదరాబాద్.

సమయం : జూలై 8, 2012, ఆదివారం, ఉదయం 10 గంటల నుంచి
(భోజనం ఏర్పాటు ఉంది)

**- సంపాదకవర్గం**

వివరాలకు : 040 66843495 (ఉదయం 10 నుంచి సాయంత్రం 5 వరకు)
Email : veekshanam2003@gmail.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao